

# సర్వసంభవామ్

## నాహం కర్తా, హరిః కర్తా

పి.వి.ఆర్.కె.ప్రసాద్

నాహం కర్తా, హరిః కర్తా
('సర్వసంభవామ్' స్వాతి సపరివారపత్రిక ధారావాహిక)
పి.వి.ఆర్.కె. ప్రసాద్ I.A.S.,

ప్రథమ ముద్రణ
**ఆగష్టు, 2003**
నాలుగవ ముద్రణ
**జనవరి, 2005**

వెల : రూ. **90/-**

ముఖచిత్రం : **బాపు**

కంపోజింగ్
**చందు గ్రాఫిక్స్**
హైదరాబాద్.

ప్రింటర్స్
**సాయి శ్రీనివాస ప్రింటర్స్**
హైదరాబాద్ - 500 004
ఫోన్ : 040-23321474

ప్రచురణకర్తలు
**ఎమెస్కోబుక్స్**
ఏలూరురోడ్, విజయవాడ -2
ఫోన్స్ : 0866-2577498, 2575281
మాసబ్ ట్యాంక్, హైదరాబాద్.
ఫోన్ : 040-23373103



## సమర్పణ

ఏ మంచి కార్యక్రమం చేయాలన్నా హరిగురువుల అనుగ్రహం లేకుండా సాధ్యపడదు.

నా చేత ఈ స్వానుభవాల సాహితీ యజ్ఞం జరగటానికి - గురువులు శ్రీ సత్య ప్రమోద తీర్థ ప్రమోద స్వామి, శ్రీ సత్యాత్మతీర్థ స్వామి ఆశీస్సుల ద్వారా - స్ఫూర్తినీ, శక్తినీ ప్రసాదించిన కలియుగ దైవం శ్రీనివాసుడుగా భాసిల్లుతున్న ఆ శ్రీహరి చరణారవిందాలకు శతసహస్రకోటి ప్రణామాలతో...

**పత్రి వెంకట రామకృష్ణ ప్రసాద్**

ॐ

SRI DIGVIJAYARAMO VIJAYATE

SRIMAJJAGADGURU MADHWACHARYA MOOLAMAHASAMSTHANA

# UTTARADI MATH

Head Office :
HALBHAVI PLOT, 2nd Cross,
Kalyana Nagar, (Behind Railway Station)
DHARWAD - 580 007. Ph. : 447709

Correspondence Office :
6th Cross, Shankarpuram,
Basavanagudi, BANGALORE-560004.
Phone : 6678726

Camp : BANGALORE.  Date : 25-6-2003.

విధి మొదలగు దేవతలకూ అందని ఆనందము గలవారు శ్రీహరి. తను సాటి-లేని మేటి దైవము. తనను పాడేవారిని కాపాడేవాడు.

కావలసినవారి కావలములను పరిహరించి శ్రేయస్సును ప్రసాదించువాడు. కలియుగములో కోటి భక్తుల కోరికలను తీర్చుటకు తిరుమలలో వేంకటేశ్వరునిగా వెలసియున్నాడు. తను వెలసిన తిరుమల ఇలలోని వైకుంఠము.

లక్ష్మ్యాది భక్తులు ఈ ఏడుకొండల స్వామిని దర్శించి నేటికీ తరించుచున్నారు. ఈ క్షేత్రములో లభించిన ఇసుమంత సుకృతమూ అసమానమైన ఫలమును ప్రసా-దించును.

ఇటువంటి తిరుమల దేవస్థానమునకు E.O గా ఉండి ఎనలేని సేవలను చేసిన వారు మా ఆత్మీయ శిష్యులైన PVRK ప్రసాదరావుగారు. తిరుమలకు తరలివచ్చే ఏ భక్తునికీ లోటు కలగకుండా చూసుకుని తిరుమలను నిజముగా భూవైకుంఠముగా చేసిన వారు. భక్తుల అవసరములను తీర్చుటకు ఎన్నో కార్యములను చేపట్టారు. చిత్తశుద్ధి, ప్రామాణికత వీరు చేసే ప్రతి పనిలోనూ గోచరిస్తుంది. 'నాహం కర్తా' అను భావనను మదిలో పదిలపరచుకున్నవారు.

వేంకటేశ్వరుని మహిమ పురాణాల్లోనే కాదు. ప్రతిరోజూ ప్రత్యక్ష వేద్యమని తెలియజేసే, భక్తుల అనుభవాలను సేకరించారు. శ్రీహరి వారిలో నిలిచి చేయించుకున్న సేవలను సంగ్రహించారు. అదే ఇప్పుడు మీ ముందున్న "నాహం కర్తా" అనే కృతి.

దీనిని చదివి భక్తులందరూ వీరి సేవలను గుర్తించి ఆదర్శముగా తీసుకో-గలరు. ఆత్మీయ శిష్యులైన PVRK ప్రసాదరావు గారికి అస్మదుపాస్య మూర్తి ఆయురారోగ్య ఐశ్వర్యములనూ జ్ఞాన భక్తి వైరాగ్యములను ప్రసాదించి ఇటువంటి సేవలనింకా చేయించవలెనని ప్రార్థిస్తున్నాము.

ఇతి నారాయణ స్మరణములతో -




उत्तरादिमठ



స్వరూపోద్ధారక గురువు
శ్రీ సత్య ప్రమోద తీర్థస్వామీజీ
(ఉత్తరాదిమఠం)



ఉత్తరాదిమఠ పీఠాధిపతి
శ్రీ సత్యాత్మ తీర్థ స్వామీజీ

# విశ్వాసమే కర్త!

తిరుమలేశుని సన్నిధిలో కార్యనిర్వహణాధికారిగా పనిచేస్తున్నప్పుడు పి.వి.ఆర్.కె. ప్రసాద్ గారు పొందిన దివ్యానుభవాల మాలిక ఈ పుస్తకం. మహిమాన్వితమైన సంకల్పం, ప్రగాఢమైన విశ్వాసం ఈ అనుభవాలకు ఆధారాలు.

భారతీయ పురాణాలు, ఇతిహాసాలు, మహానుభావులైన మన పూర్వ కవులు మనకు సంపూర్ణ వ్యక్తిత్వంగల ఒక రాముణ్ణి, ఒక కృష్ణుడిని అందించారు. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శాక్తేయాది సర్వ భారతీయ మత శాఖలు ఒకరేమిటి అందరూ తమవాడిగా, తమకు ఆరాధ్యుడుగా భావించే తిరుమలేశుడు భారతీయుల విశ్వాసానికి ప్రతీకగా నిలిచాడు. మన పురాణాల్లో, ఇతిహాసాల్లో ప్రస్తావనకురాని శ్రీ వేంకటేశ్వరుడు భారతీయులందరి విశ్వాసాన్ని చూరగొన్న ఆరాధ్య దైవం.

తిరుమలేశునిపట్ల మానవజాతి ప్రకటిస్తున్న ప్రగాఢ విశ్వాసంనుంచి తిరుమల ఓ విశ్వజనీనమైన మహిమాన్విత స్థలంగా అవతరించింది. కులం, మతం, వర్ణం, జాతి మొదలైన విభేదాలకు అతీతంగా ముక్తకంఠంతో వందల వేల సంవత్సరాలుగా మానవజాతి తిరుమలేశుని పట్ల అచంచలమైన విశ్వాసాన్ని ప్రకటిస్తూ వస్తూంది. లక్షలాదిగా జనం 'గోవింద' నామస్మరణ చేస్తూ నిరంతరంగా తిరుమలను దర్శిస్తూనే వున్నారు. అన్ని భేదాలకు అతీతంగా మానవజాతిని ఏకీకృతం చేసే శక్తి తిరుమలేశునికి వుంది అన్నది వందల సంవత్సరాలుగా మనకు కనబడుతున్న నిజం. మనకి కనపడని భగవంతుని లేడు అనుకుందామా? మనకు కనబడుతున్న సత్యాన్ని నమ్ముదామా?

ప్రసాద్‌గారు పొందిన అనుభూతులు, వారి కెదురైన అనుభవాలు చదివి లక్షలాది తెలుగు పాఠకులు ఆ అనుభవాల్ని తమ సొంతమైనట్లు, వారి జీవితంలో ఎదురైన అనుభూతులతో సరిపోల్చుకోవడం నాకు తెలిసిన మరొక సత్యం. అందుకే ఈ పుస్తకాన్ని తిరుమలేశునిపట్ల మానవజాతికున్న విశ్వాసానికి ఓ వ్యక్తీకరణగా నేను భావిస్తున్నాను.

అచంచలమైన మానవ విశ్వాసానికి ప్రతీకగా నిలిచిన తిరుమలేశుని సేవకుడైన ప్రసాద్‌గారు 'నాహం కర్తా, హరిః కర్తా' అన్నారు. అయితే ఇక్కడొక విషయం స్పష్టంగా చెప్పవలసిన అవసరముంది. ఒక సామాన్య కుటుంబంలో జన్మించి, ప్రధానమంత్రి సమాచార సలహాదారు స్థాయికి ఎదిగిన ఓ మనిషి చేస్తున్న వ్యక్తీకరణ యిది. తన నిర్ణయాలతో, ఆలోచనలతో సమాజాన్ని ప్రభావితం చేయగల స్థానంలో ఉన్నవారు ధర్మాన్ని నడిపిస్తూ, న్యాయాన్ని అందించవలసినవారు, స్పష్టంగా కనిపించని న్యాయాన్ని అనుభవంతోనే కనుగొని వ్యవహరించడం ఇక్కడ మనం గమనించాలి. తను చేసిన పనికి తానే కర్తనని భావించినట్లయితే కేవలం భౌతిక విషయపరిజ్ఞానంతోనే సర్వమూ నిర్వహించగలనని భావించినట్లయితే వారు ఆ స్థితికి చేరుకోవడం సాధ్యంకాదు. 'నాహం కర్తా' అనేది ఆ వ్యక్తీకరణే. వివేకానందుని నుంచి కలాం వరకు ఎందరో సాధు సత్పురుషులు ఇదే అనుభూతికి లోనుకావడం మనకు స్పష్టంగా కనబడుతున్న విషయం. ప్రసాద్‌గారి ఈ వ్యక్తీకరణ ఓ కొనసాగింపు మాత్రమే. ఇది మహోన్నతమైన భారతీయ చింతనకు ప్రతీక.

ఎమెస్కో

# నాహం కర్తా, హరిః కర్తా

'స్వాతి' వారపత్రికలో 'సర్వసంభవామ్' శీర్షికన ప్రచురితమైన నా వింత అనుభవాలు చదివిన పాఠకులు అనేకమంది నాకు నేరుగానూ, 'స్వాతి' ద్వారాను రాసిన లేఖల్లో నేను తిరుమల-తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా అమల్లోకి వచ్చిన అనేక పథకాలకి, విధానాలకి - నాకు గొప్పదనాన్ని ఆపాదిస్తూ వచ్చారు.

నిజానికి, ఇది భక్తులకి ఉపయోగపడుతుంది అనిగానీ, దేవస్థానాలకి మంచిదనిగానీ భావించి నేను చేశాను అనుకుంటున్న ప్రతి పనికీ - "నాహం కర్తా, హరిః కర్తా" (నేను కాదు కర్తని, చేసేది చేయించేది శ్రీహరి మాత్రమే) అని మనస్ఫూర్తిగా విశ్వసించి చేశాను. సత్కారాలు వెతుక్కుంటూ వచ్చినా, ఛీత్కారాలు ముంచెత్తుకొచ్చినా, అన్నీ శ్రీనివాసుడి ప్రసాదమే అని నమ్మాను. ఇప్పటికీ అలాగే నమ్ముతున్నాను. మొదట నా ఈ అనుభవాలని ప్రచురించటానికి 'స్వాతి'వారు నిర్ణయించినప్పుడు నేను సూచించిన శీర్షిక సహితం "నాహం కర్తా, హరిః కర్తా".

నా అనుభవాలతో నా విశ్వాసాన్ని పాఠకుల మీద రుద్దకూడదన్న ఉద్దేశ్యంతోనే జరిగిన సంఘటనలని యథాతథంగా కాగితంమీద పెట్టే ప్రయత్నం చేశాను. కొన్ని సందర్భాలలో అద్భుతంగానూ, కొన్నిచోట్ల విచిత్రంగానూ, మరికొన్నిసార్లు నమ్మశక్యంకానట్లుగానూ కనిపించే నా ఈ అనుభవాల్ని నాస్తికులు తార్కిక దృష్టితో విశ్లేషించినా, ఆస్తికులు ఆధ్యాత్మిక దృష్టితో చూసినా, అనేక సందేహాలు ఉదయించకమానవు.

"భగవంతుడు ఉన్నాడా? ఉంటే ఎలా వుంటాడు? నువ్వు చూశావా?" అని ప్రశ్నించే హేతువాదులకీ, ఒక మంచిపని చేయాలనుకున్నప్పుడు భగవంతునిపట్ల ఎలాంటి విశ్వాసంవుంచి, ఎంత చిత్తశుద్ధితో పనిచేస్తే మానవయత్నాలకు దైవబలం తోడవుతుంది అని తెలుసుకోవాలనుకునే జిజ్ఞాసువులకీ - నా ఈ వింత అనుభవాలలో సమాధానం ఎంతవరకు దొరుకుతుందో చెప్పలేను. కాని, అనుభవాలు పెరిగిన కొద్దీ నాలో "నాహం

కర్తా, హరిః కర్తా" అన్న విశ్వాసం మాత్రం ఇనుమిక్కిలిగా పెరిగిందని, పెరుగుతూనే వుందని చెప్పగలను.

మంచిచెడుల విచక్షణజ్ఞానంతో కూడిన జీవిత పరమార్థం తెలుసుకునేలా నడిపిస్తూ వచ్చిన నా స్వరూపోద్ధారక గురువు శ్రీ సత్యప్రమోద తీర్థస్వామీజీ, వారి ఉత్తరాధికారి శ్రీ సత్యాత్మ తీర్థ స్వామీజీల మార్గదర్శకత్వం, "సమాజంలో పదిమంది జీవితాల్లో వెలుగు నింపటానికే నువ్వు IAS లో చేరాలనుకుంటున్నాను" అన్న మా నాన్నగారు పత్రి కృష్ణారావుగారి ఆకాంక్ష, నియమబద్ధమైన ఆధ్యాత్మిక జీవనమార్గంలో నేను నడవటానికి నా సహధర్మచారిణి గోపిక నిర్వహించిన పాత్ర నా ఈ అనుభవాలలో నిబిడీకృతమైవున్న జీవిత సత్యాన్ని అన్వేషించే ప్రేరణ కలిగించాయి.

అందుకే, నేను ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసెస్ (IAS)లో చేరిన తొలి సంవత్సరాలలో నన్ను తెలిసున్న వాళ్ళకి ఇవాల్టి నా జీవనశైలి విచిత్రంగానూ, నమ్మశక్యంకానిదిగానూ కనిపిస్తుంది. ఈ పరివర్తనానికి దర్పణం నా ఈ అనుభవాల సంకలనం.

నా వింత అనుభవాలలో అధికభాగం తిరుమల తిరుపతి దేవస్థానాలలో నేను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పనిచేసిన కాలానికి సంబంధించినవీ, ఆ పోస్టింగ్ కారణంగా చోటుచేసుకున్నవీ. నేను TTD నుంచి బదిలీ అయి 21 సంవత్సరాలు గడుస్తోంది. మరి ఈ అనుభవాల్ని ఇప్పుడే ఎందుకు రాయాలనిపించింది - అని ఎవరికైనా అనిపించవచ్చు. దానికి సమాధానం : "నాహం కర్తా, హరిః కర్తా"

పి వి ఆర్ కె ప్రసాద్

## నా మనసులో మాట

నా అనుభవాల్ని, మనోభావాల్ని అక్షరరూపంలో పెట్టడంలో నాతోపాటు శ్రమించిన ఆత్మీయుడు జి. వల్లీశ్వర్‌కీ,

'సర్వసంభవామ్' శీర్షికన నా వింత అనుభవాల్ని ప్రచురించే సాహసం చేసిన 'స్వాతి' వారపత్రిక సంపాదకులు శ్రీ వేమూరి బలరామ్‌కీ,

'స్వాతి'లో ప్రచురితమైన నా స్వానుభవాల రచనలను ఎప్పటికప్పుడు విశ్లేషిస్తూ, ప్రోత్సహించిన రచయిత శ్రీ రావులపాటి సీతారామారావు IPS కీ,

'స్వాతి'లో ప్రచురితమైన నా అనుభవాలమాలికకి అందాన్ని ఇనుమడింపజేసేలా చిత్రాలు వేసిన బాపు, వర్మగార్లకీ,

ఇంకా - నా అనుభవాల గాథలు ప్రచురణరూపం దాల్చడంలో DTP తదితర బాధ్యతల నిర్వహణలో సహకరించిన బి. రామచంద్రయ్య , డి.భుజంగరావు, శ్రీమతి వి. ధనలక్ష్మి డి. మహదేవ్‌లకూ,

'స్వాతి'లో ప్రచురితమైన నా అనుభవాలన్నింటినీ http//pvrk. hrdiap. gov.in' వెబ్‌సైట్‌లో పొందుపరిచిన ఆర్. భాస్కర్, వెంకటరమణ, సత్యనారాయణ రాజులకూ,

మాటల్లో వ్యక్తం చేయలేని కృతజ్ఞతాభావాలతో....

పి వి ఆర్ కె ప్రసాద్

# నాహం కర్తా, హరిః కర్తా



# 1

## మోకాలుకీ కొండకీ ఏం సంబంధం?

శ్రీనివాసుడ్ని చూడాలని తిరుమల కొండ ఎక్కితే, మోకాళ్ళు నొప్పి పెట్టడం సహజం. కాని, నా విషయంలో జరిగింది వేరు. మేం - 'తిరుమలకు ఎందుకు వెళ్ళాలి?' అనుకున్నప్పుడే, మోకాలు నొప్పి అనే చేదు అనుభవాన్ని చవిచూడాల్సి వచ్చింది!!

★ ★ ★

పశ్చిమ గోదావరి జిల్లాలో అసిస్టెంట్ కలెక్టర్ ట్రెయినింగ్ తరువాత భువనగిరి సబ్ కలెక్టర్‌గా ప్రారంభమైన సర్వీసులో ఖమ్మం జిల్లాకలెక్టరుగా మూడేళ్ళు పనిచేయడంతో జిల్లాల్లో నా పోస్టింగ్స్ ఇంచుమించు పూర్తయ్యాయి. 1977లో ఖమ్మం నుంచి బదిలీ చేస్తూ నన్ను ఆంధ్రప్రదేశ్ నీటిపారుదల సంస్థ మేనేజింగ్ డైరెక్టరుగా ప్రభుత్వం నియమించింది. ఈ సంస్థ కార్యాలయం హైదరాబాద్‌లో ఉంది.

ఇంక ఇక్కడితో జిల్లాల్లో పోస్టింగ్‌లు పూర్తయినట్లే కనుక హైద్రాబాద్‌లో పిల్లల అడ్మిషన్‌లు చూసుకొని, సొంత ఇంట్లో స్థిరపడే ప్రయత్నంలో వుండగా, ఒకరోజు హడావుడిగా ఛీఫ్ సెక్రటరీ కార్యాలయం నుండి నాకు ఫోన్ వచ్చింది. అప్పట్లో శ్రీ ఐ. జె. నాయుడు ఛీఫ్ సెక్రటరీ. తీరా వెళ్ళాక విషయమేమిటయ్యా అంటే - నేను మూటా ముల్లే సర్దుకుని, మళ్ళీ జిల్లాల్లోకి వెళ్ళాలి. కాకపోతే ఈసారి నేను తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వెళ్ళాలని ముఖ్యమంత్రి డాక్టర్ మర్రి చెన్నారెడ్డిగారు సూచించారు.

ఇలాంటి పోస్టుల విషయంలో ముఖ్యమంత్రులు స్వయంగా ఎంపిక చేసుకోవటం అప్పుడే కొత్తగా ఆరంభమైన విధానం. అదికూడా అంత సులువుగా జరగలేదు. ఛీఫ్ సెక్రటరీ ఎంపిక చేసి ఇచ్చిన కొంతమంది ఐఏఎస్ అధికారుల జాబితాలోంచి ముఖ్యమంత్రి తనకిష్టమైన కొద్దిమందిని మళ్ళీ ఎంపిక చేసుకున్నారు. అందులోంచి నాకు ప్రథమావకాశం ఇచ్చారు. ఛీఫ్ సెక్రటరీ చెప్పటమయితే, "ఆధ్యాత్మిక సంబంధమైన సంస్థలలో పనిచేయాలంటే వాటి ఉనికిపట్ల పరిపూర్ణమైన విశ్వాసం వుండాలి. అలాగే, అక్కడ పనిచేయటానికి ఆసక్తికూడా వుండాలి. ఈ ప్రాతిపదికపైన ముఖ్యమంత్రి నీ పేరు ఎంపిక చేశారు. కనుక నీకిష్టమైతేనే పోస్టింగ్ ఆర్డర్స్ వేయటం జరుగుతుంది."

నాకు - అప్పటికప్పుడు ఎటూ చెప్పలేని స్థితి. "ఇప్పుడిప్పుడే హైద్రాబాద్‌లో సెటిల్ అవుతున్నాను. మళ్ళీ హైద్రాబాద్ వదిలిపోవాలా?" అన్న అసంతృప్తి. అలాగని గట్టిగా "నాకు ఆసక్తి లేదు" అని చెప్పేద్దామంటే, "స్వామి వారి నుండి పిలుపువస్తే తిరస్కరించిన వాళ్ళమవుతున్నామా?" అన్న అనుమానం. ఆ సమయంలో ఒక మిత్రుడు నాకు గుర్తు చేశాడు - 1973లో పశ్చిమగోదావరి కలెక్టరుగా వున్న ఒక ఐఏఎస్ అధికారిని ప్రభుత్వం టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నియమిస్తూ ఆర్డర్సు వేస్తే, స్థానిక రాజకీయ నాయకుల ప్రోద్బలంతో ఆయన అక్కడే మరికొంతకాలం కొనసాగాలని కోరుకోవడం, ఫలితంగా ఆ ఆర్డర్సు రద్దుకావటం జరిగింది. అలా జరిగిన రెండు మూడు వారాల్లోనే ఆయన కస్టమ్స్, ఎసిబి, ఇన్‌కంటాక్స్ దాడులకు గురికావటం - సస్పెండ్ అవటం కూడా జరిగింది!!!

ఇలాంటి సందిగ్ధస్థితిలో - ఎలాంటి నిర్ణయం తీసుకోవాలన్నా భార్యతో కూడా సంప్రదించాలని భావించాను. అందుకే నా నిర్ణయం ఏమిటో చెప్పటానికి రెండురోజులు వ్యవధి కావాలని ఛీఫ్ సెక్రటరీని నేను కోరటం, ఆయన "సరే" అనడం జరిగిపోయింది.

ఇంటికొచ్చాక భార్య గోపికతో చర్చించాను. అప్పటికే దాదాపు పదేళ్ళపాటు పోస్టింగ్స్‌తో అటూ ఇటూ తిరుగుతూ వున్నాం. కూతురు మాధవి స్కూలు చదువు ఆరంభమై, అప్పటికి మూడు వేర్వేరుచోట్ల స్కూళ్ళలో చేరాల్సివచ్చింది. మళ్ళీ అమ్మాయి చదువుకి భంగం కలుగుతుంది. ఏం చేయాలి?... చాలా తర్జన భర్జనలు జరిగాయి. వెళ్తానని చెప్పటానికా పూర్తిగా మనసు రావటం లేదు. అలాగని "నాకిష్టం లేదు" అని ఛీఫ్ సెక్రటరీకి చెప్పలేను. మేమిద్దరం కలిసి ఆలోచించుకుని, "ఈ విషయాన్ని ప్రభుత్వానికే వదిలేస్తున్నాం." - అని చెప్పాలని నిర్ణయించుకున్నాం. ఈ సమస్యకి ఇది తెలివైన పరిష్కారం అని నేను భావించాను. అలాగే ఛీఫ్ సెక్రటరీకి చెప్పేశాను కూడా. కాని నాయుడుగారు ఒప్పుకోలేదు. "చూడు ప్రసాద్, నువ్వు ఇష్టపడివెళ్తానంటేనే తప్ప పోస్టింగ్ ఆర్డర్స్ వేయడం కుదర్దు" అని కుండబద్దలు కొట్టినట్లు చెప్పేశారు. అయినా ఎందుకనో మళ్ళీ ఆలోచించి, "సరే, నేను కూడా ముఖ్యమంత్రి గారికి నువ్విలా అన్నావని చెబుతాన్లే, ఆయనేమంటారో కూడా చూద్దాం" అన్నారు. అక్కడికి నేను - "ఇంక పోస్టింగ్ ఆగిపోయినట్లే, హమ్మయ్య, సమస్య గట్టెక్కింది"





అని ఊపిరి పీల్చుకున్నాను. కాని మరో సమస్య అప్పుడే మొదలైందని నాకు ఆ సాయంత్రం సినిమాకి వెళ్ళేదాకా తెలీదు...

* * *

**మా** కుటుంబమంతా సినిమా చూస్తుండగా మధ్యలో మా అమ్మాయి మాధవికి కుడిమోకాలిలో నొప్పి ప్రారంభమైంది. సినిమా పూర్తయ్యేసరికి మోకాలు వాచిపోయింది. నొప్పి ఎక్కువైపోయింది. మర్నాడు డాక్టర్‌కి చూపించాం. "ఇదేదో పురుగు కుట్టిన బాపతు" అని డాక్టరు అనుమానించారు. మందులిచ్చారు. అయినా నొప్పి తగ్గలేదు. వాపు తగ్గలేదు. కాలు మడిస్తే చాలు విపరీతమైన నొప్పి. రెండు మూడు రోజులు గడిచాయి. ఎక్స్‌రే తీశారు. ఇంకేవో పరీక్షలు చేశారు. విషయం తెలియటం లేదు. కానీ మందులవాడకం, దానితోపాటు స్కూలుకి పోలేనంత బాధ మాత్రం అమ్మాయికి పెరిగిపోతున్నాయి. మరోసారి రోజ్‌మెరీ టెస్ట్‌లాంటి పరీక్షలు కూడా చేశారు. అన్నింటి ఫలితం ఒక్కటే - "లోపల అంతా బాగానే వుంది". ఏమైనా ముందు - కాలుకి సగందాకా బ్యాండేజి వేశారు వాపుని తగ్గించటం కోసం. బ్యాండేజి మూలంగా మాధవికి నడక కూడా కష్టమైపోయింది. అలా డాక్టర్లు, టెస్టులు, మందులతో రోజులు గడిచిపోతున్నాయి. "అమ్మా, ఇలా ఎంతకాలమే" అని పిల్ల ఆవేదనతో అడుగుతుంటే సమాధానం చెప్పలేని స్థితి.

అలా అప్పటికి మాధవి స్కూలు మానేసి నెల రోజులవుతోంది. అసలెందుకిలా జరిగింది - అన్న ఆలోచన నన్ను తొలిచేయడం ఎక్కువైంది. అకస్మాత్తుగా, "ఒకవేళ నేను టిటిడి పోస్టింగ్ వదిలించుకోవాలని చూడటమే ఇందుకు కారణమా?" అన్న సందేహం కూడా కలిగింది. మళ్ళీ నేను, గోపిక కూర్చొని గడచిన కథ అంతా నెమరు వేసుకున్నాం. ఛీఫ్ సెక్రటరీ పిలవడం, మేము వద్దనుకోవడం, ఇలా ఛీఫ్ సెక్రటరీకి చెప్పేసి రావడం, అదే సాయంత్రం సినిమాలో మాధవికి మోకాలు నొప్పి ప్రారంభం కావడం, మర్నాటి నుంచి అది స్కూలు మానేయటం.... ఇవన్నీ మా సందేహానికి ఒక సమాధానమిచ్చినట్లు అనిపించింది. అంతే! మర్నాడు నేను చేసిన మొదటి పని - ఛీఫ్ సెక్రటరీని కలిసి, టిటిడికి వెళ్ళటానికి నా అంగీకారం తెలపడం.

నాయుడుగారు చాలా ఉదాసీనంగా చెప్పారు - "రెండు మూడుసార్లు ముఖ్యమంత్రితో ఈ అంశం చర్చకు వచ్చిందయ్యా! కాని ఎవర్ని వేయాలో ఇంకా తేల్చుకోలేదు. సరే, నేను మళ్ళీ సమయం వచ్చినప్పుడు ముఖ్యమంత్రితో మాట్లాడి చూస్తా, ఆయన ఏమంటారో..." అంతే తప్ప, "పోస్టింగ్ నీకే వేయిస్తాలే" అని ఆయన హామీ ఇవ్వలేదు. ముఖ్యమంత్రి చెన్నారెడ్డి గారి ఆగ్రహానుగ్రహాల ప్రభావం ఎలా వుంటుందో తెలిసిన మనిషి కనుక అలాంటి హామీ ఇవ్వటానికి నాయుడుగారు ధైర్యం చేయలేదు... ఏమైనా, "శ్రీనివాసుడు పిలిస్తే రానన్నాను" అన్న వెలితి లేకుండా చెప్పేశాను, ఇక మిగిలింది ఆయనే (శ్రీవారు) చూసుకుంటాడు - అన్నది నా ఆలోచన.

విచిత్రమేమంటే, అందుకు విరుద్ధంగా జరగలేదు. ఆ సాయంత్రం ఛీఫ్ సెక్రటరీ నుంచి నాకు పిలుపు వచ్చింది. వెళ్ళగానే పోస్టింగ్ ఆర్డర్స్ కూడా ఇచ్చేశారు నాయుడుగారు. ఆ ఆర్డర్ కాపీతో ఇంటికి చేరిన నేను గేటు దగ్గరే నిశ్చేష్టుణ్ణయి నిల్చుండిపోయాను ఆ దృశ్యాన్ని చూసి.

అది - "డాడీ" అంటూ మాధవి పరుగెత్తుకుంటూ వచ్చి నన్ను చుట్టేసింది. "చూడు చూడు, ప్లాస్టర్ తీసేస్తే నేను ఎంత బాగా నడుస్తున్నానో, వాపుపోయింది, నొప్పి పోయింది..." అంటూ మాధవి కాలు మడిచింది, కాలు చాచింది, గెంతింది, దూకింది, పరుగెత్తింది... మాధవి ఆనందానికి అంతులేదు. మరి 40 రోజులుగా ఉన్న ఆ వాపు ఏమైంది?...

* * *



తిరుమల మూర్తులు-1

## మూలవిరాట్-ధృవబేర

తిరుమల శ్రీనివాసుడి గర్భాలయంలో అందరూ చూసేది తూర్పు ముఖంగా వుండే శ్రీనివాసుడి మూలవిరాట్. దీన్నే ఆగమ పరిభాషలో 'ధృవబేరం' అంటారు. యోగ, భోగ, విరహ రూపాల్లోకాక 'వీరస్థానక' విధానంలో నిలబడి వుండే ఈ 'ధృవబేర' విగ్రహానికి అనుబంధంగా శ్రీదేవి-భూదేవి విగ్రహాలు వుండవు. మూలవిరాట్ స్థిరమై వుంటుంది కనుక ఉత్సవాలకోసం సంచార విగ్రహం వేరే వుంటుంది. గర్భగుడిలో ఇలాంటి నాలుగుచిన్న విగ్రహాలు సంచార లక్షణం కలిగి వున్నాయి.






# 2

# జపాలకి జడివానలు కురుస్తాయా?

అర్ధరాత్రి దాటాక, తిరుమల గుడి తలుపులు తాళాలు వేశాక, తిరుమలేశుని గుడిలో వుండే నిలువెత్తు గంటలు గణగణమని మ్రోగుతున్నాయి.

అంతకు ముందెన్నడూ అలా జరగలేదు. అనూహ్యమైన, అసాధారణమైన ఈ సంఘటనతో తిరుమల ప్రజలు ఉలిక్కిపడి లేచారు. స్థానిక పౌరులు, సత్రవులలోని యాత్రికులు ఆదరాబాదరా పరుగులు తీశారు ఆలయంవైపు. ఆశ్చర్యం, అనుమానం, ఆందోళన - ఆ సమయంలో దేవాలయం దగ్గరకు చేరిన వాళ్ళందరి మొహాల్లో కొట్టొచ్చినట్లు కనుపిస్తోంది.

"ఎలా జరిగింది? ఎలా జరిగింది?" అనుకుంటూ అంతా ప్రశ్నల వర్షంలో తడిసిపోతున్నారు. నిజానికి, నీరు లేక తిరుమల ఎండిపోతోంది!!!

* * *

**నేను** తిరుమల తిరుపతి దేవస్థానాలకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వెళ్ళిన మరుసటి సంవత్సరమే - 1979లో - తిరుమల కొండమీద భయంకరమైన నీటి కొరత ఏర్పడింది. ఆ సంవత్సరం వర్షాభావ పరిస్థితుల తీవ్రత కారణంగా తిరుమలకు నీటిని సరఫరా చేసే గోగర్భం రిజర్వాయర్‌తోపాటు మరో రెండు చిన్న చెరువులు - ఒక ఆళ్వార్ ట్యాంక్, మరొకటి శ్రీవారి పాదాలకి వెళ్ళే దారిలో వున్నది - కూడా ఆగష్టు నాటికి పూర్తిగా ఎండిపోయాయి. ఇప్పటి పాపనాశనం రిజర్వాయర్ అప్పటికింకా నిర్మాణంలో వుంది. కొండమీద అడపాదడపా నీటి అవసరాలకు ఉపయోగపడే మూడు నాలుగు బావులు కూడా అడుగంటి పోయే పరిస్థితి ఏర్పడింది. తిరుమలలో నీటి వినియోగం మీద అప్పటికే ఆంక్షలు విధించారు.

సెప్టెంబర్, అక్టోబర్ మాసాల్లో వచ్చే తుఫానుల వల్ల వర్షాలు కురుస్తాయి. కనుక సాధారణంగా ఆ వర్షాలతో అక్టోబర్ నాటికి ఈ ట్యాంకుల్లో, బావుల్లో నీటిమట్టం పెరుగుతుండేది. అదే ఆశతో ఆ సంవత్సరం కూడా వున్న నీటిని పొదుపుగా వాడుకుంటూ అక్టోబర్ దాకా నిరీక్షించాం. కానీ వరుణదేవుడు కరుణించలేదు. ఉన్న నీటి నిలవల్ని ఇంజనీర్లు అంచనా వేసి, మరో మూడు నాలుగు వారాలకు మించి సరఫరా చేయలేమని తేల్చారు. అయినా ఇంకా ఆశ - వర్షాలు ఏదోరకంగా పడకపోతాయా అని. ఒకవేళ వర్షాలు కురవకపోతే... !

ఈ ప్రశ్నకు నాకు రెండు పరిష్కార మార్గాలు కనిపించాయి. మొదటిది - తిరుపతి నుంచి కొండ మీదకు ట్యాంకర్లతో నీళ్ళు రవాణా చేయించడం, రెండోది - నీటి కొరత కారణంగా కొండకు రావద్దని యాత్రికులకు విజ్ఞప్తి చేయటం. ఎందుకంటే తిరుమలలో నీటి సరఫరా మీద కొత్తగా ఆంక్షలు విధించే అవకాశం లేదు. ఈ ఆంక్షలు అప్పటికే గరిష్ఠస్థాయికి చేరుకున్నాయి. ఆరువేల జనాభా తిరుమలలో వుంది. ఇంకా రోజుకి పాతికవేలదాకా యాత్రికులు వస్తూ పోతుంటారు. వీళ్ళందరికీ నీళ్ళు ఎక్కడ్నుంచి ఇవ్వాలి? ఇవ్వలేకపోతే - భక్తుల దర్శనాల్ని నిరోధించాలా? - నీళ్ళు ఇవ్వలేకపోతున్నాం కాబట్టి శ్రీవారి దర్శనం మానేయండి - అని దేవస్థానాల ధర్మకర్తలు ప్రకటించడం సబబా? కాకపోతే మరేం చేయాలి?... బోర్డులో సభ్యులు ఎంతమందివున్నా, కీలక అంశాలలో మౌలిక బాధ్యత ఎప్పుడూ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌దే. అందుకని నేనే రకరకాల అంచనాలు వేసి ట్యాంకర్‌లతో నీళ్ళు తెప్పించడం ప్రారంభించాను - అవైనా ఆలయం మెయింటెనెన్సుకి మాత్రమే సరిపోతాయి.

ఇదిలా చేస్తూనే - మరోప్రక్క ఈ సమస్యకు ఆధ్యాత్మిక పరిష్కారం ఏమన్నావుందా అంటూ కూడా నేను శోధన సాగించాను. ఫలితంగా - దేవస్థానాల ఆస్థాన సలహాదారు, వేదవేదాంగాలను ఔపోసన పట్టిన ప్రముఖ పండితుడు ఉప్పులూరి గణపతి శాస్త్రి(90) గారిని నేను సంప్రదించటం జరిగింది. (ఆ తరువాత కాలంలో భారత ప్రభుత్వం గణపతి శాస్త్రిగారిని 'పద్మ విభూషణ్'తో గౌరవించింది.)

ఇలా వర్షాభావ పరిస్థితి ఏర్పడినప్పుడు జపాలు, యజ్ఞాలు చేయటం వంటి పరిష్కారాలు ఏమన్నా వున్నాయా? వుంటే అవి ఆచరణ సాధ్యమా? అందువల్ల ఫలితం ఏమేరకు వుంటుంది?... ఇలాంటి అన్ని రకాల సందేహాలకూ శాస్త్రిగారు ఇచ్చిన జవాబు ఒక్కటే - "ఇలాంటి అన్ని సమస్యలకీ వేదాల్లో పరిష్కార మార్గాలు వున్నాయి. అయితే వాటిల్లో ఏ ఒక్క కర్మని ఆచరించాలన్నా, భగవంతుని పట్ల పరిపూర్ణమైన విశ్వాసంతో, త్రికరణశుద్ధిగా ఆచరిస్తేనే ఫలితం వుంటుంది. ప్రజల్లో నాగరిక జీవనంపట్ల మోజు పెరిగి, ఇలాంటి సనాతన వైదిక విధానాలను ఆచరించటం సన్నగిల్లటం వల్ల, అలాంటి మహాకార్యాలు నిర్వహించగల వేద పండితులు కనుమరుగైపోతున్నారు తప్ప - వేద శాస్త్ర సంపద నిరుపయోగం కాలేదు, కాబోదు..."





ఒక మహా యాజ్ఞికుని వర్చస్సు వుట్టిపడే శాస్త్రిగారి మొహంలో - వైదిక కర్మలపట్లా, సామాజిక సమస్యలకు అవి ప్రసాదించగల పరిష్కారాల పట్లా కనుపించిన విశ్వాసం నన్ను ఆకట్టుకున్నది. ఈయన ద్వారా ఏదో పరిష్కారం దొరుకుతుందనే ఆశ కలిగింది. శాస్త్రిగారు తన వంశానికి మూలమైన వేదశాఖనే కాక, అన్ని వేదాలనూ - ఉప శాఖలతో సహా - అధ్యయనం చేయటంలోనే 48 సంవత్సరాలు గడిపారు.

వ్యాకరణ, తర్క, వేదాంత, మీమాంస, న్యాయ, నిరుక్త విజ్ఞానాన్ని కూడా సముపార్జించితే తప్ప, వేదార్థాన్ని సక్రమంగా వ్యాఖ్యానించడం సాధ్యపడదు.... ఆ స్థాయిని సాధించిన మహాపురుషుడు శ్రీ గణపతి శాస్త్రి - అని ఆ సంభాషణలో నేను అర్థం చేసుకున్నాను. దాంతో శాస్త్రిగారి మార్గదర్శకత్వం మీద గురి, ఆశ కూడా నాలో పెరిగాయి. శాస్త్రానుసారంగా ఏం చేయాలంటే అది, ఎలా చేయాలో అలాగే త్రికరణశుద్ధిగా చేయటానికి, చేయించటానికి నేను సిద్ధమయ్యాను. అప్పటి నా లక్ష్యం ఒక్కటే - ఎంత క్లిష్టమైన విధానమైనా సరే ఆచరించి, నీటిని సాధించాలి - యాత్రికులకు సహాయపడాలి.

గణపతి శాస్త్రిగారు - వరుణ జపం నిర్వహిస్తే వరుణదేవుడు కరుణించి వర్షిస్తాడని తరణోపాయం చెప్పారు. అది ఎలా నిర్వహించాలో కూడా చెప్పారు. కానీ తానుగా వచ్చి చేయించలేనంటూ తన అశక్తతని (అనారోగ్య కారణాలవల్ల) వ్యక్తం చేశారు. అయితే ఎక్కడెక్కడ్నుంచి ఏయే ఋత్విక్కుల్ని పిలిపించి ఈ కార్యాన్ని నిర్వహింపచేయవచ్చో వివరించారు.

చివరికి నవంబరు 1 నుంచి వరుణజపం ప్రారంభించాలని నిర్ణయించాం. కాని అది జరగలేదు. వాయిదా పడుతూ వచ్చింది. ఒకరోజు ఎవరో పండితుడి ఇంట్లో అశౌచం అన్నారు. మరోరోజు మరో పండితుడికి అనారోగ్యం అన్నారు. మరో పండితుడికి మరో రోజు మరో సమస్య... - ఓ ప్రక్కన గోగర్భం రిజర్వాయరులో నీటిమట్టం రోజురోజుకీ క్షీణించిపోతోంది. మరోవారం రోజులకి మించి నీటి సరఫరా అసాధ్యం - అంటూ ఇంజనీర్లు చేతులెత్తేశారు. ఆశ పెట్టుకున్న వరుణ జపం ఆరంభానికా రకరకాల ఆటంకాలు... అలా వారం రోజులు గడిచిపోయాయి. నేను సేవిస్తున్న శ్రీవారిని మరోసారి తల్చుకున్నాను - "ఏమిటీ పరీక్ష! ఎంతకాలం ఈ సందిగ్ధస్థితి? - ఈ కార్యక్రమం సక్రమంగా జరగదా? దీనికి నీ ఆమోదం ఇంకా రాలేదా?..." ... చివరికి ఎలాగైనా సరే నవంబరు 8 నుంచి వరుణ జపం చేసి తీరాలని నిర్ణయించుకున్నాం.

భగవంతుని ఆమోదం అయిందా లేదా అన్న ప్రశ్నకు సమాధానంగా - ఆ (నవంబరు 7) అర్థరాత్రి రెండు గంటల సమయంలో ఆలయం తలుపులు మూసివున్న తరుణంలో ... తిరుమల గిరులు ప్రతిధ్వనించేలా శ్రీవారి ఆలయంలోని బంగారు వాకిలిలో భారీ గంటలు 'గణగణ' మ్రోగాయి... తిరుమల ఒక్కసారి ఉలిక్కిపడి లేచింది. జనం లేచి పరుగెత్తారు "ఈ గంటల మోత



వరుణజపం ఆరంభానికి ముందు అర్ధరాత్రి మ్రోగిన గంటలు

ఎక్కడ్నుంచి" అనుకుంటూ. టి.టి.డి. ఉద్యోగులకు ఆ గంటల మోత ఆలయం లోంచి అని అర్థమైంది. కానీ నమ్మలేని స్థితి. అర్థరాత్రి ఏకాంతసేవ పూర్తయ్యాక, తలుపులన్నీ తాళాలు వేశాంగదా, ఈ గంటలమోత ఎక్కడిది - అన్న సంభ్రమాశ్చర్యాలు వాళ్ళని ముంచెత్తాయి.

లౌకిక ఆలోచనా ధోరణిలో అందరూ - "ఎవడో యాత్రికుడు లోపలవుండి పోయి వుంటాడు. వాడే ఈ పని చేసుంటాడు - తలుపులు తీయించడం కోసం" అనుకున్నారు. ఏమైతేనేం, సుప్రభాతసేవ కోసం తెల్లవారు ఝామున మూడు గంటలకు తలుపులు తీయాలి.... తీశాం. మూలమూలలా గాలించాం - గంటలు మ్రోగించిన 'శక్తి' ఎవరా అని!!! గర్భగుడిలో 'మూలవిరాట్' తప్ప మరో శక్తి కనబడలేదు! అప్పుడు నాకు అనిపించింది - వరుణ జపానికి శ్రీవారి ఆమోదం లభించిందని.

తెల్లవారుతూనే వరుణ జపం ప్రారంభం కావాలి. అంతకుముందు వరకూ ఏవేవో కారణాలవల్ల రాలేకపోయిన ఋత్విక్కులు సహితం ఆరోజు వచ్చేశారు. వరుణ జపంలో రకరకాల కార్యక్రమాలున్నాయి. కొందరు పండితులు పుష్కరిణిలో ఛాతీలోతు నీళ్ళలో నిలబడి జపం చేయాలి. మరికొందరు శ్రీవారి ఉత్సవ విగ్రహాలకు అభిషేకాలు, పూజలు చేయాలి. మరోప్రక్క వరుణ దేవుణ్ని ఆరాధిస్తూ హోమం జరపాలి.

అలా మూడు రోజులు చేశాక మూడోరోజు సాయంత్రం ఉత్సవ విగ్రహాలకు పుష్కరిణి మంటపంలో స్నపన తిరుమంజనం చేయటంతో కార్యక్రమం ముగుస్తుంది. తిరిగి నాలుగోరోజు ఉదయం 7 గంటలకు స్వామివారికి సహస్ర కలశాభిషేకం (కార్యక్రమం సజావుగా జరిపించినందుకు కృతజ్ఞతలు తెలుపుతూ) చేస్తారు... అలా ఋత్విక్కుల వేదమంత్రోచ్చారణల మధ్య మూడు రోజుల కార్యక్రమం సవ్యంగా జరిగిపోయింది.





మూడోరోజు సాయంత్రం స్నపన తిరుమంజనం దాకా ఏ విశేషమూ లేదు. ఎక్కడా మబ్బులు కమ్మే ఛాయలు కనబడటంలేదు. సూర్యుడు ప్రకాశవంతంగా కనుపిస్తూనే వున్నాడు. "సరే, ఏం చేస్తాం, మన ప్రయత్నం మనం చేశాం" అనుకుంటూ నాతోసహా ఋత్విక్కులంతా ఉత్సవ విగ్రహాల్ని పుష్కరిణి నుండి బయటకు తీసుకువచ్చి, ఆలయంవైపు నడుస్తున్నారు. అక్కడి నుంచి అక్కడికి అంతా కలిపి ఓ వంద గజాల దూరం ఉంటుందేమో. "కన్నీళ్ళే తప్ప, వర్షం నీళ్ళు కనబడటం లేదే" అంటూ ఊరేగింపు వెనకాల నుంచి విలేకరుల వ్యాఖ్యలు కూడా వినిపిస్తున్నాయి...

క్షణాల్లో... ఆకాశం ఉరిమింది... కుండపోతగా వాన ప్రారంభమైంది. ఎంత ఉధృతంగా ఆకాశం వర్షించిందంటే, శ్రీవారి ఉత్సవ విగ్రహాల్ని తడవకుండా ఆలయంలోకి చేర్చడం కోసం పండితులంతా ఆ కొద్ది దూరం పరుగులు తీయాల్సి వచ్చింది. మామూలుగా అయితే ముందు జాగ్రత్త చర్యగా విగ్రహాలకి ఛత్రం పడతారు. ఆ రోజు వాతావరణం అలాంటి అవసరాన్ని సూచించలేదు. కనుక ఛత్రాలు తేలేదు. దాంతో ఆలయం చేరేసరికి అంతా తడిసి ముద్దయిపోయాం. అలా మొదలైన ఆ కుండపోతవాన మర్నాడు ఉదయం 7 గంటలకి సహస్ర కలశాభిషేకం ఆరంభమయ్యేదాకా నిరాటంకంగా కురుస్తూనే వుంది.



వర్షం కురవకముందు గోగర్భం డామ్‌లో పూజలు

సహస్ర కలశాభిషేకం ప్రారంభం కాబోతుండగా, ఛీఫ్ ఇంజనీరు పరుగెత్తుకుంటూ వచ్చి నా చెవిలో వేశారు - "గోగర్భం రిజర్వాయర్ పొర్లి ప్రవహిస్తోంది". నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అప్రయత్నంగా శ్రీనివాసుడికి నమస్కారం చేశాను.

విచిత్రం ఏమంటే - తిరుమల గిరుల చుట్టుప్రక్కల తిరుపతి, రేణిగుంట, కాళహస్తి, రైల్వే కోడూరుల వైపు ఎక్కడా

ఆ వర్షం ఛాయలు కూడా కానరాలేదు. ఒక్క తిరుమల కొండని మాత్రమే జడివాన ముంచెత్తింది ఆ రాత్రంతా.

ఆ సంఘటన కాకతాళీయమా?

వేద మంత్రాల శక్తి ప్రభావమా?

భక్తులు నమ్ముతున్న ఆ దేవుని అనుగ్రహమా?

* * *



వర్షం కురిశాక గోగర్భం డామ్



# 3

## రాష్ట్రపతికి అడ్డంపడ్డ విమానం

అకస్మాత్తుగా - ఆ విమానం గాల్లో వూగిపోయింది. క్షణాల్లో నేలకూలింది. ఒక ప్రత్యేక దిశలోకి ఈడ్చివేయబడింది. కొన్ని వందల గజాల దూరంలో నేలమీద దేకుతూ పోయి, స్తంభించిపోయింది. దాని ముక్కు, తోక భాగాలు విరిగిపోయాయి. ఇంజన్‌లోంచి నిప్పురవ్వలు, పొగలు బయటకు తన్నుకొస్తున్నాయి. అయినా విమానం పేలిపోలేదు. మాకు మాత్రం గుండెలు ఆగిపోయినట్లయింది.

* * *

**నేను** తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా ఒకసారి తిరుచానూరులోని పద్మావతీ అమ్మవారికి తెప్పోత్సవం జరుగుతోంది. అది 1981 జూలై 15 లేదా 16 కావచ్చు. ఆ రోజు తెప్పోత్సవం కార్యక్రమంలో వుండగా నాకు ఛీఫ్ సెక్రటరీ నుండి టెలిఫోన్ కాల్ వచ్చింది. ఆ ఫోన్‌కాల్ సారాంశం ఇది: అప్పటికే సికింద్రాబాద్ బొలారంలోని రాష్ట్రపతి నిలయంలో వేసవి విడిదికి వచ్చి వున్న రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి తిరుమలకు వచ్చి 10-15 రోజులపాటు కొండమీదే బస చేసి, శ్రీవారి సన్నిధిలో గడపాలనుకుంటున్నారు.

నాకు విచిత్రంగా అనిపించింది. రాష్ట్రపతి వచ్చి శ్రీవారి దర్శనం కోసం ఒకటి రెండు రోజులు కొండమీద బసచేయడం మామూలే. ఆ ఒకటి రెండు రోజుల బస అంటేనే ఒక యజ్ఞం చేసినంతపని. రాష్ట్రపతి కోసం సెక్యూరిటీ ఏర్పాట్లు, ఆయన ఆంతరంగిక సిబ్బందికీ, సెక్యూరిటీ సిబ్బందికీ, రాష్ట్ర ప్రభుత్వం తరఫున ఆయనని అంటిపెట్టుకొని వుండే మంత్రిగారికీ, వారి సిబ్బందికీ, ఇంకా రాష్ట్రపతిని చూడాలని వచ్చే వివిపిలకూ బస ఏర్పాటు చేయడం, వాళ్ళకి భోజనాల ఏర్పాట్లు, ఇదంతా మామూలుగానే పెద్ద తతంగం.

అలాంటప్పుడు దైనందిన పరిపాలనా కార్యక్రమాలకు ఆటంకం కలుగుతూండటం కూడా సహజం. ఇప్పుడు 10-15 రోజులపాటు రాష్ట్రపతి వస్తారంటే - అందులోనూ ఆయన తెలుగువాడు, మాజీ ముఖ్యమంత్రి కూడా కనుక, ఆయన్ని చూడటానికి వచ్చిపోయే అతిథుల్ని, నాయకుల్ని కూడా పట్టించుకోవాలన్నా, భద్రతా ఏర్పాట్లు పటిష్ఠంగా చేయాలన్నా అంత సులభంగా జరిగిపోయే విషయం కాదు. దీనికితోడు మంచి కాటేజీల్ని పెద్దయెత్తున రిజర్వు చేసి వుంచాలి. కనుక సాధారణ భక్త యాత్రికులకు అసౌకర్యం కలిగించాల్సి వస్తుంది. అలాగే రాష్ట్రపతి శ్రీవారి దర్శనానికి బయల్దేరినప్పుడల్లా చాలాసేపు దర్శనం క్యూలని నిరోధించాల్సి వస్తుంది. ఇది - భక్తులకి మరింత అసౌకర్యం, చికాకు కలిగిస్తాయి.

నేనీ విషయాలన్నీ ఛీఫ్ సెక్రటరీకి వివరించాను. "మీరీ విషయాన్ని రాష్ట్రపతి దృష్టికి తీసుకువెళితే బాగుంటుందేమో" అన్నాను. ఆయన - అప్పటికే తాను రాష్ట్రపతికి ఈ పరిస్థితి క్లుప్తంగా వివరించాననీ, అయినా రాష్ట్రపతి తాను ఎవరికీ అసౌకర్యం కలిగించకుండా, విజిటర్ల గోల పెట్టుకోకుండా, కేవలం స్వామి వారిని మాత్రమే చూసుకుంటూ, భక్తుడిగా రెండు వారాలపాటు కొండ మీద గడపదలచుకున్నానని చెప్పారనీ ఛీఫ్ సెక్రటరీ అన్నారు. అయినా నా అభ్యర్థన మేరకు మరోసారి రాష్ట్రపతితో మాట్లాడతానని హామీ ఇచ్చారు.

మరుసటిరోజు ఉదయాన్నే మళ్ళీ నాకు ఛీఫ్ సెక్రటరీ నుంచి ఫోన్‌కాల్ వచ్చింది. "విషయాలన్నీ మాట్లాడానయ్యా. ఆయన మాత్రం కొండమీద బసచేయడం తప్పదంటున్నారు. కాకపోతే తాను రాష్ట్రపతి హోదాలో కాక, సాధారణ భక్తుడిలా శ్రీనివాసుడ్ని సేవించుకోవాలనుకుంటున్నారట. హంగూ, ఆర్భాటం లేకుండా, సాదా ఏర్పాట్లు మాత్రం చేయాలంటున్నారు. నువ్వు ఇవ్వాళే బయల్దేరి ఇక్కడికి వస్తే, సాయంత్రం నిన్నే రాష్ట్రపతి దగ్గరికి తీసుకువెడతాను. మిగతా విషయాలు మీరు ముఖాముఖి మాట్లాడుకోవచ్చు-" అని ఛీఫ్ సెక్రటరీ వివరించారు... ఆ ప్రకారం, ఆ మధ్యాహ్నమే నేను హైదరాబాద్‌కి విమానంలో బయల్దేరాను.

ఆ రోజుల్లో తిరుపతి నుంచి హైద్రాబాద్‌కి ఒక 'ఆవ్రో' విమానం నడిచేది. మధ్యాహ్నం 3.30 గంటలకి తిరుపతిలో బయల్దేరితే 5 గంటల ప్రాంతంలో హైద్రాబాద్ చేరతాం. నేను ఎయిర్‌పోర్టుకి బయల్దేరబోతూ, ఇలా రాష్ట్రపతి రాకకి సంబంధించిన సెక్యూరిటీ ఏర్పాట్లు ప్లాన్ చేయవలసిందిగా అడిషనల్ ఎస్. పి. రావులపాటి సీతారామారావుకీ, విజిలెన్స్ ఆఫీసర్ జనార్దన నాయుడికి సూచనలు పంపించి, రేణిగుంట ఎయిర్‌పోర్టుకి చేరుకున్నాను. అప్పట్లో తిరుమలకొండ మీద సన్నిధి వీధిని వెడల్పు చేసే కార్యక్రమం ముమ్మరంగా జరుగుతూండటం వల్ల ఈ అధికారులంతా అక్కడే వున్నారు. అయినప్పటికీ వాళ్ళు నా సూచనలందుకుని రేణిగుంట ఎయిర్‌పోర్టుకి వచ్చి నన్ను కలుసుకున్నారు. అప్పటికే నేను విమానం ఎక్కేశాను. అయినా వాళ్ళు వస్తున్నారని తెలిసి, కొంతసేపు విమానాన్ని ఆపించాను. వాళ్ళు వచ్చి ఏర్పాట్ల గురించి చర్చించి దిగిపోయాక, 'ఆవ్రో' బయల్దేరింది.






రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డితో
శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్

విమానంలో తొమ్మిదో వరుసలో కిటికీ పక్కన కాకుండా, వరుస మధ్యలో సీటు నాకు వచ్చింది. నాకు పక్క సీటులో అప్పటి సాంస్కృతిక శాఖామంత్రి శ్రీ భాట్టం శ్రీరామ్మూర్తి కూర్చున్నారు. రాష్ట్రపతి పర్యటన గురించి ఆయనేదో అడుగుతున్నారు. నేను చెబుతున్నాను. అంతలో విమానం మెల్లగా రన్‌వే మీద పరుగులు తీస్తూ గాలిలోకి ఎగిరింది.

కొద్ది నిమిషాలు గడిచాయో లేదో, ఒక్కసారిగా విమానం వూగిపోయినట్లయింది. మాకు కడుపులో ఏదో దేవినట్లనిపించింది. ప్రయాణికులు కేకలు వేశారు. మళ్ళీ విమానం నడక సర్దుకుంది. 'అమ్మయ్య' అనుకున్నాం - అంతే, క్షణాల్లో మళ్ళీ కడుపులో దేవటం ఆరంభమైంది. అంటే విమానం బరువుని కోల్పోతోందన్నమాట. అంతలో మరోసారి విమానం విపరీతంగా వూగిపోసాగింది. విమానంలో గాలి వీచినట్లయింది. తలగడలు, పేపర్లు ఎగిరిపోతున్నాయి. అందరం నడుముకి బెల్ట్‌లు బిగించుకు పెట్టుకున్నా, విమానం కుడిపక్కకి ఒరిగిపోతున్నట్లు, వెనక్కి లేచిపోతున్నట్లు అనిపిస్తోంది. భయంతో కేకలు, అరుపుల మధ్య ప్రయాణికులు తమ తమ సీట్లకి బల్లుల్లా అంటుకుపోయారు. - అలా ఓ పక్కకి తోసుకుంటూ దూసుకుపోతున్నట్లున్న విమానం ఒక్కసారిగా దభీమని ఆగిపోయింది ఒకే ఒక్క కుదుపుతో. ఆ కొద్ది నిమిషాలపాటు ముందు సీటు గట్టిగా పట్టుకు కూర్చుని కళ్ళు మూసుకుని నేను సేవిస్తున్న స్వామిని ధ్యానిస్తూ, ప్రార్థిస్తున్న నేను, విమానం ఒక్క వూపుతో ఆగిపోగానే, గాలి తోసుకువస్తున్న వైపు (వెనక్కి) తిరిగి చూశాను. విచిత్రం - విమానానికి చిల్లు పడింది. అందులోంచి దుమ్ము, బురద మట్టి లోపలకు ఎగిరి వచ్చేస్తున్నాయి. అప్పటికే చాలా బురదమట్టి విమానం లోపల పైకప్పు నిండా వెదజల్లబడింది. నాకు అప్పుడు అర్థమైంది. విమానం నేల కూలింది.

ఉద్వేగంతో, సంభ్రమంతో నేను కేకలు వేశాను. సీటు బెల్ట్ విప్పుకుని వెనుక తలుపు దగ్గరకు పరుగెత్తాను. నాతోపాటు ఎయిర్ హోస్టెస్, మరో ప్రయాణికుడు కూడా వచ్చారు. ముగ్గురం కలిసి అతి బలంగా తంతేగాని వెనుక తలుపు తెరుచుకోలేదు. తీరా తలుపు తీసి చూస్తే, విమానం మట్టి నేలని బల్లిలా అంటుకుపోయి వుంది. బయటంతా కుండపోతగా వర్షం...

క్షణాల్లో ప్రయాణికులందరూ బ్రతుకు భయంతో 'గోవిందా, గోవిందా' అనుకుంటూ విమానంలోంచి దూకేశారు. అందరం అప్పుడు గమనించాం - విమానం ముందు భాగంలోంచి పొగలు వస్తున్నాయి. అయితే వర్షం వల్ల ఆ పొగలకి కారణమైన మంటలు వేగంగా తగ్గిపోయాయి. నేను ఒక కాలి చెప్పును విమానంలో మర్చిపోయాను. మళ్ళీ లోపలికి వెళ్ళి తెచ్చుకున్నాను... అందరం బయటే నిలబడి వర్షంలో తడుస్తున్నాంగానీ, ఎవరూ ధైర్యంచేసి విమానంలో కూర్చోవాలనుకోలేదు. కొద్ది నిమిషాలకు వర్షం తగ్గిపోయింది. విమానంలోంచి పొగలు ఆగిపోయాయి. ఆకాశం తెరిపిచ్చింది. వెలుతురు పెరిగింది. పరికించి చూస్తే, విమానం ముక్కుభాగం, తోకభాగం విరిగి ఎక్కడో పడిపోయాయి. ప్రొపెల్లర్స్ కొన్ని భాగాలుగా ముక్కలైపోయి చెల్లా చెదురుగా పడున్నాయి. మేం వున్నది ఒక బాగా ఎండిపోయిన చెరువు గర్భంలో. అప్పటికి విమానం 200 - 300 గజాల దూరం దాకా బాగా నేలమీద ఈడ్చివేయబడ్డట్లు స్పష్టంగా కనుపిస్తోంది. అయితే అక్కడ చౌడు నేల కావటంవల్లా, ఆ సమయంలో వర్షం కురుస్తూండటం వల్లా, ఆ తడిసిన మట్టి - విమానానికి ఒక షాక్ అబ్జార్బర్‌లాగా పనిచేసింది. మొత్తం మీద 29 మంది ప్రయాణికులం క్షేమంగా వున్నాం. విచిత్రంగా - ఒక్క రక్తపు చుక్క కూడా ఎక్కడా చిందలేదు. మరోసారి శ్రీనివాసుని ధ్యానించుకున్నాను.

అందరం 'బ్రతుకు జీవుడా' అనుకుంటూ బయటపడ్డ ఆనంద పారవశ్యంతో ఉక్కిరిబిక్కిరవుతూ ఒకరికొకరు అభినందనలు తెలుపుకుంటున్నాం. అంతకుముందు మా విమానం పిచ్చిగా వెర్రిగా ఎగరటాన్ని గమనించిన అడిషనల్ ఎస్.పి. టిటిడి సెక్యూరిటీ ఆఫీసర్లు ఎయిర్‌పోర్టులోనే కొంతసేపు నిరీక్షించారు. అంతలో విమానంలో ఎయిర్ కంట్రోల్ పోయిందని ప్రకటన రావడంతో ఖంగారుగా వాళ్ళంతా వాళ్ళ వాహనాల్లో ఎయిర్‌పోర్టు అధికార్లతో సహా విమానం ఎగిరిన దిక్కులో ప్రయాణించి, విమానం కూలిపోయిన చోటుకి చేరుకున్నారు. అప్పటికి విమానం రేణిగుంట విమానాశ్రయం నుండి అయిదుమైళ్ళు ప్రయాణించింది.

నేను చొరవ తీసుకుని, ముందుగా విమానం చుట్టూ భద్రతా వలయం ఏర్పాటు చేయించాను. ప్రయాణికులందరినీ టిటిడి వాహనాల్లో తిరుపతి చేర్పించే ఏర్పాటు, అక్కడ వాళ్ళు ఆ రాత్రి వుండటానికి ఏర్పాటు చేశాను. వాళ్ళ బంధువులకు ఈ విమానం కూలిన వార్త రేడియోల ద్వారా తెలియటానికి ముందుగానే ప్రయాణికులంతా వాళ్ళ వాళ్ళ ఇళ్ళకి ఫోన్ చేసి చెప్పించే ఏర్పాటు చేశాను. ఈ పరిస్థితుల్లో నేను హైద్రాబాద్ రాలేకపోతున్నట్లు ఛీఫ్ సెక్రటరీకి, రాష్ట్రపతి కార్యాలయానికి తెలియజేశాను.

మర్నాడు నేను.- జిల్లా కలెక్టరు, సబ్ కలెక్టరులతోపాటు ముందుగా విమానం కూలిపోయిన స్థలాన్ని సందర్శించాను. పైలెట్‌లు చెప్పినదాన్ని బట్టి ఏం జరిగిందో, ఎలా జరిగిందో వాళ్ళకి అర్థం కావటంలేదు. ప్రచండమైన గాలులు వీచాయి. ఆ గాలుల వేగానికి ఆవ్రో విమానం





వూగిపోయింది. కంట్రోల్ చేయాలని వాళ్ళు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. ఆ గాలులు విమానాన్ని ఆ చెరువులోకి తోసిపడేశాయి. అలా దూసుకుపోవడంలో, ఆ చెరువు గట్టు మీదున్న చెట్ల తలకాయల్ని విమానం చెక్కేసింది. ఆ విశాలమైన చెరువులో విమానం కూలిపోయినచోట అంతా మట్టి నేల - మరో వైపు గట్టులోపల 15-20 అడుగుల వెడల్పున నీళ్ళు నిలిచి వున్నాయి.

విచిత్రంగా, విమానం ఆ నీళ్ళలో కూలిపోలేదు!

చెరువుకి కొంచెం దూరంలో అటు ఇటూ పెద్ద పెద్ద బండరాళ్ళు చిన్నసైజు కొండల్లా వున్నా, ఆ ప్రచండ మారుతాలు విమానాన్ని వాటి మీదకి విసిరేయలేదు. అలా జరిగివుంటే, ఆ 29మందిలో ఏ ఒక్కరం బ్రతికి వుండేవాళ్ళమే కాదు!!!

విమానం నేలకూలడం వల్ల, ఆ తాకిడికి ఇంజన్లు రెండూ దెబ్బతిని పోయాయి. కుడివైపు ఇంజను దెబ్బతిన్న ధాటికి విమానంలో చివర సీట్లు రెండు వరుసలు ఎగిరిపోయాయి. ఎంత ఉధృతమైన వత్తిడితో ఆ సీట్లు ఎగిరిపోయాయంటే, ఆ ధాటికి విమానం బాడీకి చిల్లు పడింది.

ఆ తరువాత ఇండియన్ ఎయిర్‌లైన్స్ జరిపిన విచారణలో తేలిందేమిటంటే - విమానం సరైన భద్రతా మార్గంలోనే ప్రయాణించింది. ఇంజన్‌లు వున్న భాగం ఏదైనా గట్టి రాతినేలకి తగిలివుంటే, విమానం తలక్రిందులుగా పల్టీలు కొట్టివుండేది. ఆ పరిస్థితుల్లో రెక్కలు కూడా నేలకి కొట్టుకుపోయి, విమానం పేలిపోయి వుండేది. విమానం చౌడు మట్టి నేలలో దిగటంతోపాటు, వర్షం కురుస్తూండటంవల్ల, ఇంజన్‌లో జనించిన అగ్ని అదుపుచేయబడింది. మరో విచిత్రం - విమానం అక్కడ పొలాల్లో వున్న హై-టెన్షన్ విద్యుత్ లైన్లకి 15-20 గజాల దూరంలో ఆగిపోయింది. లేకుంటే - దాని ప్రేలుడు మాత్రమే విమానాశ్రయం దగ్గరున్న అధికారులకి వినిపించేది, కనుపించేది. మేం అందరం ఆనవాళ్ళు తెలీకుండా ఛిన్నాభిన్నమై పోయి వుండేవాళ్ళం.

కూలిపోతున్న విమానం ఒక పక్కకి ఒరిగి, దూసుకువెళ్ళి, దాని రెక్కల క్రిందవున్న ఇంజన్ బ్లాక్స్ ఆధారంగా మాత్రమే 200-300 గజాల దూరం మట్టినేలమీద దేకుతూ పోయి, చెరువు గర్భంలో నిలిచివుండిపోయింది. చక్రాలు లోపలకు ముడుచుకునే వుండిపోయాయి కానీ బైటకు తెరుచుకోలేదు. చక్రాలు బయటకు వచ్చివుంటే, విమానం పక్కకి వాలుతూ, నేలమీద దూసుకువెళ్ళిన తాకిడికి కూడా విమానం పేలి, తునాతునకలైపోయి వుండేది.

ఆ పరిశీలనలో మరో విషయం బయటపడింది. నేనూ, మంత్రి శ్రీ భాట్టం శ్రీరామ్మూర్తి కూర్చున్న వరుసకి వెనుక వరుస సీట్లు మాత్రమే ఎగిరిపోయాయి. మా వరుస నుంచి ముందు వరుస సీట్లన్నీ మిగిలాయి. అదృష్టవశాత్తూ ఆ వెనుక సీట్లలో ప్రయాణికులు లేరు. పైలెట్ మొహాన చిన్నగా గీరుకుపోయింది. శ్రీ భాట్టం చేతివేళ్ళు కొద్దిగా నలిగాయి. అంతే! అంతకుమించి ఎవరికీ ఎలాంటి గాయాలు తగల్లేదు.

"ఇంతకన్నా అద్భుతంగా ఏ సినిమాలోనూ సురక్షిత విమాన ప్రమాదాన్ని చూపించలేరు" అంటూ ఎయిర్‌లైన్స్ విచారణ నివేదిక పేర్కొంది. "విమానం చెరువు లోపల బండల్ని గుద్దినా, ముందుకెళ్ళి హై టెన్షన్ లైన్స్‌ని తాకినా, బోర్లా పల్టీలు కొట్టినా... ఏ ఒక్కరూ మిగిలి వుండేవాళ్ళు కాదు. కాని అలా ఎందుకు జరగలేదు? - ఇలాగే ఎందుకు జరిగింది? 'ఆవ్రో' తట్టుకోలేని వాతావరణ పరిస్థితుల్లో, ఎవరో పనిగట్టుకొని విమానాన్ని అలాంటి ప్రమాదం పాలవకుండా పక్కకి లాగి చెరువులో క్షేమంగా దించినట్లయింది" - అని ఎయిర్‌లైన్స్ నివేదిక పేర్కొంది. ఎవరు? ఏ శక్తి అలా చేసింది? ఎందుకు చేసింది?

★ ★ ★

తిరుమల మూర్తులు-2

### భోగ శ్రీనివాసుడు

పల్లవ యువరాణి సామవాయి ఒక వెండి శ్రీనివాసుడి (సంచార) విగ్రహాన్ని చేయించి క్రీ. శ. 614లో సమర్పించింది. (మొదటి ప్రాకారం ఉత్తర గోడ మీద శాసనం.) 'కౌతుక బేరం'గా చెప్పబడే ఈ విగ్రహాన్ని 'భోగ శ్రీనివాసుడు' అని కూడా అంటారు. నిత్య దీపారాధన, నిత్య అన్న ప్రసాదాల నైవేద్యం, నిత్యాభిషేకం వగైరా అన్ని సేవలూ ఈ 'కౌతుక బేర' విగ్రహానికే జరుగుతాయి. ఆగమ శాస్త్రానుసారం కూడా ప్రతి ధృవ బేరానికి 'కౌతుకబేరం' వుండి తీరుతుంది.



# 4

## ఆ ఉగాదికి అలా ఎందుకయింది?

శ్రీ మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా వున్నారు. ఆయన సమక్షంలో తిరుమల తిరుపతి దేవస్థానాల తరఫున ఉగాది వేడుకల్ని నేను హైద్రాబాద్‌లో రవీంద్ర భారతిలో నిర్వహించాల్సి వుంది. సాంప్రదాయాలపట్ల చెన్నారెడ్డికి గల గౌరవం, కార్యక్రమ నిర్వహణలో ఏదన్నా తేడా వస్తే ఆయనకి కలిగే ఆగ్రహం సామాన్యమైనవి కావు. అన్నీ తెలిసికూడా - ఉగాది ముందురోజు నేను హైద్రాబాద్ బయల్దేరబోయి ఆగిపోయాను. తిరుపతిలో నా క్యాంప్ ఆఫీసులో కూర్చొని, "విమానం వచ్చిందా? టైమైందా?" అని క్యాంప్ క్లర్క్‌ని అడుగుతూనే వున్నాను. కాని ఎయిర్‌పోర్టుకి వెళ్ళాలనిపించలేదు. విమానం ఎక్కాలనిపించలేదు. ఎక్కలేదు. దాని పర్యవసానం... ?

★ ★ ★

తెలుగువారి జీవితాల్లో ఉగాది అత్యంత విశిష్టమైన పండుగ. పంచాంగ శ్రవణం, ఉగాది పచ్చడి, కవి సమ్మేళనాలు, తెలుగుదనం ఉట్టిపడే సాంస్కృతిక కార్యక్రమాలూ... వగైరా స్ఫురణకు వస్తాయి. హైద్రాబాదు రవీంద్రభారతిలో ఉగాది వేడుకల్ని సాంప్రదాయబద్ధంగా నిర్వహించటానికి టి.టి.డి. శ్రీకారం చుట్టడం జరిగింది. వేద పఠనాలు, పంచాంగ శ్రవణాలు, పండితులకు సత్కారాలు, కవి సమ్మేళనం... వగైరాలు ఈ కార్యక్రమంలో భాగం. ప్రముఖ పండితులు శ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రి పంచాంగ పఠనం చేయటానికి ముందుకొచ్చారు. అలా 1979లో విజయవంతంగా జరగటంతో తిరిగి 1980లో కూడా ఈ కార్యక్రమాన్ని మరింత ఘనంగా నిర్వహించాలని అప్పటి ముఖ్యమంత్రి చెన్నారెడ్డి ఆశించారు.

అప్పట్లో టి.టి.డి. కి పూర్తిస్థాయి బోర్డు లేదు. రెవెన్యూ ప్రిన్సిపల్ సెక్రటరీ రమేశన్ ఒక పర్సన్ ఇన్‌ఛార్జి, దేవాదాయశాఖ కమీషనర్ చంద్రమౌళిరెడ్డి రెండవ పర్సన్ ఇన్‌ఛార్జి, నేను (ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా) మూడవ పర్సన్ ఇన్‌ఛార్జిని. అందుకనే టిటిడి మేనేజ్‌మెంట్ బాధ్యత అంతా ఈ ముగ్గురితో కూడిన కమిటీదే.

ఉగాది ఉత్సవాన్ని రవీంద్రభారతిలో పెద్దయెత్తున జరపటానికి అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయి. నేనే స్వయంగా వేద పండితుల్ని, కవుల్ని, గాయకుల్ని, ఎంపికచేసి పక్కా కార్యక్రమాన్ని రూపొందించటం జరిగింది. ఈసారి ఘనంగా చేస్తున్నాం కనుక మంత్రుల్ని, న్యాయమూర్తుల్ని, ఇంకా అనేక ఇతర రంగాలలోని ప్రముఖుల్ని ఆహ్వానించాం. ఈసారి ఉగాది వేడుకలు వైభవోపేతంగా జరగాలని ముఖ్యమంత్రే స్వయంగా కోరుకున్నారు కనుక, తేడావస్తే ఆయన ఆగ్రహావేశాలు ఎలా వుంటాయో తెలుసు కనుక ప్రతి చిన్న అంశాన్ని ఒకటికి నాలుగుసార్లు పరిశీలించి, ఏర్పాట్లు చేయడం జరిగింది. ఇంత జరిగాక కూడా ఒకరోజు ముందుగా వెళ్తే కాని ఏర్పాట్లను పర్యవేక్షించలేను కాబట్టి, ఉగాదికి ముందురోజునే హైద్రాబాద్‌కి బయల్దేరాలనుకున్నాను.

తిరుపతి నుంచి రోజూ ఉదయం 11 గంటలకి హైద్రాబాద్‌కి విమాన సర్వీస్ వుంది. అందులో వెళితే ఆ మధ్యాహ్నామే హైద్రాబాద్ చేరుకుని ఏర్పాట్లు సజావుగా జరుగుతున్నాయో లేదో చూసుకోవచ్చు. ఆ ప్రకారం విమానం టిక్కెట్టు బుక్ అయింది. సామాను సర్దేశాను. భోజనం కూడా అయింది. విమానం రేణిగుంట విమానాశ్రయంలో దిగేటప్పుడు తెలుసుకొని నాకు చెప్పవలసిందిగా క్యాంప్‌క్లర్క్‌కి చెప్పి నేను తిరుపతిలో నా నివాసం దగ్గర క్యాంప్ ఆఫీసులో ఫైళ్ళు చూసుకుంటున్నాను.

పదిగంటలు దాటింది... క్యాంప్‌క్లర్క్ వచ్చి విమానం దిగే టైమ్ అయిందని చెప్పాడు. అతనివంక చూశాను. "విమానం దిగాక చెప్పు చూద్దాం..." అన్నాను. మామూలుగా అయితే అధికార పర్యటన ఏదున్నా పది నిమిషాలు ముందే విమానాశ్రయాన్ని చేరుకునే అలవాటున్న నేను - ఎందుకో అప్పుడు అంత చురుగ్గా వ్యవహరించలేకపోయాను... మరికాస్సేపటికి క్యాంప్‌క్లర్క్ మళ్ళీ వచ్చాడు - "విమానం దిగింది" అంటూ. ఏదో తెలీని స్తబ్ధత నన్ను వెంటాడింది. నేను ఏమీ మాట్లాడలేదు. క్యాంప్ క్లర్క్ నన్ను వదల్లేదు - "సార్, ఎయిర్‌పోర్టు మేనేజరు అడుగుతున్నారు మీరు బయల్దేరారా లేదా అని" ... "సరే" అన్నాను. సాలోచనగా తలపంకిస్తున్నాను - మళ్ళీ ఫైళ్ళు చూస్తున్నాను.... అంతలో నా భార్య గోపిక వచ్చింది. అప్పటికి నేను బయల్దేరి వెళ్ళిపోయాననుకుంటోందిట. నన్ను ఇంకా అక్కడే చూసి ఆశ్చర్యపోయింది. "ఇదేంటి? ఇంకా ఇక్కడే వున్నారు? పదకొండయింది. ఫ్లయిట్‌కి టైమైపోయింది... ?" - నేను కొంచెం నిర్లిప్తంగా, "అదే చూస్తున్నాను. టైమైంది గదా! బయల్దేరాలి, బయల్దేరాలి" అన్నాను.





అన్నానే కానీ, ఆమె అటు తిరగ్గానే మళ్ళీ అలాగే కూర్చుండిపోయాను. ఫైళ్ళు చూస్తున్నాను. ఫ్లయిట్‌కి టైమైందని తెల్సు. లేవాలనీ, వెళ్ళాలనీ ఓ పక్క క్షణక్షణం గుర్తుకొస్తోంది. మరోపక్క అంతర్లీనంగా నాకు అర్థంకాని, ఏదో స్తబ్ధత నాలో పెరిగిపోతోంది... మరికొద్దిసేపటికి క్యాంప్‌క్లర్క్ మళ్ళీ వచ్చాడు. "సార్, ఎయిర్‌పోర్టు మేనేజరు మళ్ళీ ఫోన్ చేశారు. విమానం బయల్దేరే టైమైందట. మీరు ఇప్పటికే బయల్దేరిపోయి వుంటే, విమానాన్ని కొద్దిసేపు నిలుపుతానంటున్నాడు..." - నేను "సరే, అలాగే ..." అని మళ్ళీ ఫైళ్ళలో మునిగిపోయాను. అతనికి స్పష్టంగా ఎలాంటి జవాబు చెప్పటానికీ నాకు మనస్కరించలేదు. అంటే, ఏం చెప్పాలో నాకే తెలీని స్థితి. బాధ్యత బయల్దేరాలంటోంది, కానీ మనసుకి - బయల్దేరే ఉత్సుకత కలగటం లేదు... మరికొద్దిసేపటికి, క్యాంప్‌క్లర్క్ వచ్చి సంకోచిస్తూ చెప్పాడు - "విమానం బయల్దేరిపోయింది" అని.-

అప్పటికి ఒక్కసారిగా నాకు మనోవికాసం కలిగింది - నేను వెళ్ళకపోతే రాగల తీవ్ర పర్యవసానం ఎలాంటిదో ఊహల్లోకి ప్రవేశించింది - అంతే! వెంటనే హైదరాబాద్‌లోని దేవాదాయశాఖ కమీషనర్ చంద్రమౌళి రెడ్డి గారికి టెలిఫోన్ చేసి "నా తరఫున మీరే రేపటి ఉగాది కార్యక్రమం నడిపించాలి సర్!", అంటూ అభ్యర్థించాను. ఆయన ఆశ్చర్యపోయాడు. మర్యాదపూర్వకంగా మాట్లాడినా, ఆయన మాటల్లోని అయిష్టత, చిరాకు నేను గమనించకపోలేదు.

"ప్రసాద్ ఎందుకు రాలేదు అని ముఖ్యమంత్రి అడిగితే, ఏదో మూడ్‌లేక రాలేదు అని ఎలా చెప్తాను" - అంటూ చంద్రమౌళిరెడ్డి గారు తన ఇబ్బందిని వ్యక్తం చేశారు. "పోనీ కారులో బయల్దేరి వచ్చెయ్, ఉదయానికల్లా వచ్చేయొచ్చు" అంటూ ఆయన ఒక సలహా కూడా ఇచ్చారు. అయినా ఎందుకో నాలో - "హైద్రాబాద్ వెళ్ళాలి" అని అనిపించకుండా అడ్డుపడుతున్న ఒక అవ్యక్తమైన మానసిక స్థితి... మళ్ళీ బ్రతిమాలాను - "ఏదో మీరే మేనేజ్ చేసెయ్యండి, మనసు బాగోలేదు. నన్ను వదిలేయండి" - అలా అక్కడికి చంద్రమౌళి రెడ్డి గారికి చెప్పాక కూడా ఎందుకో అన్యమనస్కంగా వుండిపోయాను. "ఛ ఏమిటిది, ఎందుకిలా జరుగుతోంది, ఎందుకు పోలేకపోతున్నాను" - అనుకుంటున్నానే కానీ వెళ్ళాలన్న ప్రయత్నం మాత్రం చేయలేకపోతున్నాను... అలా సమయం గడుస్తోంది.

అకస్మాత్తుగా మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో క్యాంప్‌క్లర్క్ నా దగ్గరికి హడావుడిగా పరుగెత్తుకుంటూ వచ్చాడు - "సార్, ఎవరో టెలిఫోన్ చేశారు - ఘాట్ రోడ్డులో క్రిందకు దిగుతున్న యాత్రికుల బస్సు రోడ్డు పక్క పిట్టగోడను గుద్దేసి, పల్టీలు కొడుతూ, రెండు మలుపుల మధ్య లోయలోకి పడిపోతుంటే చూశాట్ట. చూస్తూనే మీకు ఫోన్ చేస్తున్నాను - అంటూ ఖంగారుగా చెప్పాడు సార్!"... నేను నివ్వెరపోయాను. మరుక్షణం నా బాధ్యత నన్ను వెంటాడింది. తిరుమలేశుణ్ని తలుచుకుంటూ కార్యరంగంలోకి దిగిపోయాను.

ఆఘమేఘాల మీద నేను చేయాల్సిన పనులు మొదలెట్టాను. ఆ రోజు ఆదివారం. అధికారులంతా శెలవులో వున్నారు. ముందుగా బస్సు బడిపోయిన చోటుకి పరుగెత్తబోయాను. మళ్ళీ ఆగిపోయాను. స్వయంగా సంబంధిత శాఖల అధికారులందరికీ ఫోన్‌లు చేశాను. ట్రాన్స్‌పోర్టు, ఇంజనీరింగ్, మెకానికల్ శాఖ, అడ్మినిస్ట్రేషన్, హాస్పిటల్, అంబులెన్స్, సెక్యూరిటీ, పోలీస్, ఫైర్ సర్వీస్... ఇలా గుర్తుకొచ్చిన శాఖలన్నింటికీ ఫోన్‌లు చేసి, క్షణాల్లో అందర్నీ ప్రమాదం జరిగిన చోటుకి బయల్దేరదీశాక, అప్పుడు నేను ఆ ప్రమాద స్థలానికి పరుగెత్తాను. అప్పట్లో సెల్ ఫోన్లు లేవు కనుక, అర్జంట్ మెసేజెస్ పంపటానికి వీలుగా, నాతోపాటు రెండు కార్లు తీసుకు వెళ్తూ, వైర్‌లెస్ సెట్స్ తీసుకురమ్మని పోలీసులకు పురమాయించాను.

ఉరుకులు పరుగుల మీద ఘాట్ రోడ్‌కి చేరుకుని నేను చూసిన ప్రమాద దృశ్యం నా హృదయాన్ని కలచివేసింది. అలాంటి ఘోర ప్రమాదాన్ని అంతకు ముందెన్నడూ నేను చూసి ఎరగను. నలభైకి పైగా మలుపులుండే పాత ఘాట్ రోడ్డులో (బస్సులు దిగటానికి వుపయోగిస్తున్నది) కొన్ని మలుపులు ఎంత నిటారుగా వుంటాయంటే, కొన్ని చోట్ల పై మలుపు కొసకీ, క్రింద మలుపు కొసకీ 40-50 అడుగుల వ్యత్యాసం (ఎత్తులో) వుంటుంది.

అయితే ప్రమాదం జరిగిన మలుపులో పరిస్థితి ఇంకా తీవ్రంగా వుంది. బస్సు ఒక మలుపులో పిట్టగోడని గుద్దేసి క్రింద బోల్తాపడినచోట, మధ్యలో ఒకటి రెండు మలుపుల్ని (కొంచెం లోపలగా వుండేవాటిని) సయితం దాటేసి, బండరాయి దొర్లి పడినట్లుగా ఒక నిటారైన కొండవాలు మీద పడి, చెట్ల కొమ్మలు అడ్డం రావడంతో ఇక దొర్లిపోలేక తాత్కాలికంగా ఆగిపోయింది. ఆ తాకిడికి బస్సు బాగా నజ్జునజ్జయిపోయింది. కిటికీలు, ద్వారం కూడా ఆ వత్తికిడి సొట్టలు పడిపోయి, అప్పచ్చిలా అణగారిపోయాయి. అప్పటికీ ముగ్గురు నలుగురు యాత్రికులు ఆ పగిలిపోయి, ముడుచుకుపోయిన కిటికీల్లోంచి బయటకు రావాలని అవస్థపడుతున్నారు. ఆ బస్సు దగ్గరకు చేరాలంటే పై మలుపు నుంచి 30 అడుగుల లోతుకు దిగాలి లేదా - క్రింద అందుబాటులో వున్న ఘాట్ రోడ్ నుంచి 40-50 అడుగులు ఎగువకి వెళ్ళాలి. అక్కడ బండరాళ్ళు, తుప్పలు, చెట్ల మధ్యలోంచి వెళ్ళటం మినహా మరో మార్గం లేదు.

బస్సులో చిక్కుకుపోయిన యాత్రికులు "రక్షించండి... రక్షించండి" అంటూ ఆర్తనాదాలు చేస్తున్నారు. మరికొందరు "గోవిందా... గోవిందా... వేంకటరమణా, కాపాడు తండ్రీ..." అనుకుంటూ ఎలుగెత్తి దీనంగా స్వామిని పిలుస్తున్నారు. అతికష్టం మీద బస్సులోంచి బయటకు పాకుతూ రాగలిగిన యాత్రికులకి, వెనకాల బస్సులో వచ్చిన యాత్రికులు ఒక గొలుసులాగ ఏర్పడి చేయూతనందిస్తున్నారు.

కొద్ది క్షణాల్లో అంబులెన్స్, టి.టి.డి. ఇంజనీర్లు అక్కడికి చేరుకున్నారు. బస్సు పడిన పరిస్థితిని చూస్తూనే ఇంజనీర్లకి చెమటలు పట్టేశాయి. బస్సు తలక్రిందులుగా ఒక కొండవాలులో పడివుంది.





పల్టీలు కొడుతూ పడటం వల్ల సొట్టలు పడిపోయి కింద కొండరాతికి అంటుకుపోయినట్లుంది. పై నుంచి చూస్తే బస్సు చక్రాలు ముందుగా కనిపిస్తున్నాయి. నాకు సహనం క్షీణిస్తోంది. "మీనమేషాలు లెక్క పెట్టకుండా ముందు యాత్రికుల్ని కాపాడే ప్రయత్నం చేయండయ్యా" అంటున్నాను. ఇంజనీర్లు పనిమొదలెట్టారు. ముందుగా అందుబాటులో వున్న వైపు నుంచి బస్సుబాడీకి మూడు పెద్ద రంధ్రాలు చేశారు. అంతా 20-25 నిమిషాల వ్యవధిలో చాలామందిని బైటకు తీసుకురాగలిగారు. కాని ఇంకా కొంతమందికి చేతులు రెండోవైపు వాలులోకి వున్న కిటికీల్లో ఇరుక్కుపోయివున్నాయి. బాడీని అటువైపు కట్ చేయడం సాధ్యమయ్యే పనికాదు. ఏం చేయాలి?... ఆ ఇరుక్కుపోయిన ప్రయాణికుల ముఖాల్లో ఆందోళన.... "బస్సు లోయలోకి పడిపోక ముందే మమ్మల్ని కాపాడరూ?" అంటున్నట్లు వాళ్ళ ముఖాల్లో తొంగిచూస్తున్న దైన్యం, బేలతనం... వాళ్ళు కనిపిస్తున్నారు. కానీ వాళ్ళని అక్కడున్న పరిస్థితిలో బయటకు తీయలేని స్థితి. అప్పటికే కొందరు భక్తులు అక్కడ తగిలిన గాయాలకి ప్రాణాలు కోల్పోయారు. షాక్ తిని చలించిపోయిన వాళ్ళకి (బస్సులోంచి బయటకు వచ్చేవరకు) ఆ బాధ తెలీకుండా ఇంజక్షన్లూ, మాత్రలూ ఇచ్చారు. ఈ పరిస్థితిలో ప్రాణాలతో వున్న వాళ్ళని ఎలాగైనా కాపాడుకోవాలన్నది నా ఆరాటం... వాళ్ళంతా తిరుమలేశుని ఉనికి మీద నమ్మకంతో ఈ యాత్రకు వచ్చినవాళ్ళు. ఆ నమ్మకంలోని శక్తి వాళ్ళని కాపాడాలని క్షణక్షణం కోరుకుంటున్నాను. కాని మిగిలి వున్న వాళ్ళనైనా కాపాడగలమా లేదా అన్న ఆందోళన వెంటాడుతూనే వుంది.

కొద్ది నిమిషాల తర్జనభర్జన తరువాత ఇంజనీర్లు తేల్చి చెప్పారు. - "బస్సుని పైకి లేపి, ఎత్తివుంచితే తప్ప రెండోవైపు కిటికీలు కట్ చేయటం సాధ్యపడదు"... నా శక్తికీ, యుక్తికీ అదొక పరీక్ష. (ఆ శక్తి నాదేనా?)

నా సర్వాధికారాల్ని వుపయోగించి, డెరిక్స్ (చిన్నసైజు క్రేన్‌లు) తెప్పించాను. ఇంజనీర్లందరినీ ఉత్సాహపరిచాను. అందరికీ పట్టుదల పెరిగింది. ఒక అరగంట వ్యవధిలో బస్సు నాలుగువైపులా కొక్కాలు తగిలించి డెరిక్స్ సహాయంతో బస్సుని పైకి లేపారు. ఇనుమడించిన ఉత్సాహంతో మెకానిక్స్ బస్సు కింద నుంచి దూరి, గ్యాస్ కటింగ్ యంత్రాల సహాయంతో బస్సు బాడీ అంచుల వెంబడి కట్ చేయడం ప్రారంభించారు. ఒక గంటలో ఆ కిటికీల్లో ఇరుకున్నవాళ్ళని కూడా సునాయాసంగా ఇవతలకు చేర్చేశారు. అప్పటికి సాయంత్రం నాలుగయింది. అప్పటికే బయటకు తీసుకువచ్చిన ప్రతి యాత్రికుణ్ణీ శరవేగంతో తిరుపతిలోని రూయా హాస్పిటల్ కి తరలించడం, చికిత్స ప్రారంభించడం జరిగిపోయింది. చాలామందికి ఫ్రాక్చర్స్‌వంటి తీవ్రగాయాలు తగిలాయి. అయినా ముందుగా నేను ప్రమాదస్థలానికి వెళ్ళకముందే, టెలిఫోన్ చేసి హెచ్చరించటం వల్ల హాస్పిటల్ కి చేరిన యాత్రికులకు చికిత్సకోసం డాక్టర్ల బృందాలు సిద్ధంగా వున్నాయి. చికిత్సలో లోపం లేకుండా టిటిడి ఖర్చుతో అందరికీ పూర్తి వైద్య సదుపాయాలు అందించడం జరిగింది.

ఇదంతా ఒక ప్రక్క జరుగుతుండగా, నేను మరోప్రక్క అడ్మినిస్ట్రేటివ్ సిబ్బందిని సమావేశపరిచి, ఎవరేమేం చేయాలో వివరించాను. చనిపోయినవారి, గాయపడినవారి బంధువులకు కబురు పంపించాలి. వీళ్ళని చూడటం కోసం వచ్చే బంధు మిత్రులకు భోజన వసతి సదుపాయాలు కల్పించాలి. బస్సులోంచి తీసిన లగేజిని పూచికపుల్లతో సహా ఆయా యాత్రికుల బంధువులకు అప్పగించాలి. మృతదేహాలను ఆయా వూళ్ళకి వాళ్ళ అడ్రసుకి పంపటానికి అంబులెన్సులు ఏర్పాటు చేయాలి.

స్వల్పగాయాలతో బయటపడిన వారికి వారి వారి ఇచ్ఛానుసారం వాళ్ళ వూళ్ళకి చేరటానికి రవాణా సదుపాయం కల్పించాలి. మరీ పేద యాత్రికులుంటే, వారికి మరింత శ్రద్ధతో రవాణా సదుపాయాలు చేయాలి.... కూలిపోయిన పిట్టగోడని వెంటనే పునర్నిర్మింపజేయాలి...

అలా ఎన్ని పనులు ఎంతమందికి చెప్పానో నాకు గుర్తులేదు. కాని, స్వామివారి ఉత్సవాల సందర్భంలో మినహా - ఇతర సందర్భాల్లో అంతలా ఇంచుమించు అన్ని శాఖల అధికారుల్ని ఉత్తేజపరిచి, పరుగెత్తించి, ఉరుకులు పరుగుల మీద పనిచేయించిన సంఘటన - నా టిటిడి సర్వీసులో అది ఒక్కటే. ఇంతా చేస్తున్నా - ఏ మూల ఏ ఒక్క (ప్రమాదంలో ఇరుకున్న) యాత్రికుడికి కష్టం కలిగినా, ఇంత ప్రయాసా వృథా అవుతుందన్న ఆదుర్దాతో, స్వయంగా ప్రతి యాత్రికుణ్ణి, హాస్పిటల్ లో, గెస్టహవుస్‌లో మళ్ళీ మళ్ళీ పలకరించి, వాళ్ళందరి మొహాల్లో సంతృప్తిని తిలకించాక, అప్పుడు - ఆ అర్ధరాత్రి ఎప్పటికో నా నివాసానికి చేరుకున్నాను.

మర్నాడు నిద్రలేచేసరికి, పత్రికలలో - 'కొండ' లోయలోకి బస్సుపడిపోయిన దుర్ఘటన గురించీ, ఆఘమేఘాల మీద ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ సారథ్యంలో టిటిడి యంత్రాంగం మొత్తం తరలివచ్చి, యాత్రికుల్ని కాపాడిన తీరుగురించీ, అభినందన భావాలతో వెలువడిన వార్తలతో, అనేకమంది శ్రేయోభిలాషుల ప్రశంసాపూర్వక టెలిఫోన్ కాల్స్‌తో - ఆ ఉగాది ఉషోదయం నాకు 'కొండ'ంత సంతృప్తిని మిగిల్చింది.

అలా ఆ ముందురోజు నేను హైద్రాబాద్ వెళ్ళకుండా నిలిచిపోవటం వల్ల ఒక పరమార్థం నెరవేరినట్లయింది. కాని ఏ శక్తి నన్ను అలా వెళ్ళనీయకుండా అడ్డుపడింది - అన్నదే 'అర్థం' కాకుండా మిగిలిపోయింది!!!

★ ★ ★



# 5

# కొండ-ఉప్పు-బెల్లం

తిరుపతి కొండమీద లడ్డు గొప్పదా? తిరువళ్ళూరు వీరరాఘవ స్వామి పాదాల దగ్గర లవణం గొప్పదా?... ఎవరు చెప్పగలరు?

శ్లో॥ **విద్యావినయ సమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తినే ।**
**శునిచైవ శ్వపాకేచ పణ్డితా స్సమదర్శిన ॥**

అన్ని ప్రాణుల్ని సమభావంతో చూడాలన్నదే శ్రీ కృష్ణ భగవానుడు గీతలో ప్రవచించిన ఈ శ్లోకానికి అర్థంగా చాలామంది చెబుతుంటారు. నిజానికి 'సమ' పదానికి అర్థం 'సమానత్వం' కాదు. 'సమ' అంటే 'నేనే' అని కృష్ణభగవానుడు మరొక శ్లోకంలో చెప్పిన నిర్వచనం ఇక్కడ అన్వయిస్తుంది. అంటే, ప్రతి ప్రాణిలోనూ ఒకేవిధంగా వున్న భగవంతుణ్ణి చూడగలగాలి. పామరుడిలోనూ, పండితుడిలోనూ, కలిమి కలవాడిలోనూ, లేమి నిండిన వాడిలోనూ, ఎలుకలోనూ, ఏనుగులోనూ కూడా దైవం ఒకేవిధంగా (సమ) వుంటాడు. ఆయన్ని చూడగలగాలి...

ఇది చెప్పటం వేరు. మానసికంగా అంగీకరించి, అనుభవించటం వేరు. మన వేద శాస్త్రాలలో నిబిడీకృతమై వున్న ఈ మౌలిక సూత్రాన్ని జీర్ణించుకుని, వంట పట్టించుకోవటం అంత సులభమైన విషయమా?

పైగా ఏటా కోట్లాది భక్తుల్ని, వాళ్ళ నుండి వందలాది కోట్లరూపాయల ముడుపుల్ని ఆకర్షిస్తూ, కలియుగ వైకుంఠంగా భాసిల్లే తిరుమల శ్రీనివాసుని సన్నిధిలో పనిచేసే టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి - ఇంతటి పరిణతి నిండిన 'సమభావన' సాధ్యమా? అందులోనూ - ప్రతి ఒక్కరూ "ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ - స్వామివారి ప్రథమ సేవకుడు" అని పదే పదే అంటూంటే, అది నిజమేనేమోనన్న 'భ్రమ'కి లోనుకాకుండా, సమభావంతో వ్యవహరించడం సులభమా?

నిజానికి శాస్త్రాలు - ఈ విగ్రహారాధన పట్ల స్పష్టమైన విశ్లేషణనిచ్చి వున్నాయి. "మనం పూజించేది విగ్రహాన్ని కాదు - అందులో వుందని భావిస్తున్న దైవాన్ని." భగవంతుడు ప్రపంచమంతా వ్యాపించి వున్నాడు. స్వయంభూ విగ్రహంలో ఈ దైవత్వం మరింత ఎక్కువ వుంటుందంటారు. ప్రతి ఆలయంలోని విగ్రహంలోనూ ఈ శక్తి వుంటుంది. కాని దాని పరిమాణం ఆయా విగ్రహ ప్రతిష్ఠల వెనుకగల పవిత్రత, భక్తి మీద ఆధారపడి వుంటాయి - అంతకుమించితే, భగవంతుడు ఎక్కడైనా ఒక్కటే. అతడు సర్వవ్యాపితుడు, సర్వశక్తిమంతుడు, సర్వగుణ పరిపూర్ణుడు. ఈ విషయమే - పై శ్లోకంలో స్పష్టమవుతుంది.

అయినా - నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా, స్వామివారి ప్రథమ సేవకుడ్ని నేనే అన్న 'భ్రమ' నాలో ఎంతటి బలమైన విశ్వాసానికి దారి తీసిందంటే - "నిజమైన స్వామి ఇక్కడే వున్నాడు. ఇతర చిన్న ఆలయాల్లోనూ, జనాకర్షణ లేని ఆలయాల్లోనూ అంతటి శక్తి లేదు" అనే భావన నాలో ఎక్కడో అంతర్లీనంగా చోటు చేసుకుంది...

అలాంటి పరిస్థితిలో ఒకసారి మద్రాసుకి సమీపంలోని తిరువళ్ళూరులోని వీరరాఘవ స్వామి బ్రహ్మోత్సవాలకి నన్ను ఆహ్వానించారు. అక్కడ వీరరాఘవ స్వామి ఆలయంలో గరుడసేవ తెల్లవారుఝామున అయిదు గంటలకి చేస్తారు. (తిరుమలలో ఈ సేవ రాత్రి తొమ్మిది గంటలకి చేయటం ఆనవాయితీ.) ఆలయ ధర్మకర్తలు నన్ను ఆ గరుడసేవలో పాల్గొనేలా రావలసిందిగా ఆహ్వానించడంతో, నేను సకుటుంబంగా బయల్దేరి, ఆ ముందురోజు రాత్రి మద్రాసులో ఒక బంధువుల ఇంటికి చేరుకున్నాను. నిర్ణీత కార్యక్రమం ప్రకారం ఆ రాత్రి బంధువుల ఇంట్లో విశ్రమించి, మర్నాడు తెల్లవారుఝామున తిరువళ్ళూరు వెళ్ళాలి.

ఆ రాత్రి భోజనాలు పూర్తయ్యాక కబుర్లు చెప్పుకొంటుంటే, ఒక బంధువు మాటల్లో అన్నారు - వీరరాఘవస్వామి దర్శనానికి వెళ్ళేవారు స్వామివారి పాదాల దగ్గర ఉప్పు, స్వామి వారి పుష్కరిణిలో బెల్లం సమర్పించడం సాంప్రదాయంగా వస్తోంది - అని. అలా చేస్తే, భక్తులకుండే అన్ని ఈతి బాధలు ఈ నీళ్ళలో బెల్లంలా కరిగిపోతాయని విశ్వాసం... నేను నవ్వాను. "బహుశా ఉప్పుకీ, బెల్లానికి మార్కెట్ కల్పించటం కోసం పాతకాలంలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ ఎవడో ఈ ట్రిక్ కనిపెట్టి వుంటాడు" - అంటూ ఓ ఉచిత వ్యాఖ్య విసిరాను. అందరం నవ్వుకున్నాం.

★ ★ ★

వేకువ ఝామున లేచి, నేను, నా భార్య గోపిక, మా అమ్మాయి మాధవి (9 ఏళ్ళు), అబ్బాయి సంజీవ్ (5 ఏళ్ళు) రెడీ అయ్యాం. అయిదు గంటలకల్లా తిరువళ్ళూరు చేరుకున్నాం. గరుడవాహనం సిద్ధంగా వుంది. ఉత్సవ విగ్రహాన్ని తీసుకువచ్చి గరుడవాహనంపై ఉపస్థితం చేశారు. మమ్మల్ని ఆలయ మర్యాదలతో ఆలయంలోకి ఆహ్వానించారు. ఇప్పటి టి.టి.డి. పారె పత్తేదారు శేషాద్రి





సహా కొందరు టిటిడి సిబ్బంది కూడా ఆ ఉత్సవాలకి వచ్చి వున్నారు. ఆలయ అధికారులు మాతో "ముందుగా మూలవిరాట్‌ని, అమ్మవారిని దర్శించుకొని రండి. ఆనక స్వామివారి ఊరేగింపులో పాల్గొందురుగాని" అంటూ సూచించడం, మేం "అలాగే" అంటూ గర్భగుడిలో ప్రవేశించడం జరిగింది.

పడుకుని వున్నట్లు వుండే శ్రీ వీరరాఘవ స్వామి విగ్రహాన్ని అద్భుతంగా అలంకరించారు. కన్నుల పండుగగా వుందా అలంకారం. అర్చకులు మా గోత్రనామాలు తీసుకుని ఆ స్వామివారికి అర్చన ప్రారంభించారు. కొద్ది క్షణాల్లో - అప్పటిదాకా హుషారుగా వున్న మా అబ్బాయి సంజీవ్ - ఒక్కసారిగా 'కడుపులో నొప్పి' అనటం ప్రారంభించాడు. "ఏదో నొప్పి, తగ్గిపోతుందిలే కాస్త ఓపిక పట్టు" అంటున్నాం. కాని, కొన్ని సెకన్ల వ్యవధిలో వాడికి బాధ ఎక్కువైంది. కడుపు పట్టుకుని మెలికలు తిరిగిపోవటం ప్రారంభించాడు. దాంతో మా అర్చన పాడుకాకుండా చూడటం కోసం, మాతోవున్న శేషాద్రి - సంజీవ్‌ని ఎత్తుకుని బైటకు తీసుకువెళ్ళాడు.

కొద్దిసేపటికి ఈ అర్చన పూర్తయింది. అదే ప్రాకారంలో అమ్మవారి గుళ్ళోకి వెళ్ళి, అమ్మవారికి అర్చన ప్రారంభించాం. ఈలోగా శేషాద్రి వచ్చాడు. సంజీవ్‌కి నొప్పి తగ్గలేదనీ, కారులో అలాగే బాధపడుతూ పడుకొన్నాడనీ చెప్పాడు. మేంకూడా "అమ్మవారి అర్చన పూర్తిచేసుకొని ఒకేసారి బైటకు వెళ్ళి చూద్దాంలే" అనుకున్నాం. అమ్మవారి అర్చనలో కూర్చున్నాం. అంతే... !

మరికొద్దిక్షణాల్లో మాతోనే వున్న మా అమ్మాయి మాధవికి కడుపులో నొప్పి ఆరంభమైంది. క్షణక్షణానికి ఆ నొప్పి పెరిగిపోయి, పిల్ల సుడులు తిరిగిపోతోంది. మళ్ళీ శేషాద్రి చొరవ తీసుకుని, మాధవిని కూడా బైటకు పంపించాడు. అర్చన ఇంకా మధ్యలోనే వుంది. ఇంతలోనే పిల్లలిద్దరికి కడుపునొప్పి! మా ఏకాగ్రత చెడిపోయింది. ముందు అర్చన పూర్తి చేయాలా, పిల్లల సంగతి చూడాలా?... మనసంతా వికలమైపోతోంది. అర్చకులు మంత్రాలు చదువుతూ వున్నారు. కానీ, మాకు మాత్రం మనస్సు అక్కడ నిలవడం లేదు. గోపిక, నేనూ మొహాలు చూసుకుంటున్నాం. తను వుండబట్టలేక బైటకు చూస్తోంది. పిల్లల గురించి ఆందోళన వ్యక్తం చేస్తోంది. అర్చన ఇంకా పూర్తికాలేదు. మధ్యలో లేచిపోవటానికి నాకు మనస్కరించడం లేదు.

మా పరిస్థితిని గమనించిన ఒక అర్చకుడు సంశయిస్తూనే ఇలా అన్నారు - "అయ్యా! ఇక్కడ ఇలా జరగటం చాలా అసాధారణ విషయం. ఎక్కడో ఏదో లోపం జరిగినట్లుంది..." ఇది వింటూనే, ప్రశ్నార్థకంగా గోపిక నా వంక చూసింది. నేను - జరిగిన సంఘటనలన్నీ నెమరువేసుకోవటం ఆరంభించాను.

చటుక్కున - ఆ ముందు రాత్రి నేను మద్రాసులో "ఇక్కడి ఉప్పు, బెల్లం సాంప్రదాయం" గురించి చేసిన వ్యాఖ్య స్ఫురణకు వచ్చింది. నన్ను నేను ప్రశ్నించుకున్నాను. "నేనేమైనా అపరాధం చేశానా?"

మరుక్షణం నేను పర్సు తీసి, శేషాద్రికి డబ్బులిచ్చి "ఉప్పు, బెల్లం తీసుకురా. ఇక్కడి సాంప్రదాయం ప్రకారం స్వామివారికి సమర్పిద్దాం" అన్నాను. శేషాద్రి తిరిగి వచ్చేలోపల నేను వీరరాఘవ స్వామిని తల్చుకుని, "అపరాధాన్ని మన్నించు స్వామీ" అనుకున్నాను. అంతమాత్రాన పిల్లలకి కడుపు నొప్పి తగ్గిపోతుందా!


తిరువళ్ళూరులో గోపిక, మాధవి, సంజీవ్, శేషాద్రిలతో పి.వి.ఆర్.కె. ప్రసాద్

కొద్ది నిమిషాల తర్వాత శేషాద్రి ఉప్పు, బెల్లం తీసుకువచ్చాడు. అద్భుతం! శేషాద్రి వెనకాలే నవ్వుకుంటూ, గెంతుకుంటూ మాధవి, సంజీవ్ వస్తున్నారు. గోపిక, నేనూ మా కళ్ళని నమ్మలేకపోయాం. భరించలేని కడుపునొప్పితో మెలికలు తిరిగిపోతుంటే, శేషాద్రి మోసుకెళ్ళిన పిల్లలు ఛెంగు ఛెంగున గెంతుకుంటూ వస్తున్నారేంటి? మేము, మాతోపాటు ఆ సన్నివేశాన్ని చూసిన అర్చకులూ, ఇతర సిబ్బందీ, భక్తులూ అంతా సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాం. మా మనసులు కుదుటపడ్డాయి. అంతే! వెంటనే మేం అత్యుత్సాహంతో, అదే ప్రాకారంలో వుండే వీర. రాఘవ స్వామి పాదాల దగ్గర లవణాన్ని అర్పించాం. పుష్కరిణిలో గుడం కలిపేశాం.

మనస్ఫూర్తిగా అప్పుడనిపించింది - స్వామి సర్వాంతర్యామి. అది తిరుమల కావచ్చు, తిరువళ్ళూరు కావచ్చు. తిరుమలేశునికి నేనే ప్రథమ సేవకుణ్ణనే భ్రమలో ఈ 'సమభావం' ప్రదర్శించలేకపోవటమే నేను చేసిన తప్పా? అందుకే స్వామి నాకీ మనోవికాస పరీక్ష పెట్టాడా?

★ ★ ★



# 6

# మాస్టర్ ప్లాన్... పద్మవ్యూహంలో

ఆ రోజు నేను తిరుపతి వదిలి వెళ్ళిపోవటానికని సామాన్లు సర్దుకుంటున్నాను. తిరుమల తిరుపతి దేవస్థానాలకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నాలుగేళ్ళు పనిచేశాక వచ్చిన బదిలీ కావటంతో, నేనూ, నా భార్య గోపిక సామాన్లు సర్దే పనిలో తలమునకలై వున్నాం... అంతలో యధాలాపంగా నా చూపులు కిటికీలోంచి బయట గేటుమీద పడ్డాయి. అక్కడ ఒక పెద్ద జన సమూహం. ఆసక్తిగా పరికించి చూశాక వాళ్ళలో కొంతమందిని గుర్తుపట్టాను. వాళ్ళు - అప్పటికి కొన్ని మాసాల క్రితం తిరుమల ఆలయ సన్నిధిలో కసి, కోపం, ద్వేషం కలబోసిన ఆవేశంతో నా మీద రాళ్ళతో దాడి చేసినవాళ్ళు! కానీ - వాళ్ళు ఇప్పుడెందుకొచ్చారు? నాకు అంతుబట్టలేదు. అంతలో నా పి. ఏ. నారాయణ హడావుడిగా వచ్చి వాళ్ళు వచ్చిన విషయం వివరించాడు... ‼ అతను చెప్పింది విన్నాను. నవ్వొచ్చింది.

★ ★ ★

**నేను** టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా 1978లో పదవీ బాధ్యతలు స్వీకరించిన నాటికి నాముందున్న ప్రధాన సమస్య - తిరుమల శ్రీనివాసుని దర్శించుకోవాలంటే క్యూ షెడ్లలో 12 నుండి 18 గంటలపాటు నిరీక్షించాల్సి వస్తోంది... పరిస్థితులు స్వయంగా తెలుసుకోవడం కోసం నేను సాధారణ యాత్రికుడిలా క్యూ షెడ్లలో ప్రవేశించాను. (నేను ఇ. ఓగా వచ్చి కొద్ది రోజులే కావటంతో, తిరుమలలో టిటిడి సిబ్బంది ఎవరూ నన్ను గుర్తు పట్టే అవకాశం లేదు)



మాష్టర్‌ప్లాన్ అమలుచేయడానికి ముందు తిరుమల

అదొక చేదు అనుభవం. ఆ షెడ్లలో ఎండ వేడికి నెత్తిమీద ఆస్‌బెస్టాస్ రేకులు కాలిపోతూ, ఆ వేడికి ఒంట్లో తాపం పెరిగి పోతుంటే, పిల్లా జెల్లా 'దాహం దాహం' అంటూ నీళ్ళ కోసం ఎగబడుతుంటే, అలా ఒక్కో క్యూ షెడ్డులో 500 నుండి 600 మంది యాత్రికులు - ఆనుకునే సదుపాయం లేని సాధారణ బెంచీల మీద కూర్చుని కునుకుతూ వుంటే, షెడ్లకి బయట తాళాలు వేసి సిబ్బంది అటూ ఇటూ తిరుగుతూ వుంటే... ఎప్పుడో కొన్ని గంటల తరువాత వరుస క్రమంలో ఒక్కో షెడ్‌లోని యాత్రికుల్ని దర్శనం క్యూలోకి వదిలేవారు. ఇక ఆ క్యూ పొడుగు ఒక కిలో మీటరుంటుంది. మళ్ళీ దారిలో మెట్లు, వంతెనలు, మళ్ళీ క్రిందకు దిగటాలూ, మధ్య మధ్యలో రోడ్లు దాటడాలు...., ఇలా నానా అవస్థపడి చెమటలు కక్కుతూ, శ్రీవారి గర్భగుడిలో ప్రవేశిస్తే, అక్కడ శ్రీవారి దివ్య విగ్రహం ముందు నిలబడి కళ్ళు మూసి తెరిచే లోపల, "నడవండి.... నడవండి" అంటూ సిబ్బంది హెచ్చరికలతో - దర్శనం పూర్తయిపోతుంది. అప్పుడే మొదటిసారిగా తెలుసుకున్నాను - ఎన్నో వందల వేల మైళ్ళ దూరం నుంచి శ్రీవారి దర్శనం కోసం ఆర్తితో వచ్చే భక్తులకు లభించేది అనేక గంటల దుర్భర నిరీక్షణ, రెప్పపాటు దర్శన భాగ్యం!!!

అలా దర్శనం చేసుకుని బయటపడ్డాక, మహాద్వారం ఎదురుగా మెట్లు ఎక్కగానే మనం అడుగుపెట్టేది సన్నిధివీధి. ఆ వీధిలో వెళ్తుంటే అక్కడి పరిస్థితి అంతా అగమ్యగోచరంగా కనిపించింది. అంతా కలిపి ఓ 100-150 గజాల పొడవుండే సన్నిధి వీధిలో కిటకిటలాడుతూ జనం. అటూ ఇటూ దుకాణాలు, మధ్యలో రకరకాల బొమ్మలు, బెలూన్లు, నకిలీ కాసులు వగయిరా అమ్ముకుంటూ తిరిగే చిల్లర వర్తకులు. యాత్రికుల్ని తప్పుదారి పట్టించే దళారీలు, జేబుదొంగలతో, ఆరేడు అడుగులకు మించి వెడల్పు లేని విధంగా ఇరుకైన చిన్న సందులా వుండే ఆ వీధిని మరింత ఇరుకు చేస్తూ, వీధి కిరువైపులా దుకాణాలు. అలా ఈదుకుంటూ ఈదుకుంటూ ఆ జన సముద్రంలో వీధి చివరికి వెళ్తే, అక్కడ అసంపూర్ణంగా వుండిపోయిన ఒక మొండి గోపురం. ఆ పక్కన బేది ఆంజనేయస్వామి విగ్రహం వున్న షెల్టరు - ఆ షెల్టరుకి చుట్టూ అనధికారికంగా పనిచేసే క్షురకుల సమూహం. అక్కడ్నుంచి కుడి ప్రక్కకి తిరిగితే అక్కడ (ఇప్పుడు ఆస్థాన మండపం, క్యాంటీన్, ఉచిత భోజనశాల వున్నచోట) దాదాపు 1100 అక్రమ కట్టడాలు. వాటిలో చాలావరకు గుడిసెలు, రేకుల షెడ్‌లూ





వగయిరా నిర్మాణాలు. హైద్రాబాద్ నగరంలోని మురికివాడల్ని గుర్తుకి తెచ్చే ఈ గుడిశె వాడకి తోడు, ఇప్పుడు క్యూ కాంప్లెక్స్ వున్నచోట కూడా 500 షెడ్‌లు, గుడిశెలతో మరో మురికివాడ వుండేది.

చుట్టూ మురికివాడలతో, దళారీలతో, చిల్లర వర్తకులతో, దుకాణాలతో నిండిన ఇరుకైన సందు గొందులు, ఆస్‌బెస్టాస్ రేకుల (యాత్రికుల) షెడ్‌ల మధ్య వుంది పవిత్రమైన శ్రీనివాసుని ఆలయం. దర్శనం కోసం వచ్చే భక్తులు కొండ ఎక్కాక, ఈ కలియుగ వైకుంఠపాళిని దాటుకుంటూ వెళ్తేకాని, రెప్పపాటు దర్శనం లభించదు... ఈ దృశ్యం నా మనసుని కలచివేసింది. ఎందుకు ఈ పరిస్థితి ఇలా వుండిపోయింది! దీన్ని ఎందుకు మార్చలేకపోయారు?... ఇలాంటి ప్రశ్నలతో నేను చాలా రోజులు మథనపడ్డాను.

సీనియర్ అధికారుల్ని అడుగుతూ వచ్చాను - "తిరుమల అంతా ఇలా ఎందుకుంది?" గతంలో ఈ పరిస్థితిని మార్చడానికి ప్రయత్నాలు జరిగాయి. భక్తుల సదుపాయం కోసం ఒక ఆధునిక క్యూ కాంప్లెక్స్ నిర్మించే ప్రయత్నం కూడా జరిగింది. కాని, ఏం చేయాలన్నా తిరుమల ఆలయం చుట్టూ వున్న అక్రమ ఆక్రమణల్ని తొలగించాలి. మురికివాడల్ని నిర్మూలించాలి. ఆలయం నాలుగువైపుల వీధుల్లో వున్న ప్రైవేటు గృహాలు, మఠాలు, స్వచ్ఛంద సంస్థల కార్యాలయాలు వగయిరాలన్నింటినీ వేరే చోటకి తరలించాలి. అడ్డగోలుగా విస్తరించిన దుకాణాల సముదాయాన్ని క్రమబద్ధీకరించాలి... ఇలాంటి ప్రయత్నం గతంలో ఎప్పుడు ఎవరు చేసినా, వెంటనే సంబంధిత యజమానులు కోర్టులో కేసు వేయడం, స్టే తీసుకురావడం పరిపాటి అయిపోయింది. అక్కడ తిరుమల శ్రీనివాసుడి ఉనికి ఆధారంగా రకరకాల వ్యాపారాలతో, వ్యాపకాలతో జీవిస్తున్నారు వాళ్ళంతా. దీంతో - తిరుమలలోని వ్యాపారస్థులూ, స్థానికులూ కలిసి ఒక బలమైన వర్గంగా రూపొందారు. ఏ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ వచ్చి ఏ మాత్రం మార్పు తీసుకురావాలని యత్నించినా - ఈ వర్గం తరఫున కోర్టులో కేసు దాఖలైపోతుంది. అలా - లెక్కలేనన్ని కేసుల్లో 'స్టే' ఉత్తర్వుల్ని (నేను వెళ్ళేసరికి) టిటిడి ఎదుర్కొంటోంది.

ఓ ప్రక్క ఈ పరిస్థితి ఇలా వుండగా, మరో ప్రక్క కనీస పారిశుధ్యం కూడా లేని ఈ జాతర వాతావరణం ఆసరాగా తీసుకుని యాత్రికుల్ని దళారీలు, దొంగలు నిలువుదోపిడీ చేస్తున్న సంఘటనలు రోజు రోజుకీ పెరిగిపోతున్నాయి. ఈ పరిస్థితి ఇలాగే వదిలేస్తే, ఇంకా ఇంకా యాత్రికులు తిరుమల యాత్రా బాధితులుగా మాత్రమే మిగిలిపోయే ప్రమాదం వుంది.

ఈ క్లిష్ట పరిస్థితి నాలో నైరాశ్యం పెంచేస్తోంది. యాత్రికుల కోసం ఏమీ చేయలేమా? తిరుమలని ఇలాగే 'దోపిడి వ్యవస్థ'కి ఆరామంగా వదిలేయాలా?... ఇలాంటి ప్రశ్నల మూలంగా నీరసం, నిస్తేజం నన్ను ఆవరించాయి.... అయినా, ఒకరోజు ఎక్కడలేని ధైర్యం తెచ్చుకుని తిరుమలకు

సంబంధించిన పాత రికార్డులన్నీ తిరగేశాను. నిజానికి, తిరుమల అభివృద్ధి పట్ల నాకు ముందు పనిచేసిన ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌లెవరూ ఉదాసీన వైఖరిని అవలంబించలేదని రికార్డుల్లో బయటపడింది. నాలాగే వాళ్ళూ తిరుమల అభివృద్ధి కోసం ఆరాటపడ్డారు. ప్రయత్నాలు చేశారు. ఉదాహరణకి ఆధునిక క్యూ కాంప్లెక్స్ కట్టడానికి ఒక బృహత్ ప్రణాళికను గతంలో టిటిడి బోర్డు మంజూరు చేసింది. శంకుస్థాపన కూడా చేసింది. అయితే అక్కడ శంకుస్థాపన తాలూకు శిలాఫలకం వేయటానికి సరిపడే స్థలం మాత్రమే వుంది. అది మినహాయిస్తే, ఆ చుట్టూ పరిసరాలన్నీ ఒక మురికివాడలో భాగం. శంకుస్థాపన తాలూకు క్యూ కాంప్లెక్స్ కట్టాలంటే 500 గుడిశెలు, షెడ్‌లు తొలిగించాలి.

అవన్నీ తీసేసినా, ఆలయం దగ్గరకు క్యూ వెళ్ళాలంటే మధ్యలో దక్షిణ మాడ వీధిలోని రెండు- మూడు అంతస్థుల భవనాలు కొన్నింటిని కూల్చేయాలి. సువిశాలమైన ఆధునిక కళ్యాణకట్ట నిర్మించాలన్నా, సన్నిధి వీధిని విస్తరింపజేయాలన్నా, ఆధునిక క్యాంటీన్ కాంప్లెక్స్ నిర్మించాలన్నా... అన్నింటికీ ఇదే సమస్య. ఇళ్ళు, గుడిశెలు, షెల్టర్లు, దుకాణాలు, ఇతర అక్రమ కట్టడాలు వగైరా తొలగించాలి.

అసలింత గందరగోళ పరిస్థితి ఎందుకు వచ్చింది? తిరుమల కొండమీద అటవీ ప్రాంతంతో సహా పదిన్నర చదరపు మైళ్ళ భూభాగం అంతా తిరుమల వేంకటేశ్వరుడికి చెందినదే. అయినప్పుడు ఈ నిర్మాణాలు, అక్రమ కట్టడాలూ ఎలా వచ్చాయి?... అదంతే! ఎలాగో వచ్చేశాయి. దేవస్థానం వారి అనుమతితో కొన్ని, అనధికారికంగా కొన్ని తిరుమలని ఆక్రమించాయి. అంతా ఒక శతాబ్దకాలంలో జరిగిపోయింది. ఇప్పుడు ఏ ఒక్క ఆక్రమణని ముట్టుకుందామన్నా వీల్లేకుండా ప్రతి అంగుళం లిటిగేషన్‌లో ఇరుక్కొని వుంది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే, తిరుపతిలోని మున్సిఫ్ కోర్టు మొదలు ఢిల్లీలో సుప్రీం కోర్టు దాకా అన్ని కోర్టులలోనూ ఈ లిటిగేషన్లు "మూడు కేసులూ - ఆరు స్టేలూ" అన్నట్లుగా పేరుకుపోయి వున్నాయి. దీనివల్ల టిటిడి లీగల్ ఆఫీసర్లకీ, గవర్నమెంటు ప్లీడర్లకీ, తిరుమల పంచాయితీ సిబ్బందికీ చేతినిండా పని దొరికింది తప్ప, అభివృద్ధి పనుల్లో అంగుళం కూడా ముందుకు సాగే అవకాశం లేకుండా పోయింది.

ఈ లిటిగేషన్ల వ్యవహారాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశాక నాకు అర్థమయిందల్లా ఈ కోర్టు కేసులు మరో 25-30 ఏళ్ళ దాకా తేలేవి కావు. అందుచేత, తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం దగ్గర ఎన్ని నిధులున్నా, ఎంత భారీ యంత్రాంగం వున్నా, యాత్రికుల్ని ఉద్ధరించటం కోసం ఎంత గొప్ప ఐడియాలున్నా, రాజకీయంగా, నైతికంగా ఎంత మద్దతు వున్నా - అవన్నీ నిష్ప్రయోజనం - ఈ కోర్టు లిటిగేషన్‌లు తేలేవరకూ!!





ఈ వాస్తవ పరిస్థితి నన్ను మానసికంగా బాగా క్రుంగదీసింది. "తిరుమల యాత్రికుల కోసం ఏదో చేసేయాలి" - అనుకుంటూ ఎంత ఉత్సాహంగా టీటిడిలో బాధ్యతలు స్వీకరించానో ఆ ఉత్సాహమంతా నీరుగారిపోయింది. అవక తవక కట్టడాలు, ఇరుకు గొందులు, దళారీల స్వైర విహారం, సదుపాయం లేని క్యూ షెడ్‌లు, పేరుకుపోతున్న అపరిశుభ్రత తదితర పరిస్థితుల కారణంగా ప్రశాంత చిత్తంతో శ్రీనివాసుని దర్శించుకోలేని యాత్రికుల దురవస్థ... ఇవన్నీ చూస్తూ కూడా (అపారమైన అధికారాలు, శక్తీ వుండికూడా) ఏమీ చేయలేని నిస్సహాయస్థితి - నన్ను కొన్ని వారాలపాటు ఆవేదనలో ముంచేసింది.

ఒకరోజు - ఆళ్వార్ ట్యాంక్ కాటేజీల దగ్గర కారుదిగి, ఆలయంకేసి వెళుతున్నప్పుడు ఆ దారిలో క్రిక్కిరిసి వున్న ఇళ్ళు, షెడ్‌లు, ఇరుకుదారులు చూడగానే అనిపించింది - ఇక్కడ ఒక విశాలమైన, అధునాతనమైన క్యూ కాంప్లెక్స్ వస్తే ఎంత బాగుంటుంది. ఈ స్థలం సరిగ్గా ఆలయానికి దక్షిణ వైపున వుంది. ఇక్కడ ఒక క్యూ కాంప్లెక్స్ రావాలి. రెండు మూడు అంతస్థుల భవనం - అందులో యాత్రికులకు లేవెటరీ, మంచినీళ్ళు, ఫ్యాన్లు, కాళ్ళు జాపి జారగిలబడి కూర్చోడానికి కుర్చీలు వగయిరా సదుపాయాలు - పెద్దవాళ్ళు నడుంవాల్చాలంటే ఏర్పాట్లూ, స్నానానికి, సామాన్లు పెట్టుకోవటానికి ఏర్పాట్లు - ఎన్ని గంటలు నిరీక్షించాల్సి వచ్చినా, విసుగు అనిపించకుండా, అలసట తెలియకుండా వుండే మధురమైన భక్తి సంగీతం, క్లోజ్‌డ్ సర్క్యూట్ టెలివిజన్ ద్వారా స్వామి వారి సేవలను తిలకిస్తూ పులకించే ఏర్పాటు, తినడానికి తినుబండారాలు... ఓహ్! అద్భుతమైన ఊహాచిత్రం నా కళ్ళ ముందు మెదిలింది...

అలా ఆలయం ముందుకు వస్తున్న కొద్దీ ఆలోచన మరింత విస్తరిస్తోంది... క్యూ కాంప్లెక్స్‌తో పాటు, సన్నిధి వీధి రూపం పూర్తిగా మారిపోవాలి. కనీసం వంద అడుగుల వెడల్పు వుండాలి. యాత్రికులు నడవటానికి సువిశాలంగా కనుపించాలి... మరి మంచి క్యాంటీన్ వుండక్కర్లేదా? అవును, యాత్రికులకు భోజన సదుపాయాన్ని బాగా మెరుగుపరచాలి. అలా చేయాలంటే, క్యాంటీన్ కాంప్లెక్స్ వుండాలి. అదెలా వుండాలంటే - మళ్ళీ ఊహల్లోకి వెళ్ళిపోయాను. మరో ఊహాచిత్రం కళ్ళముందు మెదిలింది. అప్పుడు కళ్యాణకట్ట రూపురేఖలు కూడా మారిపోవాలనీ, దాన్ని కూడా అందంగా, పరిశుభ్రంగా నూతనంగా నిర్మించాలనీ కోరిక పుట్టింది. ఇంకా ఒక మనోరంజకమైన సభామందిరం కూడా తిరుమలలో వుండాలి. ఏవయినా మంచి సభా, సంగీత, నృత్య, సాంస్కృతిక కార్యక్రమాలు జరపాలంటే - వీలయితే స్వామి వారి కళ్యాణం కూడా జరిపించడానికి అలాంటి హాలు అవసరం. అది ఇంకో ఊహ... ఓహ్! అద్భుతమైన, అపూర్వమైన ఊహా చిత్రాలు. అవన్నీ కలుపుకొని చూస్తుంటే మనస్సు గాల్లో తేలిపోయింది.... ఆ ఊహల్లోంచి బయటపడేసరికి నేను రేకుల షెడ్‌ల మధ్యలోంచి ఆలయం దగ్గరకొచ్చేశాను. ప్చ్! ఈ కల నిజమవుతుందా? శ్రీనివాసుడ్ని నమ్ముకుని ముడుపులు కట్టుకుని, వందలమైళ్ళ దూరం నుంచి మూగభక్తితో, శ్రీవారి పాదాలు

దర్శిస్తే చాలు - అన్న ఆర్తితో వచ్చే యాత్రికుల కోసం అడుగడుగునా అందమైన నందనవనంలా కనబడేలా తిరుమలని ఎప్పటికయినా చూడగలనా? ఆ భక్తులకు తిరుమల యాత్ర మధురానుభూతిని మిగిల్చేలా ఈ సదుపాయాలు కల్పించగలనా?... ఈ అవకాశం నాకు లభిస్తుందా?... అంతలో కోర్టు లిటిగేషన్‌లు గుర్తుకొచ్చాయి. క్షణాల్లో మళ్ళీ డీలా పడిపోయాను...

కాస్సేపటికి ఆలయంలోకి అడుగు పెడుతూనే ఆపుకోలేని ఆవేశంతో స్వామి వారిని ప్రశ్నించాను - "నీ భక్తుల కోసం ఎన్నో సదుపాయాలు కల్పించాలని ఆరాటంగా వుంది. కాని ఎందుకు ఇన్ని ఆటంకాలు ఎదురవుతున్నాయి? ఎందుకనీ, ఏ ఒక్కటీ చేయలేని నిస్సహాయస్థితి నన్ను వెంటాడుతోంది? ఎప్పటికిది పరిష్కారమవుతుంది? అసలు పరిష్కారం వుందా? వుంటే అది నాకు లభ్యమవుతుందా? లేదంటే, నీ భక్తులు ఇక్కడ ఇలా అవస్థలు పడుతూనే వుండాలా? ఎంతకాలం?...." అలా స్వామిని ప్రశ్నిస్తూండగానే తటాలున మెరుపులా ఒక ప్రశ్న నాలో ఉదయించింది...

"అవునూ! నేను ఎంతసేపూ యాత్రికుల సదుపాయం కోసం తిరుమల కొండమీద అవకతవక నిర్మాణాలు ఎలా కూల్చెయ్యాలీ, గుడిశెలు, షెడ్‌లు ఎలా నిర్మూలించాలీ - అనే ఆలోచిస్తున్నానే! మరి అక్కడ నివసిస్తున్న వాళ్ళ సంగతి ఏమిటి? వాళ్ళు మాత్రం - తిరుమలలోని శ్రీనివాసుడి ఉనికి ఆధారంగా జీవిస్తున్న వాళ్ళు కాదా? 'ఆయన' అంటూ వున్నాడు కనుక, 'ఆయన' కోసం భక్తులు వస్తున్నారు కనుక, వీళ్ళు ఇక్కడ జీవించగలుగుతున్నారు. 'ఆయనే' ఇక్కడ లేకపోతే, 'ఆయన'కి ఇష్టం లేకపోతే, వీళ్ళిక్కడ వుండగలిగేవారా? యాత్రికులకి సేవ చేయడం ద్వారా, వాళ్ళు 'ఆయన్ని' సేవిస్తున్న వాళ్ళు అవటం లేదా?... మరి వాళ్ళెక్కడికి పోతారు...."

ఈ ఆలోచన మనస్సులోకి రావటం ఆలస్యం - ఒక్కసారిగా నాకు ఏదో మనోవికాసం కలిగినట్లనిపించింది. నాలో కొత్త ఉత్సాహం, ఉత్తేజం చోటు చేసుకున్నాయి. క్రమంగా నాలో అంతకు ముందు వరకూ ఆవరించి వున్న నైరాశ్యపు మబ్బులు విడిపోతున్నాయి. అవును, నేను వాళ్ళ దృక్పథంలోంచి కూడా ఆలోచించాలి. వాళ్ళ శ్రేయస్సుకి భంగం కలగకుండా ప్లాన్ చేయాలి. అప్పుడే, ఏమయినా సాధించగలుగుతాం... అందుకోసం సంబంధిత పెద్దల్ని, నాయకుల్ని పిలిపించి చర్చించాలి. అందర్నీ విశ్వాసంలోకి తీసుకుని అందరికీ ఆమోదయోగ్యమైన రీతిలో సమస్యని పరిష్కరించాలి...

ఇక ఆలస్యం చేయలేదు. మర్నాడే లక్ష్మీపతి, రాఘవన్, రాము, కృష్ణ, చారి, రామచంద్రారెడ్డి వగయిరా స్థానిక పెద్దలతో మాట్లాడాను.

సరిగ్గా అంతకుముందే అన్నారావుగారి సారథ్యంలోని టిటిడి ట్రస్టుబోర్డు రద్దయింది. రెవెన్యూ సెక్రటరీ ఛైర్మన్‌గా, దేవాదాయశాఖ కమీషనర్ ఒక మెంబర్‌గా, నేను మెంబరు - సెక్రటరీగా పర్సన్స్





- ఇన్‌ఛార్జి కమిటీ ఏర్పాటయింది. నా ఆలోచనలు ఆ కమిటీ ముందు పెట్టాను. దేవాదాయశాఖ మంత్రితో, ముఖ్యమంత్రితో కూడా చర్చించాను - "తిరుమలని ఒక ఆదర్శవంతమైన యాత్రా స్థలంగా చేయాలంటే ఒక మాస్టర్‌ప్లాను అమలుచేయాలి. అందుకు మీ మద్దతు కావాలి సర్" అన్నాను. వాళ్ళ ఆమోదంతో ఒక సమగ్ర వ్యూహంతో రంగంలోకి దిగాను.



రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డికి, ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డికి
క్యూకాంప్లెక్స్ మోడల్ చూపించి
మాస్టర్‌ప్లాన్ గురించి వివరిస్తున్న పి.వి.ఆర్.కె.ప్రసాద్

ఆ వ్యూహం ప్రకారం - తిరుమల గ్రామం మొత్తం సర్వే చేయాలి. ఆలయం చుట్టూ వున్న అన్ని ప్రైవేటు కట్టడాలు, నిర్మాణాలు, ఇళ్ళు, గుడిశెలు వగయిరా ఫోటోలు తీయాలి. ప్రతి నిర్మాణం వివరాలు, ఆ ఇంట్లో లేదా ఆ గుడిశెలో వుండే జనాభా వివరాలు, ఆ ఇంటి స్థలం విస్తీర్ణం వగయిరా సమాచారం అంతా ఈ సర్వేలో పక్కాగా రికార్డు కావాలి. అదంతా పూర్తయ్యాక వాళ్ళ వాళ్ళ స్థలాలకి, నిర్మాణాలకి నష్ట పరిహారం చెల్లిస్తూ వాళ్ళందరి కోసం తిరుమలలోనే ఆలయానికి మూడు కిలోమీటర్ల దూరంలో ఒక టౌన్ షిప్ నిర్మాణం జరగాలి. అక్కడ వాళ్ళకి ప్రత్యామ్నాయ వసతి సదుపాయాలు (లీజు పై) కల్పించాలి. నష్టపరిహారాల్లో ఎలాంటి ఆరోపణలకి అవకాశం లేకుండా, ఒక కమిటీని నియమించి, దాని ద్వారా అందరికీ న్యాయం జరిగేలా, పూర్తి పారదర్శకతని పాటిస్తూ, ఆలయం చుట్టూ వున్న వాళ్ళందర్నీ ఆ టౌన్‌షిప్‌కి తరలించాలి. అలాంటి ప్రతిపాదనకి అందర్నీ ఒప్పించి, అలా ఒప్పుకున్నాక వాళ్ళచేత కోర్టుల్లో వున్న అన్ని పిటీషన్లని ఉపసంహరింపజేయాలి.

అంతే! నెలరోజుల్లోనే సర్వే పూర్తయింది. బహిరంగ విచారణల ద్వారా ఏ నిర్మాణం ఎవరిదీ, ఎవరెవరు వుంటున్నారూ తదితర అన్ని అంశాలూ సమగ్రంగా రికార్డయ్యాయి. రెండు నెలల్లో - ఆ నిర్మాణాల స్వాధీనానికి వీలుగా స్థానికులతో చర్చించటానికి పెద్దలతో ఒక కమిటీ ఏర్పాటయింది.

స్థానికులు ఖాళీ చేయాల్సిన స్థలాల ఇళ్ళకి విలువని ఖరారు చేసే పని ఈ కమిటీదే. ఆలయం చుట్టూ వున్న వీధుల్లోని వివిధ మఠాలను కూడా కొత్త 'మఠాల వీధి'కి తరలించటానికి వీలుగా ఏర్పాటు జరిగింది.

ప్రతి ఒక్కరి స్థలం లేదా ఇల్లు మీద వచ్చే నష్టపరిహారం గురించి ప్రతి ఒక్కరికీ తెలిసేలా పారదర్శకత పాటిస్తూ, మరో నెల రోజుల్లో పరిహారం చెల్లింపుల కమిటీ తన రిపోర్టును ఖరారు చేసేసింది.

అలా జరిగాక ముందుగా కూల్చేసిన నిర్మాణాల స్థలంలోనే ఇప్పటి మోడర్న్ క్యూ కాంప్లెక్స్ నిర్మాణాన్ని చేపట్టాం. అక్కడ ఒక చెరువు వుండేది. అందుకని ఆ చెరువు గట్టు మీదకి వచ్చేలా ఈ క్యూ కాంప్లెక్స్‌ని అర్ధ చంద్రాకారంగా నిర్మించాం. అయితే ఆ క్యూ కాంప్లెక్స్ నిర్మాణానికి ముందు జరిగిన ఒక సంఘటన నాకు పెద్ద సమస్యని సృష్టించింది.

క్యూ కాంప్లెక్స్ కోసం జరుగుతున్న నిర్మూలన కార్యక్రమం దక్షిణ మాడ వీధిలో కొన్ని పక్కా భవనాల దగ్గరకొచ్చేసరికి వ్యతిరేకత ఎదురయింది. అది కాస్తా కూస్తా వ్యతిరేకత కాదు. అక్కడికీ, అక్కడ నివసించే వాళ్ళలో ముఖ్యుడైన లక్ష్మీపతి తదితరులు టిటిడికి సహకరించటానికి విశాల హృదయంతో ముందుకు వచ్చారు. కాని మిగిలినవాళ్ళల్లో కొందరు (ముందు అంగీకరించిన వాళ్ళే) స్థానిక నాయకుల వత్తిడి కారణంగా భవనాల నిర్మూలనకు ఎదురు తిరిగారు.

ఆరోజు ఉదయం 11 గంటల ప్రాంతంలో మా ఛీఫ్ సెక్యూరిటీ విజిలెన్స్ ఆఫీసర్ రామచంద్రా రెడ్డి వచ్చి ఈ గొడవ గురించి చెప్పాడు. అది చిన్న గొడవకాదు. స్థానిక నాయకులు ఒక పెద్ద జన సమూహాన్ని ప్రోగు చేసి కట్టడాల నిర్మూలనకి అడ్డంపడ్డారు. వాళ్ళని కాదని ఒక్క అంగుళం కూడా ముందుకు పోలేని పరిస్థితి. టిటిడి ఇంజనీరింగు సిబ్బందికీ, వాళ్ళకీ మధ్య వాగ్వాదం ముదిరిపోయింది. "ఈ బుల్‌డోజర్లు మా శవాల మీంచి నడిస్తేనే మీరీ ఇళ్ళు కూల్చగలుగుతారు" అంటూ వాళ్ళు పెద్ద జగడం సృష్టించారు. కేకలు, అరుపులు, నిరసన ధ్వనులు... ఈ గందరగోళంతో అప్పటిదాకా ఈ నిర్మూలన కార్యక్రమాలు పర్యవేక్షిస్తున్న రామచంద్రారెడ్డికి ఏంచేయాలో పాలుపోక నా దగ్గరకు పరుగెత్తుకు వచ్చాడు. నేను నివ్వెరపోయాను.

"ఏమిటిదీ? మనం ఇంతమందిని ఒప్పించి పని సాగిస్తుంటే ఇన్ని రోజుల తరువాత ఇప్పుడేమిటీ గొడవ?-" అనుకుంటూ మధనపడ్డాను. "భగవంతుడా, నీవే దిక్కు - దారి చూపించు" అని వేడుకొన్నాను. అంతలో స్ఫురించింది - రామచంద్రారెడ్డి పోలీసు డిపార్ట్‌మెంటు నుంచి టిటిడికి డెప్యుటేషన్ మీద వచ్చి పని చేస్తున్న అడిషనల్ పోలీసు సూపరింటెండెంటు స్థాయి అధికారి. అంతే - రామచంద్రారెడ్డిలోని 'పోలీస్'కి పనిచెప్పాను. "ఏమిటయ్యా నాకు చెబుతున్నావ్ - నువ్వు పోలీసు ఆఫీసర్‌వై వుండి కూడా ఆ మాత్రం వాళ్ళని కంట్రోల్ చేయలేవా?"... ఇలా ఇలా చెప్పాల్సింది చెప్పాను. మరుక్షణంలో రామచంద్రారెడ్డి అక్కడ్నుంచి అదృశ్యమయ్యాడు.

"బుల్‌డోజర్‌లు మా శవాల మీంచి నడుస్తాయి" అంటూ అడ్డం వచ్చిన స్థానిక లీడర్‌ని మెడబట్టి, గాల్లోకి ఎత్తి, వూపేశాడు రామచంద్రారెడ్డి. "విధి నిర్వహణలో వున్న సిబ్బందికి ఆటంకం కలిగించారో సున్నంలోకి ఎముకలు లేకుండా..." అంటూ రామచంద్రారెడ్డి ఉగ్ర నరసింహావతారం





ప్రదర్శించాడు. ఫినిష్! ఊహించని ఈ పరిణామంతో ఆ నలుగురైదుగురు లీడర్లూ భయంతో వణికిపోయారు. ఒక్కమాట ఎదురు చెప్పకుండా రాజీకి వచ్చేశారు. దక్షిణ మాడ వీధిలో పురాతన కట్టడాల నిర్మూలన నిరాటంకంగా సాగిపోయింది. అప్పటిదాకా టిటిడితో ఒప్పందం చేసుకోడానికి వెనుకాడిన మిగతా భవనాలవాళ్ళు కూడా ఒప్పందాల మీద సంతకాలు చేసేశారు.

శరవేగంతో మా వ్యూహం అమలు జరుగుతోంది. దాదాపు మూడువేల నిర్మాణాల్ని తొలగించటానికి, ఆ ఇళ్ళల్లో వాళ్ళ సామానంతా టిటిడి వాహనాల్లో తరలించి వాళ్ళకి ప్రత్యామ్నాయ వసతి కల్పించటానికీ, ఆ తరలింపు కాలంలో వాళ్ళకి భోజన సదుపాయాలు కల్పిస్తూ ఎలాంటి అసంతృప్తి లేకుండా చూడటానికీ, అక్కడున్న చిన్న సత్రవుల్నీ, మఠాల్ని ఇప్పటి మఠం వీధికి తరలించటానికీ సహకరించడంలో టిటిడి సిబ్బంది చూపిన ఉత్సాహం, వేగం, శ్రమ మర్చిపోలేనివి. అలా ఏడాదిపాటు నిర్విరామంగా కష్టపడితే, ఇప్పటి ఆస్థాన మండపం, అన్నదానం కాంప్లెక్స్, క్యాంటీన్, కళ్యాణకట్ట, మార్కెట్ కాంప్లెక్స్, క్యూ కాంప్లెక్స్‌ల నిర్మాణానికి తగినట్లుగా సిద్ధం చేయగలిగాం.

కానీ ఇంకా జటిలమైన సమస్య మరొకటి అప్పుడే బయటపడింది... అది సన్నిధి వీధిని విస్తరించడంలో వ్యతిరేకత. ఆలయ ముఖ ద్వారానికి ఎదురుగా - ఒక ఇరుకు బజారులా వుండే సన్నిధివీధి ఆరడుగుల వెడల్పుకి కుంచించుకుపోయి వుండటంతో యాత్రికులు - జాతరలో నడిచినట్లుగా క్రిక్కిరిసి నడవాల్సివస్తోంది. అక్కడి షాపుల్ని రెండుప్రక్కలా యాభయ్యేసి అడుగులు వెనక్కి జరిపితేనేకాని వంద అడుగుల వెడల్పున (ఇప్పుడున్న) వీధి తయారవదు. అందుకు షాపుల యజమానులు అంగీకరిస్తే - వాళ్ళందరికీ పక్కాషాపులు యథాతథరీతిలో కట్టించి ఇవ్వాలన్నది నా ఆలోచన. అదే అందరికీ చెప్పాం. "ఇది యాత్రికుల సదుపాయం కోసం మీ అందరూ సహకరించాల్సిన విషయం. దయచేసి సహకరించండి..." అంటూ ఎంతో బ్రతిమాలగా చాలామంది ఒప్పుకున్నారు. కానీ - "మేం ఒప్పుకుని ఖాళీ చేస్తాం. మిగతావాళ్ళు రాజకీయపలుకుబడితో ఇక్కడే వుండిపోతే మేం నష్టపోతాం గదా?" అని వాళ్ళ భయం. పైగా టిటిడి అధికారులమీదా నామీదా వాళ్ళకి నమ్మకం లేదు. "ఎవరి షాపులు మళ్ళీ వాళ్ళకే వస్తాయని గ్యారంటీ ఏమిటి?" అంటూ అనుమానాలు. ఈలోగా సన్నిధి వీధికి దక్షిణవైపున వున్న వెయ్యి కాళ్ళ మంటపాన్ని (ఇలా సన్నిధి వీధి విస్తరించటానికి వీలుగా) ఎంత వెనక్కి జరపాలో చూసుకున్నాం. సన్నిధి వీధికి ఉత్తరవైపున షాపుల వెనకాల వున్న వివిధ మఠాలకి చెందిన ఆస్తుల యాజమాన్యాల్ని కూడా ఈ విస్తరణకి ఒప్పించి, ఒప్పందాల మీద సంతకాలు తీసుకున్నాం. మా ప్రయత్నాలు చూసి, షాపుల యజమానులు కొంతమంది కోర్టులకెక్కారు. స్టే ఉత్తర్వులు తెచ్చారు.

అప్పటిదాకా వాళ్ళని ఒప్పించాలని చేసిన ప్రయత్నాలన్నీ బెడిసి కొట్టాయి. - ఈ సన్నిధివీధి విస్తరణ జరక్కపోతే అసలు తిరుమల మాస్టర్ ప్లాన్‌కి అర్థమేలేదు. ఏం చేయాలి?... "తిరుమల



60వ దశకంలో సన్నిధివీధి

వేంకటేశ్వరుడే దీనికి కూడా పరిష్కారం చూపిస్తాడు..." అనుకుంటూ వదిలేస్తే పోలేదా? అనిపించింది.

నాలో నేను తర్కించుకున్నాను. దైవశక్తే మనల్ని నడిపిస్తోందని ఎంత విశ్వసించినా మన ప్రయత్నం మనం చేయాలి గదా!.... ఇలా అనుకున్నాక ఈ కోర్టు కేసుల విషయంలో అడ్వకేటు జనరల్‌తో, న్యాయవాద నిపుణులతో చర్చించడం నేను చేయగల చివరి ప్రయత్నంగా భావించాను. వాళ్ళతో మాట్లాడాక, హైకోర్టుని ఆశ్రయించాం. దుకాణాల యజమానులు వేసిన కేసులన్నింటినీ గుత్తగా హైకోర్టుకి బదిలీ చేయించి, వాటికి జవాబుగా టిటిడి నుంచి పిటీషన్ వేశాం. మాస్టర్ ప్లాన్ లక్ష్యం, దాన్ని అమలు చేసే విధానం, అందులో ఒక భాగంగా సన్నధివీధి విస్తరణ... వగయిరా అంశాలన్నీ వివరించాం. ఈ మాస్టర్ ప్లాన్ వల్ల నష్టపోతున్నామనుకుంటున్న షాపుల వాళ్ళందరికీ తిరిగి పక్కా షాపులు కట్టించి ఇస్తున్నామనీ, ఏ ఒక్కరికీ అన్యాయం జరగదనీ, ఎవరూ నష్టపోరనీ కూడా లిఖిత పూర్వకంగా వివరించాం. అద్భుతం! హైకోర్టు మా వాదనని అంగీకరిస్తూ, అన్ని స్టే ఉత్తర్వులనీ - ఒకే ఆర్డరుతో ఒక శుక్రవారం నాడు తొలిగించివేసింది! ఇది మా మానవ ప్రయత్నానికి ఆ స్వామి వారి ఆమోదంలా భావించి, ఆ ఆర్డరు వచ్చిన వెంటనే - సన్నిధి వీధి విస్తరణ కోసం రంగంలోకి దూకాం. సోమవారం నాటికల్లా ఆ పని పూర్తయిపోయింది. కాని.... అంత సులువుగా కాలేదు.

ఆ శుక్రవారం ఉదయం - హైకోర్టు ఆర్డర్సు అందగానే దుకాణాల తొలగింపును మా ఇంజనీరింగ్ సిబ్బంది ప్రారంభించారు. నేను ఆలయం ముందు నిలబడి పర్యవేక్షిస్తున్నాను. అకస్మాత్తుగా ఒక పెద్ద గుంపు కేకలు, అరుపులతో సన్నిధివీధిలోకి దూసుకువచ్చింది. వస్తూనే నా మీద రాళ్ళ వర్షం కురిపించింది. వాళ్ళలో కొంతమంది ఆ షాపులు నడుపుకుంటున్న వాళ్ళు. వాళ్ళకి తోడు కొందరు స్థానికులు. ఆ దాడిలో నాతో వున్న సెక్యూరిటీ గార్డుకి, విజిలెన్స్ ఆఫీసర్‌కి దెబ్బలు తగిలాయి. ఒక సెక్యూరిటీ గార్డు గాల్లోకి కాల్పులు జరిపాడు. కాల్పుల భయానికి అంతా చెల్లాచెదరయ్యారు. షాపుల నిర్మూలన సజావుగా సాగిపోయింది. కానీ, ఈ సంఘటనతో నేను బ్రమాన్పడిపోయాను. నా కళ్ళ వెంబడి నీళ్ళు. ఈ దుర్ఘటనకి నేనే కారణమా? నేనే కారణమా? నేనే కారణమా?





దాంతో నేనే పూర్తి బాధ్యత తీసుకుని సన్నిధివీధి విస్తరణ తరువాత, ప్రతి షాపు యజమానికి అతని పాత షాపు క్రమంలోనే వెనక్కి జరిపి కొత్తగా నిర్మించిన షాపు వచ్చేలాగా, అవకతవకలకి అవకాశంలేని పారదర్శకత పాటిస్తూ, షాపుల కేటాయింపు జరిగేలా చూశాను. అలా కొత్తషాపులు కేటాయింపు జరిగేదాకా, వాళ్ళు అక్కడే తాత్కాలిక షెల్టర్లలో వ్యాపారం కొనసాగించుకోటానికి కూడా అనుమతించాను.

1982 మే-జూన్ కాలంలో అంటే నేను టిటిడి నుంచి బదిలీ అయ్యేనాటికి - భగవంతుడు నా స్వప్నం ఫలించేలా చేశాడు. నేను కలగన్న ఊహా చిత్రాల సంకలనం రూపుదాల్చింది. ఆధునిక క్యూ కాంప్లెక్స్, విశాలమైన కళ్యాణకట్ట, ఆస్థాన మంటపం, ఫైవ్‌స్టార్ హోటల్‌స్థాయి వంటశాల, క్యాంటీన్ కాంప్లెక్స్, మార్కెట్ కాంప్లెక్స్, అన్నదానం కాంప్లెక్స్‌ల నిర్మాణాలు పూర్తికావస్తున్నాయి. నేను వుండగానే ఒకేసారి అయిదువేలమంది భోజనం చేయగల విశాలమైన డైనింగ్ హాలు వినియోగంలోకి వచ్చింది. నిత్యాన్నదాన పథకానికి తొలిదాతగా ఆయిల్ మర్చంటు (అనంతపూర్) ఎల్. వి. రామయ్య 16 లక్షల రూపాయలు విరాళం ఇచ్చారు. (ఆ తరువాత ఆ పథకం విరాళాలు ఒక్క నెలలోనే కోటి రూపాయలు దాటాయి.) వేంకటేశ్వర గెస్టు హౌస్ పక్కన వరుసగా గెస్టు హౌసులు, పెద్ద క్యాంటీన్ (ఇప్పటి 'మయూరి') కాంప్లెక్స్‌ల కట్టడాలు ముమ్మరంగా సాగుతున్నాయి. బేది ఆంజనేయస్వామి ఆలయ పునర్నిర్మాణం, విగ్రహ ప్రతిష్ఠ పూర్తయ్యాయి. ఆ విగ్రహ ప్రతిష్ఠ సమయంలో ఆంజనేయస్వామికి నమస్కరించి వెనక్కి తిరిగి చూశాను - ఎదురుగా తిరుమల ఆలయ గోపురం - ఆ గోపురానికి, ఆంజనేయ ఆలయానికి మధ్య విమానాశ్రయంలో రన్‌వే లాంటి సువిశాలమైన వంద అడుగుల వెడల్పు సన్నిధి వీధి, అక్కడ ఏర్పాటు చేసిన స్వామి వారి ఊంజల్ ఉత్సవం. యాత్రికులు క్రిక్కిరిసి నడుస్తున్న ఒక్కప్పటి దృశ్యం - అక్కడ ఇప్పుడు లేదు. ఎంత నేత్రానందంగా వుంది! ఓహ్! ఆనందంతో నా శరీరం పులకించిపోయింది. ఎంత గొప్ప కార్యం జరిగింది!

(ఆ శక్తి నాదా?)



1982లో మాస్టర్‌ప్లాన్ అమలుచేశాక సన్నిధివీధి

* * *

ఇదంతా జరిగి పోయి కొన్ని నెలలు గడిచింది. నాకు బదిలీ అయింది. 1982 జూన్‌లో వెళ్ళిపోయే ప్రయత్నాల్లో వుండగా,

ఇదిగో తిరుమల నుంచి రెండు వర్గాల వాళ్ళు తిరుపతిలో నా బంగళా 'మీదకి' వచ్చారు. ఒకవర్గం సన్నిధివీధి షాపుల యజమానులు, రెండోవర్గం మాడ వీధుల్లోంచి కొత్త టౌన్‌షిప్‌కి తరలించబడిన స్థానికులు.

"... మీరు మా ఇళ్ళు కూలుస్తామన్నప్పుడూ, షాపులు తొలగిస్తామన్నప్పుడూ మాస్టర్ ప్లాను అమలు చేయడంలో మీ చిత్తశుద్ధినీ, నిజాయితీని గుర్తించలేకపోయాం. అనుమానం, భయం, ఆందోళన మమ్మల్ని వెంటాడాయి. మిమ్మల్ని ప్రతిఘటించాం. మిమ్మల్ని దూషించాం. మీమీద దాడిచేశాం... కాని, మీరు చెప్పిన మాస్టర్ ప్లాను యథాతథంగా అమలు జరిగి ఒక్కలోపం వుందని చెప్పడానికి కూడా మేం సాహసించలేనంతటి సంతృప్తిని మాకు మిగిల్చింది... మీ పట్ల ఆ రోజుల్లో దురుసుగా ప్రవర్తించినందుకు సిగ్గుపడుతున్నాం. బాధపడుతున్నాం. మీరు మమ్మల్ని వదిలి వెళ్ళిపోతున్నందుకు ఇప్పుడు..." అంటూ వాళ్ళు కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు. వారి ప్రేమ, ఆప్యాయత, వాళ్ళలో పెల్లుబుకుతున్న మానవతా భావాలు నన్ను కదిలించివేశాయి. నా కళ్ళ వెంట ఆనందబాష్పాలు...

సన్నిధివీధి దుకాణాల యజమానులంతా కలిసి నాకు ఒక బేది ఆంజనేయస్వామి పంచలోహ విగ్రహాన్ని, మాడవీధుల్లోని నిర్వాసితుల బృందం - శ్రీనివాసుడు, శ్రీదేవి, భూదేవిల పంచలోహ విగ్రహాల్ని బహూకరించారు.

నిజానికి, వాళ్ళ ప్రయోజనాల్ని కాపాడుతూ వచ్చిన శక్తి నాదికాదని నాకు తెలుసు. మరి ఎవరు - ఏ శక్తి వాళ్ళకి న్యాయం చేసింది? ఏ శక్తి మాస్టర్ ప్లాన్ అంత కొద్దికాలంలో అమలు జరిగేటట్టు చేసింది??

★ ★ ★



# 7

# 16 గంటల అజ్ఞానం

ఆ గదిలో చాలామందిమి వున్నాం. అయినా నిశ్శబ్దం తాండవిస్తోంది. మా కళ్ళ ముందు ఎనభయ్యోపడిలో వున్న ఒక మహాపండితుడు, తేజోమూర్తి, శ్రీనివాసుని భక్తుడు అయిన రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ కదల్లేని స్థితిలో మంచంమీద కూర్చుని - తన చేతిలోని తిరుమలేశుని ప్రసాదం వంకా, తన నియామకపత్రం వంకా ఉద్వేగం, సంభ్రమం నిండిన కళ్ళతో తదేకంగా చూస్తున్నారు. శర్మగారి కళ్ళ వెంబడి ధారాపాతంగా భక్తిబాష్పాలు కారుతున్నాయి. వణుకుతున్న కంఠంతో - అతి కష్టం మీద నోరు విప్పి, "ఇన్నాళ్ళకు నా మీద దయ గలిగిందా స్వామీ..." అంటూ తిరుమలేశుని తల్చుకుంటున్నారు... చూస్తున్న మా అందరికీ కళ్ళు చెమ్మగిల్లాయి. అప్పుడలా ఎందుకు జరిగిందో నాకు అర్థం కావటానికి మరో 16గంటలు పట్టింది.

★ ★ ★

తిరుమల శ్రీనివాసుని తన భక్తిపూర్వక అక్షరమాలలతో అనునిత్యం సేవించిన మహాభక్తుడిగా తాళ్ళపాక అన్నమాచార్య గురించి తెలీని ఆంధ్రులు వుండరు. ఆయన భక్తి భావావేశంతో రాసిన కీర్తనలు 30వేలకు పైగా వున్నాయి. అన్నమయ్య భక్తితో సాగించిన సాహితీ యజ్ఞంలో విలువల్ని, ఆరాధనని గుర్తించిన అప్పటి పాలకులు, ఆ కీర్తనలన్నింటినీ తామ్ర పత్రాలమీద చెక్కించారు. వాటిలో కొన్నింటికి గోసాయిల ద్వారా గ్రామాల్లో ప్రచారం లభించింది. ఆ రకంగా ప్రచారంలోకి రావటం వల్లే ఈనాటికీ ప్రతి తెలుగుతల్లి నోట వినిపిస్తూంటుందీ జోలపాట - "జో అచ్యుతానంద, జోజో ముకుంద.."



అన్నమయ్య సంకీర్తనలు బయటపడ్డ భాండాగారం

అలా ప్రచారానికి వినియోగించిన తామ్ర పత్రాలని ఆలయంలోని గోడలో నిక్షిప్తం చేశారు - ఎవరు చేశారో, ఎప్పుడు చేశారో తెలీదు. ఆ సంకీర్తనల కట్ట 20వ శతాబ్దం మధ్యకాలంలో (మహంతుల యాజమాన్యంలో ఆలయ నిర్వహణ జరుగుతున్న కాలంలో) బయట పడింది. అలా బయటపడిన వాటిల్లో 11వేలు మాత్రమే మనకు లభ్యమయ్యాయి. ఆ కీర్తనలకు వ్రాతప్రతులు తయారుచేయడంలో వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ తదితరులు గణనీయమైన కృషి చేశారని చెబుతుంటారు.

నాకు ముందు టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పనిచేసిన శ్రీ రాజగోపాలరాజు, దాదాపు మూడు దశాబ్దాల పాటు టిటిడికి అనేక స్థాయిలలో సేవలందించిన శ్రీ చెలికాని అన్నారావుల సారధ్యంలో ఈ అన్నమయ్య కీర్తనల ప్రచురణ ఆరంభమైంది. టిటిడి విద్యాసంస్థలలోని ఒక పండితుడు రామసుబ్బ శర్మకు - ఈ సంకలనాలను తయారుచేసి, ముద్రింపచేసే బాధ్యతను అప్పగించారు. అప్పట్లో టిటిడి సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా వున్న నేదునూరి కృష్ణమూర్తి సారధ్యంలో - కళాశాల విద్యార్థులను - ఈ సంకీర్తనలకు బాణీలు కట్టేందుకు ప్రోత్సహించడం కోసం వాళ్ళకు ఆర్థిక సహాయాన్ని కూడా శ్రీ రాజగోపాలరాజు ఏర్పాటు చేశారు. అలా నేదునూరి గురుత్వంలో తయారైన వారే ఇప్పటి ప్రముఖ గాయకులలో ఒకరైన శ్రీమతి శోభారాజు, శ్రీ బాలకృష్ణ ప్రసాద్. ఆ రకంగా అన్నమయ్య సంకీర్తనల పరిరక్షణకు, ప్రచారానికి పునాదులు వేసిన ఘనత వాళ్ళందరికీ దక్కుతుంది.

1978లో నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా బాధ్యతలు స్వీకరించిన రెండు మాసాల తరువాత ఒకరోజు రామసుబ్బశర్మ గారిని పిలిపించి, ఆయన విభాగంలో జరుగుతున్న పనుల గురించి తెలుసుకున్నాను. ఆయన వివరించిన దాన్ని బట్టి ఆ రాగిరేకులలోని సంకీర్తనలకు తెలుగు వ్రాతప్రతులయితే తయారయ్యాయి కానీ, తామ్ర పత్రాల్ని పరిరక్షించే కార్యక్రమం, వేలాది కీర్తనలకు ఎడిటింగ్, ప్రింటింగ్ ఇంకా జరగాల్సి వుంది. అలాగే, ఆ సంకీర్తనలలోని అనేక మాటలకు





(ఆ మాండలీకాల్లో కాలానుగుణంగా వచ్చిన మార్పులవల్ల) అర్థాలు రాయాల్సి వుంది. అది ఒక బృహత్ కార్యక్రమం. ఎన్ని దశాబ్దాలయినా పట్టొచ్చు.

ఎందుకంటే - అన్నమయ్య సంకీర్తనలు జన బాహుళ్యంలోకి చొచ్చుకుపోయాయి. ఆ సాహిత్యంలో వుండే సంస్కృత, తెలుగు భాషా ప్రయోగాల మూలంగా, ఆ కీర్తనలు పండితుల్ని, పామరుల్ని సయితం ఆకర్షించాయి. ఆ కీర్తనల్లో శాస్త్రీయ ధోరణి వుంది. జానపద ప్రయోగం వుంది. లాలిపాటలుగా చలామణి అయ్యే లాలిత్యం వుంది. శృంగార కళ వుంది. ప్రేమభావం వుంది. భజన లక్షణం వుంది. పొంగిపొర్లే భగవదారాధన వుంది. నిజానికి "మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమి యొకటే, ఛండాలుడుండేటి సరిభూమి ఒకటే..." అంటూ సమసమాజ తత్త్వాన్ని ఎన్నో వందల సంవత్సరాల క్రితం ప్రచారంలోకి తీసుకువచ్చినవాడు కూడా అన్నమయ్యే... అందుకే అన్నమయ్య అన్ని వయస్సులవారిని, అన్ని వర్గాల వారినీ కూడా ఈనాటికీ ఆకర్షించగలుగుతున్నాడు. - అయితే అన్ని కీర్తనలలోని లక్షణం - భగవంతుని లీలల్ని వర్ణించడం, భగవదారాధనా మాధుర్యాన్ని మనకి పంచి పెట్టడం. ఎంత లోతైన, విశాలమైన భక్తి వేదాంత తత్త్వాన్ని అన్నమయ్య తన సాహిత్యంలో చిందించారంటే, ఈనాటికీ ఆ సాహిత్యంపైన పరిశోధనలు కొనసాగుతూనే వున్నాయి - వుంటాయి.

కాని, త్యాగరాజు కీర్తనల మాదిరిగా అన్నయమ్య కీర్తనలు గురు-శిష్య పరంపర ద్వారా ప్రచారంలో కొనసాగుతున్నవి కావు. అందువల్ల ఈ కీర్తనల రాగిరేకులు బయటపడ్డాక తెలిసిన విషయం ఏమంటే, ప్రతి సంకీర్తనకూ రాగం మాత్రమే వాటిల్లో ఉదహరించబడింది. అంటే, ఏ సంకీర్తనను ఏ రాగంలో అన్నమయ్య పాడుకున్నారో తెలిసింది కానీ, వాటికి స్వరం తెలీదు. ప్రతి కీర్తనకి 'శ్రీ వెంకటేశాయ' మకుటం మాత్రం వుంది.

ఈ కార్యక్రమం గురించి అధ్యయనం చేస్తున్న కొద్దీ నాలో ఆసక్తి పెరిగింది. "ఇంతటి సాహితీ విలువలు, భక్తి ప్రమాణాలు కలిగిన సంకీర్తనల్ని ముద్రించి వూరుకుంటే సరిపోదు. వీటిని ప్రచారంలోకి తీసుకురావాలి. అందరూ విని ఆనందించాలి. ప్రతి ఇంటా ప్రతి నోటా ఈ కీర్తనల మాధుర్యం పొంగిపొర్లాలి..." అన్న తహతహ నాలో పెరిగిపోయింది. ఫలితంగా ఈ విలువైన సాహిత్య సంపదను పరిరక్షించేలా - అదేసమయంలో ప్రతి ఇంటా ప్రతిధ్వనించేలా ఈ సంకీర్తనలకి ప్రాచుర్యం కూడా కల్పించే లక్ష్యంతో అన్నమాచార్య ప్రాజెక్టుని ఏర్పాటు చేయటం జరిగింది. అలా ఏర్పాటైన ప్రాజెక్టుకి స్పెషల్ ఆఫీసర్‌గా (తరవాత కాలంలో డైరక్టరుగా) - టిటిడి కాలేజీలో అధ్యాపకుడైన కామిశెట్టి శ్రీనివాసుల్ని నియమించాం. సాహితీ సంకలనాలు తయారు చేయటం, ముద్రింపజేయటం వంటి బాధ్యత ప్రొఫెసర్ సుబ్బరాయశర్మది కాగా, ఆ సంకీర్తనలకి సంగీతం జోడించి, వాటిని ప్రచారంలోకి తీసుకురావటం కామిశెట్టి శ్రీనివాసులు బాధ్యత.

అన్నమయ్య కీర్తనలు లిఖించి వున్న తామ్రపత్రాల్ని పరిరక్షించడం దగ్గర్నుంచి, అన్ని సంకీర్తనలను ప్రచురింపజేయటం, వాటికి ప్రముఖ సంగీత విద్వాంసుల సహాయంతో ఆయా రాగాలకు తగినట్లుగా స్వరస్థానాలను నిర్ణయింపజేయటం, ప్రముఖ గాయకులతో గానం చేయించటం, ఒక ఔత్సాహిక గాయక బృందాన్ని ఏర్పాటు చేసి - వారి ద్వారా ఊరూరా ఈ కీర్తనలని ప్రచారం చేయించటం, ఆడియో-వీడియో క్యాసెట్లు తయారు చేయించటం, భజన కీర్తనలు ఆధారంగా చెక్కభజనలు, కోలాటాలు నిర్వహించటంలో భజన బృందాలకు శిక్షణ నిప్పించటం, ఈ బృందాల్ని ఏటా మెట్లోత్సవానికి ఆహ్వానించటం, విద్యార్థులకు పోటీలు నిర్వహించటం, ఆ కీర్తనలకు నృత్యరూపాల్ని ప్రోత్సహించటం వగయిరా కార్యక్రమాలతోపాటు తాళ్ళపాక గ్రామాన్ని టిటిడి దత్తత చేసుకొనటం వరకూ - ఈ ప్రాజెక్టు లక్ష్యాలలో వున్నాయి. ప్రాజెక్టు తరపున విశ్వ విద్యాలయాల్లో - అన్నమయ్యపై పరిశోధనలు కూడా ప్రోత్సహించే పని మొదలు పెట్టాం. అలా మొదటిదశలో డాక్టరేట్ పొందినవాళ్ళు శ్రీ మేడసాని మోహన్, శ్రీ పి. ఎల్. ఎన్. ప్రసాద్. (ఆ ప్రాజెక్టులో భాగంగానే శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి, "బాలాజీ పంచరత్నమాల" గానం చేశారు.)

కుమారి శోభారాజు, బాలకృష్ణ ప్రసాద్‌లతో ఒక గాయక బృందం ఏర్పాటైంది. వైద్యనాథన్ తదితర వాద్య కళాకారులతో ఈ బృందం - (కామిశెట్టి శ్రీనివాసులు వ్యాఖ్యానంతో) అన్నమయ్య కీర్తనలకు వూరూరా సంగీత ప్రదర్శనలు ఇవ్వటం ఆరంభమైంది. ప్రముఖ సంగీత విద్వాంసులు నిర్ణయించిన విధంగా ఆయా రాగాలకు స్వరాలు కూర్చి సాధన చేస్తూ ఈ బృందం ఇస్తున్న ప్రదర్శనలకు అనూహ్యమైన స్పందన వచ్చింది. అన్నీ భక్తిగీతాలే - అయినా జనం విపరీతంగా ఆదరిస్తున్నారు... నిజానికి ఈ సంగీత ప్రచార కార్యక్రమం ఆరంభంలో నాకు పెద్ద సంకటం ఎదురైంది. శాస్త్రీయ సంగీత విద్వాంసులంతా ఈ కీర్తనల్ని కర్నాటక శాస్త్రీయ సంగీతంలోనే పాడాలంటారు. అలా చేస్తే, జనసామాన్యంలో వీటికి ప్రచారం లభించదేమో - అన్నది నా బెంగ. అందుకే రాగాన్ని, స్వరాన్ని శాస్త్రీయంగా వుంచుతూ, ఆలాపన తగ్గించి, పామర జనరంజకంగా వుండేలా ఈ కీర్తనల్ని గానం చేయాలని సూచించాను. (అలా శాస్త్రీయ, లలిత సంగీతాల మేళవింపుతో తయారైన అన్నమయ్య కీర్తనలే ఇప్పటికీ టిటిడి వారి ఆడియో క్యాసెట్ల రూపంలో ప్రచారంలో వున్నాయి.) ప్రతి నెలా కొన్ని కొత్త సంకీర్తనల్ని ఈ బృందం విధిగా సాధన చేసి తీరాలనీ, అలా సాధన చేసినవాటిని బయట కార్యక్రమాల్లో పాడేముందు ఒకసారి నా బంగళాలో సమీక్షించుకోవాలనీ నిర్ణయించాం. - అలా నెలకోసారి రాత్రి తొమ్మిది గంటల తరువాత, ఈ అన్నమాచార్య ప్రాజెక్టు గాయక బృందంతో నా సంగీత సమీక్షలు జరుగుతుండేవి.

అలాంటి ఒకరాత్రి మా సంగీత సమీక్ష చర్యలో కామిశెట్టి శ్రీనివాసులు లేవనెత్తిన అంశం ఆ రాత్రంతా నాలో సుడిగుండాలు సృష్టించింది. తెల్లవారే లోపు ఒక మహోన్నతమైన పరిణామానికి దారితీసింది...

* * *





ఆ రాత్రి మా సంగీత సమీక్ష ముగిశాక, కామిశెట్టి శ్రీనివాసులతో మాటల్లో - నేను మర్నాడు బెంగుళూరు వెళ్తున్నానని చెప్పాను. అది వింటూనే శ్రీనివాసులు - "సర్, మీరేమీ అనుకోకపోతే ఒక చిన్నమాట చెబుతాను, బెంగుళూరులో రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారు వుంటున్నారు. వారిని మీరొకసారి మర్యాదపూర్వకంగా కలిసి పలకరిస్తే బాగుంటుందేమో! ఎందుకంటే ఇవాళ మీరు ఇంతటి బృహత్ కార్యక్రమం (అన్నమాచార్య ప్రాజెక్టు) నిర్వహించటానికి మూలకారకుల్లో ఆయన ఒకరు. రాగిరేకుల మీద లభ్యమైన కీర్తనలను వ్రాత ప్రతుల్లోకి మార్చటంలోనూ, వాటి తెలుగు నుడికారాన్ని (మాండలీకాన్ని) స్పష్టంగా గుర్తించి, ఇప్పటి తెలుగులోకి అన్వయించడంలోనూ, ఆ కీర్తనల్లోని వైశిష్ట్యాన్ని అధ్యయనం చేసి, వెలుగులోకి తీసుకురావడంలోనూ... ఇలా అనేక సంవత్సరాలపాటు అన్నమాచార్యుని కీర్తనలమీద అవిశ్రాంతంగా కృషిచేసిన మహాపురుషుల్లో అనంతకృష్ణశర్మగారు ఒకరు. వారితోపాటుగా ఈ మహత్కార్యాన్ని సాగించిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారికి వారి సహాయకులకు కూడా ఇతోధికంగా గౌరవ పురస్కారాలు లభించాయి. ఎటువంటి గుర్తింపుకీ నోచుకోకుండా మిగిలిపోయిన మహనీయుడు రాళ్ళపల్లి వారు..." అంటూ చెప్పుకుపోయాడు. వీలైతే కలవటానికి ప్రయత్నిస్తానని నేను చెప్పటంతో, రాళ్ళపల్లివారి అడ్రసు కూడా ఇచ్చి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయిందగ్గర్నుంచీ నాకు మనసు తొలిచేయడం ఆరంభమైంది. అంతకుముందెన్నడూ నేను రాళ్ళపల్లివారిని కలుసుకోలేదు. వారి పాండిత్య ప్రకర్ష గురించి అసలు తెలీదు. కాబట్టి నాకుగా నేను వారి గురించి ఎలాంటి అంచనా వేయలేను. కానీ... మనసులో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి. ఇంతటి ప్రాజెక్టు ఇవ్వాళ అవతరించడానికి ఆద్యులలో రాళ్ళపల్లివారు ఒకరు. శ్రీ వేంకటేశ్వరుని కీర్తించే అన్నమయ్య భక్తి సాహిత్యం వెలుగులోకి రావటానికి కారకులలో రాళ్ళపల్లి కూడా వున్నారు. ఇవ్వాళ సులువుగా ఆ సాహిత్యం మనకర్థమయ్యేలా రూపం దాల్చడానికి అవిశ్రాంతంగా కృషి చేసిన వ్యక్తి రాళ్ళపల్లి. అయినా - ఆయన సమకాలికులకు, ఆ బృహత్ కార్యక్రమంలో పాలుపంచుకున్న మిగతావారికి లభించిన గుర్తింపు ఆయనకు లభించలేదు!.. ఇదే ఆలోచనతో నిద్రపట్టలేదు... రాళ్ళపల్లి వారి విషయంలో ఎక్కడో ఏదో లోపం జరిగిందన్న అపరాధ భావన - అంతరాంతరాళాల్లో నన్ను తొలిచేస్తోంది. ఈ లోపం ఎలా జరిగిందీ అన్న ప్రశ్న కన్నా దీన్ని ఎలా సవరించాలీ - అన్న వేదన నా మస్తిష్కాన్ని మథించేస్తోంది... అలా ఎంత సమయం గడిచిందో తెలీదు.

ఉన్నట్టుండి అర్ధరాత్రి ఒంటిగంట ప్రాంతంలో ఏదో ఒక దివ్యశక్తి నన్ను ఆవహించినంత ఆవేశం కలిగింది. అప్పటికప్పుడు డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి ఫోన్ చేసి, నిద్రలేపి చెప్పాను - "చూడయ్యా, నేను తెల్లవారుఝామున ఆరు గంటలకి బెంగుళూరు బయల్దేరాలి. ఆలోగా, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారిని టిటిడి ఆస్థాన విద్వాంసులుగా నియమిస్తున్నట్లు ఒక నియామక పత్రం,

శ్రీవారి గోల్డ్ డాలరు, ఒక శాలువా, శ్రీవారి ప్రసాదం లడ్డు, అక్షింతలూ వగయిరా సరంజామా అంతా నా బంగళాకు చేరిపోవాలి..."

మా డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ నిర్ఘాంతపోయాడు అంతా వింటూనే. (ఎందుకంటే ఆస్థాన విద్వాన్‌గా ఎవర్ని నియమించాలన్నా, టిటిడి బోర్డు ఏటా ఒక నిపుణుల కమిటీని నియమించాలి. ఆ కమిటీ వారు ఏయే రంగాలలో ఆస్థాన్ విద్వాంసులు ఇంకా నియమింపబడలేదో చూసి, ఆ రంగాలలో నిష్ణాతుల పేర్లు పరిశీలించి పేర్లు సిఫార్సు చేస్తే, ఆ సిఫార్సుని బోర్డు అంగీకరించి, ఆయా నిష్ణాతులకు పంపితే, వారు అంగీకారం తెలిపితే - అప్పుడు వారికి తిరుమల బ్రహ్మోత్సవాల సదస్సులో మర్యాదలు చేసి, ఆస్థాన్ విద్వాంసులుగా నియమిస్తున్నట్లు ప్రకటించాలి... ఇది నిర్ణీత విధానం.) అతను ఈ విధి-విధానం గురించి ఏదో మాట్లాడబోతే, నేనే వారించాను. "అదంతా అలా వుంచవయ్యా, తెల్లవారేటప్పటికి నేను చెప్పిన విధంగా జరిగిపోవాలి..." అంటూ ఆదేశించాను. అప్పటికి నా మనసు కుదుటపడింది. మిగతా రాత్రి నిద్ర పట్టింది...

టిటిడి ఉద్యోగుల సమర్థత కారణంగా ఉదయం నేను బయల్దేరే సమయానికి అన్నీ రెడీ అయిపోయాయి. బెంగుళూరు వెళ్తూనే ముందుగా శర్మగారింటికి కబురుచేసి, ఆ ప్రకారంగా ఆ మధ్యాహ్నం మూడు గంటలకి నేనూ, నా భార్య గోపిక కలిసి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారింటికి ఈ గౌరవ పురస్కార సరంజామాతో వెళ్ళాం. వెళ్ళేసరికి, ఆ ఇంటి వాతావరణంలో చాలామంది గుమిగూడి వున్నారు. వాళ్ళ ముఖాల్లో దిగులు తొంగిచూస్తోంది. "ఏమిటి సంగతి" అని అడిగితే, ఎవరో చెప్పారు - శర్మగారికి బాగుండటం లేదని. మేం లోపలికి వెళ్ళాం.

ఆ గదిలో నిశ్శబ్దం తాండవిస్తోంది. శర్మగారు ఒక వారంరోజులుగా స్పృహలో లేరుట. ఆయన కొడుకు కాబోలు నన్ను దగ్గరికి తీసుకువెళ్ళి శర్మగారి చెవిలో పిలిచాడు. ఆయన పలకలేదు. మళ్ళీ నాలుగైదు సార్లు గట్టిగా పిలుస్తూ చెబుతున్నాడు - "మీ కోసం తిరుమల నుంచి ప్రసాదం వచ్చింది .... 'ప్రసాదం' వచ్చింది...." ఈసారి కొద్దిగా కదలిక వచ్చింది వారిలో. అతికష్టంమీద ఆయన కళ్ళు తెరిచారు... అర్ధనిమీలిత నేత్రాలతో ఆ విద్వాంసుడు నావంక చూస్తున్నారు. ఆయన కొడుకు నేనెవరో చెబుతున్నారు. ఆయనకి ఏం అర్థమయిందో నాకు తెలీదు. నేను మాత్రం ఏదో అనిర్వచనీయమైన అనుభూతికి లోనవుతూ, శ్రద్ధాప్రపత్తులతో ఆ డాలరు హారాన్ని వారి మెడలో వేశాను. శాలువా కప్పాను. ఆస్థాన్ విద్వాంసుడి నియామక పత్రాన్ని, శ్రీవారి ప్రసాదాన్ని వారి చేతుల్లో పెట్టి నమస్కరించాను. కొడుకులు వారికి కొద్దిగా మెడ ఎత్తి, నడుము క్రింద దిండ్లు అమర్చి, వెనక్కివాలి కూర్చున్న స్థితిలో కూర్చోబెట్టే ప్రయత్నం చేశారు. అప్పుడు గమనించాను - ఆయన కళ్ళు తెరిచి చూస్తున్నారు. కాని ఆ దృష్టి నామీద లేదు. తన చేతిలోని శ్రీవారి ప్రసాదం మీద, ఆ నియామక పత్రం మీద వుంది. ఆయన కంటి వెంట బాష్పాలు ఏకధారగా కారుతున్నాయి. పెదిమలు వణుకుతున్నాయి. క్రమంగా నోరు పెగిలింది. రుద్ధ కంఠంతో ఏమేమో అంటున్నారు. అర్థం కావటం





లేదు - చెవి దగ్గరగా పెట్టి వింటున్నారు కొడుకులు. చివరికి, భక్తి పారవశ్యంతో వారు అంటుంటే మాకు వినబడిన మాటలు - "ఇన్నాళ్ళకు నామీద దయకలిగిందా స్వామీ!.."

ఆ ఆనందానుభూతిలో వారిని ఇంక ఇబ్బంది పెట్టకూడదనుకున్నాం. మరో పదినిమిషాల తరువాత నేనూ, గోపిక మా పని మీద వెళ్ళిపోయాం.

మరో 16 గంటల తరువాత - ఆ మర్నాడు ఉదయం నేను, గోపిక తిరుపతి బయల్దేరే హడావుడిలో వుండగా, మా బెంగుళూరు గెస్ట్‌హవుస్ మేనేజర్ న్యూస్‌పేపర్ తీసుకువచ్చి చూపించారు. మొదటి పేజీలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారి ఫొటో ప్రచురితమైంది. ఆ వార్త మా పలకరింపు గురించి కాదు. వారి ప్రాణవాయువులు అనంత విశ్వంలో లీనమైపోవటం గురించి. ఆ ముందురోజు మేం వారిని కలిసి వెళ్ళిన 10-15 నిమిషాలకే తిరుపతి ప్రసాదం చేతిలో వుంచుకునే వారు స్వర్గస్థులయ్యారు!!

ఏమిటిది? ఎందుకిలా జరిగింది? జరిగిందంతా యాదృచ్ఛికమా! దైవేచ్ఛా!

- ఆ తరువాత టిటిడి బోర్డు మీటింగ్‌లో ఈ వివాదాస్పద అంశాన్ని (రాళ్ళపల్లి వారిని ఆస్థాన్ విద్వాంసులుగా నియమిస్తూ నేను ఉత్తర్వులు అందించిన తీరు) బోర్డు ఆమోదానికై ప్రవేశపెట్టాను. టిటిడి బోర్డుకి మాత్రమే నిర్ణయాధికారం వుండే ఇలాంటి సున్నితమైన అంశాల విషయంలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి ఎలాంటి విచక్షణాధికారాలు లేవు. ఒకవేళ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ తనకు అలాంటి విచక్షణాధికారాలు వున్నట్లుగా ప్రవర్తిస్తే, ఆ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ సర్వీసులను తక్షణం టిటిడి నుంచి ఉపసంహరించవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వానికి సిఫార్సు చేసే అధికారం అప్పట్లో బోర్డుకి వుంది... ఈ సంగతి నాకు తెలుసు. కాని జరిగిపోయిందానికి ఏమీ చెయ్యలేను కనుక బోర్డు చేసే ఎలాంటి తీర్మానానికైనా కట్టుబడి వుండటానికి మానసికంగా సిద్ధపడిపోయాను.

అయితే, నా వివరణ అంతా విన్నాక, నా ఈ చర్య ఎటువంటి వాదోపవాదాలు లేకుండా, చైర్మన్ బి. నాగిరెడ్డి గారి ఆధ్వర్యంలో ఏకగ్రీవ ఆమోదాన్ని పొందింది. అప్పుడు నేను, నాగిరెడ్డిగారిని అడిగాను. "ఒకవేళ రాళ్ళపల్లి వారు ఇంకా జీవించి వుంటే ఇప్పుడు నేను చేసిన పనికి బోర్డు ఎలా ప్రతిస్పందించి వుండేది?"

విజయా ఫిలింస్ పతాకం మీద అనేకరకాల కథలకు సినిమా రూపాన్ని కలిగించిన నిర్మాత అయిన నాగిరెడ్డి - సినిమాలాంటి ఈ కథ అంతా మరోసారి నెమరు వేసుకున్నట్లున్నారు. కొద్ది క్షణాలపాటు మాట్లాడలేదు. తరువాత సాలోచనగా తలపంకిస్తూ, "చూడండి ప్రసాద్‌గారూ, ఏది ఎలా జరగాల్సివుందో అలా జరిగిందని సరిపెట్టుకోవడమే తప్ప, ఇప్పుడిక అలాంటి ప్రశ్నలు మీరు అడక్కూడదు, జవాబు ఆశించకూడదు. సరేనా... ?"

అంటే, ఇది ఇలాగే జరగాలని రాసిపెట్టి వుందనుకోవాలా?

★ ★ ★

(ఆలయంలో లభించిన రాగిరేకులలోని సాహిత్యాన్ని పఠనయోగ్యమైన తెలుగులో పరిష్కరించే బృహత్ కార్యక్రమాన్ని శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మకు 1951లో దేవస్థానం వారు అప్పగించారు. అప్పటికి ఆరు సంపుటాలు ముద్రించటం జరిగింది. నాటి నుంచి అన్నమయ్య సాహిత్యంలో మిళితమై వున్న కన్నడ, తమిళ, సంస్కృత శబ్దాలను సమీక్షించడం, సందిగ్ధ పదాలకు తెలుగు, తమిళ, కన్నడ నిఘంటువుల ఆధారంగా ప్రకరణార్థాలను గుర్తించి, ఆయా భాషల మాండలీకాల్లో వచ్చిన మార్పులకు తగినట్లుగా ఆయా పదాల అర్థాలను వివరించటం, ఆ సాహిత్యంలో ఇమిడివున్న విశేష కావ్య ప్రయోగాలను చర్చించడం, అలా 20 సంపుటాలను పరిష్కరించటం, రెండు సంపుటాల్లోని (108) కీర్తనలకు స్వరాలు కూర్చటం, సంగీత ప్రయోక్తలకు ఉపయుక్తంగా వుండేలా అన్నమయ్య సంకీర్తనలలోని 31 రాగాల లక్షణాలను వివరించి, వాటి విశిష్టతలను చర్చించటం వగయిరా జటిలమైన బాధ్యతలను - ఈ బృహత్ సాహితీ యజ్ఞంలో భాగంగా - రెండు దశాబ్దాలకు పైగా అవిశ్రాంతంగా నిర్వర్తించిన సంగీత సాహిత్య పరిపూర్ణుడు శ్రీ అనంత కృష్ణ శర్మ (1893-1979).




తిరుమల మూర్తులు-3

### కొలువు శ్రీనివాసుడు

గర్భ గుడిలో వుండే మరో శ్రీనివాసుడి చిన్న విగ్రహాన్ని 'బలిబేరం' (కొలువు శ్రీనివాసుడు) అంటారు. మూలవిరాట్‌కి తోమాలసేవ జరిగాక, ఈ 'బలిబేరం' విగ్రహాన్ని ఆస్థానమంటపంలోకి తీసుకువచ్చి, అక్కడ రోజువారీ పంచాంగ శ్రవణం, డిటం (రేషన్) పంపిణీ ఏర్పాట్లు చేస్తారు. ముందురోజు వచ్చిన హుండీ బహుమానాలను కూడా ఈ కొలువు శ్రీనివాసుడికే లెక్కలు చెప్పి అప్పగిస్తారు.






# 8

# శ్రీనివాసుడు నిర్దయుడా?

**"ఎంత** నిర్దయుడివి? నీ దర్శనం కోరి వస్తున్న నా కుటుంబాన్ని ఇలా అర్ధరాత్రివేళ ఈ కొండల మధ్య ఘాట్‌రోడ్డులో నిర్దాక్షిణ్యంగా వదిలేస్తావా? ఛీ... నా జీవితకాలంలో మళ్ళీ ఎన్నడూ నీ దర్శనం చేసుకోవాలని కోరుకోను. చాలు. ఈ అనుభవం చాలు..." అని తిరుమల వేంకటేశ్వరుణ్ణి కసితీరా తిట్టుకుంటున్న ఆ పెద్దమనిషి - ఒక అరగంట తరువాత ఎదురైన అనుభవంతో చలించిపోయాడు. పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. 'గోవింద నామ స్మరణ ఒక్కటే తన జీవితానికి పరమావధి' అంటూ పదే పదే లెంపలు వేసుకున్నాడు!!

* * *

**నేను** టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్నంతకాలం (1978-82), శ్రీవారి ఆలయంలో జరిగే అన్ని సేవల విషయంలోనూ, యాత్రికులకు సదుపాయాల విషయంలోనూ, సేవల మెరుగుదల విషయంలోనూ "ఇంకా ఏమైనా చేయగలమా" అని తాపత్రయపడుతుండేవాడిని. ఆ కారణంగానే వీలైనన్ని ఎక్కువసార్లు సుప్రభాతం నుంచి రాత్రి ఏకాంతసేవ దాకా అన్ని సేవలకూ హాజరవ్వాలని ప్రయత్నం చేస్తుండేవాడిని. ముఖ్యంగా శుక్రవారం అభిషేకానికి ఎట్టి పరిస్థితుల్లోనూ నేను హాజరవుతుండేవాడిని.

అయితే ఈ సేవ తెల్లవారుఝామున 4. 30 గంటలకే (సేవలో పాల్గొనే భక్తులతో) ఊరేగింపుగా ఆరంభమవుతుంది. అందుకని ప్రతి గురువారం మధ్యాహ్నమే తిరుపతిలో బయల్దేరి, దారిలో ఆకస్మిక తనిఖీలు చేసుకుంటూ, నాలుగ్గంటలకల్లా కొండకి చేరుకోవటం, అక్కడ మళ్ళీ అధికారులతో కలిసి సంయుక్తంగా తనిఖీలు నిర్వహించటం చేసేవాడిని. అలా చివరికి ఆలయం చేరుకుని, రాత్రి 9. 30 గంటలదాకా వుండి, పూలంగి సేవ దర్శనం చేసుకున్నాక గెస్ట్‌హవుస్‌కి చేరుకోవడం, తెల్లవారుఝామున 4. 30కి అభిషేక సేవకి వెళ్ళటం రివాజయిపోయింది.

1980లో ఒక గురువారంనాడు మాత్రం నా కార్యక్రమం అంతా తారుమారయిపోయింది. తిరుపతిలోనే ఆఫీసుపని వత్తిడి కారణంగా రాత్రి 8 గంటలయినా నేను తిరుమలకు బయల్దేరటం కుదరలేదు. ఇంటిదగ్గరే భోజనం చేసి, 9. 30 కల్లా బయల్దేరాలనుకున్నాను. ఆ టైమ్ కూడా అయింది. అయినా ఇంకా ఇంటిదగ్గర క్యాంప్ ఆఫీసులోనే కూర్చుని, ఏవో ఫోన్ కాల్స్ వస్తే మాట్లాడుతూ వుండిపోయాను. నా పర్సనల్ అసిస్టెంట్, డ్రైవర్ నా కోసం నిరీక్షిస్తున్నారు. పది దాటింది. నా భార్య గోపిక వచ్చి, "ఇంకా బయల్దేరలేదేంటి?" అని అడిగింది. సాధారణంగా ప్రతి శుక్రవారం అభిషేకానికి నాతోపాటు వచ్చే అలవాటు ఆమెకుంది. ఆ రోజు మాత్రం ఇంట్లో అతిధులుండిపోయారని రానంది. కాని, నేనెలాగూ లేటయిపోవడం గమనించాక, "పోనీ, రాత్రికి ఇక్కడే వుండిపోయి, తెల్లవారుఝామున 3.30కి బయల్దేరండి. నేనూ రావటానికి ప్రయత్నిస్తాను" అంటూ ఒక సూచన కూడా ఇచ్చేసింది. నాకు నచ్చలేదు. "రాత్రికి ఇక్కడ పడుకునే ప్రశ్నేలేదు. నేనీక్షణమే బయల్దేరుతున్నాను" అనేశాను... అన్నాను కానీ మళ్ళీ ఎందుకో బద్ధకించాను. ఒక 20-30 నిమిషాలు ఏవో ఫైళ్ళు - కాగితాలు చూస్తున్నాను. ఈలోపల గోపిక మళ్ళీ రెండు మూడుసార్లు వచ్చి నా వ్యవహారం చూసి, పెదిమలు విరుచుకుంటూ వెళ్ళిపోయింది...

అలా 10.30 అయిందేమో... ఒక్కసారిగా చూస్తున్న ఫైలుని అర్ధాంతరంగా మూసేశాను. ఛివాల్న కుర్చీలోంచి లేచిపోయాను. ఎవరో వెంటబడి తరుముతున్నారా - అన్నంత వేగంగా వెళ్ళి కారులో కూర్చున్నాను. డ్రైవర్‌ని "పోనీవయ్యా" అన్నాను. మరో పది నిమిషాల్లో ఘాట్‌రోడ్ ఆరంభంలోని అలిపిరి టోల్‌గేట్ చేరుకున్నాం. (భద్రతా కారణాల వల్ల అప్పట్లో 10 గంటలకే టోల్‌గేట్ మూసేసేవాళ్ళు.) నాకోసం టోల్‌గేట్ తెరిచారు. ఆరోజు తిరుమలకి ట్రాఫిక్ చాలా ఎక్కువగా వుందన్నారు టోల్‌గేట్ సిబ్బంది. రద్దీ





ఎక్కువుందంటే, దర్శనానికి నిరీక్షణ కనీసం 7-8 గంటలు పట్టే పరిస్థితన్నమాట...

అర్ధరాత్రి ఘాట్‌రోడ్డులో కారు ప్రయాణం. చల్లటి గాలికి మామూలుగా అయితే ఒక కునుకు పట్టేదే. కాని ఆ రోజు నిద్ర రావటం లేదు. "కార్యక్రమం అంతా ఇలా లేటయిపోయిందేమిటి?" అన్న చిరాకుకి తోడు త్వరగా తిరుమలకి చేరుకోవాలన్న ఆదుర్దా వెంటాడుతోంది. నిజానికి తెల్లవారుఝామున నాలుగు గంటలలోపల ఎప్పుడు చేరినా ఒకటే, అయినా ఏదో తెలీని ఆదుర్దా - త్వరగా వెళ్ళాలనిపించేలా చేస్తోంది. "కొంచెం త్వరగా వెళ్దాం పద" అంటూ డ్రైవర్‌ని హెచ్చరించాను. అసలు ఘాట్‌రోడ్డులో - ఎంత అలవాటున్న డ్రైవరయినా అందులోనూ రాత్రిపూట - వేగంగా వెళ్ళటానికి సాహసించరు. అలాగే డ్రైవర్ ఏదో అవస్థపడుతున్నాడు.

ఆ ఘాట్‌రోడ్డులో అన్ని మలుపులు తిరిగేశాం. ఇంకొక్క కిలోమీటరు ప్రయాణిస్తే తిరుమల చేరుకుంటాం అనగా, చివరి మలుపు దగ్గర, ఆ కారుచీకట్లో ఒక పెద్దాయన నిలబడి, మా కారు ఆపమంటూ ఆత్రుతగా చేతులు వూపుతున్నాడు. కారు హెడ్‌లైట్స్ వెలుగులో గమనించాను - ఆయన వెనకాల ఒక అంబాసిడర్ కారు ఆగివుంది. మా డ్రైవర్‌ని కారాపమన్నాను. ఎవరాయన? అంత అర్ధరాత్రిలో అక్కడ ఎందుకున్నాడు?... నేనీ ప్రశ్నలు అడిగే లోపలే ఆయన కారు దగ్గరకి వచ్చి, "సార్ మీలాగానే యాత్రకని వచ్చాం. మా కారు చెడిపోయింది. మేం అర్జంటుగా కొండపైకి వెళ్ళాలి. కొంచెం లిఫ్ట్ ఇవ్వరా, ప్లీజ్, ప్లీజ్" అంటూ ఆందోళన నిండిన స్వరంతో ఇంగ్లీషులో అడుగుతున్నాడు. నా ప్రశ్నలన్నీ వాయిదా వేసుకుని, "మీరు ఎంతమందున్నారు?" అని అడిగాను. ఆయన, ఆయన భార్య, కూతురు, అల్లుడు, డ్రైవరు - మొత్తం అయిదుమంది. మా కారులో నేను, నా పి.ఏ, డ్రైవరు. - "ఇంతమంది ఎలా పడతాం నా కారులో" అన్న ఆలోచన కూడా నాకు రాలేదు. అనాలోచితంగా వాళ్ళందర్నీ (లగేజీతో సహా) మా కారులోకి ఎక్కించుకున్నాను... అప్పుడు గమనించాను - ఆయన కూతురు, అల్లుడూ పసుపు బట్టల్లో (మధుపర్కాల్లో) వున్నారు. అంటే అప్పుడే పెళ్ళి చేసుకు వస్తున్నారన్నమాట. విచిత్రం! వాళ్ళు కారు ఎక్కగానే నాలో అంతకుముందున్న చిరాకు, ఆదుర్దా మటుమాయమైపోయాయి!!

తిరుమలకి చేరే లోపల ఆయన బెంగ, ఆందోళన మిళితమైన కంఠంతో తన కథంతా చెప్పేశాడు. దాని సారాంశం ఆయన మాటల్లో :

"మైసూరులో హోటల్ వ్యాపారం మాది... తిరుమల వేంకటేశ్వరుడు తప్ప నాకు మరో దైవం తెలీదు. అందుకే మా అమ్మాయి పెళ్ళి కొండమీద చెయ్యాలనుకున్నాను. కానీ మా వియ్యంకుడి పట్టుదల కారణంగా, మైసూరులో చేశాను. అయితే వివాహం అయిన వెంటనే పసుపు బట్టల్లో అమ్మాయినీ, అబ్బాయినీ తీసుకుని శ్రీనివాసుడి దర్శనం చేయిస్తానన్నాను. దానికి ఆయన ఒప్పుకున్నారు... అలాగే, ఇదిగో ఈ ఉదయం 10 గంటలకి మైసూరులో పెళ్ళి జరిగింది. వెంటనే బెంగుళూరు మీదుగా తిరుమల వచ్చి, రాత్రి ఏడుగంటలకల్లా స్పెషల్ దర్శనం (రూ. 50 అప్పట్లో) పూర్తి చేసుకుని, వెంటనే బయల్దేరితే, రేపు ఉదయానికల్లా మైసూరు చేరిపోవచ్చనుకున్నాం... పెళ్ళికి వచ్చిన బంధువులంతా అక్కడే వున్నారు. పెళ్ళి సంబరాలు ఇంకా జరగాల్సినవి కూడా వుండి పోయాయి. కాని మా దురదృష్టం కొద్దీ, దారంతా రైల్వే గేట్లు, ట్రాఫిక్ స్తంభించటాలూ వగైరా కారణాల వల్ల మేం అలిపిరి చేరేసరికి 10 గంటలయింది. టోల్ గేట్ మూసేశారు. అక్కడి సిబ్బందిని బ్రతిమాలి, మా కథంతా చెప్పి 12 గంటలలోపు దర్శనం చేసుకుని తెల్లవారే సరికి మైసూరు చేరాలయ్యా అని అర్థిస్తే వదిలారు. ఇప్పుడు మీరు కూడా వాళ్ళని అలాగే బ్రతిమాలి వుంటారు కదా!..."

- ఇలా చెబుతూ ఆయన ఆగిపోయాడు. నేను - "అంతే, అంతే" అంటూ మాటమార్చేశాను. నేనెవరో చెప్పలేదు. ఆ తరువాత కథ నాకు అర్థమయిపోయింది. ఘాట్ రోడ్డులో వాళ్ళ కారు చెడిపోయింది. ఇప్పుడు ఆయన సమస్య అంతా ఆలయంలో దర్శనం మూసేసే (12 గంటల) లోపల అమ్మాయిచేత, అల్లుడి చేత దర్శనం చేయించాలి. కారు చెడిపోయి, తన ప్రయాణం అంతా అస్తవ్యస్తంగా జరగటంతో, ఆయన సహనం కోల్పోయాడు. కారు ఆగిపోయిన మరుక్షణం ఆయనకి ఏం చేయాలో తెలీకుండా పోయింది. క్రింద టోల్ గేట్ మూసేశారు. మళ్ళీ తెల్లవారుఝామున నాలుగ్గంటలకి కాని దాన్ని తెరవరు. అప్పటిదాకా ఈ చీకట్లో ఏం చేయాలి? పోనీ నడిచి వెళ్దామా అంటే, 12 గంటల లోపల ఆలయం చేరుకోవటం సాధ్యపడదు. ఎలా? ఎలా? ఈ బెంగతో ఆయన దిగులు పడిపోయాడు.

"స్వామీ, నిన్నే నమ్ముకున్నానే. అనుక్షణం నిన్నే ఆరాధిస్తానే. నీ ఆశీస్సులకోసం కొత్త దంపతుల్ని పెళ్ళిపీటల మీద నుంచి, నానా అవస్థపడి నేరుగా ఇక్కడికే తీసుకువచ్చానే! అయినా నాకు ఇంత అన్యాయం చేస్తావా? పసుపుబట్టల్లో నిన్ను దర్శించాలని వచ్చిన ఈ పిల్లలకి దర్శనం లేదు. నేను సకాలంలో పెళ్ళిమంటపానికి తిరిగి వెళ్ళే ఆశలేదు. నా భక్తి అన్ని సమస్యలకి పరిష్కారం చూపిస్తుందన్న నా నమ్మకానికి - నా కొత్త అల్లుడి ముందు





విలువలేదు. ఈ రాత్రంతా చలిలో ఈ ఘాట్ రోడ్డులో వణుకుతూ జాగరణ చేయటం తప్ప మార్గం లేదు... ఛీ! ఏం దేవుడవయ్యా నువ్వు? నిన్ను నమ్ముకున్న భక్తుల్ని ఇంత దీనావస్థకి గురి చేస్తావా? ఇంత నిర్దయగా ఈ అడవిలో వదిలేస్తావా?... ఎంత గుడ్డిగా నిన్ను నమ్ముకుని వచ్చాను?... ఇంక జన్మలో నీ కొండకి రాను. నిన్ను చూడాలని కోరుకోను..." అనుకుంటూ మనసులో శ్రీనివాసుడ్ని తిట్టుకుంటూ, అల్లుడిముందర అవమానభారం తోడవడంతో కలిగిన దిగులుతో ఖిన్నుడై వుండిపోయిన స్థితిలో, మా కారు ఆయనకి కనబడింది. నేను కారులో ఎక్కించుకోగానే, ఆయన ప్రాణం లేచివచ్చినట్లయింది. అప్పుడు ఆయన అన్న మొదటి వాక్యం - "సర్, మీరెవరో దేవుడు పంపించినట్లుగా వచ్చారండీ... !"

ఇలా ఆయన మాట్లాడుతుండగానే మా కారు తిరుమలలోని గెస్ట్‌హవుస్‌కి చేరిపోయింది. అప్పటికి 11. 30 అయింది. ఆయన నాకు 'థాంక్స్' చెప్పేసి, ఆదరాబాదరా దర్శనం కోసం భార్యనీ, పిల్లల్నీ పరుగులు తీయించాలని హడావుడి పడుతున్నాడు. నేను - "ఖంగారు పడకండి, కొంచెం మొహం కాళ్ళు కడుక్కురండి. కారులో వెళ్దాం" అన్నాను. మరో పదిహేను నిమిషాల తరువాత వాళ్ళని నాతోపాటు తీసుకువెళ్ళి, ఆలయంలో వదిలాను. ఆలయ సిబ్బందికి పురమాయించి, నా పనిమీద వెళ్ళిపోయాను. దర్శనాలు ముగిసేవేళకి కొద్ది నిమిషాలు ముందుగా, వాళ్ళకి ప్రత్యేక దర్శనం, హారతి, ప్రసాదం తనివితీరా లభించాయి. టిటిడి అతిధులుగా ఆ రాత్రికి వాళ్ళకి బస, భోజనం కూడా ఏర్పాటయింది. రాత్రికి రాత్రి టిటిడి సిబ్బంది వాళ్ళ కారుని కూడా రిపేరు చేసేశారు. ఆ రాత్రి వాళ్ళని నేను మళ్ళీ కలుసుకోవటం వీలుపడలేదు. అయితే అప్పటికి ఆయన నా గురించి విచారించి, తెలుసుకున్నాడు... మర్నాడు ఉదయం శుక్రవారం అభిషేక సేవ పూర్తయ్యాక నేను వాళ్ళ గురించి వాకబు చేస్తే, తెల్లవారుఝామున నాలుగ్గంటలకే వెళ్ళిపోయారని తెలిసింది.

★ ★ ★

రెండురోజుల తరువాత ఆయన నాకు లెటర్ రాశాడు - "... నా కారు ఘాట్ రోడ్డులో ఆగకుండా తిరుమలకి 11 గంటలకే చేరివున్నప్పటికీ, ఆరోజు వున్న యాత్రికుల రద్దీలో ఆ రాత్రి మాకు దర్శనం జరిగివుండేది కాదు. అందుకే మా ఇలవేల్పుడయిన శ్రీ వేంకటేశ్వరుడు మాకు కారు చెడిపోయే పరిస్థితి కల్పించి, మిమ్మల్ని రప్పించాడు. మీ ద్వారా ఈ భక్తుడి కోరిక ఘనంగా నెరవేర్చాడు. అంత గొప్ప దర్శనం మాకు గతంలో ఎన్నడూ జరగలేదు.

ఆయన లీల అర్థం చేసుకోలేక, ఆ రాత్రి కొద్దిక్షణాలపాటు విచక్షణ కోల్పోయి, ఆయన్ని ఎంత ద్వేషించానో? ఎన్ని దుర్భాషలాడానో? జరిగినదానికి ఇప్పుడు కుమిలిపోతున్నాను. అనుక్షణం స్వామిని క్షమార్పణలు వేడుకుంటూనే వున్నాను..."

★ ★ ★



తిరుమల మూర్తులు-4

## ఉగ్ర శ్రీనివాసుడు

గర్భాలయంలోని మరో చిన్న విగ్రహం ఉగ్ర శ్రీనివాసుడు. దీన్నే 'స్నపన బేరం'గా వ్యవహరిస్తారు. 14వ శతాబ్దంవరకు ఈ విగ్రహాన్నే ఉత్సవ విగ్రహంగా వ్యవహరించేవారు. ఒకసారి ఈ విగ్రహం ఊరేగింపుగా వెళ్ళినప్పుడు అగ్ని ప్రమాదం జరిగిందనీ, అప్పుడు ఈయన్ని 'ఉగ్ర శ్రీనివాసుడు'గా గుర్తించారనీ అంటారు. ధృవబేర, కౌతుకబేర, బలిబేర విగ్రహాలకి భిన్నంగా 'స్నపన బేర' విగ్రహం శ్రీదేవి-భూదేవి సహితమై వుంటుంది. ఏడాదికొకసారి మాత్రమే సూర్యోదయానికి ముందే ఈ విగ్రహాన్ని సర్వాలంకారాలతో ఊరేగింపుగా తీసుకువెళ్ళి తీసుకువచ్చేస్తారు.







# 9

# ముఖ్యమంత్రి ఆగ్రహజ్వాలల్లో

**మం**త్రులు, సీనియర్ అధికారులు వున్న ఒక సమావేశంలో అకస్మాత్తుగా ముఖ్యమంత్రి ఆగ్రహం కట్టలు తెంచుకుంది.

"ఏమనుకుంటున్నాడా ఐ.ఏ.ఎస్. ఆఫీసర్? ఏదో పని చేస్తాడుగదా అని టి.టి.డి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ పోస్టులో వేస్తే రాజకీయాలు నడుపుతాడా? అంత రాజకీయాలమీద మోజుంటే, ఆ కలేజా వుంటే - "ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసెస్‌కి రాజీనామా చేసి, రాజకీయాల్లోకి దిగాలి... మాకు వ్యతిరేకంగా ఇలాంటి రాజకీయాలు సాగిస్తాడా? - చూస్తాను ఎలా సాగిస్తాడో.... ?" ఇలా అంటూ ఆవేశంతో వూగిపోతూ, అక్కడ లేని ఒక జాయింట్ సెక్రటరీ స్థాయి ఐ. ఏ. ఎస్. అధికారి మీద ఆగ్రహంతో విరుచుకుపడ్డారు ముఖ్యమంత్రి.

ప్రజాస్వామ్యంలో ప్రజలచేత ఎన్నుకోబడ్డ ప్రభుత్వంలో ముఖ్యమంత్రి సర్వాధికారి. ఆయనకు ఆగ్రహం వస్తే, ఆయన క్రింద యంత్రాంగంలో ఒక చిన్న అధికారిని ఆదుకునే శక్తీ, ఆసక్తీ ఎవరికి మాత్రం వుంటాయి?... దురదృష్టవశాత్తూ, 1979 నాటి ఆ సంఘటనలో ముఖ్యమంత్రి - డాక్టర్ మర్రి చెన్నారెడ్డి కాగా, ఆయన ఆగ్రహానికి గురైన ఐ. ఏ. ఎస్. అధికారిని నేనే.... !

★ ★ ★

అసలు తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పోస్టింగ్ ఆర్డర్సు తీసుకోవడం దగ్గర్నుంచే ఎదురుదెబ్బలు మొదలయ్యాయి. టి.టి.డి. కి వెళ్ళాలా వద్దా అన్న సందిగ్ధంలో పడి, అప్పటికి ఆ పరిస్థితి నుంచి తప్పించుకోవాలని ప్రయత్నించినప్పుడు, మా అమ్మాయి మాధవికి మోకాలు వాచిపోవడం మొదటి అనుభవం.

ఆ తరువాత, "శ్రీనివాసుడు పిలుస్తుంటే రానంటున్నానేమో" అన్న సందేహంతో వెళ్ళాలని నిర్ణయించుకుని, పోస్టింగు ఆర్డర్సు తీసుకుని, ఛార్జి తీసుకోటానికి ముహూర్తం నిర్ణయించుకుని, దేవాదాయశాఖ అడిషనల్ కమీషనర్ ఆనందరావు మొదలియార్ దగ్గర్నుంచి హైదరాబాద్‌లో పదవీ బాధ్యతలు స్వీకరించి, తిరుపతికి ప్రయాణమైన క్షణంలో మరో దుర్ఘటన ఎదురైంది... అది జరిగిన ఏడాదికే ఇలా మరోసారి ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారి గర్జనకి గురికావలసివచ్చింది.

ఇలా ముఖ్యమంత్రి - పదిమంది మంత్రుల, సెక్రటరీల సమక్షంలో నా మీద దుమ్మెత్తి పోశారన్న విషయం ఛీఫ్ సెక్రటరీ ఎస్.ఆర్. రామ్మూర్తిగారి ద్వారా వినగానే, నేను ప్రమాన్పడిపోయాను. నాకు అణుమాత్రంగా కూడా నా లోపం ఏమిటో, నేను చేసిన నేరం ఏమిటో అర్థంకాలేదు. నిజానికి ఛీఫ్ సెక్రటరీ రామ్మూర్తిగారికి కూడా ముఖ్యమంత్రి ఆగ్రహానికి మూలం ఏమిటో తెలీదు. అయినా నా అభ్యర్థనమేరకు ఆయన తరువాత ముఖ్యమంత్రితో మాట్లాడి నాకు తెలియజేసిన నా నేరం ఏమిటంటే -

"చెన్నారెడ్డిగారి కిష్టంలేని పత్రికలకు టిటిడి ప్రకటనలు జారీ చేసింది..."

చెన్నారెడ్డిగారిని వ్యతిరేకించే కడప జిల్లా కాంగ్రెసు నాయకుడు (మాజీ ముఖ్యమంత్రి వెంగళరావు అనుయాయుడైన) రత్నసభాపతి సొంతంగా ప్రారంభించిన ఒక మ్యాగజైన్‌కీ, ప్రభుత్వాన్ని విమర్శించే 'ఈనాడు' దినపత్రికకీ టిటిడి ప్రకటనలిచ్చింది. దానికితోడు, ఆ ప్రకటనలు వెలువడిన సంచికలలోనే చెన్నారెడ్డిగారి విధాన నిర్ణయాలను విమర్శిస్తూ వార్తలు కూడా ప్రచురితమయ్యాయి. అంటే చెన్నారెడ్డిగారిని విమర్శిస్తూ రాసే పత్రికలకి నేనే ప్రకటనలిచ్చి, ప్రోత్సహిస్తున్నానని ముఖ్యమంత్రి అనుమానం!

నిజానికి టి.టి.డి. ప్రకటనల విషయంలో నేను వెళ్ళిన కొత్తలోనే ఒక నిర్దిష్ట విధానాన్ని రూపొందించడం జరిగింది. దాని ప్రకారం, దినపత్రికలకు ఇచ్చే ప్రకటనలన్నీ ఆయా పత్రికల సర్క్యులేషన్‌ని బట్టి ఇవ్వాలి. టి.టి.డి.లో 38 డిపార్ట్‌మెంట్స్ వున్నాయి. అనేక సంక్షేమ, ఆధ్యాత్మిక కార్యక్రమాలను టి.టి.డి. నిర్వహిస్తూ వుంటుంది కనుక ప్రకటనలు తరచూ ఇవ్వాల్సివస్తూ వుంటుంది. అయితే మ్యాగజైన్స్ విషయంలో మాత్రం - వాటి ప్రారంభ సంచికలో ప్రకటన ఎవరు కోరినా ఇవ్వాలని ఆదేశించాను. ఎందుకంటే తొలి సంచికలో తిరుమల తిరుపతి దేవస్థానాల ప్రకటనను శ్రీనివాసుడి ఆశీస్సులుగా చాలామంది విశ్వసిస్తుంటారు. ఈ బాధ్యత అంతా టి.టి.డి.





పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్‌దే. ఒకసారి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ విధాన నిర్ణయం ప్రకటించాక, ఆ ప్రకారం జరిగేటట్లు ఆయా అధికారులే చూస్తారు తప్ప ప్రతి చిన్న విషయం అమలులో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ జోక్యం చేసుకోవటం సాధ్యపడదు. ... ఆ ప్రకారంగా నిర్దుష్ట విధానానికి లోబడే పి.ఆర్.ఓ. ప్రకటనలు జారీ చేశారని నా విచారణలో స్పష్టమయింది. అయితే ఆ ప్రకటనలు వెలువడిన రోజునే ముఖ్యమంత్రి విధానాన్ని విమర్శిస్తూ వార్తలు రావటం కేవలం కాకతాళీయంగా జరిగింది. సర్వసాధారణంగా అన్నిచోట్లా జరిగినట్లే, ఇక్కడ కూడా ఎవరో ముఖ్యమంత్రిగారి 'మహాభక్తులు' ఈ పత్రికల కాపీలు తీసుకెళ్ళి చెన్నారెడ్డిగారికి చూపించారు. "మీ క్రింద పనిచేసే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ మీకు వ్యతిరేకంగా రాసే పత్రికలకు ప్రకటనలు ఇస్తున్నారు. చూశారా ఎంత ఘోరమో?" అని కూడా చాడీలు చెప్పి వుంటారు. తమ విధేయత నిరూపణకోసం లేదా ఇతరత్రా తమ అసమర్థత కప్పి పుచ్చుకోవడం కోసం లేదా అసూయతో ఇలాంటి విధానాలు అవలంబించే వాళ్ళు ఏ వ్యవస్థలోనయినా వుంటారు. వాళ్ళ స్వభావాన్ని వాళ్ళు ఆయా సందర్భానుసారం వినియోగంలో పెడుతుంటారు... సరే, ఇప్పుడు నేనేం చేయాలి?

నా మనస్సాక్షికి తెలుసు. ఈ ప్రకటనలు ఇవ్వడం విషయంలో నా ప్రమేయం లేదు. ఇచ్చిన ప్రకటనలు సయితం నిర్దిష్ట విధానం ప్రకారం పి.ఆర్.ఓ. ఇచ్చినవే. కాని ముఖ్యమంత్రికి నామీద అనుమానం కలిగింది (కలిగించారు). నిజానికి ముఖ్యమంత్రి నా మొహంమీద ఏమీ చెప్పలేదు. ఆయన ఇలా అనుమానిస్తున్నారన్నది ఛీఫ్ సెక్రటరీ సమాచారం మాత్రమే. కనుక నా ముందున్నవి రెండే మార్గాలు. ఒకటి - నాకుగా నేను ముఖ్యమంత్రిని కలిసి వివరణ ఇవ్వటం, రెండోది - ఈ విషయాన్ని ఇక్కడితో వదిలేసి ముఖ్యమంత్రి అడిగినప్పుడే చూసుకోవడం. బాగా ఆలోచించిన మీదట మొదటి మార్గాన్నే నేను ఎంచుకున్నాను.

ఎక్కడ సేవ చేసినా విశ్వసనీయత అనేది ప్రతి ఉద్యోగికి వుండితీరాల్సిన మొదటి లక్షణం. అలాంటి నా విశ్వసనీయతని ముఖ్యమంత్రే శంకిస్తున్నప్పుడు, ఆ శంక ఆధారరహితమైంది అయినప్పుడు, దానిని నివారించే ప్రయత్నం చేయకుండా, గుడ్డిగా పనిచేసుకుపోవాలనుకోవడం అవివేకం. అందుకే ముఖ్యమంత్రిని స్వయంగా కలుసుకోవాలని నిర్ణయించుకున్నాను.

వెంటనే నేను ఆయా ప్రకటనల వివరాలు, పత్రికల కాపీలు తీసుకుని హైద్రాబాదు వెళ్ళి ఛీఫ్ సెక్రటరీని కలిశాను. ఆయన ముఖ్యమంత్రి కార్యదర్శి సంతానం గారిని, జాయింట్ సెక్రటరీ వి. గోవిందరాజన్‌గారిని కూడా పిలిపించారు. వాళ్ళకి ఈ క్లిప్పింగ్స్ చూపించి, ప్రకటనలు ఎలా ఇస్తారో ఏమిటో నేను వివరించాక, జరిగినదాంట్లో నా లోపం ఏమీ లేదని వాళ్ళు ఒప్పుకున్నారు. కాని ముఖ్యమంత్రిని ఒప్పించాలన్నదే నా ఆరాటం.

ముఖ్యమంత్రి ముందుకు వెళ్ళాలంటే అందరికీ జంకుగానే వుంది. చెన్నారెడ్డిగారికి కోపం వస్తే ఆయన ముందు నిలబడి మాట్లాడాలంటే ఉన్నతస్థాయి అధికారులు సయితం భయపడే రోజులు అవి.

★ ★ ★

నిజానికి అప్పటికి ఏడాది క్రితం నేను టి.టి.డి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా బాధ్యతలు స్వీకరించిన రోజున కూడా ఇలాగే ముఖ్యమంత్రికి ఎవరో ఏదో నూరిపోయటం, ఆయన నా మీద నిప్పులు చెరగడం జరిగింది. అది కూడా నేను ఆనందరావు మొదలియార్ దగ్గర పదవీ బాధ్యతలు స్వీకరించిన గంటకే.

ఆ రోజు ముఖ్యమంత్రి నన్ను పిలిపించి "ఏమయ్యా, నువ్వు మాకు వ్యతిరేకంగా వెంగళరావు ఏజెంటుగా పనిచేద్దామనుకుంటున్నావా?" అంటూ నిలదీశారు. కొద్దిక్షణాలపాటు నా నోట మాటలేదు... ఏదో మాట్లాడబోయి తమాయించుకున్నాను. 'నేను పనిచేయాల్సింది తిరుమల శ్రీనివాసుడి సన్నిధిలో. ఆయన్ని సేవించే భాగ్యం నాకు వుంటే, ఏది ఎలా జరగాలో అలా జరిగేలా ఆయనే చూసుకుంటాడు' - అని మనసులో అనుకున్నాను.

ఆయన ఆవేశం తగ్గాక, "సర్, మీరు దేని గురించి మాట్లాడుతున్నారో నాకు తెలీటం లేదు. పి.వి. నరసింహారావు గారు ముఖ్యమంత్రిగా వుండగా, నేను ఆయన సెక్రటరీగా పనిచేశాను. అప్పుడు నాకు పి. వి గారి మనిషి అని అంతా ముద్రవేశారు. వెంగళరావుగారు ముఖ్యమంత్రిగా వున్న కాలంలో ఆయన సొంతజిల్లా అయిన ఖమ్మంలో నేను కలెక్టరుగా పనిచేశాను. అంతమాత్రానికే ఇప్పుడు మీరు నాకు వెంగళరావు మనిషిగా ముద్రవేస్తున్నారు... సర్, మా విధేయత మా ఉద్యోగాలకే కాని వ్యక్తులకు కాదు. మీరు అనవసరంగా నన్ను అనుమానిస్తున్నారు..." అంటూ వివరించే ప్రయత్నం చేశాను. ఆయన ఆరోపణ అంతా ఒక్కటే. - ఆ ముందురోజు నేను వెంగళరావుగారికి అత్యంత సన్నిహితుడయిన టి.టి.డి. ఛైర్మన్ చెలికాని అన్నారావుని కలిసి, ఆయన్నే ఛైర్మన్‌గా కొనసాగింపజేస్తానని హామీ ఇచ్చానట! విషయం అర్థమైంది. నాలో నేనే నవ్వుకున్నాను - వాస్తవం ఎలా వక్రీకరించి చెప్పబడిందో తెలిసిపోయింది.

జరిగిందేమిటంటే - ఆ ముందురోజే అమెరికా నుండి తిరిగివచ్చిన అన్నారావు గారు ఆ రాత్రి మా ఇంటికి వచ్చి నాకు అభినందనలు తెలిపివెళ్ళారు. - ఇదే విషయం ముఖ్యమంత్రికి వివరించాను. ఖమ్మంలో నేను కలెక్టరుగా వుండగా టిటిడి వారు కళ్యాణమంటపం కడుతున్నప్పుడు అన్నారావుగారు ఖమ్మం వస్తుండేవారు. అప్పుడు మాత్రమే ఆయన్ని కలుసుకున్నాను. అంతకుమించి ఆయనతో చెప్పుకోదగ్గ సాన్నిహిత్యం నాకు లేదు. "అదలావుంచి, అసలు టి.టి.డి ఛైర్మన్‌ని నియమించే విషయంలో తుది నిర్ణయాధికారం ముఖ్యమంత్రికే వుందని తెలిసీ, నేనెందుకు ఇలాంటి విషయంలో





తలదూరుస్తాను... ఏమైనా సర్, నేను బాధ్యతలు స్వీకరించిన గంటలోనే ఇలా మీ విశ్వాసాన్ని కోల్పోతాననుకోలేదు. ఇప్పుడైనా నేనింకా తిరుపతి వెళ్ళలేదు. నా సామాన్లు మాత్రమే వెళ్ళాయి. మీరు మీకు విశ్వాసపాత్రుడైన వేరెవర్నయినా టి.టి.డి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నియమించుకోండి. నాకు శెలవిప్పించండి..." అంటూ ఓ నమస్కారం పెట్టేశాను.

టి.టి.డి. కి వెళ్ళాలని మనసులో ఓ పక్క లాగుతున్నా, నా విశ్వసనీయతని నిలబెట్టుకోవడం కోసం అలా చెప్పక తప్పలేదు. మరోసారి శ్రీనివాసుడి మీద భారం వేసి, నేను లేచిపోవడానికి ఉద్యుక్తుణ్ణయ్యాను... అంతలో చెన్నారెడ్డిగారి ముఖంలో రౌద్రంపోయి ప్రసన్నత చోటుచేసుకుంది. గొంతులో గాంభీర్యం స్థానంలో అనునయం వ్యక్తమవుతోంది... "చూడు ప్రసాద్, వెంగళరావు అంటే మాకూ గౌరవమే కాని ఆయన మాకు వ్యతిరేకంగా పనిచేస్తున్నాడయ్యా. వెంగళరావుకి అన్నారావు ఎంత ముఖ్యుడో నీకు తెలుసుగదా..." అంటూ ఆయన ధోరణిలో ఆయన మాట్లాడారు. చివరికి అన్నారావుని మా ఇంటికి వెంగళరావుగారే పంపి వుంటారని, ఆయనకి ఆయనే ఒక అభిప్రాయానికొచ్చారు.

"ప్రసాద్, నీ మీద మాకు పరిపూర్ణమైన విశ్వాసం వుంది. ఇంత వెంటనే నిన్ను ఆ స్థానం నుంచి మార్చటం మాకు ఇష్టంలేదు. వెళ్ళు. నువ్వెళ్ళి బాగా పనిచేయ్..." అంటూ లాలనగా భుజం తట్టారు.... అలా నేను తిరుపతికి వెళ్ళి టి.టి.డిలో పనిచేయడం ఆరంభించిన ఏడాదిలోపే, మళ్ళీ ఈ ప్రకటనల ఉపద్రవం వచ్చిపడింది...

★ ★ ★

నేపథ్యం ఇంత చేదుగా వున్నప్పటికీ, ముఖ్యమంత్రి ఆగ్రహసాగరం ఎంత కట్టలు తెంచుకున్నప్పటికీ, నేను మాత్రం ఆయన్ని కలిసే తీరాలని నిర్ణయించుకున్నాను. చివరికి ఛీఫ్ సెక్రటరీ, ముఖ్యమంత్రి కార్యదర్శి నన్ను అదేరోజున, ఆదివారం కనుక తార్నాకలోని ముఖ్యమంత్రి ఇంటికి తీసుకువెళ్ళారు. ముఖ్యమంత్రికి ఛీఫ్ సెక్రటరీ - నేను వచ్చినపని ఏమిటో క్లుప్తంగా వివరించారు. అంతే!

ఆ ఉపోద్ఘాతాన్ని వింటూనే చెన్నారెడ్డిగారు నా మీద విరుచుకుపడ్డారు. నేనింకా నోరు విప్పలేదు. కాని ముఖ్యమంత్రిని ఎవరు ఆపగలరు? ".... ప్రసాద్, నువ్విలా చేస్తావనుకోలేదు... మేం ఎన్నడూ ఇలాంటి అవిధేయత నీ నుంచి ఎదురవుతుందని ఊహించలేదు... మమ్మల్ని వ్యతిరేకించేవాళ్ళకి ప్రకటనలిచ్చి ప్రోత్సహిస్తావా?... ఇదేనా నువ్వు ముఖ్యమంత్రి పట్ల ప్రవర్తించాల్సిన పద్ధతి?..." ఇలా ఫుల్‌స్టాప్, కామా లేకుండా చెన్నారెడ్డిగారు నామీద నిప్పులు కురిపిస్తున్నారు. మధ్యలో సంతానంగారు కల్పించుకొని ఏదో చెప్పబోయారు. ఎవరు చెప్పినా ఆపే ధోరణిలో లేరు ముఖ్యమంత్రి.

అలా కొద్ది నిమిషాలు గడిచిపోయాక, ఆయన ఆవేశం కొంచెం తగ్గాక, నేను నోరు విప్పాను. జరిగిందంతా పి.ఆర్.ఓ. స్థాయిలో ఒక నిర్దిష్ట విధానం ప్రకారం జరిగిందేననీ, ఇందులో నా వ్యక్తిగత ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేదనీ వివరించే ప్రయత్నం చేశాను. ఆయన అయిష్టంగానే విన్నారు. కానీ తన అభిప్రాయం మార్చుకోలేదు. అంతా నాకు తెలిసే జరిగిందన్న నమ్మకాన్ని కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పారు.

"... ముఖ్యమంత్రి (పి.వి. నరసింహారావు) దగ్గర సెక్రటరీగా పనిచేశావు. వెంగళరావు టైమ్‌లో ఆయన జిల్లాకి కలెక్టరుగా పనిచేశావు... ఇప్పుడు ఇలాంటి పరిస్థితులు కల్పిస్తే వాటి రాజకీయ దుష్పరిణామాలు ఎలావుంటాయో నీకు తెలీదా?... తెలీదని నువ్వు చెబితే మేం నమ్మాలా? చాల్చాల్లేవయ్యా చెప్పావ్...." అంటూ ఆయన ముందున్న అనుమానాన్నే మళ్ళీ నొక్కి చెప్పారు...

ఛీఫ్ సెక్రటరీ, ముఖ్యమంత్రి సెక్రటరీ, ముఖ్యమంత్రి జాయింట్ సెక్రటరీ కూడా ఏదో వివరించాలని వ్యర్థ ప్రయత్నం చేశారు... ఒక్కసారిగా మాటలు ఆగిపోయాయి. కొద్దిక్షణాలపాటు ఆ గదిలో నిశ్శబ్దం తాండవించింది. చేసేదేమీ లేక ముఖ్యమంత్రిగారికి నమస్కారం పెట్టి మేమంతా బయటికి వచ్చేశాం.

మరో వారంరోజుల్లో ప్రధానమంత్రి ఇందిరాగాంధీ తిరుపతి వస్తున్నారు. ఆమెతోపాటు ముఖ్యమంత్రి చెన్నారెడ్డి కూడా వస్తారు. అప్పుడు నలుగురిలో ముఖ్యమంత్రి ఆగ్రహజ్వాలలు మరోసారి ప్రజ్వరిల్లితే...! ఈ ఊహ నేను భరించలేకపోయాను. ముఖ్యమంత్రి విశ్వాసం కోల్పోయాకకూడా అక్కడే పనిచేయాలనుకోవటం, ఆత్మగౌరవాన్ని పణంగా పెట్టి కొనసాగాలనుకోవటం నా స్వభావం కాదు. అందుకే ముఖ్యమంత్రి ఇంట్లోంచి బయటకువచ్చిన వెంటనే ఛీఫ్ సెక్రటరీకి ఒక లెటర్ రాసిచ్చాను. "నన్నీ పోస్టు నుంచి బదిలీ చేయండి. వేరెవర్నయినా పోస్టు చేయటానికి వ్యవధి కావాల్సివుంటే, టి.టి.డి. లో నా తరువాత సీనియర్ అధికారికి పదవీ బాధ్యతలు అప్పగించి వెళ్ళిపోవడానికి అనుమతించండి..." అంటూ అభ్యర్థించాను.

హైదరాబాద్ నుంచి తిరుపతి వచ్చే ముందు నిర్ణీత కార్యక్రమం ప్రకారం నేను పుట్టపర్తిలో సత్యసాయిబాబా సమక్షంలో శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మిగారి బాలాజీ పంచరత్నమాల క్యాసెట్ (టి.టి.డి. తయారుచేసింది) విడుదలకు వెళ్ళాల్సి వుంది. అయిష్టంగానే వెళ్ళాను. ఆ క్యాసెట్ విడుదల పూర్తయ్యాక, సాయిబాబా మమ్మల్ని లోపలికి పిలిచారు. నేను, నా భార్య గోపిక, శ్రీమతి సుబ్బలక్ష్మి, ఆమె భర్త సదాశివం లోపలికి వెళ్ళాం. నిరాడంబరత, ప్రేమ వుట్టిపడుతున్న బాబా నన్ను చూస్తూనే ఆప్యాయంగా పలకరించారు. టి.టి.డి. సేవలు ప్రస్తుతించారు. అలా మాట్లాడుతూనే ఆయన అకస్మాత్తుగా - చెదిరిన మనస్సుతో వున్న నన్ను ఉద్దేశించి, "చూడు ప్రసాద్, టి.టి.డి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నువ్వురావడం అన్నది దైవ సంకల్పం వల్ల జరిగింది. అక్కడి నీ నియామకం ముఖ్యమంత్రి చేతుల్లోనో, ఛీఫ్ సెక్రటరీ చేతుల్లోనోలేదు. దైవ సంకల్పం లేకపోతే, నిన్నక్కడ ఎవరూ





నియమించలేరు. అక్కడ్నించి తొలగించనూలేరు. అందుచేత, నీ మనస్సాక్షి ప్రకారం పనిచేయ్. దైవాన్ని నమ్మి దేవుని పేరిట నీవు చేస్తున్న సత్కార్యక్రమాలు కొనసాగించు..." ఆశ్చర్యం! ఆయన నా మనసు చదివేశారు!

దీంతో, మరోసారి నాలో అంతర్మథనం మొదలైంది. నేనెందుకింత ఆందోళన చెందుతున్నాను. నేను ఏ నేరమూ చేయలేదు. అయినా ముఖ్యమంత్రికి అనుమానం, ఆగ్రహం కలిగాయి. కలిగితే...? బాబా చెప్పినట్లు, నన్ను టి.టి.డి. కి రప్పించింది శ్రీనివాసుడే అయితే నేనిక్కడ వుండాలో అక్కర్లేదో తేల్చాల్సింది కూడా ఆయనే. ఇది మానవశక్తికి మించిన విషయం అయినప్పుడు నేను ఆందోళన చెంది వుపయోగం ఏమిటి? ఆయనకే వదిలేస్తే సరికదా!... అలా అనుకున్నాను కానీ, వుండబట్టలేక, తిరుపతికి రాగానే ఛీఫ్ సెక్రటరీకి టెలిఫోన్ చేసి, "నన్ను రిలీవ్ చేసే విషయం ఏమైంది సార్" అని అడిగాను. ఆయన ముభావంగా, "నీ లెటర్ ముఖ్యమంత్రికి చూపించాను. ఆయన ఆమోదం ఇంకా రాలేదు..." అన్నారు. అయినా నా ఉత్సుకత ఆగలేదు. ముఖ్యమంత్రి ఏమీ తేల్చకపోవటం ఏమిటి? అయితే ఛీఫ్ సెక్రటరీతో మాటల్లో బయటపడిన ఓ చిన్న వ్యాఖ్య (ముఖ్యమంత్రి చేసింది) ఏమిటంటే, "ఏమిటీ? ప్రసాద్ వెళ్ళిపోతే, ఆ పోస్టుకి ఇంకెవరూ దొరకరనుకుంటున్నాడా?" ... ఈ సందిగ్ధస్థితి నాలో "ఏం జరగబోతోంది" అని ఆదుర్దాని పెంచిందేతప్ప సమస్య పరిష్కారం కాలేదు. పైగా, ప్రధాని ఇందిరాగాంధీకి, ముఖ్యమంత్రి చెన్నారెడ్డికి మధ్య సంబంధాలు దెబ్బతిన్నాయన్న ప్రచారం జరుగుతున్న నేపథ్యంలో మరో రెండు రోజుల్లో ఇందిరాగాంధీ తిరుపతి వస్తున్నారు... బాగా ఆలోచించాక శ్రీనివాసుని దర్శించుకున్నాను. సమస్యని పూర్తిగా తిరుమల వేంకటేశ్వరుడికి "వదిలేసి" నిశ్చింతంగా నేను నా పనిలో నిమగ్నమైపోయాను.

ఇందిరాగాంధీ వచ్చారు. ఆమె పర్యటన అంతా బాగా జరిగిపోయింది. చివర్లో ఆమె వెళ్ళిపోబోయేముందు మా పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ రావుల సూర్యనారాయణమూర్తి వచ్చి, ఇందిరాగాంధీ తిరుమల పర్యటన తాలూకు ఫోటో ఆల్బమ్ నా చేతిలో పెట్టాడు. నేను తీసుకెళ్ళి ముఖ్యమంత్రికిచ్చి, ప్రధాన మంత్రికి బహూకరించాలని కోరాను.



ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ,
ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డిలతో శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్.



ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ, ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డిలతో ప్రసాద్

విచిత్రం! ఆయన అలా చేయలేదు. స్వయంగా నన్నే ఇందిరాగాంధీ దగ్గరకు తీసుకెళ్ళి, నాచేత ఆల్బమ్‌ను ఆమెకు బహూకరింపచేశారు. నన్ను ఆమెకు చూపిస్తూ, "ఇతను చాలా ఉద్దండుడైన ఐ.ఏ.ఎస్. ఆఫీసర్. అందుకని అతన్ని నేనే స్వయంగా ఎంపిక చేసి ఇక్కడ నియమించాను. ఇక్కడ అనేక అభివృద్ధి కార్యక్రమాల్ని అతను చాలా సమర్ధవంతంగా అమలుచేస్తున్నాడు..." అంటూ ప్రశంసలు కురిపించారు. ఫొటోగ్రాఫర్‌ని పిలిపించి, మా ముగ్గురినీ కలిపి ఫోటో తీయించారు....

ఇది జరిగిన మర్నాడు ఛీఫ్ సెక్రటరీ నాకు టెలిఫోన్ చేసి, "ప్రధాని పర్యటన గురించి ప్రసాద్ ఏమంటున్నాడయ్యా అని ముఖ్యమంత్రి అడుగుతున్నారు. ... ఇంతకీ అక్కడ ఏం జరిగిందేంటి?" అని ఆసక్తిగా అడిగారు. నేను తెల్లమొహం వేశాను.

ఆ మర్నాడు పోస్టులో ముఖ్యమంత్రి కార్యాలయం నుంచి నాకు ఒక ప్రత్యేక పార్శిల్ వచ్చింది. తెరిచిచూసి, నేను ఆనందాశ్చర్యాలలో మునిగిపోయాను. అందులో - ప్రధానమంత్రి ఇందిరాగాంధీ, ముఖ్యమంత్రి చెన్నారెడ్డిలతో నేను దిగిన ఫొటో మీద ముఖ్యమంత్రి స్వదస్తూరితో క్రింద సంతకంతో ఇలా రాసి వుంది.

**"విత్ బెస్ట్ విషెస్... కీప్ అప్ ది గుడ్ వర్క్"**

ఆ తరువాత గోదావరి, కృష్ణా పుష్కరాల సందర్భంలో జరిగిన సభల్లో ఆయన బహిరంగంగా నా మీద ప్రశంసల జల్లు కురిపించారు.

- మరో మూడున్నర సంవత్సరాల పాటు ప్రభుత్వం నన్ను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా కొనసాగింపజేసింది.

★ ★ ★



# 10

# అద్భుతయజ్ఞం

హైద్రాబాద్‌లో మహావీర్ హాస్పిటల్‌లోని ఒక రూమ్‌లో - బెడ్‌మీద విషమ పరిస్థితిలో వున్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌గారి పక్కన కూర్చొని ఆయన చెయ్యిపట్టుకొన్నాను. ఆ స్పర్శకి ఆయన కొద్దిగా కళ్ళు తెరిచారు. ఆప్యాయత ఉట్టిపడేలా చూస్తున్నారు. అతికష్టంమీద నోరు విప్పారు.

"... అసాధారణమైన ఈ బృహత్ యజ్ఞాన్ని మేం నిర్వహించలేకపోవచ్చు... పీఠంలోని మా వారసుడే యజ్ఞానికి కర్తగా వ్యవహరిస్తారు... అప్పటికి మేం ఇహలోకంలో వున్నా, లేకపోయినా, శ్రీ లక్ష్మీనారాయణ సహస్రకుండ మహాయజ్ఞం నిరాటంకంగా జరిగేలా అన్ని ఏర్పాట్లు నువ్వేచూడాలి నాయనా..."

వణుకుతున్న కంఠంతో మంద్రస్వరంతో ఆగి ఆగి మాట్లాడుతూ, నా చేతిని వాత్సల్యపూర్వకంగా నిమురుతూ జీయర్‌గారు మళ్ళీ కళ్ళు మూసుకున్నారు. ఆయన మాటలు వింటూనే నాకు మతిపోయినట్లయింది.

ఆ షాక్ నుంచి తేరుకునే లోపల - కొన్ని గంటల తరువాత - అందిన విషాద వార్త: "జీయర్ గారు పరమపదించారు..." అంతే! డీలా పడిపోయాను. దారీ తెన్నూ తెలీని నిబిడాంధకారంలో మునిగిపోయాననుకున్నాను. గజేంద్రమోక్షంలో - "లావొక్కింతయు లేదు..." అంటూ మొరపెట్టుకున్న గజేంద్రుడి పరిస్థితి నాది. కాని నేను గజేంద్రుణ్ణి కాదు, నన్నెవరు గట్టెక్కిస్తారు???

★ ★ ★

**నేను** తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించిన కొద్దినెలలకే అన్నారావుగారు ఛైర్మన్‌గా వున్న టిటిడి ట్రస్టు బోర్డుని ప్రభుత్వం రద్దుచేసింది. కొత్తబోర్డు ఏర్పాటయ్యేదాకా బోర్డు స్థానంలో ముగ్గురు అధికార్లతో కూడిన కమిటీని ప్రభుత్వం నియమించింది. వీళ్ళని 'పర్సన్స్ ఇన్‌ఛార్జి' అంటారు. ఈ కమిటీకి ప్రిన్సిపల్ సెక్రటరీ డాక్టర్ రమేశన్ ఛైర్మన్, దేవాదాయశాఖ కమీషనర్ (అంతకుముందు టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పనిచేసిన) శ్రీ చంద్రమౌళి రెడ్డి ఒక మెంబరు. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నేను మెంబరు - సెక్రటరీని.

ఈ కమిటీకే సర్వాధికారాలు వున్నాయి. టి.టి.డి. పాలనా వ్యవస్థను సమూలంగా పునర్వ్యవస్థీకరించే బాధ్యతను, అలాగే టి.టి.డికి స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించే కొత్త చట్టాన్ని రూపొందించే బాధ్యతను కూడా ఈ కమిటీకే ప్రభుత్వం అప్పగించింది. అయితే ఈ కమిటీలోని ముగ్గురు అధికారులు కూడా బిజీగా వుండే బాధ్యతాయుతమైన పదవుల్లో వున్నవాళ్ళే కావడం వల్ల అన్ని కార్యక్రమాలకీ ప్రాథమిక నివేదికలు తయారు చేసేపని మెంబరు - సెక్రటరీగా నా మీద పడింది. అలా దైనందిన బాధ్యతలకి తోడు ఈ నివేదికల తయారీ వగయిరా పనుల్లో తలమునకలైవున్న రోజుల్లో జీయర్‌గారు తిరుపతి వచ్చారు.

త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ అప్పటికే ఒక మహాశక్తి సంపన్నుడైన స్వామిగా పేరుపడ్డారు. సన్యాసాశ్రమం స్వీకరించాక, స్వయంగా ఒక పీఠాన్ని ఏర్పాటుచేసి, తన ఆకర్షణీయమైన వాక్చాతుర్యం, అపారమైన పాండిత్య ప్రకర్ష, ఆధ్యాత్మిక బోధనాశక్తి, నిర్వహణా సామర్థ్యంతో ఆ తేజస్వి లక్షలాది గృహస్థుల జీవితాల్లో ఆధ్యాత్మిక వెలుగులు నింపే కార్యక్రమాలు నిర్వహించారు. 'రామనామ' జప ఉద్యమం ద్వారా లక్షలాది ఆస్తికుల చేత 'రామకోటి' రాయించారు. దేశవ్యాప్తంగా 108 రామకోటి స్థూపాల్ని ఏర్పాటు చేశారు. (వాటిల్లో ఒకటి తిరుమలలో కూడా వుంది.) నేను టిటిడిలో చేరటానికి కొద్ది సంవత్సరాల ముందు ఒక పెద్ద యజ్ఞాన్ని కూడా ఆయన తిరుమలలో నిర్వహించారు.

జీయర్‌గారి ఈ నేపథ్యం కారణంగా వారు తిరుమలకు వచ్చి, నన్ను కలుసుకోవాలనుకుంటున్నారని తెలియగానే నేనే చొరవతీసుకుని తిరుమలలో వారికి తగిన ఏర్పాట్లు చేశాను. జీయర్ గారు వచ్చారు. వారిని సందర్శించాను. తిరుమలలో నేను చేపట్టిన కొన్ని కార్యక్రమాల్ని ఆయన ప్రస్తుతించారు. ఆధ్యాత్మిక ధోరణిలో కొన్ని మంచి విషయాలు చెప్పారు. అలా మాట్లాడుతూ, మాట్లాడుతూ, అకస్మాత్తుగా ఆయన ఆగి నా మొహంలోకి - ఏదో వెతుకుతున్న దృష్టితో - చూశారు. ఆయన ఎందుకలా ఆగిపోయారు? ఏం చెప్పాలనుకుంటున్నారు?... నాకు అర్థం కావటంలేదు. అంతలో ఆ తేజస్వి కళ్ళలో ఏదో మెరుపు మెరిసినట్లయింది. వెంటనే "ప్రసాద్, ప్రజల్లో శాంతి, సామరస్యం నెలకొనేలా చేయడం కోసం అపారమైన దివ్యశక్తి కిరణాలను ప్రసరింపజేయగల - శ్రీ లక్ష్మీనారాయణ సహస్రకుండ మహాయజ్ఞాన్ని నిర్వహించాలని చాలాకాలంగా అనుకుంటున్నాం.





ఇప్పుడు నాకు నమ్మకం కలిగింది (?) ఈ బృహత్ కార్యక్రమాన్ని తిరుమల కొండ మీదనే నిర్వహించాలి మనం... !!" అన్నారు.

అంటే, ఆయన ఆధ్వర్యంలో గతంలో జరిగిన యాగం కన్నా ఇది చాలా పెద్దది. ఇందులో ఒక వెయ్యి హోమకుండాలు - యజ్ఞం పూర్తయ్యేదాకా - అలా జ్వలిస్తూనే వుండాలి. ఏకధాటిగా ఋత్విక్కులు వాటికి ఆహుతులు అర్పిస్తూ వుండాలి... ఈ మహాయజ్ఞం నిర్వహించటానికి అనేక రకాల పదార్థాలను భారీయెత్తున సేకరించాలి. అదే స్థాయిలో పందిళ్ళు వేయాలి. దీన్ని చూడటానికి వచ్చే భక్తులకు సదుపాయాలు కల్పించాలి. యజ్ఞంలో పాల్గొనటానికి వచ్చే వేద పండితులందరికీ బస కల్పించాలి... ఇంకా లైటింగ్ ఏర్పాట్లు, రవాణా సదుపాయం, భోజన వసతి వగయిరా అనేక ఏర్పాట్లు చేయాలి. జీయర్ గారిచ్చిన వివరణ ప్రకారం ఈ ఏర్పాట్లన్నింటికీ సుమారుగా 30 లక్షల రూపాయలు ఖర్చవుతుంది!!

ఆయన ఇంకా ఇలా అన్నారు. "ఈ మొత్తం యజ్ఞ నిర్వహణ వ్యయంలో కొంత టి.టి.డి. భరించి, కార్యక్రమ నిర్వహణకు సహకరించాలి. యజ్ఞంలో పాల్గొనటానికి వచ్చే వేద పండితులందరికీ రవాణా ఖర్చులు, సంభావన కూడా టి.టి.డి భరించాలి..."

నేను అలా వింటూ వుండిపోయాను. "... ఏమంటావ్ ప్రసాద్" అని జీయర్ గారు ప్రశ్నించినప్పుడు ఏమనాలో తోచక, "ఈ యజ్ఞానికి ఇప్పుడు మీ దగ్గర వున్న నిధి ఎంత?" అని అడిగాను. జీయర్‌గారు చిరునవ్వు నవ్వి అన్నారు. - "మేం స్వయంగా రాష్ట్రమంతా తిరిగి గృహస్థుల నుంచి విరాళాలు సేకరిస్తాం. విరాళాలిచ్చిన వారంతా ఇక్కడ లక్ష్మీ పూజ వంటి కార్యక్రమాల్లో పాల్గొంటారు. అలా సేకరించిన నిధి పరిమాణం ఈ 30 లక్షల రూపాయల కన్నా అధికంగా వుంటుంది కనుక, అదంతా టిటిడి వారే తీసుకుని అధికంగా వచ్చిన మొత్తాన్ని ధార్మిక కార్యక్రమాలకు వినియోగించవచ్చు."

నాకు విషయం స్పష్టంగా అర్థమయింది. ఈ కార్యక్రమం కోసం ఆయన దగ్గర నిధి ఏమీ లేదు. ముప్ఫైలక్షల రూపాయల ఖర్చులో కొంత టి.టి.డి. భరించాలి. ముందుగా కొంత ఇతర ఖర్చుల కోసం అడ్వాన్సుగా ఇవ్వాలి. యజ్ఞానికి అవసరమైన ఆధ్యాత్మిక, వైదిక మార్గదర్శకత్వాన్ని, వేద పండితుల్ని పిలిపించే బాధ్యతను జీయర్‌గారు స్వీకరిస్తారు...

నేను అప్పటికప్పుడు ఇతమిత్థంగా ఏమీ చెప్పలేకపోయాను. అనేక సందేహాలు నన్ను వెంటాడుతున్నాయి. ఇలా ఒక స్వామీజీ చేసే యజ్ఞానికి తిరుమల కొండమీద టిటిడి సహకరించటం సబబా కాదా? అలాంటి కార్యక్రమానికి టిటిడి ఒక సహ నిర్వాహకునిగా వ్యవహరించవచ్చా? విరాళాలు కుప్పలు తెప్పలుగా వస్తాయనీ, వాటితో టి.టి.డి. అడ్వాన్సు తిరిగి చెల్లించేస్తామనీ జీయర్‌గారి విశ్వాసం. కానీ అంత మొత్తంలో విరాళాలు రాకపోతే... ? మామూలుగా రోజూ వచ్చే

వేలాది యాత్రికులను సంబాళించుకోవడమే కష్టంగా వుంటే, ఈ యజ్ఞంకోసం వచ్చే జనసమూహానికి కనీస సదుపాయాలు కల్పించగలమా? టి.టి.డి. పరిపాలనా యంత్రాంగం మీద పడే శ్రమదమాదుల్ని తట్టుకోగలమా?... ఈ సందేహాల నేపథ్యంలో "నేను పర్సన్స్ ఇన్‌ఛార్జీ కమిటీతో చర్చించి చెబుతాను" అని జీయర్‌గారికి చెప్పి బయటపడ్డాను. సందేహాలు నాకేగాని, ఆయనకి లేవు. ఆయన అపారమైన విశ్వాసం వ్యక్తం చేస్తూ, "ఇది దైవ సంకల్పం, జరిగే తీరుతుందయ్యా" అన్నారు. (అవునా?)

ఈ విషయం నేను కమిటీ ముందు పెట్టాను. దేవాదాయ కమీషనరు శ్రీ చంద్రమౌళిరెడ్డి ప్రోత్సాహకరంగా మాట్లాడారు. టి.టి.డి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పనిచేసిన అనుభవం ఆయనది. పైగా జీయర్‌గారంటే ఆయనకి ఎనలేని గౌరవం. ఇలాంటి ఏ ఆధ్యాత్మిక కార్యక్రమాన్నయినా తిరుమల కొండమీద అనుమతించవచ్చునన్నది ఆయన అభిప్రాయం. "భక్తులకు దర్శనం, సదుపాయాలు, తిరుమలేశుని సేవలు, భగవదారాధనకి సంబంధించిన అన్ని ఇతర కార్యక్రమాలూ టి.టి.డి. బాధ్యత వహించాల్సినవే" - అన్నారు శ్రీ చంద్రమౌళిరెడ్డి. అయితే ఇలాంటి కార్యక్రమం ఎక్కడ నిర్వహించినా భక్తులు తండోపతండాలుగా వస్తారు కనుక కొండమీద టి.టి.డి యంత్రాంగం చాలా కష్టపడి పనిచేయాల్సి వుంటుంది. "ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నీకయితే రెండు నెలలు ఊపిరి సలపనంతటి పనిబడుతుంది. నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా జరిగిన హోమం సందర్భంలో ఇలాంటి పరిస్థితినే ఎదుర్కొన్నాను" అంటూ తన 'అనుభవాన్ని' వివరించారు. ఇదంతా చెప్పాక "ఇప్పుడు ఏం చేయాలీ అన్నది నువ్వే నిర్ణయించుకో" అంటూ తుది నిర్ణయం నాకే వదిలేశారు. ఛైర్మన్ డాక్టర్ రమేశన్ తటస్థంగా వుండిపోయారు. "రేపు ఇంకెవరన్నా స్వామీజీ వచ్చి మరో యాగం చేస్తామంటే ఏం చేస్తావ్?" అంటూ ఒక చిక్కు ప్రశ్న వేసి వదిలేశారు. విషయం తేలలేదు. అయితే నేను వదల్లేదు. కమిటీ మొత్తం జీయర్‌గారితో ముఖాముఖీ కూర్చొని చర్చించి నిర్ణయించాల్సిందే తప్ప, ఇది నేనొక్కడినే నిర్ణయించే విషయం కాదని నొక్కి చెప్పాను.

ఈ కమిటీకి ఎంత స్వతంత్ర నిర్ణయాధికారం వుందనుకొన్నప్పటికీ, నిజమైన అధికారం ఎవరి చేతుల్లో వుందో వారిని కూడా సంప్రదించడం మంచిదనిపించింది. వెంటనే అప్పటి దేవాదాయశాఖ మంత్రి శ్రీ వీరమాచనేని వెంకట నారాయణ గారి దగ్గరా, ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డిగారి దగ్గరా కూడా ఈ యజ్ఞం విషయాన్ని ప్రస్తావించాను. వాళ్ళు ఏమీ అభ్యంతరం తెలపలేదు. పైగా "ఎలా మంచిదని తోస్తే అలా చేయవయ్యా" అంటూ మళ్ళీ నాకే వదిలేశారు.

చివరికి పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీకి, జీయర్ స్వామికి మధ్య నేను ప్రతిపాదించిన సమావేశం జరిగింది. ఆ సమావేశంలో ఇలాంటి మహోన్నత యజ్ఞం తిరుమల వంటి పవిత్ర ప్రదేశంలోనే ఎందుకు జరగాలో, అలా జరిగితే వచ్చే ప్రభావం ఎంత గొప్పగా వుంటుందని శాస్త్రాలు ఘోషిస్తున్నాయో వివరిస్తూ జీయర్‌గారు చాలాసేపు మాకు నచ్చజెప్పాలని ప్రయత్నించారు. వారి





పాండితీ గరిమ, చర్చా నైపుణ్యంకన్నా, ఈ బృహత్ కార్యక్రమం జరిపితీరాలనీ, సమాజానికి ఒక ప్రయోజనం సిద్ధించాలనీ జీయర్‌గారి మాటల్లో వ్యక్తమైన ఆరాటం, ఆ కార్యక్రమ ప్రయోజనం పట్ల వారికున్న అచంచలమైన విశ్వాసం మమ్మల్ని కదిలించివేశాయి. ఈ కార్యక్రమాన్ని తిరుమలలో నిర్వహించటానికీ, టిటిడి సహకరించటానికీ కమిటీ అంగీకరించింది. (అయితే నాకు తెలుసు - క్రియా నిర్వహణ బాధ్యత చివరికి నామీద పడుతుంది.)

ఆ అంగీకారం ప్రకారం - యజ్ఞానికి అవసరమైన నిధుల్ని ముందుగా టిటిడి అడ్వాన్సుగా ఇస్తుంది. అదేకాక, యజ్ఞానికి అవసరమైన దినుసులన్నీ టిటిడి (విరాళంగా) సరఫరా చేస్తుంది. జీయర్‌గారు వసూలు చేసే విరాళాల్లో టిటిడి అడ్వాన్సు తిరిగి చెల్లించగా మిగిలే అదనపు సొమ్మంతా టిటిడి ధార్మిక కార్యక్రమాలకి విరాళంగా జీయర్‌గారు ఇచ్చేస్తారు. ఒప్పందం ఖరారైంది. పనులు ఆరంభమయ్యాయి. మరో రెండు మాసాల తరువాత యజ్ఞ నిర్వహణకు తగిన ముహూర్తం కూడా నిర్ణయమైంది.

ఈ మహాయజ్ఞం గురించి రాష్ట్రమంతటా భారీయెత్తున ప్రచారం జరుగుతోంది. ఒక నెల గడిచింది. తిరుమల కొండమీద శ్రీ లక్ష్మీ నారాయణ సహస్రకుండ యజ్ఞానికి ఏర్పాట్లు ముమ్మరంగా సాగిపోతున్నాయి. ఎంపిక చేసిన స్థలాన్ని శుభ్రం చేయడం, పందిళ్ళు వేయడం, కావలసిన వంటచెరకు, దినుసులు, నెయ్యి వగయిరా సరంజామా ప్రోగు చేయటం - కొండమీదకి చేరవేయటం, రాబోయే పండితుల కోసం వాళ్ళ ఆచారాలకు తగినట్లుగా భోజన, స్నానాది వసతి సదుపాయాలు కల్పించడం, భక్తుల కోసం త్రాగునీటి సదుపాయం కల్పించడం, వివిధ రకాల పనులమీద జీయర్‌గారి సిబ్బందితో సమన్వయంతో పనిచేయటానికి టిటిడి అధికారులను, సిబ్బందిని నియోగించడం, రోజువారీ దైవదర్శనానికి వచ్చే యాత్రికులకు ఈ యజ్ఞం వల్ల కలిగే రద్దీ తాకిడి తగలకుండా జాగ్రత్తలు వహించడం, విడిగా ఒక అకౌంట్స్ విభాగం ఏర్పాటు చేయడం... ఇలా అనేక రకాలయిన బాధ్యతలు టిటిడిమీద పడ్డాయి. దాంతో నాకు నిజంగానే ఊపిరి సలపని స్థితి ఏర్పడింది. నాకిది ఫుల్‌టైమ్ పని అయిపోయింది. అయినప్పటికీ - ఒక బృహత్ యజ్ఞంలో పాలుపంచుకొంటున్నానన్న ఆనందంలో అది 'భారం' అని నేననుకోలేదు. శ్రీనివాసుడు వెలసిన తిరుమల గిరుల్లో అసంఖ్యాక మానవాళి సంక్షేమం కోసం ఒక మహాయజ్ఞం జరగబోతోంది. దాని భారం నేను కూడా మోస్తున్నానన్న (నిజంగానా?) ఓ చిరు సంతృప్తి కోసం ఎక్కడలేని ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని తెచ్చుకొని పనిచేస్తున్నాను.... జీయర్‌గారి తరఫున శ్రీ గోపాలాచార్య స్వామి సమన్వయకర్తగా పనిచేస్తున్నారు. కాకతీయ సిమెంట్సుకి చెందిన శ్రీ వెంకటేశ్వర్లు కూడా ఈ యజ్ఞానికి అవసరమైన సరంజామాని తాను యిచ్చిందే కాకుండా, బయటనుండి తీసుకురావడంలో అహర్నిశలు శ్రమించారు.... యజ్ఞం ప్రారంభంకావటానికి ఇంకా 19-20 రోజులు మాత్రమే మిగిలాయి. అప్పటికే జీయర్‌గారి పర్యటన మూడొంతులు పూర్తయినట్లూ, గృహస్థుల స్పందన బాగా వున్నట్లూ వింటూన్నాం.

అకస్మాత్తుగా ఒకరోజు మధ్యాహ్నం నాకు టెలిఫోన్ కాల్ వచ్చింది... "జీయర్‌గారు అస్వస్థతతో మంచం పట్టారు వరంగల్లులో". నేను చాలా ఆందోళన చెందాను. ఆ రాత్రికే వరంగల్లుకి బయల్దేరాను. మర్నాడు ఉదయం హైదారాబాద్‌కి చేరి, వరంగల్లుకి టెలిఫోన్ చేస్తే, జీయర్‌గారిని హైద్రాబాద్ తీసుకువచ్చి మహావీర్ హాస్పిటల్ లో చేర్చారని తెలిసింది. వెంటనే మహావీర్‌కి పరుగులు తీశాను. అక్కడ...

హాస్పిటల్ లో రూమ్ బయట శ్రీ గోపాలాచార్య, శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్యులు, జీయర్‌గారి ప్రియ శిష్యుడు - ఇప్పటి చినజీయర్ గారు - ఇంకా అనేకమంది జీయర్ గారి అనుయాయులు ఆత్రుతతో నిరీక్షిస్తున్నారు. నేను జీయరుగారున్న రూమ్‌లో అడుగు పెట్టాను. బెడ్ మీద జీయర్‌గారు స్పృహలో లేనట్లు పడుకొని వున్నారు. వారి పక్కన కూర్చుని చూస్తున్నాను. కొంతసేపయ్యాక మెల్లగా వారి చెయ్యిపట్టుకొన్నాను.

నా స్పర్శకి వారు కళ్ళు తెరిచారు. నన్ను చూడగానే తేజోవంతమైన ఆ కళ్ళలో ఏదో అనిర్వచనీయమైన ఆనందం తొణికిసలాడింది. వాత్సల్యపూరితంగా నా చేయి నిమిరారు. మరింత దగ్గరికి రమ్మని సైగ చేశారు. దగ్గరికి జరిగాను. వణుకుతున్న కంఠంతో ఆత్రుతగా అడిగారు. - "అక్కడ ఎలా జరుగుతున్నాయి ఏర్పాట్లు..." చెప్పాను. అంతలో కళ్ళు మూసుకున్నారు... కొద్ది క్షణాలు నిశ్శబ్దం. మళ్ళీ కళ్ళు తెరిచారు. అర్ధనిమీలిత నేత్రాలతో నావంక ఆత్మీయంగా చూస్తూ, "ప్రసాద్, యజ్ఞం జరిగే నాటికి మేం ఉండకపోవచ్చు. యజ్ఞకర్తగా మా స్థానంలో వచ్చే వారసుడు వ్యవహరిస్తారు. ఆయన సమర్థుడు... అయినా ఏర్పాట్లు పర్యవేక్షించే భారం మొత్తం నీదే. నీ సహకారంతో ఇది జరగాలని దైవ సంకల్పం..." అంటూ జీయర్‌గారు మళ్ళీ కోమాలోకి వెళ్ళిపోయారు. నేను నిరుత్తరుడ్నయిపోయాను.... ఏదో అర్జంటు పని వుండటంతో అక్కడ్నుంచి నేరుగా తిరుపతికి వచ్చేశాను. అప్పటికి అక్కడ ఒక వార్త నాకోసం సిద్ధంగా వుంది - "జీయర్‌గారు దైవ సాన్నిధ్యం చేరుకున్నారు!"

అంతే! నా పరిస్థితి అగమ్యగోచరంగా తయారైంది. యజ్ఞం జరగటానికి ఇంకా కొద్దిరోజులు మాత్రమే వుంది. ఇది దైవాన్ని ఆరాధిస్తూ, మానవ సంక్షేమం కోసం జరిగే ఒక అసాధారణమైన బృహత్ క్రతువు. ఎన్నో లక్షల రూపాయల వ్యయం, వందలాది కార్యకర్తల సమయం, శక్తీ గత రెండు మాసాలుగా ఖర్చయ్యాయి. ఇంత జరిగాక ఇలాంటి అరుదైన భారీ కార్యక్రమం ఆగిపోతుందా? ఈ యజ్ఞం కోసం చొరవతీసుకుని టిటిడి అధికారుల్నీ, ఇతర భక్తుల్నీ ఎంతోమందిని ఇందులోకి దింపాను. ఇన్ని ప్రయత్నాలు జరిగాక, యజ్ఞం జరగకపోతే, ఈ శ్రమకి అర్థం ఏమిటి? టిటిడి అడ్వాన్సు చేసిన సొమ్ము సంగతి ఏమిటి! భక్తులిచ్చిన విరాళాలకు సిద్ధించే ప్రయోజనం ఏమిటి? సంబంధిత వర్గాలందరికీ నా సంజాయిషీ ఏమిటి?... ఈ పరిస్థితినుంచి ఎలా బయటపడతానో?






అద్భుతయజ్ఞంలో అప్పటి కేంద్రమంత్రి
శ్రీ పి.వి.నరసింహారావు

ఈ ఆందోళన నిండిన మనస్సుతో తిరుమల ఆలయంలోకి వెళ్ళాను... "సర్వశక్తి సంపన్నుడవని ప్రజలు విశ్వసించే నీ అనుగ్రహం - సమస్త ప్రజలమీద ప్రసరించాలన్న ఉన్నత లక్ష్యంతో ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టాం. ఏం జరిగినా ఎలా జరిగినా నీదే భారం స్వామీ...." అనుకొంటూ అలా ధ్యానంలో వుండిపోయాను. బయటకు వచ్చేసరికి అందిన వార్త - "జీయర్‌గారి వారసులుగా చిన జీయర్ మఠాధిపత్యం స్వీకరించబోతున్నారు."

నేను మా అధికార్లతో, సంబంధితులందరితో చర్చించాను. సుదీర్ఘంగా సాగిన ఆ చర్చల్లో అనేక ప్రశ్నలు ఉదయించాయి. యజ్ఞాన్ని జరపటానికి ముందుకు సాగాలా వద్దా? యజ్ఞాన్ని విరమించుకుంటే ఏమవుతుంది? విరమించుకోకుంటే, ముందుకు సాగటం ఎలా? ముందుకు వెళితే, సవ్యంగా బయటపడతామా... ?

రెండురోజుల తరువాత, కాబోయే జీయర్‌గారు శ్రీవిల్లిపుత్తూరు వెళ్ళి, అక్కడ సన్యాసాశ్రమం, పీఠం బాధ్యత స్వీకరించి, త్రిదండి చినశ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌గా తిరుమల వచ్చారు. నూనూగు మీసాల వయస్సులో సన్యాసాశ్రమం స్వీకరించిన చినజీయర్ అపారమైన ఉత్సాహం, ఆధ్యాత్మిక కళ ఉట్టిపడుతుండగా, మృదుమధురమైన సంభాషణా చాతుర్యంతో, ఎలాంటి జటిల సమస్య ఎదురయినా చలించని పరిణతి నిండిన ఆలోచనా విధానంతో కొద్దిరోజుల్లోనే అందరినీ ఆకట్టుకున్నారు.

అయస్కాంత శక్తి నిండిన తన చూపులతోనే అందరికీ సూచనలు ఇస్తూ, చకచకా తాను నడుస్తూ, అందర్నీ నడిపిస్తూ, కార్యకర్తలందరిలోనూ ఎనలేని ఉత్సాహాన్ని, విశ్వాసాన్ని ఉద్దీపింపజేస్తూ ఆ కొద్దిరోజుల్లోనే - ఆయన అక్కడ అందరికీ ఆమోదయోగ్యుడైన యజ్ఞసారధిగా, స్ఫూర్తి ప్రదాతగా నిలిచారు. శ్రీ లక్ష్మీనారాయణ సహస్రకుండ యజ్ఞానికి యజ్ఞకర్తగా నడుం బిగించారు. పెద జీయర్‌గారే ఆవహించి చినజీయర్‌గారి చేత కార్యక్రమం నడిపిస్తున్నారా అని అందరూ అబ్బురపడేలా ఆయన రంగంలోకి దిగారు.

అంతే! మరి తిరుగులేదు. యజ్ఞశాలలోని ఋత్విక్కుల వేదమంత్రోచ్చారణలతో తిరుమల కొండలు ప్రతిధ్వనిస్తుండగా, సహస్ర హోమకుండాల నుంచి ఏకధాటిగా వెలువడుతున్న పొగవలయాలు యజ్ఞపురుషుడి ఆశీస్సులా అన్నట్లుగా ఆకాశంలో నలుదెసలా వ్యాపిస్తుండగా, అక్కడ


యజ్ఞం సందర్భంగా త్రిదండి శ్రీమన్నారాయణ చిన జీయర్ స్వామి తిరుమల ఆలయానికి వచ్చినప్పుడు

పూజల్లో పాల్గొన్న వేలాది దంపతులు చేస్తున్న నిరవధిక భగవన్నామస్మరణ - కొండకి వస్తున్న లక్షలాది యాత్రికుల్లో భక్తిభావాలను పరవళ్ళు త్రొక్కిస్తుండగా - నా భయాందోళనలను పటాపంచలు చేస్తూ, నా ఊహాకందనంత విజయవంతంగా ఆ మహాక్రతువు జరిగింది. పూర్ణాహుతి రోజున చినజీయర్ గారి ఆశీఃపలుకులతో ఆ కార్యక్రమం అత్యంత ఘనంగా ముగిసింది.... ఆ ముగింపు సమయంలో నాకు తెలియకుండానే నా కళ్ళు చెమర్చాయి. ఎలా ఆ గండం గడిచిందో, ఎంత విచిత్రంగా అనూహ్యంగా అంతా సవ్యంగా జరిగిపోయిందో, ఆగిపోవాల్సిన బృహత్ యజ్ఞాన్ని - ఏ శక్తి అమోఘంగా ముందుకు నడిపించిందో... ఎవరు చెప్పగలరు? టిటిడి అడ్వాన్సుగా యిచ్చినదానికంటే, యితరత్రా ఖర్చు పెట్టినదానికంటే చాలా ఎక్కువగా డబ్బు మిగిలింది. అది టిటిడికి జమ చేయబడింది.

కానీ, చినజీయర్ గారి గురించి ఆనాటి నా అంచనా తప్పుకాలేదని ఎవరైనా చెప్పగలరు. ఈ పాతికేళ్ళ కాలంలో - సామూహిక విష్ణు పారాయణ, 'గీతాజ్యోతి' వంటి అనేక ఆధ్యాత్మిక ప్రచార ఉద్యమాలతోనూ, జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్టు ద్వారా చేపట్టిన విద్యా, సేవా కార్యక్రమాలతోనూ వామనావతారం స్థాయి నుంచి త్రివిక్రముడి స్థాయికి ఎదిగిన శ్రీ చినజీయర్‌గారు - పెద జీయర్ గారిని మరిపింపజేశారని వారి శిష్యులు అంటూంటారు. హరుడు నిజమైన హరిభక్తుడని నాలాంటి మధ్వులంతా విశ్వసిస్తారు. అత్యంత హరిభక్తుడైన హరుడ్ని ద్వేషించేవాడు వైష్ణవుడు కాలేడు. కాని ఈ వాదం కొందరు వైష్ణవులకు ఆమోదయోగ్యం కాదన్నది తిరుమలలో నేను చూసిన పరిస్థితి. అయితే వైష్ణవ పీఠానికి ఆధిపత్యం వహిస్తున్నప్పటికీ, శ్రీ చినజీయర్‌గారు ఇటీవల మానస సరోవరయాత్ర చేసి, కైలాస పర్వత ప్రదక్షిణం కూడా చేయటం ద్వారా - హరి, హరుల మధ్య వుండే సంబంధాన్ని మరోసారి నిర్ధారించినట్లయింది.

భక్తకోటికి ఒక అమూల్యమైన సందేశాన్ని అందించినట్లయింది!!!

* * *



# 11
# కాసులహారం

ఆ రోజు 1980 అక్టోబరు నెల చివరి వారంలో ఒక గురువారం. ఆ మధ్యాహ్నం నేను చాలా అత్యవసరమైన సమావేశంలో వుండగా, ఆలయ పేష్కార్ దగ్గర్నుంచి ఒక ఫోన్‌కాల్ వచ్చింది. పేష్కార్ నాకు చెప్పిన విషయమేమిటంటే - కర్నాటక నుండి 20 మంది సభ్యుల (భక్తుల) కుటుంబం ఒకటి వచ్చింది. వాళ్ళంతా 108 బంగారు నాణాలతో (కాసులతో) స్వామివారి కోసం ఒక కాసుల హారం (నెక్లెసు) తయారుచేయించారు. ప్రతి ఒక కాసుమీద శ్రీవారి నామం, అమ్మవారి నామం చెక్కించారు. ఆ కాసుల హారాన్ని స్వామి వారికి సమర్పించుకోవాలని ఆ భక్తుల కోరిక. అంతేకాదు, ఆ హారాన్ని ఆ మర్నాడే (శుక్రవారం) అభిషేకానంతరం స్వామివారికి అలంకరిస్తే, తమ కుటుంబసభ్యులంతా శ్రీవారిని ఆ అలంకారంలో చూసి తరించాలన్నది వారి తాపత్రయం.

నిజానికి అప్పటికే కొన్ని దశాబ్దాలకాలంగా అమలులో వున్న నిబంధనల ప్రకారం - ఏ భక్తుడయినా స్వామి వారికి తమ ముడుపును ఏ బహుమానం రూపంలో ఇవ్వాలనుకున్నా దాన్ని నేరుగా హుండీలో సమర్పించుకోవాలి లేదా, వారి సంతృప్తి కోసం వారు ఆ బహుమానాన్ని ఆలయ అధికారులకిచ్చి రశీదు తీసుకోవచ్చు. అక్కడ్నుంచి ఆ బహుమానం టి.టి.డి. ట్రెజరీకి పంపించబడుతుంది. అలాకాక ఎవరైనా భక్తులు తాము తెచ్చిన

బహుమానాన్ని స్వామి వారికి అలంకరింపజేయాలని కోరుకున్నట్లయితే, వారు ఆ బహుమానం విలువకు సమానమైన సొమ్మును (వర్తన) దేవస్థానానికి చెల్లించాల్సి వుంటుంది. (పాతకాలంలో రాజులు, జమీందారులు, ఇతర సంపన్నులు తరచూ ఇలాంటి బహుమానాలు తీసుకువచ్చి, శ్రీవారికి అలంకరింపజేయాలని పట్టుబడుతుండే నేపథ్యంలో ఈ నిబంధనని ప్రవేశపెట్టినట్లు కనుపిస్తుంది.) ఈ నిబంధన గురించి పేష్కార్ అప్పటికే భక్తుల బృందానికి వివరించడం జరిగింది. కాని వాళ్ళ ఆరాటం, ఆవేదన ఈ నిబంధన వినిపించుకొనేలా లేవు. శ్రీనివాసుని ఆదేశాల మేరకే తాము ఈ కాసులహారం తయారుచేయించి, తిరుమలకు వచ్చామనీ, ఈ ముడుపు తనకు సమర్పించుకోవటంలో ఏదైనా ఇబ్బంది వుంటే ఎవరినో కలుసుకోవాలని కూడా శ్రీనివాసుడే చెప్పాడనీ... వాళ్ళు పేష్కార్‌తో పదేపదే విన్నవించుకున్నారట. అతనికి ఏం చేయాలో తోచక నాకు ఫోన్ చేశాడు. నేను, "సరే, ఓ గంటలో నేనే అక్కడికి వస్తాలేవయ్యా" అన్నాను. అలాగే కొండమీదకి చేరుకున్నాను. ఆ భక్త కుటుంబాన్ని తీసుకువచ్చి పేష్కార్ నాకు పరిచయం చేశాడు.

* * *

కర్నాటకలోని చిక్‌మగళూర్ జిల్లా లక్కపల్లి గ్రామానికి చెందిన ఆ కుటుంబానికి పెద్ద డి.ఎస్. నాగరాజారావు. ఒక ప్రాథమిక టీచర్. తన చిన్న జీతంతోనే అతను తన తల్లిదండ్రుల్ని, చెల్లెళ్ళని, తమ్ముళ్ళని, తన కుటుంబాన్ని పోషించుకోవాల్సిన స్థితి. పేరుకి కొద్దిగా భూమి వున్నా, అదంతా బీడు పడిందవటంవల్ల దానిమీద వచ్చే ఆదాయం శూన్యం. ఆ నాగరాజారావు చెప్పిన కథ ఇలా వుంది...

15-16 సంవత్సరాల క్రితం నాగరాజారావుకి ఒక రాత్రి స్వప్నంలో శ్రీ వేంకటేశ్వరుడు ప్రత్యక్షమై "నాకు కాసుల పేరు సమర్పించుకుంటావా?" అని అడిగాడు. దాన్ని నాగరాజారావు పెద్దగా పట్టించుకోలేదు. ఒకరోజు గడిచాక ఒక ఉదయాన్నే ఎవరో భక్తులు అతనింటికి వచ్చి తిరుపతి ప్రసాదం లడ్డు ఇచ్చారు. వెంటనే నాగరాజారావుకి ఆ ముందురోజు రాత్రి కల జ్ఞాపకం వచ్చింది. దాంతో కుటుంబ సభ్యులందర్నీ సమావేశపరిచి, ఈ విషయం చర్చించాడు. "ఏం చేద్దాం" అంటే "ఏం చేద్దాం?" అంటూ అందరూ ముఖాముఖాలు చూసుకున్నారు. ఎందుకంటే ఆ ఇంట్లో ప్రతి ఒక్కరూ శ్రీనివాసుని ఉనికిపట్ల విశ్వాసం, భక్తి వున్నవాళ్ళే - కాని స్వామి వారికి 108 కాసుల పేర్లు సమర్పించుకొనేటంత స్తోమతు వాళ్ళకి లేదు. కనీసం ఒక





బంగారు కాసు చేయించే శక్తి కూడా లేదు. ఏం చేయాలో తెల్చుకోలేక "తరువాత చూద్దాంలే" అంటూ ఆ విషయాన్ని అప్పటికి వాయిదా వేశారు.

... ఆ రాత్రి మళ్ళీ నాగరాజారావుకి స్వప్నంలో స్వామివారు సాక్షాత్కరించారు. మరోసారి తన అభీష్టాన్ని గుర్తు చేశారు. ఈసారి నాగరాజారావు ఈ అంశాన్ని గట్టిగా మనసుకి తీసుకున్నాడు. మర్నాడు కుటుంబ సభ్యులందర్నీ కూర్చోబెట్టాడు. జరిగిన సంఘటనలన్నీ నెమరువేసుకున్నారు. ఒక నిర్ణయానికి వచ్చారు. అదేమంటే - రాగి కాసుల హారం తయారు చేయించి, అందులో అక్కడక్కడా కొన్ని వెండికాసులు చేరుద్దామని. మళ్ళీ ఆ రాత్రి నిద్రలో నాగరాజారావుకి శ్రీవారు దర్శనమిచ్చి "బంగారు కాసుల పేరు కానుకగా ఈయవా?" అని మరోసారి నొక్కిచెప్పారు. దీంతో నాగరాజారావు తట్టుకోలేకపోయాడు. ఆ రాత్రి ఇంక నిద్రపట్టలేదు. ఎంత త్వరగా తెల్లవారుతుందా, ఎంత వేగంగా ఈ విషయాన్ని ఇంట్లో అందరికీ చెప్పి, పరిష్కారం వెతుకుదామా అన్న ఆరాటంలోనే ఆ మిగతా రాత్రి గడిపాడు. తెల్లవారుతూనే మళ్ళీ కుటుంబమంతా కూర్చున్నారు. "ఇంట్లో ఆడవాళ్ళ మంగళసూత్రాలన్నీ కలిపినా ఒకటి రెండు బంగారు కాసులుకన్నా చేయించలేమే - 108 కాసులతో బంగారు హారం ఎలా చేయించాలి... ఎలా, ఎలా?" అలా తర్జన భర్జనలయ్యాక, "సరే, కానుక కోరిన ఇలవేలుపే, ఈ సమస్యని కడతేర్చే మార్గం చూపిస్తాడు" అనుకున్నారు. అంతే!

... ఆ రోజు నుంచి తమ కుటుంబం అంతా రోజుకి ఒక్కసారి భోజనం మానేసి, అందువల్ల మిగిలే ఖర్చు శ్రీవారి బంగారు కాసుల కోసం ఆదా చేయాలన్నదే వారు తీసుకున్న నిర్ణయం. ఆరుమాసాలపాటు ఆ కుటుంబంలోని పసిపిల్లల దగ్గర్నుంచి వృద్ధులదాకా ప్రతి ఒక్కరూ రోజుకి ఒక పూట ఉపవాసదీక్ష అవలంబిస్తూ వచ్చారు. అలా కూడబెట్టిన సొమ్ముతో ఆరుమాసాల తరువాత వాళ్లు చేయించగలిగింది రెండు బంగారు కాసులు! ఇంకా 106 కాసులు తయారు చేయించాలి. నాగరాజారావు కుటుంబం శ్రీనివాసుడి మీదే భారం వేశారు. నిత్యం స్వామిని స్మరిస్తూ, ఉపవాసాలు కొనసాగించారు....

ఈలోగా క్రమంగా ఇంట్లో పరిస్థితులు మారుతూ వచ్చాయి. నాగరాజారావు తమ్ముడొకడికి ఉద్యోగం వచ్చింది. ఆ మరుసటి సంవత్సరం ఆ ప్రాంతంలో ఒక నీటిపారుదల పథకం అమల్లోకి వచ్చి, నాగరాజారావు పొలాల్లోకి సాగునీరు ప్రవహించింది. రెండు, మూడు సంవత్సరాల కాలంలో వాళ్ళ బీడు భూముల్లో సేద్యం ఆరంభమైంది. వేసిన పంటలన్నీ

సత్ఫలితాలనిస్తూ వచ్చాయి... మెరుగుపడిన ఆర్థిక పరిస్థితితో బంగారు కాసుల సేకరణ ఉద్యమం పుంజుకుంది... ఆరంభించిన 16 సంవత్సరాలకి వాళ్ళ దీక్ష ముగింపుకొచ్చింది. 108 కాసులహారం తయారయింది. ఉపవాసాలతో పొదుపు చేసిన సొమ్ము, పంటలమీద ఆదాయంలో ఖర్చులు పోగా మిగిలిన సొమ్ము.... అలా అలా వాళ్ళు జీవించడం కోసం తిన్నది మినహా, మిగతా ప్రతి రూపాయిని పోగుచేసి, అణువణువునా పొంగిపొర్లే భక్తిభావంతో ఆ రూపాయల్ని బంగారు కాసులుగా మార్చి శ్రీవారికి కానుకగా సమర్పించుకొనే ముహూర్తం వచ్చిన రోజున మరోసారి తిరుమలేశుడు నాగరాజారావు కలలో దర్శనమిచ్చాడు. "అంతా కలిసే తయారు చేశారుగా హారాన్ని. మరి, అంతా కలిసే కొండకి వచ్చి, నా ముడుపు చెల్లించుకోరా! మీ హారంలో నన్ను దర్శించుకోరా?" అని స్వామి వారు కోరారు. ఇంకా విచిత్రం "మీకేమైనా ఇబ్బంది వస్తే 'ఈ వ్యక్తిని' కలుసుకోండి" అని చెబుతూ స్వామి వారు ఒక మనిషిని చూపించి అంతర్థానమయ్యారు.

... అంతా విన్నాను. శ్రీనివాసుడిపట్ల అనిర్వచనీయమైన నిర్మలమైన ఆ భక్తి, స్వప్నంలో స్వామి వారి చెప్పినట్లు అనిపించిన పలుకులపట్ల అచంచలమైన విశ్వాసం, ఆయన చెప్పినట్లు చేసి తీరాలన్న ఆరాటం - నాగరాజారావు కుటుంబ సభ్యుల మొహాల్లో ప్రస్ఫుటంగా కనుపిస్తోంది. అప్పటికే భక్తికీ, దారిద్ర్యానికీ మధ్య దూరాన్ని ఛేదించుకుంటూ 16 సంవత్సరాలు సుదీర్ఘ ప్రయాణం చేసి, శ్రీవారి కానుకతో కొండకి వచ్చిన వారి దగ్గర లక్కపల్లి తిరిగి వెళ్ళటానికి ఖర్చులకి సరిపడే సొమ్ము మాత్రమే మిగిలిందిట... ఇలా చెబుతున్న నాగరాజారావుకి ఒక్కసారిగా ఏదో స్ఫురించింది. మరుక్షణం ఆర్ద్రత, ఆనందం నిండిన కంఠంతో - "మీరే, మీరే, నాకు కలలో వేంకటేశ్వరస్వామి చూపించిన వ్యక్తి. మిమ్మల్నే కలుసుకోమని చెప్పాడు..." అంటూ నాగరాజారావు ఉద్వేగంతో నా చేయి పట్టుకొని ఊపేశాడు. నా కళ్ళు చెమ్మగిల్లాయి.

వారి పరిస్థితి అర్థమైంది. ఆ కాసులహారాన్ని స్వామి వారికి అలంకరింపజేయటానికి నిబంధనల ప్రకారం కావలసిన 'వర్తన' ఇచ్చే స్తోమతు లేదు సరికదా, అభిషేకానంతరం దర్శనం చేయటానికి చెల్లించాల్సిన రుసుము చెల్లించే పరిస్థితి కూడా వారికి లేదు. వారికి ఉన్నదల్లా ఒక్కటే "శ్రీనివాసుడు చెప్పినట్లు చేశాం. కనుక, ఆయన అభీష్టం నెరవేరేలా ఆయనే చూస్తాడు." అన్న అపారమైన నమ్మకం.





... నా హృదయాంతరాళాల్లో నాకు అంతపట్టని స్పందన. నాకు తెలీకుండా నా కంటి నుంచి బాష్పాలు. ఏం జరుగుతోందో తెలీదు. ఎందుకిలా జరుగుతోందో అర్థంకాలేదు. కాని ఆ కొండమీద వెలిసిన స్వామిపట్ల వారికి గల విశ్వాసానికి న్యాయం చేయాల్సిన బాధ్యత - ఆ స్వామి సేవకుడిగా నా మీద వుందని మాత్రం స్పష్టంగా తెలుస్తోంది. నిబంధనల ప్రకారం వర్తన అడుగుదామా అంటే కనీసం రెండు లక్షల రూపాయలకి పైగా (ఆ హారం విలువని బట్టి) వాళ్ళు చెల్లించాల్సి వుంటుంది. పోనీ వర్తన లేకుండా, హారాన్ని స్వామి వారికి అలంకరింపజేద్దామా అంటే, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి అలాంటి విచక్షణాధికారాలు లేవు. విధ్యుక్త ధర్మానికీ - విశ్వాసాల విలువలకీ మధ్య అదొక సంఘర్షణ. కానీ వారి మొహాల్లో ఆ భక్తి, ఆవేదన, ఆరాటం, 16 సంవత్సరాల శ్రమ ఫలితంగా దక్కుతుందనుకొంటున్న మధుర క్షణంకోసం ఆర్తితో ఎదురుచూపులు చూస్తుంటే - 'వీలుపడదు' అని చెప్పలేకపోయాను.

వారి విశ్వాసం వమ్ముకాకుండా వారికి సహాయపడటమే న్యాయం అనిపించింది. వారికీ, వారి స్వామికీ మధ్య - వాళ్ళు వుందనుకొంటున్న అనుబంధాన్ని లేదనటానికీ, వున్నా దాన్ని నిరాకరించటానికీ మధ్యలో నేనెవర్ని? అక్కడ నా ఉద్యోగం - ఆయనకీ, ఆయన భక్తులకీ నిష్కల్మషంగా సేవ చేయటమే గదా!... - ఈ ఆలోచనలు రావటమే ఆలస్యం - నేను పేష్కార్‌కి ఆదేశాలిచ్చాను - వారి కోరిక ప్రకారమే కానీయండి. 'వర్తన' చెల్లింపునుండి వారిని మినహాయించండి.

ఆ ప్రకారం ఆ మర్నాడు అభిషేకం తరువాత స్వామివారిని ఆ కాసుల హారంతో అలంకరించారు. ఆ కుటుంబమంతా 'గోవిందా' అనుకుంటూ తనివితీరా స్వామివారిని వీక్షించారు. ఆ క్షణంలో వాళ్ళ కళ్ళల్లో తొణికిసలాడిన ఆనందం, భక్తిపారవశ్యం... ఏమని వర్ణించగలను!

... ఆ తరువాత కొన్ని రోజులకి జరిగిన టిటిడి బోర్డు సమావేశంలో నేను చేసిన 'నిబంధనల ఉల్లంఘన' గురించి వివరించాను. పర్యవసానం ఎలా వుంటుందో తెలీకపోయినా, ఎలాంటి పర్యవసానానికైనా సిద్ధపడి వున్నాను. అయితే బోర్డు సభ్యులంతా దైవచింతనగల వాళ్ళే కావడంతో, నాగరాజారావు భక్తిగాథ వారిని కూడా కదిలించివేసింది. వెంటనే బోర్డు ఆ కాసులహారం విషయంలో నేను తీసుకున్న చర్యకి ఆమోదముద్ర వేసింది. అంతేకాదు, "భవిష్యత్తులో ఇలా ఎవరైనా పేద భక్తులు ఇవ్వదలచిన బహుమానాల విషయంలో కూడా 'వర్తన'కి మినహాయింపు ఇవ్వాలి" అని కూడా తీర్మానించింది.

నాకిప్పటికీ అంతుపట్టని ప్రశ్నలలో ఇది కూడా ఒకటి. ఎందుకలా జరిగింది? ఏ శక్తి నాగరాజారావుకి కాసులహారం చేయించమని ప్రేరణ కలిగించింది, తదనుగుణంగా నిర్ణయం తీసుకునేలా నాకు శక్తినిచ్చింది?.

★ ★ ★



తిరుమల మూర్తులు-5

## మలయప్ప స్వామి

యాదవరాయరాజుల కాలంలో కళ్యాణోత్సవం, డోలోత్సవాలు ప్రవేశపెట్టబడ్డాయి. ఇప్పుడు ఏడాదికి 450 ఉత్సవాలు జరుగుతాయి. ఉగ్ర శ్రీనివాసుడి విగ్రహాన్ని బయట ఊరేగింపులకి తీసుకెళ్ళడం మానేసిన దగ్గర్నుంచీ శ్రీదేవి, భూదేవి సహిత మలయప్పస్వామి విగ్రహాన్నే అన్ని ఉత్సవసేవల్లోకీ తీసుకువెళ్తున్నారు. మూడడుగుల ఎత్తుండే ఈ విగ్రహాన్ని 'ఉత్సవబేరం' అంటారు. ఇప్పుడు బ్రహ్మోత్సవాలలో భక్తులు చూసే విగ్రహం ఇదే.







# 12

# హరే, శ్రీనివాస

"గోవిందా... జయగోవిందా.... భజగోవిందా..." అంటూ శ్రీనివాస దాసుల సమూహం భక్తి పారవశ్యంతో చేస్తున్న భజననాదాల హోరుతో తిరుమల పుష్కరిణి సమీపంలోని ఆ సభాప్రాంగణం ప్రతిధ్వనిస్తోంది.

పరవళ్ళు త్రొక్కుతున్న భక్తిభావంతో, ఆ దాసులంతా తిరుమలేశుని నామస్మరణ జలధిలో మునిగిపోయారు. ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న ఆ దాసుల శ్రీనివాస ఆరాధనా కెరటాల తాకిడికి నేను కూడా పరవశించిపోయాను - అనాలోచితంగానే హరినామస్మరణలో ఓలలాడాను. అలా శ్రీనివాసుని భజిస్తూ, నర్తిస్తూ భక్తి ప్రపంచంలో విహరించాక, గురువుల ఆశీఃపలుకులతో లౌకిక ప్రపంచంలోకి వచ్చిన ఆ దాసుల్ని చూసి ఆనందం పట్టలేక అడిగాను - "శ్రీనివాసుడి దాసులుగా మీ భక్తి తత్పరత అపారమైంది... అసాధారణమైంది. తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా మీకు నేనేం చేయగలనో చెప్పండి?..."

వాళ్ళంతా ముక్తకంఠంతో వ్యక్తంచేసిన 'అతి పెద్ద' కోరిక ఏమంటే - "సంతృప్తికరమైన శ్రీనివాస దర్శనం!!" అనుక్షణం ఎవరి నాలుకమీద శ్రీనివాస నామం నర్తిస్తోందో, ఎవరి హృదయాల్లో శ్రీ వేంకటేశ్వరుడి రూపం మాత్రమే నిక్షిప్తమైవుందో, ఎవరి శక్తీ, భక్తీ సమస్తం ఆ స్వామి ఆరాధనకే అంకితమో - వాళ్ళు నన్ను అడిగేది - "మంచి దర్శనం ఇప్పించండి స్వామి..."

"ఇంతేనా! నీ ఈ దాసులకోసం ఇంతకన్నా ఏమీ చేయలేనా శ్రీనివాసా..." అనుకుంటూ క్షణకాలం కళ్ళు మూసుకున్నాను. ఆ క్షణంలో...

సమస్త జనావళి శ్రీనివాసదాసులైపోయినట్లూ, శ్రీవారి కరుణా కటాక్ష వీక్షణాలు ఇంటింటా ప్రసరిస్తున్నట్లూ, ప్రతి ఒక్కరూ - కోటి సూర్యప్రభా కాంతులతో వెలుగొందే తిరుమల వేంకటేశ్వరుడి ముందు నిలబడి హరినామస్మరణతో మోక్ష ప్రాప్తికి దారులు వేసుకుంటున్నట్లూ - ఒక అవ్యక్తమైన చిత్రం మనసులో మెదిలింది. (ఎవడా చిత్రకారుడు?) అంతే, ఆ ప్రేరణతో అప్పటికప్పుడు, (నా అధికార పరిధిని అతిక్రమించి) అప్రయత్నంగా ఒక ప్రకటన నా నోటి నుంచి వెలువడింది. ఆ తరువాతకాలంలో అదొక 'మహత్తర ఉద్యమానికి' కారణమైంది... ఇది జరిగి 24 ఏళ్ళు గడుస్తోంది. నిజానికి అప్పుడు ఏం జరిగింది? ఎందుకు అలా జరిగింది? దాని పర్యవసానం ఏమిటి?... అని వెనక్కి తిరిగి చూస్తే...

* * *

**1979** జనవరి - ఫిబ్రవరి ప్రాంతంలో ఒక 'దాస' భక్తుడు శ్రీ పరిగి వసంతకుమార్ నా దగ్గరకు వచ్చారు. తిరుమలలోని పుష్కరిణి దగ్గరున్న వ్యాసరాయ మఠంలో గురు గోవింద విఠల్ దాసు గారి ఆధ్వర్యంలో పురందరదాసు ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయనీ, చివరి రోజు కార్యక్రమంలో నేను ముఖ్య అతిథిగా పాల్గొనాలనీ ఆయన కోరిక.

నేను యధాలాపంగా "సరే, చూద్దాం" అన్నాను. కాని ఆయన పట్టువిడవకుండా, తప్పకుండా నేనీ కార్యక్రమానికి రావాలని పదే పదే అభ్యర్థించాడు.

"ఆరాధనోత్సవాలు ఎప్పుడూ జరిగేవే కదా, ఎందుకంత పట్టుబడుతున్నారు?"

ఆ ప్రశ్నతో అవకాశం తీసుకొని, శ్రీ పరిగి 'దాస' తత్త్వం - 'దాస' ఆరాధనా విధానం గురించి వివరించారు.

కొన్ని శతాబ్దాల క్రితంవరకూ వేదాలు, ఉపనిషత్తులు, మహాభారతం, భాగవతం, ఇతిహాస పురాణాలు సామాన్య మానవులకు భాషాపరంగా అందుబాటులో లేవు. కర్ణాటక ప్రాంతంలోని కొందరు మహా పండితులు దేవనాగరలిపిలోని ఈ సాహిత్యాన్ని పామర జనంలోకి తీసుకువెళ్ళాల్సిన ఆవశ్యకతని గుర్తించారు. అలా గుర్తించి, కుల, వర్ణ, లింగ వివక్షత లేకుండా, ప్రజలలో ప్రచారం చేయాలని సంకల్పించి, అందుకోసం మొదట నడుంకట్టిన పండితోత్తములు శ్రీ నరహరి తీర్థులు, శ్రీ శ్రీపాదరాయలు, శ్రీవాది రాజస్వామి. మధ్వ సన్యాసులైన వీరి తరువాత వ్యాసరాయ శిష్యులైన పురందరదాసు, కనకదాసులు, తరువాయి పరంపరగా విజయదాసులు, గోపాలదాసులు, జగన్నాథదాసులు పామరజన రంజకమైన కన్నడ భాషలో ఈ బృహత్ సాహిత్యాన్ని





హరికథామృతసార ప్రవాహంగా ప్రచారంలోకి తీసుకువచ్చారు. కీర్తనలు, దేవరనామాలు, భజనలు వగయిరా రూపాల్లో వ్యాస సాహిత్యం దాస సాహిత్యంగా ప్రచారంలోకి రావటంతో గడచిన కొన్ని శతాబ్దాలకాలంలో వేద, ఉపనిషత్తుల ఆధ్యాత్మిక తత్త్వసారం కర్ణాటకలో నలుదెసలా ప్రాకుతూ వచ్చింది. విజయనగర సామ్రాజ్య పతనంతో, పురందరదాసు కనకదాసుల నిర్యాణంతో తగిన ప్రోత్సాహం లేకా, వ్యవస్థాపరమైన పునాదులు లేకా ఈ ఉద్యమం ప్రజల్లోకి వెళ్ళాల్సినంత లోతుగా, విస్తృతంగా పోలేకపోయింది. కాని 'దాస' దీక్ష తీసుకున్న వారి అంకితభావం మాత్రం దృఢమైంది, అపారమైంది.

ఒకసారి దీక్ష తీసుకుంటే, ఆ 'దాసుడు' - తన తుది శ్వాస వరకూ (గృహస్థుగా వుంటూనే) తాను హరికి దాసుడ్ని మాత్రమేనన్న భావనతో కూడిన 'దాస' జీవితాన్నే గడపాల్సి వుంటుంది. తనకు లభించే ఆధ్యాత్మిక పరిణతినిబట్టి, ఆ 'దాసు' దేవరనామాల్ని రూపొందించవచ్చు. తన ద్వారా దీక్ష తీసుకుని 'దాస' జీవితాన్ని సాధన చేసే మరో ముముక్షువుకి ఒక అంకితనామాన్ని గురువుగా ప్రసాదించవచ్చు . ఇలా సాగిపోయే 'దాస' గురు - శిష్య పరంపర ఉద్యమంలో, ఒక 'దాస' గురువుకి శిష్యుడు కాగల యోగ్యత రావాలంటే, ఆధ్యాత్మిక జీవనాన్ని మనస్ఫూర్తిగా సాధన చేయగల స్థాయిని సంపాదించుకోవాలి.

... "అలాంటి 'దాస' గురు శిష్యపరంపరలో వచ్చిన గురు గోవింద విఠల్ దాసు ఆధ్వర్యంలో ఇప్పుడు పురందరదాసు ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి...." అంటూ శ్రీ పరిగి వివరించారు.

గురు గోవింద విఠల్ దాసు - వృత్తిరీత్యా పూర్వాశ్రమంలో కర్ణాటక ప్రభుత్వంలో P. W. D. లో సబ్ ఓవర్సీర్. దాస ఉద్యమంలో చేరాక ఆయనొక గురువుగా ఎదిగాడు. దాదాపు 800 దేవర నామాలు రూపొందించిన విఠల్ దాసు దీక్ష ఇచ్చి, అంకితనామాలిచ్చి సుమారు 250 మంది శిష్యుల్ని తయారుచేశారు. వాళ్ళల్లో ఎవడు ఏ కులానికి చెందినవాడు అన్న ప్రశ్నకు తావేలేదు. హరిదాస దీక్షలో శ్రద్ధ చూపించిన హుస్సేన్ సాహెబ్‌కు కూడా అంకితనామం యివ్వటం జరిగింది.

శ్రీ పరిగి చెప్పిందంతా విన్నాక, ఈ దాసులందరి శిష్యపరంపర వ్యవస్థ నాలో కొంత ఉత్సుకత రేకెత్తించింది. ముఖ్యంగా గృహస్థుగా వుంటూనే 'దాస' జీవనాన్ని సాధన చేయడం, నిరక్షరాస్యులలో సయితం ఆధ్యాత్మిక జ్ఞానజ్యోతుల్ని నిరంతరం ఉద్దీపింపచేసేలా హరికథామృత సారాన్ని ప్రచారం చేయటం, కుల, వర్ణ, లింగ వివక్షత లేకుండా - ఆధ్యాత్మికచింతన ప్రాతిపదికగా ఎవరికైనా దీక్షనిచ్చే గురువ్యవస్థ కొనసాగుతూండటం... నన్ను ఆకర్షించాయి.

"వసంతకుమార్ గారూ! మీ కార్యక్రమానికి తప్పకుండా వస్తాను" అంటూ హామీ ఇచ్చాను. మొత్తంమీద నన్ను పుష్కరిణి సమీపంలోని వ్యాసరాయ మఠంలో పురందరదాసు ఆరాధనోత్సవాలకి తీసుకువెళ్ళటంలో శ్రీ పరిగి కృతకృత్యులయ్యారు. అక్కడికి వెళ్ళాక నాకు ఇంకా కొత్త విషయాలు

తెలిశాయి. ఒక వ్యక్తి దాస గురువు ద్వారా దీక్ష తీసుకుంటే, శ్రీహరికి దాసుడిగా ఆధ్యాత్మిక చింతన పెంచుకోవడమేకాక, గృహస్థుగా తన ధర్మం తాను నిర్వర్తిస్తూనే, వేద రహస్యాల్ని వెల్లడించే రామాయణ భారత భాగవతాది ఇతిహాసాల సారాన్ని సామాన్య ప్రజల నోళ్ళలో నానేలా భజనలు, కీర్తనలు, కథలు తదితరరూపాల్లో ప్రచారం చేయటానికి నిరంతర కృషి సాగిస్తూనే వుండాలి.

అలాంటి ఒక 'దాసుడ్ని' శ్రీ పరిగి నాకు పరిచయం చేశారు.... ఆయన పేరు ఖగవర ధ్వజ విఠల్ దాసు. గురుగోవింద విఠల్ దాసు ముఖ్య శిష్యులలో ఆయనొకరు. ఆ రోజు కార్యక్రమంలో ఖగవరధ్వజ విఠల్ దాసు కూడా ప్రసంగించారు.... అది ప్రసంగం అనడం సమంజసమా?

అదొక ఆధ్యాత్మిక గంగా ప్రవాహం. గీతలోంచి, ఉపనిషత్తుల్లోంచి, దేవర నామాల్నుంచి, హరికథామృతసారం నుంచి శ్లోకాలు, చరణాలు ఉదహరిస్తూ, శ్రోతల్ని - వారి అణువణువు దైవ చింతనతో స్పందించేలా భక్తి పారవశ్యంలో ముంచెత్తుతూ ఖగవర ధ్వజ విఠల్ దాసు చేసిన భాషణ నాకు అలౌకికానందాన్ని కలిగించింది. అప్పుడే నా ప్రక్కన కూర్చున్న శ్రీ పరిగి చెప్పారు. "వీరి ప్రబోధాలు కావాలంటూ కర్నాటక, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌ల నుంచి అనేక భక్త సమాజాల వారు అడుగుతున్నారు"... అంతసేపు ఆయన భాషణ విన్నాక ఈ విషయం నాకేమీ ఆశ్చర్యం కలిగించలేదు. అపార ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వాన్ని ఔపోసన పట్టి, భక్తి ఎందుకు అన్న దగ్గర్నుంచి, భవబంధాల్నుంచి మానవుల్ని విముక్తుల్ని చేయగల మోక్ష మార్గాల దాకా అనర్గళంగా, సరళమైన, మధురమైన భాషలో పామర జనాన్ని రంజింపజేసేలా భాషణ చేస్తున్న ఖగవర ధ్వజ విఠల్ దాసుని ఒకసారి వింటే మళ్ళీ మళ్ళీ వినాలని ఎందుకనిపించదు?

మాటల్లో శ్రీ పరిగిని అడిగాను. "ఈ దాసుగారి వృత్తి ఏమిటి? టీచింగ్ లాంటిదేమైనానా?" చిన్న చిరునవ్వు నవ్వి ఆయన చెప్పిన సమాధానం నన్ను దిగ్భ్రాంతిపరిచింది... ఈ ఖగవర ధ్వజ విఠల్ దాసుకి అసలు పేరు నాగరాజు. హైస్కూలు చదువుకూడా చదువుకోని పామరుడు. మాతృభాష అయిన కన్నడ భాషలో సయితం సరిగ్గా రాయడం, చదవడం రాదు. పోస్టల్ డిపార్ట్‌మెంటులో పోస్టుమ్యాన్‌గా పనిచేస్తున్నాడు. ఆయన ఒకసారి గురుగోవింద విఠల్‌దాసుగారి ఆధ్వర్యంలో జరిగిన హరి ఆరాధనా కార్యక్రమంలో, హరినామ పారాయణలో యాదృచ్ఛికంగా పాల్గొన్నాడు. ఆ క్షణాల్లో చేసిన 'గోవింద' నామస్మరణ నాగరాజు ఆలోచనా విధానాన్నే మార్చిపారేసింది. తనకు దీక్ష ఇప్పించమంటూ గురుగోవింద విఠల్ దాసుని ఆశ్రయించాడు. ఏడాదిపాటు పరీక్షించాక, నాగరాజులో పరిణతి చెందిన ఆధ్యాత్మిక ధోరణితో సంతృప్తి చెందాక, శ్రీ విఠల్ దాసు ఆయనకు దీక్ష ఇచ్చి 'ఖగవరధ్వజ విఠల్‌దాసు'గా నామకరణం చేశారు... ఇది జరిగిన ఏడెనిమిది సంవత్సరాల తరువాత ఈ పురందరదాసు ఆరాధనోత్సవాలలో ఆయన్ని మొదటిసారిగా కలుసుకున్నాను. ఆ వేదిక మీద ఆయన భాషణ విన్నాక, ఆయన గురించి శ్రీ పరిగి ఇచ్చిన వివరణ నమ్మశక్యంకాని విషయంలా కనుపించింది.





అక్షరజ్ఞానం లేని ఒక పోస్టుమ్యాన్ ఇంతటి భాగవతోత్తముడిగా ఎలా రూపాంతరం చెందగలిగాడు? ఎవడిచ్చాడా శక్తి? ఎక్కడిదా స్ఫూర్తి?... అనక, నా ప్రశ్నలన్నింటికీ కలిపి ఖగవర ధ్వజ విఠల్ దాసు చిరునవ్వుతో ఒకే ఒక్క మాటలో చెప్పిన జవాబు "మా గురువుగారి ద్వారా శ్రీనివాసుడే!"

మొత్తం మీద ప్రతి ఏటా గురు గోవింద విఠల్‌దాసు ఆధ్వర్యంలో పురందరదాసు ఆరాధనోత్సవాలు జరుగుతున్నప్పటికీ మొదటిసారిగా ఆ సంవత్సరమే నేను ఆ కార్యక్రమంలో పాల్గొనడం, 'దాస' వ్యవస్థ గురించి తెలుసుకోవడం జరిగింది. దాదాపు దక్షిణాది రాష్ట్రాలలో ఈ భక్తి సాహిత్యం ప్రచారం చేస్తూ వున్న చాలామంది దాసులు (అందరూ గృహస్థులుగా వుంటూ ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలలో వివిధ ఉద్యోగాలలో వున్నవాళ్ళు) ఆ సభకు వచ్చారు. గురుగోవింద విఠల్‌దాసు ఈ 'దాస' కుటుంబం గురించి నిశితంగా అధ్యయనం చేసి, 'హరిభక్త విజయం' పేరుతో ప్రపంచానికి అంతగా తెలియని 200మంది దాసుల గురించి ఎనిమిది గ్రంథాలలో ప్రచురింపజేశారు. దాస సాహిత్యం విశిష్టత, దాని ప్రచార లక్ష్యం, ఆ లక్ష్యసాధన కోసం అంకిత భావంతో దాసులు సాగిస్తున్న కృషి గురించి వింటున్న కొద్దీ నాలో ఆసక్తి పెరిగింది. తిరుమల తిరుపతి దేవస్థానాల కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్న శ్రీ అప్పన్నాచార్య కూడా ఆ వేదిక మీద 'హరికథామృతసారం' గురించి చేసిన ప్రసంగం - ఆయనకు ఈ దాస సాహిత్యం పట్ల, దాస వ్యవస్థ పట్ల గల విస్తృత పరిజ్ఞానానికి అద్దం పట్టాయి. అంతటి జ్ఞానశీలి టిటిడిలో లెక్చరర్‌గా వున్నారన్న విషయం అప్పుడే నాకు బోధపడింది.

క్రమంగా అప్పటికప్పుడే నాలో ఏదో తెలీని అంతర్మథనం మొదలైంది. కొన్ని వర్గాలవారికి, అందులోనూ పండితులైన వారికి మాత్రమే అందుబాటులో వుంటూ వచ్చిన వేద విజ్ఞాన రహస్యాల్ని సరళమైన సాహిత్యంతో, శ్రావ్యమైన ఆలాపనల రూపంలో నిరక్షరాస్యులను సయితం సమ్మోహపరిచేలా ప్రచారంలోకి తీసుకురావాలని తరాల తరబడి నిరంతర కృషి సాగిస్తున్న 'దాస' వ్యవస్థ ఇలాగే ఏ కొద్ది వందలమందితోనే మిగిలిపోయి, చిక్కిపోయి, అంతరించిపోవాలా? ఏ హరి నామస్మరణ సాధకులందరికీ మోక్షాన్ని ప్రసాదిస్తుందని విశ్వసిస్తూ ఈ 'దాసులు' హరికథామృతసార ప్రచారానికి అంకితభావంతో పనిచేస్తున్నారో - వాళ్ళకోసం ఆ 'హరి' సేవకుడిగా (టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా) నేను ఏమీ చేయలేనా? చేయలేనా?.... ఆ క్షణంలో నాకు తెలీకుండా నాలో ఉప్పొంగిన భక్త్యావేశం వల్ల కావచ్చు - ఆ దాసుల్నుద్దేశించి అడిగేశాను - "మీకు నేనేం చేయగలనో చెప్పండి" కాని వాళ్ళు కోరింది - తనివితీరా గోవిందుడ్ని దర్శించుకుంటే చాలట.

ఇంతేనా, ఇంతకన్నా ఏం చేయలేనా శ్రీనివాసా? - అనుకుంటూ క్షణకాలం కళ్ళు మూసుకున్నాను. - ఆ క్షణంలో నాకళ్ళ ముందు మెదిలిన ఊహాచిత్రం కారణంగా మరుక్షణంలో

అప్రయత్నంగా ఒక ప్రకటన చేశాను - "దాస వ్యవస్థ గురించిన సమాచారాన్నీ, మరుగున వుండిపోయిన దాసులూ - వారి దేవర నామాల గురించిన సమాచారాన్నీ, దాస సాహిత్యాన్నీ భవిష్యత్తరాలకు సమగ్రంగా అందించేలా, ఈ సాహిత్యానికి శాశ్వతమైన ప్రచారం లభించేలా దాస సాహిత్య ప్రాజెక్టుని టిటిడి ఏర్పాటు చేస్తుంది. ఈ బృహత్ కార్యానికి ఒక వ్యవస్థని ఏర్పాటు చేసి, ప్రాజెక్టు ఆఫీసర్‌ని కూడా వెంటనే నియమిస్తాం..." ఇలా అంటున్నప్పుడు యాదృచ్ఛికంగా నా దృష్టి - శ్రీ అప్పన్నాచార్య మీద పడింది. వెంటనే, "ఎవరో ఎందుకు? ఈ అప్పన్నాచార్యనే ప్రాజెక్టు ఆఫీసర్‌గా నియమిస్తున్నాం" అంటూ నా ప్రకటన పూర్తిచేశాను... దాసులంతా గోవింద నామస్మరణతో కూడిన హర్షధ్వానాలు చేశారు.

ఆ కార్యక్రమం అయిపోయి, ఇవతలకు వచ్చాక, ఏదో మైకంలోంచి బయటపడినట్లుగా నా మనస్సులో ఒక ప్రశ్న తలెత్తింది. "అవును! లక్షల రూపాయల వ్యయంతో కూడుకున్న ఒక ప్రాజెక్టు ప్రవేశపెట్టాలంటే, (అది కూడా శాశ్వత ప్రాతిపదికన) నేను బోర్డులో ప్రతిపాదన చేయాలిగదా! దానికి బోర్డు ఆమోదముద్ర పడాలిగదా? అదేమీ లేకుండా నేనిలా ప్రకటన చేసేశానే! పైగా ప్రాజెక్టు ఆఫీసర్ నియామకం కూడా ప్రకటించేశాను! ఇదేమిటి? ఇలా జరిగింది?..." మరుక్షణం - నాకు నేనే సమాధానం చెప్పుకున్నాను. - "ఏ స్వామిని సేవిస్తూ పురందరదాసు దగ్గర్నుంచి ఇప్పటిదాకా ఈ దాసులు తమ జీవితాలు ధన్యం చేసుకుంటూ వచ్చారో, ఆ స్వామి సేవకుడిగా నాకు న్యాయం అనిపించింది చేశాను. ఇది జరిగేదీ లేనిదీ ఆయనే చూసుకుంటాడు..."

అదృష్టవశాత్తూ, ఆ తరువాత జరిగిన టిటిడి బోర్డు మీటింగులో - నా ఈ ప్రకటనని ఆమోదించే బాధ్యతని బోర్డు సభ్యులే తీసుకున్నారు. ఎలాంటి వివాదం లేకుండా 'దాస సాహిత్య ప్రాజెక్టు' ఏర్పాటునీ, ప్రాజెక్టు ఆఫీసర్‌గా తెలుగు, కన్నడ భాషా సాహిత్యాలలో నిష్ణాతుడైన శ్రీ అప్పన్నాచార్య నియామకాన్ని కూడా బోర్డు ఆమోదించింది!!

గడిచిన రెండు దశాబ్దాల కాలంలో 'దాస' సాహిత్యోద్యమం కేవలం ఒక సాహిత్య ప్రచార ఉద్యమంగా కాక, భక్తి సాధనోద్యమంగా దక్షిణాది రాష్ట్రాలలో మహారాష్ట్రలో మూలమూలలకు విస్తరించింది. ఏటా తిరుమలలో జరిగే మెట్లోత్సవంలో, బ్రహ్మోత్సవాలలో భజనలు చేస్తూ, నర్తిస్తూ పాల్గొనే 'దాస' సాహిత్య ఉద్యమ ప్రేరేపిత భజన బృందాల సంఖ్య క్రమంగా వందల్లోంచి వేలల్లోకి పెరిగింది. ఇంకా పెరుగుతోంది. తిరుమలలో ప్రత్యక్షంగా చూసినా, టీవీ ప్రసారాలలో బ్రహ్మోత్సవాలు చూసినా, కుంకుమ పసుపు రంగుల చీరల్లో స్త్రీలు, ధోవతీ, కాషాయరంగు తలపాగాతో పురుషులు నాట్య బృందాలుగా తన్మయత్వంతో హరి సంకీర్తన చేయటం విధిగా కనుపిస్తుంది. అదొక మధురానుభూతి.






దాససాహిత్య ప్రాజెక్టు భజన బృందాలు మెట్లోత్సవాల సందర్భంగా గోవిందరాజస్వామి ఆలయం తిరుపతి నుండి ఉత్సవం ఆరంభంలో శ్రీ పి.వి.ఆర్.కె.ప్రసాద్

ఏ ఇద్దరు 'దాస భక్తులు' ఎదురైనా 'హరే శ్రీనివాస'తోనే పలకరించుకోవటం ఒక అలవాటుగా రూపొందింది. 'హల్లో' బదులు టెలిఫోన్‌లో మాట్లాడేటప్పుడు 'హరే శ్రీనివాస' సంబోధనతో సంభాషణ మొదలుపెట్టి, 'హరే శ్రీనివాస'తో ముగింపు చేయటం ఆనవాయితీ అయింది. క్రమంగా వేసవిలో ఆధ్యాత్మిక శిబిరాల నిర్వహణ, దాస ఆరాధనోత్సవాలు, భజన బృందాల సమ్మేళనాలు, విచారగోష్టులు, సంకీర్తనలలోనూ, జ్ఞానపరంగానూ, భజన బృందాలు మధ్య పోటీలు - ఈ ప్రాజెక్టులో భాగంగా దక్షిణాదిలో మహారాష్ట్రలో విస్తరించాయి. దాస సాహిత్యం మీద తెలుగు, కన్నడ, ఇంగ్లీషు భాషల్లో అనేక పరిశోధనా గ్రంథాలు, సరళమైన భాషలో అనేక చిరుపుస్తకాలు, 24 ఆడియో క్యాసెట్‌లు ఈ ప్రాజెక్టు ఆధ్వర్యంలో వెలువడ్డాయి. దాసవ్యవస్థకు సంబంధించిన అనేక ఎగ్జిబిషన్‌లు జరిగాయి. సృష్టి-సాధన, సృష్టిప్రకరణ, కేశవాదిరూపాలు, పాప-పురుష విసర్జన, ఓంకార స్వరూపం, మానవ శరీరాల్లోని పలు పద్మాల విశిష్టత, మానవదేహంలో వుండే భగవద్రూపాలు, అభిమాన దేవతలు - వారు జీవిని ప్రేరేపింపచేసే విధానం... తదితర అనేక సంక్లిష్టమైన, సాధకునికి అవసరమైన అంశాలు శాస్త్ర ప్రామాణికంగా ఆయిల్ పెయింటింగ్స్ రూపంలో ఈ ప్రాజెక్టు ఆధ్వర్యంలో తయారు చేయబడ్డాయి. వివిధ దాసుల చిత్రాల్ని, వాళ్ళు ఉపయోగించిన సాధనాల్నీ, వారి గృహాల్ని, వారు ఆరాధించిన భగవద్రూపాల్ని కూడా ఈ ప్రాజెక్టు సేకరించింది. ఈ దాసుల ఆరాధన దినోత్సవాలలో యితర తిరునాళ్ళలో ఈ ఎగ్జిబిషన్లు ఏర్పాటు చేయటం ఈ ప్రాజెక్టు కార్యకలాపాలలో ఒక ముఖ్య భాగం. ఇటీవలికాలంలో ఈ సాహిత్యం యొక్క సంగీత స్వరూపం ఎంత బలంగా, విస్తృతంగా పల్లెల్లోకి ప్రాకిందంటే - తిరుపతి / తిరుమల మెట్లోత్సవాల సంబరం, సంరంభం చూసి, ఆదోని, కోలార్, చిత్రదుర్గ, కరిఘట్ట, దేవరాయని దుర్గ వంటి ప్రాంతాలలో స్థానిక ఆలయాలలో మెట్లోత్సవాల్ని క్రొత్తగా ప్రవేశపెట్టారు. నేను ఇటీవల ఉడిపిలో జరిగిన శ్రీకృష్ణుని వజ్రకవచ సమర్పణ ఉత్సవానికి వెళ్ళినప్పుడు అక్కడ, శ్రీకాకుళం, విజయనగరం, రాజమండ్రి, నల్లజర్ల, తాడేపల్లిగూడెం, విజయవాడ,

అనంతపూర్, ఆదోని, కర్నూలు తదితరప్రాంతాల నుంచి భజన బృందాలు (దాస సాహిత్య ప్రాజెక్టు ఆధ్వర్యంలో) వచ్చి, కన్నడంలోని దాస సాహిత్యాన్ని మృదు మధురంగా భజన రూపంలో గానం చేశారు. కన్నడ ప్రాంతం నుండి వచ్చిన భజన బృందాలకంటే, కన్నడ భాష తెలీకుండా కన్నడ సాహిత్యాన్ని గానం చేసిన తెలుగు భజన బృందాలపై స్వామీజీలు ప్రశంసల జల్లు కురిపించారు. ఇలా ఒకవైపు సంగీతపరంగా లక్షలాది మందిని భక్తి సాగరంవైపు మళ్ళిస్తున్న ఈ 'దాస సాహిత్య ప్రాజెక్టు' మరోవైపు సాహిత్యపరంగా, ఆధ్యాత్మిక చింతన ప్రచారపరంగా అనేక కుటుంబాలను ప్రభావితం చేస్తోంది. గత 20 ఏళ్ళ కాలంలో నేను చూసిన ఇలాంటి దాస సాహిత్య ప్రభావిత భక్తులలో ఒకరు శ్రీమతి గోపిక.

ఈమె తిరుమలలో 1979 నాటి పురందరదాసు ఆరాధనోత్సవాలలో శ్రీ పరిగి వసంతకుమార్ భార్య సునంద ద్వారా పాల్గొంది. ఆ మూడురోజుల కార్యక్రమం ప్రభావంతో ఆమెకు దాస సాహిత్యం పట్ల ఆసక్తి పెరిగింది. శ్రీ అప్పణ్ణాచార్య వంటి పండితుల ద్వారా కన్నడ భాషలోని ఆ సాహిత్యాన్ని అర్థం చేసుకోటానికి ప్రయత్నం చేస్తున్నకొద్దీ, దానిపట్ల ఆమె మరింత ఆకర్షితురాలవుతూ వచ్చింది. చివరికి దాస సాహిత్యంతో ఆమె ఎంతగా మమైకపోయిందంటే, దానిలో నిక్షిప్తమైవున్న భక్తి మాధుర్యాన్ని ఆస్వాదించటం కోసం ఆమె కన్నడం రాయటం, చదవటం, మాట్లాడటం కూడా నేర్చుకుంది. ఎనిమిది గ్రంథాల్లోని దాస సాహిత్యాన్ని తెలుగులోకి తర్జుమా చేసి గురుగోవింద విఠల్‌దాస్ సేవా సమితి ద్వారా ప్రచురింపజేసింది. శ్రీమతి సునందతో కలిసి, తనలాగా దాస సాహిత్యంతో ప్రభావితులైన ఉషా వెంకోబారావు, రకుమాబాయి, వేదమ్మ, లక్షణ, వైజయంతి, ఉషా, రుక్మిణమ్మ తదితరులతో కలిసి, గురుగోవింద విఠల్ దాస సేవా సమితిని స్థాపించి, భక్తి జ్ఞాన కార్యక్రమాలు సాగిస్తోంది.

శ్రీహరిని సేవిస్తూ ధన్య జీవితాలు గడిపిన అనేకమంది దాసులు ఆంధ్రప్రదేశానికి చెందినవారేనన్న విషయాల్ని నాలాంటి వాళ్ళకు తెలియజెప్పింది. గోపాలదాసు మహబూబ్‌నగర్ జిల్లాలో ఉత్తనూరుకి చెందినవారు. విజయదాసుల తపోభూమి గుంతకల్లు సమీపంలోని చిప్పగిరికాగా, శేషగిరిదాసులు గద్వాల్ దగ్గర మొదలుకల్ నుంచి వెలుగులోకి వచ్చారు. (గోపిక నా అర్ధాంగి)

ఇంత బృహత్ ఉద్యమంగా విస్తరించిన ఈ దాస భక్తి ఉద్యమానికి మూలమైన సిద్ధాంతం ("ఆ దైవమే సర్వస్వం - ఆ స్వామికి నేను దాసుడ్ని") చూడటానికి చాలా తేలికగా కనుపించవచ్చు. కాని ప్రతి ఆలోచనలో, ప్రతి పనిలో, ప్రతి జీవిలో స్వామినే 'సర్వస్వం'గా చూడగల పరిణతిని సాధించడానికి కావలసిన సాధనే దాసోద్యమ స్వరూపం.





'దాస సాహిత్య ప్రాజెక్టు' కేంద్ర బిందువుగా నలుదెసలా ప్రాకుతున్న ఈ ఉద్యమం - 'మూఢ భక్తి'ని ప్రచారం చేయదు.

దైవాన్ని గురించిన పరిజ్ఞానంలో

శ్రీహరి సర్వోత్తముడనీ, జగత్తు సత్యమనీ,

ఈశ్వరుడు, జీవులు, జడములు - వీని మధ్య పంచ భేదములు కలవనీ,

జీవులు అస్వతంత్రులు మరియు పరమాత్ముని సేవకులనీ,

జీవులు స్వరూపతః భిన్నులు మరియు తారతమ్యం గలవారనీ,

స్వరూప సుఖానుభూతే ముక్తియనీ,

పరమాత్ముని యందు నిరతిశయ, అచంచల భక్తిని ఎల్లప్పుడూ నిలపటమే ముక్తికి సాధనమనీ,

ప్రత్యక్షము, అనుమానము, ఆగమములనునవి మూడు ప్రమాణములనీ,

పరమాత్ముని వేదము వలనా, వేద జ్ఞానమువలననే తెలియదగుననీ,

- చెప్పే ఈ జ్ఞానం ప్రతి దాసుడికీ వుండాలనీ దాస సాహిత్యం బోధిస్తుంది.

ఎటువంటి ప్రతిపాదనలూ, పరిశీలనలూ, సిఫార్సుల ఫైళ్ళూ, సానుకూలతా రిపోర్టులూ, టిటిడి బోర్డు ఆమోదాలు లేకుండానే, ఇరవైనాలుగేళ్ళ క్రితం ఒక అవ్యక్తమైన భక్త్యావేశంలో నా నోటంట వెలువడిన ప్రకటన - ఈనాడు ఇంతటి శక్తివంతమైన, మహత్తరమైన భక్తి ఉద్యమానికి ఆలంబనమైన 'దాస సాహిత్య ప్రాజెక్టు' ఆవిర్భావానికి దారి తీసిందంటే నాకే ఆశ్చర్యమని



మెట్లోత్సవంలో దాసులు

పిస్తూంటుంది. ఈ క్రెడిట్ నాకు అంటగట్టేలా ఎవరన్నా మాట్లాడినప్పుడు ఏదో అపరాధ భావన నన్ను వెంటాడుతూంటుంది.

ఎందుకంటే, ఆరోజు అసంకల్పితంగా నాచేత ఆ ప్రకటన చేయించిన శక్తీ, ప్రేరణా నావి కావని నాకు తెలుసు కనుక... హరే శ్రీనివాస!

★ ★ ★




తిరుమల మూర్తులు-6

## సీతారామలక్ష్మణులు

ఆగమ శాస్త్రాల్లో ఉదహరించబడిన విధంగావున్న అయిదు 'బేరా'లే కాక, హనుమాన్ సహిత సీతారామ లక్ష్మణుల విగ్రహాలు కూడా తిరుమల ఆలయంలో (రాములవారి మేడ) వున్నాయి. శ్రీరామనవమి ఉత్సవాలలో చివరిరోజున (పునర్వసు నక్షత్రం) అభిషేకానంతరం సీతారామలక్ష్మణుల విగ్రహాన్ని హనుమాన్ విగ్రహం మీద అధిష్ఠింపచేసి తిరుమల వీధుల్లో ఊరేగిస్తారు.






# 13

## ఆ ఒక్క క్షణం కోసం...

పన్నెండు గంటలు!

ఆ భక్తజనం తిరుమల క్యూషెడ్లలోకి చేరి అప్పటికి పన్నెండు గంటలు కావస్తోంది. ఇంకా ఎంతసేపు అలా చెమటలు కారుతూ, ఆ క్యూషెడ్లలో నిరీక్షిస్తే, తిరుమల శ్రీనివాసుడి దర్శనం అవుతుందో తెలీదు...

"ఏడు కొండలవాడా... వెంకట రమణా... గోవిందా... గోవింద..." అంటూ వుండుండి ఒకసారి గోవింద నామస్మరణతో క్యూషెడ్లు ప్రతిధ్వనిస్తున్నాయి. మళ్ళీ అంతలోనే నిశ్శబ్దం. బల్లల మీద కూర్చుని కూర్చుని నడుం పట్టేసిన వాళ్ళు లేచి ఒళ్ళు విరుచుకుంటున్నారు. చిన్న పిల్లలు "ఆకలి... ఆకలి" అంటూ అమ్మా, నాన్నల్ని సతాయిస్తున్నారు. లేదంటే, నీరసంతో అమ్మల ఒళ్ళో నిద్రపోతున్నారు. ముసలివాళ్ళు "ఉస్సు- అస్సు" అంటూ ఆపసోపాలు పడుతున్నారు. "ఇంకా ఎంత సేపమ్మా గుళ్ళోకి వెళ్ళటానికి" అంటూ ఎదిగిన పిల్లలు విసుక్కుంటున్నారు.... మళ్ళీ అంతలోకే "గోవిందా... గోవింద" అంటూ ఎవరో అరిచారు. క్యూలో వున్న వేలాది మంది ఒక్కసారి "గోవిందా" అన్నారు.

"అలా ఎన్నిసార్లు పిలిచినా ఏం లాభం నాన్నా! మధ్యాహ్నం దాకా అలా నోరు నొప్పి పుట్టేలా అరిచి, అరిచి శోష వచ్చి పడిపోయే స్థితి వస్తుంది చూడు, ఆ టైంకి మనం ఈ క్యూలో వెళ్ళి, వెళ్ళి వేంకటేశుడ్ని చూస్తాం. ఎందుకు?... కళ్ళు మూసి తెరిచేలోపల బయటికి వెళ్ళిపోవటానికి! ఆ రెండు సెకన్ల దర్శనం కోసం పన్నెండు - పద్నాలుగు గంటల వెయిటింగ్! ప్చ్! మన దేవుడ్ని మనం చూడటానికి ఎన్ని కష్టాలు..." అంటూ ఓ టీనేజ్ కుర్రాడు, తన వయసు మళ్ళిన తండ్రిని డబాయించేస్తున్నాడు.

- ఇలా క్యూలో వెయిటింగ్‌లో వున్న భక్తులు టిటిడి మేనేజ్‌మెంట్‌ని తిట్టుకుంటుండగా వినడం నాకు అదే మొదటిసారికాదు. ఇ.ఓ. గా ఛార్జి తీసుకున్న కొత్తలో రెండు మూడుసార్లు ఎవ్వరికీ తెలియకుండా క్యూషెడ్లలో 12 గంటల నుండి 16 గంటలదాకా నిరీక్షించి దర్శనం చేసుకొనే పరిస్థితిని ప్రత్యక్షంగా రుచిచూడటం జరిగింది. అప్పటికే నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వెళ్ళి కొన్ని నెలలు కావస్తోంది. నా రొటీన్ ఇన్‌స్పెక్షన్‌లలో ఇలాంటి వ్యాఖ్యలు అనేకసార్లు విన్నాను. విన్న ప్రతీ సారీ ఆవేశం వచ్చేసేది.

ఇష్టదైవమైన శ్రీనివాసుడ్ని దర్శించి తరించాలన్న ఆరాటంతో, మూగ భక్తితో వేల కొద్దీ మైళ్ళ దూరం నుంచి నానా ప్రయాసలు పడి వచ్చిన భక్తులకు గంటలకొద్దీ క్యూషెడ్లలో నిరీక్షించి, నిరీక్షించి, గుళ్ళోకి ప్రవేశించాక, దివ్యాలంకార శోభితుడైన తమ ఆరాధ్య దైవాన్ని సందర్శించుకోటానికి లభించే సమయం ఒక్కొక్కసారి ఒక్క సెకను మాత్రమే!

1978లో తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వెళ్ళిందగ్గర్నుంచీ నాకొచ్చే లెటర్స్‌లో అధికభాగం ఈ దర్శనం గురించే.

"... మొక్కులు మొక్కి, ముడుపులు కట్టుకుని, కాళ్ళకు బలపాలు కట్టుకొని, నడిచి మెట్లెక్కి, గంటలకొద్దీ క్యూషెడ్లలో నిరీక్షించాక మాకు లభించే దర్శనం ఎంత?... మీరెప్పుడన్నా క్యూలో నిలబడి దర్శనం చేసుకొని చూశారా?... వివిపిల దర్శనాలు మాత్రమే పట్టించుకుంటారా?... సామాన్య భక్తుల ఆర్తి మీకర్థం కాదా?..." ఇలాంటి ప్రశ్నలతో లెటర్స్ కోకొల్లలుగా వచ్చేవి. దర్శనం సంతృప్తికరంగా జరగలేదన్న అసంతృప్తితో భక్తులకు తిరుమల కొండ అంతా అస్తవ్యస్త ప్రపంచంలాగా, టిటిడి ఉద్యోగులంతా భక్తుల ఉసురుపోసుకుంటున్న దళారీల్లాగా కనుపించడం నిత్యకృత్యమైపోయింది. ఈ అసంతృప్తితో తరచూ భక్తులకూ, టిటిడి ఉద్యోగులకూ మధ్య వాగ్యుద్ధాలు జరుగుతుండేవి. ఆలయంలోకి వచ్చాకకూడా క్యూలో భక్తుల సహనాన్ని పరీక్షిస్తూ సిబ్బంది "జరగండి - జరగండి" అంటున్న కొద్దీ (అప్పటికే గంటల కొద్దీ వెయిటింగ్‌లో వున్న) భక్తుల కోపం తారస్థాయికి చేరుకునేది. ఈ గొడవమూలంగా చివరికి ప్రశాంతంగా, నిర్మల చిత్తంతో శ్రీనివాసుని దర్శించుకునే అవకాశం లేకుండా పోవడం, దర్శనం జరిగినా సంతృప్తికరంగా దర్శించుకున్నామన్న ఆనందం అసలు లేకుండా పోవడం జరిగేది.





కొన్ని వారాలు, నెలలు ఈ దర్శనాల పరిస్థితిని అధ్యయనం చేశాను. దర్శనం మాట ఎలా వున్నా, కనీసం క్యూలో వుండే ఇతర ఇబ్బందుల్నయినా తగ్గించలేమా అని ఆలోచించాను. క్యూలో వుండే భక్తులకు మూత్ర విసర్జన ఒక పెద్ద సమస్య. ఒకసారి క్యూషెడ్ల నుండి క్యూలోకి ప్రవేశించాక, దర్శనం జరిగి బయటకు వచ్చేంతవరకూ (దాదాపు రెండు గంటలు) భక్తులకు మూత్ర విసర్జన అవకాశమేలేదు. ముఖ్యంగా వృద్ధులయితే లఘుశంక తీర్చుకునే ఆదుర్దాలో దర్శనం కూడా వదులుకొని ఆలయంలో క్యూలోంచి బైటకు వెళ్ళిపోతూండటం చూశాను.

ఒక రోజు ధ్వజస్తంభం దగ్గర నిలబడివుండగా ఇలా ఓ వృద్ధ భక్తుడు హడావుడిగా బైటకు వెళ్ళిపోవడం చూసి, "అరెరె, ఈయన నీ దర్శనం చేసుకోకుండా వెళ్ళిపోతున్నాడే! ఏమీ చేయలేనా స్వామీ!" అని శ్రీనివాసుడ్ని ప్రార్థించాను. ఆయనైతే గర్భగుడిలోంచి నాకేమీ జవాబివ్వలేదు. కానీ, నా మనోభావాలు కనిపెట్టిన ఒక సీనియర్ టిటిడి ఉద్యోగి, "సర్, మొబైల్ టాయ్‌లెట్ బాక్సుల్ని దేవాలయం బయట క్యూ ప్రక్కన అక్కడక్కడ ఏర్పాటు చేస్తే, వీళ్ళు ఇబ్బంది తీర్చుకున్నాకే ఆలయంలోకి వస్తారు సర్!" అంటూ ఒక చిన్న సూచన వదిలాడు. గ్రేట్ ఐడియా! కొన్ని రోజుల్లోనే దాన్ని అమలు చేసేశాం. అలాగే ఒకరోజు నేను చూస్తూండగానే ఆలయంలో పడికావలి (హుండీ కానుకలు లెక్కించే చోటు నుంచి) దగ్గర ఒక తల్లి తన చిన్న పిల్లాడ్ని ఎత్తి, "చూడు, చూడు వెంకటేశ్వర స్వామిని" అని చూపించే ప్రయత్నంలో గుమ్మం తగిలి తూలిపడింది. క్షణకాలం నా మనసు విలవిల్లాడింది. "ఈ గుమ్మాల్లేకుండా చేయచ్చుగదా స్వామీ" అంటూ ఆమె భర్త శ్రీవారి మీద విసుక్కున్నాడు.

"అవును, తనని లిప్తకాలం చూసే అదృష్టం కోసం అంగలారుస్తూ వచ్చే భక్తులకి ఈ గుమ్మాలు అడ్డమెందుకు పెట్టాడు శ్రీనివాసుడు?" అని నాకూ ఓ సందేహం కలిగింది. సందేహం ఎలా వచ్చిందో సమాధానం కూడా అలాగే దొరికింది. (ఎవడిచ్చాడా సమాధానం?) ఒకటి రెండు వారాల్లోనే ఆ సమాధానాన్ని అమలు చేయించాను. ఇప్పుడింక అక్కడ గుమ్మాలు వున్నట్లు అనిపించనూ అనిపించదు, గుమ్మాలు తగిలి భక్తులు తూలనూ తూలరు. ఎందుకంటే పడికావలి గుమ్మం దగ్గరా, గర్భగుడి ముందు గుమ్మం దగ్గరా ర్యాంప్‌లు (వాలుబల్లలు) ఏర్పాటు చేశాం. అలాగే లోపల గర్భగుడి ముందు గుమ్మానికీ, పడి కావలికీ మధ్య భాగంలో గుమ్మం ఎత్తులో ఒకటే పొడవాటి బల్ల ఏర్పాటు చేశాం...

ఈ రెండు ఏర్పాట్లతో అనూహ్యమైన స్పందన భక్తులలో కనుపించింది. ముఖ్యంగా పడికావలి గుమ్మం దగ్గర ర్యాంప్ ఎక్కిన దగ్గర్నుంచీ భక్తులు బల్లమీదే వుంటారు కనుక గర్భగుడిలోని నిలువెత్తు శ్రీనివాసుని ముఖారవిందాన్ని - గర్భగుడి గుమ్మం దగ్గరికి చేరేదాకా - క్యూలోని ప్రతి భక్తుడూ వీక్షించగలుగుతారు. స్వామి మనోహర రూపాన్ని చూస్తూనే మైమరచిపోయి, పడికావలి గుమ్మం దగ్గర్నుంచే భక్తులు "గోవిందా గోవిందా" అనుకుంటూ భక్తిపారవశ్యంతో, తన్మయత్వంతో - అంతవరకూ క్యూషెడ్లలో నిరీక్షణలో కలిగిన అలసటనంతా మర్చిపోయి, ఆనందాశ్రువులు రాలుస్తూ శ్రీవారిని ఎక్కువసేపు సందర్శించుకొనే అవకాశం ఆ రకంగా భక్తులకు పెంచగలిగాం - అనుకున్నాను.

అది ఒక చిన్న ఆత్మానందం మాత్రమే. అసలు సమస్య ఇంకా అలాగే వుంది. క్యూలో 10-12 గంటలపాటు భక్తులు నిరీక్షిస్తున్నారు. ఈ సమయాన్ని ఎలా తగ్గించాలి అన్న సమస్య పరిష్కారం కాలేదు - మరో ప్రయత్నంలో - పడికావలి దాటాక రాములువారి మేడ నుంచి గర్భగుడి దాకా భక్తులు వెళ్ళేదారిలోకి బయటనుంచి తాజా గాలిని పంపించే ఏర్పాటు చేశాం. ఇందువల్ల లోపల ఉక్కపోయటం, సరిగ్గా గాలి ఆడకపోవటం వంటి చీకాకు లేకుండా పోయింది. అలాగే గర్భగుడి దగ్గర క్యూలో భక్తుల్ని "నడవండి, నడవండి" అంటూ నడిపిస్తూ (తోస్తూ) వుండే సిబ్బందిని ప్రతి రెండు మూడు గంటలకొకసారి మార్చే సిస్టం పెట్టాం. అందువల్ల అక్కడి సిబ్బందిలో విసుగుదల భక్తుల మీద ప్రసరించే అవకాశాలు తగ్గాయి. - అయినా అసలు సమస్య - (క్యూలో వెయిటింగ్ తగ్గించడం) పరిష్కారం కాలేదు.

అనేక రోజులు ఈ సమస్య నా మనస్సుని తొలిచేసింది. అనేక రాత్రులు దీన్ని గురించే ఆలోచిస్తూ నిద్రపట్టేది కాదు. ఒక్కోసారి అనుకునేవాణ్ణి - "నాకెందుకింత తాపత్రయం? భక్తుడికి సంతృప్తికరమైన దర్శనం లభించటం లభించకపోవటం అన్నది వాళ్ళ వాళ్ళ ప్రాప్తం మీద, భగవదనుగ్రహం మీద ఆధారపడి వుంటుంది కదా?" మళ్ళీ అంతలోకే అనిపించేది - భక్తుల ప్రాప్తం మాట ఎలా వున్నా, టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నా బాధ్యతేమిటి? భక్తుల సదుపాయాలు చూడటం నా ప్రాథమిక విధ్యుక్తధర్మం కాదా?

ఒకరోజు చాలా సీరియస్‌గా ఈ దర్శనాల వ్యవహారం ఏదో తేల్చాలనుకుని గర్భగుడి ముందు నిలబడ్డాను. భక్తులు రాముల వారి మేడ గుమ్మం దాటాక, గర్భగుడి గుమ్మం ముందుకి (కుడివైపు నుంచి) వస్తారు. రెండు మూడు అడుగులు ఎడమ ప్రక్కకి జరుగుతారు. (వాళ్ళు జరక్కపోతే అక్కడి వాలంటీర్లు జరగమంటారు) అక్కడ్నుంచి వెనక్కి తిరిగి వెళ్ళిపోతారు. అంటే సరిగ్గా కుడివైపు నుంచి వచ్చి ఎడమపక్కకి ఆ రెండు మూడు అడుగులు జరిగే వ్యవధిలోనే





వారు శ్రీనివాసుని ఎదురుగా వుండి దర్శించుకుంటున్నారు. ఈలోపల - క్యూలోంచి గర్భగుడి గడప ముందుకి రాగానే అక్కడ ఒక అర్చకులు తీర్థం ఇస్తారు. మూడడుగులు ఎడమకి జరగ్గానే అక్కడ మరో అర్చకులు శటారి పెడతారు. ఈ తీర్థం, శటారి తీసుకొనే ప్రయత్నంలో భక్తుడి ఏకాగ్రత స్వామి వారి విగ్రహం మీంచి ప్రక్కకి (తీర్థం, శటారి మీదకి) మళ్ళుతోంది. ఈ తీర్థానికీ, శటారికి మధ్యలో తనకున్న ఒక సెకను కాలంలో శ్రీవారిని చూస్తూనే భక్తిపారవశ్యంతో, ధ్యానం చేయాలని కళ్ళు మూసుకొని తలదించుకొని నమస్కరిస్తాడు. అంతలో "జరగండి... జరగండి" అంటూ వలంటీర్లు తొందరపెట్టేస్తారు.

నాకు అప్పుడు స్పష్టంగా అర్థమైన విషయం ఏమిటంటే ఈ తీర్థం, శటారి మూలంగా స్వామి విగ్రహం ముందు భక్తుల ఏకాగ్రతకి భంగం కలుగుతోంది. ఒక్క సెకను కూడా తనివితీరా భక్తులు స్వామి వార్ని దర్శించుకోలేకపోతున్నారు. పైగా సీనియర్ అధికారులు లేనప్పుడు ఈ తీర్థం, శటారి ఇచ్చే అర్చకులు, ఒక చేత్తో అవి ఇస్తూనే, రెండో చెయ్యి భక్తుల ముందుకి (దక్షిణ ఆశిస్తూ) చాపుతారని కొందరు అధికారులు నా దృష్టికి తీసుకువచ్చారు. అంటే భక్తుడి ఏకాగ్రత - ఈ తీర్థం శటారి తీసుకోవటం వల్లేకాక, వాళ్ళకి దక్షిణ ఇవ్వడం కోసం జేబులోంచి పర్సు తీసి, చిల్లర తీసి ఇచ్చే ప్రయత్నం వల్లా, తీర్థం తీసుకునే ముందు, తర్వాత చేతులు తుడుచుకునే ప్రయత్నం వల్లా కూడా దెబ్బతింటోందని బయటపడింది. అంటే అసలక్కడ జరుగుతున్నదేమిటి? రోజుల తరబడి ప్రయాణంలో, గంటల తరబడి నిరీక్షణలో గడిపి, క్యూలో నానావస్థలూ పడి భక్తుడు - వెంకటేశ్వరుడి ముందు నిలబడి, అక్కడున్న కొద్ది క్షణాల్లో - తన ఇష్ట దైవానికి తన పిలుపుని నేరుగా వినిపించాలన్న ఆర్తితో వస్తే, ఆ కొద్దిసేపట్లో తీర్థం, శటారి, దక్షిణ వేసుకోవటం, పిల్లలకి తీర్థం తాగించడం, చేతులు తుడుచుకోవడం వంటి ప్రక్రియలతో భక్తుడికి మిగులుతున్న ఆనందం ఏమిటి?

ఇదంతా చూస్తూంటే నాకనిపించింది. ఈ తీర్థం, శటారిలను, గర్భగుడి గుమ్మం దగ్గర్నుంచి ఇవతలకు జరిపేస్తే, భక్తుడి ఏకాగ్రత దెబ్బతినదు కదా!... ఆ ఆలోచన అమలు చేయటం కూడా చాలా సులభం. ఎందుకంటే, ఇందులో అర్చకులూ నష్టపోయేది లేదు, టిటిడి వారూ నష్టపోయేది లేదు. "గ్రేట్ ఐడియా" - అనుకున్నాను. వెంటనే అమలు చేసేయాలని నిశ్చయించేశాను. కానీ... అమలు చేయలేకపోయాను. "వందలాది సంవత్సరాలుగా మేం తీర్థం, శటారి ఇక్కడే ఇస్తున్నాం. ఇప్పుడీ సాంప్రదాయానికి గండి కొట్టాలని చూస్తారా? ససేమిరా వీల్లేదు" అంటూ అర్చకులు నా ప్రతిపాదనకి ఎదురు తిరిగారు. అర్చక మిరాసీదార్లతో, ఆచార్య పురుషులతో, ఆస్థాన విద్వాంసులతో నేను జరిపిన చర్చలు ఫలప్రదం కాలేదు. తీర్థం, శటారి -

గర్భగుడి దగ్గర్నుంచి బైటకు లేదా ఇవతలకి తీసుకురావాలని నేను చేస్తున్న వాదనలో ఔచిత్యం, హేతుబద్ధత కన్నా సాంప్రదాయానికే "ఎక్కువ విలువ ఇవ్వాలి" అన్నట్లుగా వాళ్ళ వాదన సాగింది. వాదించి, వాదించి విసిగిపోయాను. "స్వామీ, ఇక నా వల్ల కాదు. నీ భక్తుల కోసం ఇలా చేయాలనుకున్నాను. ఇది మంచిదనుకుంటే ఎలా చేయిస్తావో నువ్వే చేయించాలి ప్రభూ!" అంటూ శ్రీవారికి మొరపెట్టుకున్నాను.

ఏమైనా నాకు మంచి ఆలోచన వచ్చిందన్న నమ్మకం, కానీ అమలు చేయలేని అసహాయత. ఈ రెండింటికీ మధ్య ఒక రాత్రంతా నలిగిపోయాను. ఆ రాత్రి మెలకువ వచ్చినప్పుడల్లా శ్రీనివాసుడ్ని తలుస్తూనే వున్నాను - ఈ సమస్య పరిష్కారం కోసం. కానీ, స్వామి పలకలేదు.

మర్నాడు ఉదయం ఎవరో అతి పెద్ద అతిథి - బహుశా దేవాదాయ మంత్రో, కేంద్రమంత్రో కావచ్చు - వచ్చారు. దర్శనం కాగానే, ఆయన, ఆయనతోపాటే వచ్చిన 25-30 మంది రాజకీయ కార్యకర్తలు, అధికారులు (మొత్తం 40-50 మంది దాకా వుంటాం) అంతా విఐపి దర్శనంలో పాల్గొన్నారు. దర్శనం అయ్యాక రివాజు ప్రకారం గర్భగుడి ద్వారం దగ్గర్నుంచి రాములవారి మేడ దాకా అటూ ఇటూ అందరూ బారుగా నిలబడ్డారు. ముందు విఐపి, ఆయన తరువాత నేనూ... ఇలా వరుసగా అందరికీ అర్చకులు తీర్థం, శటారి, హారతి ఇచ్చుకుంటూ వెళ్తున్నారు. నేను చాలా అన్యమనస్కంగా వున్నాను. "ఒక మంచిపని అనుకున్నది చేయలేకపోతున్నాను స్వామీ" అంటూ మళ్ళీ శ్రీహరిని ప్రశ్నిస్తున్నాను. (ఆయన పలుకుతాడా నా పిచ్చిగాని!)

అంతలో మా లైను చివర (రాములవారి మేడదగ్గర) నుంచి విఐపి తాలూకు అధికారి ఎవరో అర్చకుల్ని పిలుస్తున్నారు. - "స్వామీ! నాకు తీర్థం, శటారి మర్చిపోయారు..." చటుక్కున అటు తలతిప్పాను. అర్చకులు లైను చివరిదాకా ఇచ్చుకుంటూ వెళ్ళి, పొరబాటున ఈ అధికారిని వదిలేసి, ఎదురుగావున్న లైను వాళ్ళకి ఇస్తున్నారు. ఈయన పిలుపుతో వాళ్ళు మళ్ళీ అక్కడే ఆగి, ఆయనక్కూడా తీర్థం, శటారి, హారతి ఇచ్చారు. అంతే! అది చూస్తూనే నాకు పరిష్కారం దొరికిపోయింది. గబగబా అక్కడికి వెళ్ళి, "ఇక నుంచి మీరు ఇక్కడే నిలబడి దర్శనం చేసుకువెళ్ళే భక్తులందరికీ తీర్థం, శటారి ఇవ్వండి" అంటూ నిర్దేశించాను.

ఈ హఠాత్ పరిణామానికి అర్చకులు నిర్ఘాంతపోయారు. ఏదో పాత వాదనే మళ్ళీ వినిపించబోయారు. నేనింక అవకాశమివ్వలేదు - "ఇప్పుడు రాములవారి మేడ గుమ్మం దాకా వచ్చి తీర్థం, శటారి ఇస్తే భంగం కలగని సాంప్రదాయానికి, రోజూ ఇలాగే ఇస్తే ఏమవుతుందట? ఈ క్షణం నుంచి ఇలాగే చేయాలి..."





వాళ్ళు వూరుకోలేదు. "అలా కాదండీ, అనూచానంగా వస్తున్న సాంప్రదాయం ప్రకారం తీర్థం, శటారి..."

"ఏం ఫరవాలేదు. వి. ఐ. పి. లు వచ్చినప్పుడల్లా ఎలాగో మీరు ఇక్కడిదాకా వస్తున్నారు కాబట్టి, ఇకనుంచి ఇక్కడే - ఈ రాములవారి మేడ గుమ్మం దగ్గర - తీర్థం, శటారి ఇచ్చేయండి..."

వాళ్ళు మరో పాయింట్ లేవనెత్తారు. "అనాదిగా భక్తులు స్వామి వారి విగ్రహం ముందు దర్శనం చేసుకుంటూ తీర్థం, శటారి తీసుకోటానికి అలవాటుపడి వున్నారు. ఇప్పుడు మనం ఆ పద్ధతి మారిస్తే వాళ్ళ మనోభావాలు దెబ్బతినే ప్రమాదం...."

"నో ప్రాబ్లమ్, అలాంటిదేదన్నా వుంటే, ఎవరన్నా వచ్చి మిమ్మల్ని ప్రశ్నిస్తే, నా మీదకి తోసేయండి. ఇదంతా ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ చేయించాడని చెప్పండి. నేను చూసుకుంటాను..." చివరికి వాళ్ళు ఒప్పుకోక తప్పలేదు.

(కాలక్రమంలో ఈ తీర్థం, శటారిలను పడికావలి బయటే ఇచ్చేలా కూడా అర్చకుల్ని టిటిడి ఒప్పించింది.)

ఇందువల్ల శ్రీవారి దర్శన సమయంలో ఏకాగ్రతతో స్వామిని వీక్షించే సమయాన్ని రెండు సెకండ్లు పెంచగలిగాం. కానీ, క్యూ షెడ్లలో నిరీక్షణ సమస్య మాత్రం ఇంకా పరిష్కారం కాలేదు. గంటకు రెండువేలమందికి దర్శనం లభించినా, రోజు మొత్తం మీద 17-18 గంటలు మాత్రమే దర్శనానికి కేటాయించటమవుతోంది. మిగతా సమయమంతా శ్రీవారి సేవలకి పోతుంది. తిరుమలలో కూడా రోజుకి 24 గంటలే కదా వుండేది.

వలంటీర్లు "జరగండి... జరగండి" అనకుండా వుంటే గంటకి 400 నుంచి 500 మంది దర్శనం చేసుకుంటారు. వలంటీర్లు తొందరపెడితే గుడిలో క్యూ మరింత వేగంగా కదిలి గంటకి 800 నుంచి 900 దాకా దర్శనం చేసుకోగలరు. కొంచెం గట్టిగా "జరగండి" అంటూ వలంటీర్లు వత్తిడి చేస్తే గంటకి 1200 నుంచి 1400 దాకా, ఇంకా గట్టిగా నెడుతూ వుంటే గంటకి 1600-1700 దాకా, మరింత బలంగా చేయిపట్టి లాగేస్తుంటే గంటకి 2200 నుంచి 2300 దాకా దర్శనం చేసుకోవచ్చు. ఇదంతా - దర్శనం నిరాటంకంగా జరుగుతున్నప్పుడు సంగతి. కాని అప్పట్లో అమల్లో వున్న దర్శనాల వేళలు అందుకు అనుకూలంగా లేవు. తెల్లవారుఝామున సుప్రభాతం తరువాత ధర్మ దర్శనం వుంటుంది. ఒక గంటదాకా తోమాలసేవ కోసం దర్శనం ఆపేస్తారు. తోమాలసేవ అయ్యాక మళ్ళీ దర్శనం మొదలు. మరో గంట కాగానే మళ్ళీ అర్చకసేవ. అదయ్యాక నైవేద్యానికి మొదటి గంట. ఆ తరువాత వారంలో ఆ రోజుని బట్టి ఏదన్నా ప్రత్యేక ఆర్జిత సేవ

(తిరుప్పావడ, సహస్రకలశాభిషేకం, అభిషేకం వగైరా) వుంటే అది అయ్యాక, అప్పుడు మళ్ళీ దర్శనం కొనసాగింపు. మొత్తం మీద నిరాటంకంగా కొన్ని గంటలపాటు స్వామి వారి ధర్మదర్శనం మొదలయ్యేది ఉదయం 10 గంటల తరువాతే.

క్యూషెడ్లలోకి భక్తుల్ని వదిలేది రాత్రి 12 గంటలకే అయినా, సుప్రభాతానంతర తొలిదర్శనం 3. 30కి మొదలవుతోంది. 12 గంటలకి క్యూ షెడ్లలో ప్రవేశించడం కోసం మరో మూడు గంటలు ముందే షెడ్లకి బయట యాత్రికులు నిరీక్షిస్తుంటారు. ఆ రకంగా వాళ్ళు సుప్రభాతానంతర దర్శనానికి వెళ్ళేసరికి ఆరుగంటల నిరీక్షణ అవసరమవుతుంది. తోమాల సేవ మొదలయ్యే లోపల ఒక షెడ్డు వరకు భక్తుల్ని దర్శనానికి వదులుతారు. అంటే ఒక 500 మంది వెళ్తారు. తోమాలసేవ తరువాత రెండో షెడ్డు వదులుతారు. అంటే వాళ్ళొక 500 మంది. అప్పుడు మళ్ళీ ఆర్జిత సేవ అడ్డమొస్తుంది. అర్చన తరువాత దర్శనం మళ్ళీ ఆరుగంటలకి మొదలు. వీటి మధ్య శుద్ధి, కొలువు, అలంకరణ లాంటి యితర సేవలు. అంటే తెల్లవారుఝామున 3. 30 నుంచి 7.30 గంటలలోపు మహా అయితే ఓ 1500 మంది దర్శనం చేసుకుంటారు. ఆ తరువాత నైవేద్యం గంట. ఆనక పడికావలిలో తిరుప్పావడలాంటి ఆర్జితసేవ. ఇలా 10 గంటలలోపు అంతరాయం లేకుండా దర్శనం జరగటం అనేది అసంభవం. అంటే రాత్రి 9-10 గంటలకి క్యూషెడ్ల దగ్గరికి వెళితే 10-12 గంటల తరువాత దర్శనం దొరకొచ్చు!

ఇలా పరిశీలన చేస్తున్న కొద్దీ నాకర్థమయిందేమంటే, ధర్మ దర్శనం ఎంత విరివిగా నిరాటంకంగా జరపగలిగితే అంత ఎక్కువమందిని - (అంటే ఆ రోజు రద్దీని బట్టి గంటకి 1000 నుంచి 2000దాకా) గర్భగుడిలోకి పంపగలుగుతాం.... సమస్య అర్థమయిపోయింది. కాని పరిష్కారం? "స్వామీ నీవే శరణం" అంటూ ప్రార్థిస్తున్నాను.

అలాంటి రోజుల్లో ఒకరోజు ఒక భక్తుడు, నాకు ఝాడిస్తూ లెటర్ రాశాడు. "అయ్యా, నేను రాత్రి తొమ్మిదిగంటలకి క్యూషెడ్లకి వెళితే 12 గంటలకు నాలుగో షెడ్డులోకి పంపారు. తెల్లవారు ఝామున మూడు గంటలకి మొదటి షెడ్డు దర్శనమన్నారు. కాని మాదాకా వచ్చేసరికి ఉదయం 10 గంటలకి కాని దర్శనం కాలేదు. ఎందుకని? ఈ ఏడుగంటలపాటు మొదటి మూడు షెడ్ల వాళ్ళే దర్శనం చేసుకుంటున్నారా? మీరు మీ విఐపి దర్శనాల కోసం మమ్మల్ని బలిచేస్తున్నారా?... మీరు మీ వి. ఐ. పి దర్శనాలన్నింటికీ కలిపి వేరే టైమ్ పెట్టుకోవచ్చు కదా? మమ్మల్నిలా దఫదఫాలుగా పంపించి ఎందుకు వేధిస్తున్నారు??..." అలాంటి లెటర్స్ అప్పటికి చాలామంది రాశారు. కాని ఈ లెటర్ వచ్చిన టైమింగ్ వేరు. రాసిన వారి పేరు శ్రీనివాస్!





నిమిషాల్లో నాకు ఈ సమస్య పరిష్కారం ఎలాగో అర్థమైపోయింది. ఆ లెటర్‌లో ఆ భక్తుడు పేర్కొన్న 'విఐపి' దర్శనాలంటే - నాకు తెలిసి ఆ సమయంలో ధర్మదర్శనానికి అడ్డం వచ్చేవల్లా శ్రీవారి సేవలే. వాటన్నింటినీ ఒక వరుస క్రమంలో ఉదయాన్నే పూర్తి చేసి, ధర్మదర్శనానికి క్యూలని - మధ్యలో గ్యాప్ లేకుండా వదిలేస్తే?... గంటకి వెయ్యి నుంచి రెండువేల మందికిపైగా ముందుకు వెళ్తారు. అంటే, తెల్లవారుఝామున 3. 30 గంటలకి మొదలుపెట్టి సుప్రభాతం, తోమాలసేవ, అర్చన, వగైరా సేవల్ని ఆరుగంటలకల్లా పూర్తి చేస్తే, 6. 30 నుంచి 10 గంటలలోపల మూడువేలమందికి పైగా ధర్మదర్శనం చేసుకుంటారు. ఈ దర్శనం సాయంత్రం ఏడుగంటలదాకా కొనసాగిస్తాం. అంటే దాదాపు పదమూడు గంటల నిరవధిక దర్శనంవల్ల ఇంకా వేగంగా క్యూ కదుల్తుంది. క్యూలో వున్నవాళ్ళకి 'క్యూ' నడుస్తోందన్న సంతృప్తి కలుగుతుంది. దర్శనం చేసుకొనే అవకాశం (తక్కువ నిరీక్షణకాలంలో) ఎక్కువమందికి కలుగుతుంది.

వెంటనే పేష్కార్ వాసు, కృష్ణస్వామి, పారె పత్తేదారు శేషాద్రిలతో సంప్రదించాను. ఆస్థాన విద్వాంసులతో, ఆచార్య పురుషులతో కూడా చర్చించి, ఈ ఆర్జిత సేవల సమీకరణ పథకం పరిశీలించమని వాళ్ళకి చెప్పాను.

అద్భుతం! కొద్దివారాల్లోనే అంతా ఏర్పాటయిపోయింది. ప్రసాదాలు తయారుచేసే పోటు మిరాసీదార్ల అసంతృప్తి (తెల్లవారుఝామునే అన్ని ప్రసాదాలూ తయారుచేయాల్సివస్తుంది కాబట్టి), మిరాసీదార్ల నిరసన మినహా మిగతా ఏర్పాటు అంతా చకచకా సాగిపోయింది. టిటిడి బోర్డు కూడా ఈ ప్రతిపాదనకి ఆమోదముద్ర వేసేసింది - ఫలితం?

తెల్లవారుఝామున మూడు గంటలనుంచి భక్తులు క్యూషెడ్లకి చేరతారు. ఆరుగంటలకి క్యూషెడ్లు తెరుస్తారు. ఏకాఎకిన క్యూలో దర్శనానికి వెళ్ళిపోతారు. అలా క్యూషెడ్లలో మొదటి బ్యాచ్ మూడు గంటలు నిరీక్షిస్తారు. రెండో బ్యాచ్‌కి నిరీక్షణ టైమ్ తగ్గిపోతుంది. ఎందుకంటే దర్శనం క్యూ నడుస్తూనే వుంటుంది కనుక. మూడో బ్యాచ్‌కి వెయిటింగ్ ఇంకా తక్కువ, నాలుగో బ్యాచ్‌కి ఇంకా తక్కువ.

ఎంత విశేషమైన మార్పు వచ్చిందంటే - 1978లో పన్నెండు గంటలు పట్టే వెయిటింగ్ టైమ్ 1980 నాటికి క్రమంగా మూడు గంటలకీ, ఒక గంటకీ తగ్గిపోతూ వచ్చింది!!

ఎప్పుడయితే క్యూషెడ్లలో నిరీక్షించే టైమ్ తగ్గిపోయిందో, టిటిడి సత్రాలలో కాటేజీలలో భక్తులు బసచేసే రోజుల సంఖ్య కూడా తగ్గిపోతూ వచ్చింది. ఇందువల్ల కాటేజీలు, సత్రాలు వినియోగించుకునేవారి సంఖ్య పెరిగింది. గతంలోగా సత్రాలు ఖాళీ లేక రోడ్లమీద భక్తులు

పడుకునే పరిస్థితి మారిపోయింది. అలాగే రైల్వే వారితో మాట్లాడి ట్రైన్లన్నీ ఉదయం 5-7 గంటల మధ్య కాక, 5-10 గంటల మధ్య తగినంత గ్యాప్‌తో తిరుపతికి చేరుకునేలా మార్పు చేశాం. అందువల్ల తిరుమలకి బస్సులో వచ్చే యాత్రికులకు బస్టాండులో వెయిటింగ్ తగ్గించాం.

ఇదంతా అయ్యాక, ఒకరోజు దర్శనానికి వచ్చిన ఒక మిత్రుడు ఈ మార్పులన్నీ చూసి మురిసిపోయాడు. "దర్శనాల విషయంలో ఎన్ని మార్పులు తీసుకువచ్చావోయ్! వ్హాట్ ఏ గ్రేట్ ఐడియా!" అన్నాడు అబ్బురపడుతూ, నవ్వుకున్నాను...

ఎవడిచ్చాడీ ఐడియాలన్నీ?

★ ★ ★




తిరుమల మూర్తులు-7

### శ్రీకృష్ణ-రుక్మిణి

రాజేంద్ర చోళుడి భార్య 1100 సంవత్సరంలో ఇక్కడ శ్రీకృష్ణ, రుక్మిణి విగ్రహాలకు పాలు, పెరుగు నైవేద్యం చేసేదిట. 'శయన బేరం'గా వ్యవహరించబడే ఈ కృష్ణ విగ్రహానికి ధనుర్మాసంలో ప్రతి రాత్రీ ఏకాంతసేవ జరుగుతుంది. (మిగతాకాలాల్లో ఈ సేవ భోగ శ్రీనివాసుడికి జరుగుతుంది) అలాగే గోకులాష్టమినాడు ఈయన్ని అలంకరించి రంగమంటపంలో ఊయలెక్కించి, ప్రబంధాలు చదువుతారు. ఈయన జన్మనక్షత్రమైన రోహిణీ నక్షత్రంనాడు (ఉట్ల ఉత్సవం సందర్భంగా) ఉత్సవబేరంతోపాటు ఊరేగిస్తారు.






# 14

# ప్రత్యేక కళ్యాణోత్సవం

**"ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం,**
**సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"**

ఆకాశంనుండి ఎక్కడెక్కడో వర్షించిన నీళ్లు ఎన్ని వేర్వేరు దారుల్లో ప్రవహించినా, ఎలాగైతే చివరకు సముద్రంలో కలుస్తాయో, అలాగే ఎందరు దేవతలకి మొక్కినా, అన్ని ప్రార్థనలూ చివరికి ఆ శ్రీహరినే చేరుకుంటాయి - ఇది వేదార్థం.

ఒకరోజు అభిషేక సమయంలో నేను తిరుమల శ్రీనివాసుని దర్శిస్తుండగా స్ఫురించిన ఈ శ్లోకమే ఒక జటిలమైన సమస్యకు పరిష్కారం చూపించింది. కొద్ది రోజుల్లోనే అది తిరుమల శ్రీ వేంకటేశ్వరుని కళ్యాణోత్సవంలో ఒక అనూహ్యమైన పరిణామానికి దారితీసింది.

★ ★ ★

తిరుమలలో శ్రీనివాసునికి జరిగే అన్నిరకాల ఆర్జిత సేవలలో అత్యంత ప్రాచుర్యం పొందింది శ్రీహరి కళ్యాణోత్సవ సేవ. ఇప్పుడు ప్రతిరోజూ కొన్ని వందలమంది భక్తులు శ్రీహరి కళ్యాణోత్సవంలో పాల్గొంటున్నారు. 40-50 సంవత్సరాలక్రితం మా తాతగారు చెప్పిన దానిప్రకారం, అప్పట్లో ఎవరన్నా భక్తుడు శ్రీనివాసునికి కళ్యాణోత్సవం చేయించదలుచుకుంటే, ఆ భక్తుడి కుటుంబానికి ఆలయ మర్యాదలు అందేవి. తిరుమలకొండ మీద చావడిలో (దేవస్థానం సత్రంలో) బస ఇచ్చేవారు.

ఆ బసనుంచి ఆ భక్తుని కుటుంబాన్నిఆలయందాకా మేళతాళాలతో సగౌరవంగా తోడ్కొనివచ్చేవారు. నిజానికి అప్పట్లో కళ్యాణోత్సవం ఇప్పటిలా ప్రతిరోజూ జరిగే కార్యక్రమం కాదు. అందువల్ల కళ్యాణోత్సవంలో పాల్గొనేవారి సంఖ్యకు పరిమితి విధించలేదు. క్రమంగా కళ్యాణోత్సవంలో పాల్గొనే కుటుంబాల సంఖ్య పెరుగుతూండటంతో, ఈ సేవలో పాల్గొనే ఒక్కొక్క గృహస్థు తరఫున మొత్తం సభ్యులు అయిదుగురికి మించరాదనే ఆంక్షలు విధించారు. 1978లో నేను తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా బాధ్యతలు స్వీకరించేనాటికివున్న పరిస్థితి ఇది.

★ ★ ★

తిరుమల శ్రీనివాసుని ఆలయంలోకి (మహద్వారం దాటి) ప్రవేశించగానే ఎడమవైపు వున్న రంగమంటపంలోనే ఈ కళ్యాణోత్సవాలు అప్పట్లో జరిగేవి. ఒక్కొక్క కళ్యాణోత్సవ సేవకు 1250 రూపాయల వంతున చెల్లించి పాల్గొనే గృహస్థుల సంఖ్య క్రమంగా పెరుగుతూవచ్చింది. రంగమంటపంలో వున్న స్థలాభావం వల్ల ఈ సేవలో పాల్గొనే గృహస్థుల సంఖ్యని 25కి పరిమితం చేయాల్సివచ్చింది. అప్పటికే చాలామంది ఆరోజుకారోజే కళ్యాణోత్సవం సేవ చేయిస్తామని ఆర్తితో రావడం, ప్రతి కళ్యాణోత్సవసేవకి తయారుచేయాల్సిన ప్రసాదాల పరిమాణాన్ని బట్టి కనీసం ఒక రోజు ముందుగా టిక్కెట్ తీసుకుంటేనే తప్ప సేవలో పాల్గొనడం సాధ్యపడదని ఆలయ అధికారులు నిరాకరించడం పరిపాటయిపోయింది. "అయ్యా, మేం స్వామివారికి కళ్యాణం చేయిస్తామని మొక్కుకుని ఎంతోదూరం నుంచి వచ్చాం. మమ్మల్ని నిరాశపరచకండి....."అంటూ గృహస్థ భక్తులు ప్రాధేయపడుతుండేవారు. ఆలయ అధికారులకి దయా, దాక్షిణ్యాలులేవని దుమ్మెత్తిపోస్తుండే వారు. అవన్నీ అలా వింటూ మింగలేక, కక్కలేక, వినీ వినిపించుకోనట్లు తలొంచుకు వెళ్లిపోవాల్సిన దుస్థితి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ ఎదుర్కోవాల్సి వచ్చేది.

మొదట్లో నేను ఈ పరిస్థితి గురించి ఆలోచించినప్పుడు "భక్తుల కోరిక మేరకు అడిగిన వాళ్లందర్నీ కళ్యాణోత్సవ సేవకి అనుమతిస్తే ఏంపోయింది" అనిపించింది. భక్తుల సంతృప్తే మనకు ప్రధానం కనుక అలాగేచేయాలి అనుకుంటూ రంగంలోకి దిగాను. కాని ఒక్కొక్క అడుగు ముందుగు వేసినప్పుడల్లా, రెండడుగులు వెనక్కివేయాల్సి వచ్చింది. సమస్య - కంటికి కనిపించినంత సులభం కాదనీ, దాని పరిష్కారం అత్యంత దుర్లభమనీ - చాలా త్వరగా నాకు బోధపడింది.

ఇందుకు కారణాలు రెండు - ఒకటి రంగ మంటపంలోస్థలం పరిమితం కనుక అపరిమితంగా గృహస్థ భక్తుల్ని అక్కడ కళ్యాణోత్సవానికి అనుమతించలేం. రెండవది - అత్యంత బలంగావున్న మిరాసీ వ్యవస్థ కారణంగా, కళ్యాణోత్సవంలో ఏ చిన్న మార్పుతీసుకురావాలని యత్నించినా, తమకు లాభంలేదనుకుంటే మిరాసీదార్లు దాన్ని వ్యతిరేకించేవారు. అప్పటికే అలాఅనేక మార్పుల విషయాల్లో





వాళ్లు కోర్టులకెక్కారు. తిరుపతి మేజిస్ట్రేట్ కోర్టు దగ్గర్నుంచి సుప్రీంకోర్టు దాకా వాళ్ల లిటిగేషన్‌లు విస్తరించి వున్నాయి.

ఇక్కడ మిరాసీ వ్యవస్థ గురించి కొంచెం చెప్పాలి. 'మిరాసీ' అంటే ఆలయంలో జరిగే సేవలనిర్వహణలో పాల్గొనే వారికి వంశపారంపర్యంగా వస్తూన్న హక్కు. ఆలయంలో అర్చకత్వం నిర్వహించే వారిని అర్చక మిరాసీదార్లంటారు. వంటశాలలో ప్రసాదాలు తయారుచేసేవారిని పోటు మిరాసీదార్లంటారు. జియ్యంగార్‌లు కూడా ఇలాగే వంశపారంపర్యంగా ఆలయంలో జరిగే వివిధ సేవలలో వినియోగించే ద్రవ్యాల నాణ్యతనీ, పరిమాణాన్ని ధృవీకరించి, అర్చకులకు అందజేసే బాధ్యత నిర్వర్తిస్తూంటారు. అర్చకులనీ, జియ్యంగార్‌లనీ సుప్రభాతకాలానికి లేపి, ఆలయానికి తోడ్కొని వచ్చే పనిని గొల్లమిరాసీదార్లు నిర్వర్తిస్తారు. అదేవిధంగా, శ్రీవారి ఏకాంత సేవలో భక్తిగీతాలు ఆలపించే అన్నమయ్య వారసులుకూడా ఈ మిరాసీ వ్యవస్థలో భాగమే.

ఈ మిరాసీదార్లందరికీ - అనూచానంగా వస్తున్న సాంప్రదాయం ప్రకారం - వారి వారి సేవలకు క్యాష్ చెల్లించే పద్ధతి లేదు. అందుకు బదులుగా శ్రీనివాసుడికి నైవేద్యం పెట్టే ప్రసాదాలలో కొంత భాగం - (ఒక నిర్దుష్ట నిష్పత్తిలో) ఈ మిరాసీదార్లవాటాల క్రింద పంపిణీ చేస్తుంటారు. ఉదాహరణకి - కళ్యాణోత్సవంలో తయారుచేసే ప్రసాదం లడ్డూల్లో (పెద్ద కళ్యాణం లడ్డు) ప్రతి పడిలో - అంటే ప్రతి 51 లడ్డూల్లో - 25 లడ్డూలు ఈ మిరాసీదార్లకి ఇచ్చేయాలి. వడలు చేసినా, జిలేబిచేసినా, పులిహోర చేసినా, చక్రపొంగలి చేసినా, దద్ధ్యోదనంచేసినా - అన్నింటిలోనూ అర్చక మిరాసీదార్లకి, పోటు మిరాసీదార్లకి వాటా వెళ్తుంది. అందుకని మిరాసీదార్లు కూడా ఏంచేస్తారంటే, ఆలయం ఆవరణలోనే ఒక కౌంటర్ పెట్టుకుని, అందులో తమవాటా ప్రసాదాల్ని భక్తులకి విక్రయిస్తుంటారు.

ఈ పరిస్థితి ఇలావుండగా - కళ్యాణోత్సవంలో పాల్గొనే గృహస్థ భక్తులకోసం- కళ్యాణం పూర్తయినాక (సాయంత్రం నాలుగవుతుంది) - అన్ని ప్రసాదాలను పోటు బ్రాహ్మలు పెద్దపెద్ద బుట్టల్లో పెట్టి భక్తుల కాటేజీలకి మోసుకువెళ్తుండేవారు. అది భక్తులకు వచ్చేవాటా. అయితే కళ్యాణోత్సవంలో పాల్గొన్న పెద్దకుటుంబాల్లో తప్ప మిగతా గృహస్థ కుటుంబాల వారు అంతంత ప్రసాదాన్ని తాము తినలేమని అంటుంటే, వాటిని యాత్రికులకు ఉచితంగా పంచిపెట్టే ఏర్పాటు చేశాం. ప్రసాదాలు అయిపోయినప్పటికీ, ప్రతి భక్తుడికీ స్వామి తరఫున ఏదో ఒక ప్రసాదం అందాలన్న ఉద్దేశ్యంతో చిన్న లడ్డూల పంపిణీ ప్రవేశపెట్టాం.

సగటున రోజుకి 25 కళ్యాణోత్సవాలు జరుగుతాయనుకుంటే, ప్రతి ఒక్క కళ్యాణోత్సవం టిక్కెట్టు మీదా ఆరు పెద్ద కళ్యాణం లడ్డూల వంతున ప్రతి అర్చక మిరాసీదారుకి 150 పెద్దలడ్డూలు లభిస్తాయి.

అదే నిష్పత్తిలో పోటు మిరాసీదార్లకి. అందుకే గృహస్థుల ప్రసాదాల ఉచితపంపిణీ వాళ్లకి అంగీకారయోగ్యం కాలేకపోయింది. ఆ రకంగా కళ్యాణోత్సవంలో తమ వాటా వదిలేయాల్సి వచ్చేది. (ఒక్కొక్క గృహస్థుకి కళ్యాణోత్సవ సేవవల్ల రెండు మూడు బుట్టల్లో అన్న ప్రసాదాలు, పెద్ద లడ్డూలు, వడలూ లభిస్తాయి.)

ఈ ప్రసాదాల పంపిణీ సమస్యకి తోడు - కళ్యాణోత్సవంలో ఒక భాగమైన హోమ నిర్వహణలో వినియోగించే ద్రవ్యాల సమస్యకూడా నన్ను వెంటాడింది. ప్రతి కళ్యాణోత్సవంలోనూ ఒక హోమకుండం వుంటుంది. అందులో హోమం జరుగుతుంది. గృహస్థ భక్తులు ఎంతమందివున్నా, ప్రతిరోజూ కళ్యాణోత్సవంలో అందరికి కలిపి ఒకే హోమం జరుగుతుంది. అయితే ఆ సేవలో పాల్గొనే గృహస్థుల సంఖ్యను బట్టి, హోమద్రవ్యాలను ఆలయ అధికారులు ఏర్పాటు చేస్తుంటారు. అంటే - సేవలోపాల్గొనే వారిసంఖ్య పెరిగితే, హోమంలో వాడే నెయ్యి వగయిరా ద్రవ్యాల పరిమాణంకూడా డిట్టం (నిర్దిష్ట కొలత) ప్రకారం పెరుగుతూంటుంది. చివరికి సేవ పూర్తయ్యాక మిగిలిపోయే పదార్థాలు (హోమశేషం) పూర్తిగా అర్చక మిరాసీదార్లకే చెందుతాయి.

అర్చకులు చేసేది ఒకే హోమం అయినప్పుడు, సేవలోపాల్గొనేవారి సంఖ్యను బట్టి హోమద్రవ్యాల పరిమాణం ఎందుకు పెంచుతూపోవాలి?... ఒక్క హోమానికే ఆ పదార్థాలను సరఫరా చేస్తాం - అంటూ దేవస్థానం అధికారులు పట్టుబట్టడం, దాన్ని సవాల్‌చేస్తూ అర్చక మిరాసీదార్లు కోర్టుకెక్కటం కూడా జరిగిపోయింది.

కాని, జరిగే హోమంఒక్కటే అయినా ఎన్ని కళ్యాణోత్సవాల టిక్కెట్లు అమ్మితే, అన్నింటికి లెఖ్ఖకట్టి హోమద్రవ్యాలను సరఫరా చేయాల్సిందే. ఆ ఒక్క హోమానికి ఖర్చయ్యే పదార్థాలు మినహా మిగిలినవన్నీ మిరాసీదార్లవే. అయితే నా సమస్య వేరు. నెయ్యి వగయిరా పదార్థాల ధరలుపెరిగిపోతున్నాయి. కళ్యాణోత్సవాలు పెరిగిన కొద్దీ ఖర్చు పెరిగిపోతోంది. రేట్లు పెంచుదామా అంటే - భక్తులు అప్పటికే గగ్గోలు పెట్టేస్తున్నారు! ఇలాంటి స్థితిలో హోమద్రవ్యాల విషయంలో అర్చక మిరాసీదార్లని ఒప్పించగలిగితే, ఈ సేవకి రేటు తగ్గించవచ్చు కదా! అలా అనుకుని ప్రయత్నంచేసీ, గతంలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌లు కోర్టు లిటిగేషన్‌లలో ఇరుక్కోవాల్సి వచ్చింది. క్లుప్తంగా చెప్పాలంటే - ఈ కళ్యాణోత్సవాల విషయంలో ఎలాంటి మార్పులు తీసుకురావటానికీ (ఒక్క టిక్కెట్ల విలువ పెంచటంలో మినహా, దేవస్థానం అధికారులకు వెసులుబాటు లేదు. ఫలితంగా - కళ్యాణోత్సవాల మీద టిటిడికి ఆర్థికభారం కొనసాగక తప్పటంలేదు.

ఏదోభక్తుల సంతృప్తికోసం, నా మానసికానందం కోసం - ఆ రంగమంటపంలోనే అటూ ఇటూ రాళ్లు జరిపీ, గ్రిల్స్ పెట్టించీ.... 35 కళ్యాణోత్సవాల దాకా జరిగే ఏర్పాటు చేశాను. అప్పటికీ





ప్రతిరోజూ ఈ సేవకోసం వచ్చే అనేకమంది గృహస్థుల అభ్యర్థనలని తిరస్కరించాల్సి వచ్చేది. అధికారులు అలాంటి అభ్యర్థనలని తిరస్కరించారని తెలిసినప్పుడల్లా నా మనస్సు మూగవేదనతో రోదించేది. కళ్యాణోత్సవం చేయించడం ద్వారా శ్రీనివాసుని సేవించుకోవాలని వందలాది మైళ్లదూరం నుంచి వస్తున్న ఈ భక్తులకి ఆ అవకాశం కల్పించలేకపోగా "వీల్లేదు, ఫోండి"అంటూ నిరోధిస్తున్నామా? ఎవడిచ్చాడీ అధికారం? ఇక్కడ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ పదవి ఎవడికోసం? ఎవరికి సేవచేయడం కోసం? భక్తులకు సదుపాయం కల్పించలేకపోతే, ఈ పోస్టు ప్రయోజనం ఏమిటి?.....

నా ఆవేశం ఆపుకోలేక అర్చక మిరాసీదార్లని అడిగేశాను. - "భక్తుల సదుపాయం చూడటానికి టిటిడికి సహకరించటానికి ఎందుకు తిరస్కరిస్తున్నారు? ఇలాచేయమని ఏదైవం చెప్పాడు?......"

నా ఆవేదన అర్థం చేసుకున్న కొంతమంది మిరాసీదార్లు-నాతో ఏకాంతంగా మాట్లాడినప్పుడు మాత్రం - "మాకేం అభ్యంతరం లేదండి, కాని మిగతావాళ్లు ఒప్పుకోవాలిగదా! శతాబ్దాల తరబడి మాకు వంశపారంపర్యంగా వస్తున్న హక్కుల్ని వదులుకోవాల్సి వస్తుందేమోనని ఆందోళన చెందుతున్నారు. అంచేత...."అంటూ నసిగేవారు. అయినా నాలో ఆశచావలేదు. "ఆశావాదం, పట్టుదల ఎప్పటికైనా ఫలితాన్ని సాధించి తీరతాయి"అన్న స్వాతంత్ర్యసమరయోధుడు సురేంద్రనాథ బెనర్జీ సూక్తి గుర్తుకొచ్చింది. నేను పట్టుదలవదల్లేదు. టిటిడి ట్రస్టుబోర్డు సభ్యులతో సుదీర్ఘంగా చర్చించాను. న్యాయవాద నిపుణులతో రోజులతరబడి భేటీ వేశాను. ఆస్థాన విద్వాంసుల్ని పదే పదే సంప్రదించాను. ఇలా చేస్తూనే, మరోప్రక్క కళ్యాణోత్సవ వేదికని రంగమంటపం నుంచి బయటికి(ఇంకా ఎక్కువ మంది భక్తులు పాల్గొనేలా) తరలించాలని తలపెట్టాను. ప్రాకారంలోపలే ఆలయానికి దక్షిణ వైపున వున్న స్టోర్సు, సామగ్రి అంతా ఇతరచోటుకి తరలింపజేశాను.

ఒకేసారి 200 మంది దాకా గృహస్థభక్తులు సకుటుంబంగా సామూహికంగా కళ్యాణోత్సవం చేయించుకునే మంటపాన్ని ఏర్పాటు చేయగలిగాను. అంతవరకూ నడిచింది కానీ, డిమాండు వున్నా-అక్కడే కళ్యాణోత్సవాలు చేయించడం మొదలు పెట్టలేకపోయాను. ఎందుకంటే - 200 కళ్యాణోత్సవాలకి సరిపడే ప్రసాదాలు (లడ్డూలు, అన్నప్రసాదాలు వగయిరా) చేయించాలి. హోమద్రవ్యాలుసరఫరా చేయాలి. అలావాటి పరిమాణం ఎంత పెరిగితే అంతగా సమస్య పరిమాణం కూడా పెరిగిపోతుంది. అర్చక మిరాసీదార్లని ఒప్పించకుండా ఏం చేయాలనియత్నించినా, కోర్టులు - లిటిగేషన్‌లు! పెద్దలతో జరిపిన అన్ని చర్చలు విఫలమయ్యాయి. నా మనస్సుకి ఎవరూ పరిష్కారం చూపించలేకపోయారు. నాది అరణ్య రోదనయిపోయింది.

★ ★ ★

**ఒక** గురువారం సాయంత్రం ఆలయంలో స్వామివారి విగ్రహం ముందు నిలబడి, నా ఆవేదనంతా వెళ్ళబోసుకున్నాను. ఆనందం, ఆవేశం, ఆవేదన, దుఃఖం, ద్వేషం, మోహం.... ఇలాంటి రాగద్వేషాలన్నింటికీ అతీతుడైన స్వామి నాకేదైనా పరిష్కారం చూపించకపోతాడా - అన్న ఆశ, స్వామివారి పాదాలు గట్టిగా పట్టుకుని పరిష్కారం చూపించే దాకా వదలనని భీష్మించుక్కూచుంటే సరి - అనుకున్నాను. ఎంత వెర్రితనం! ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నాకున్న అధికారాలన్నీ ఆ గర్భగుడికి ఇవతలున్న 'కులశేఖరపడి' వరకే. ఆ గుమ్మంలోపలికి వెళ్లి విగ్రహాన్ని తాకే అధికారం కూడా ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి లేదు. ఆ అర్హత అర్చకులది మాత్రమే....

మరి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌ల వ్యవస్థ రాకమునుపు సంగతి? అప్పుడూ అంతే, మరి ఇంకా అంతకు ముందు, అంతకన్నాముందు ... ? స్వామి విగ్రహం ఎదుట నిల్చున్నానన్నమాటే గానీ, నా ఆలోచనలు కొన్ని దశాబ్దాలు, శతాబ్దాలు వెనక్కి వెళ్ళిపోతున్నాయి.... కొండమీదకి జనం రానప్పుడూ అర్చకులు వున్నారు. ఒకటీ అరా కళ్యాణోత్సవాలు జరిగినప్పుడూ వున్నారు. కొండమీద అసలు జనమే లేని రోజుల్లో - ఒక శతాబ్దం క్రిందటి కాలంలో - అర్చకులు తిరుపతినుంచి కొండమీదకి అడవిమార్గంలో నడిచి వెళ్ళి శ్రీవారికి పూజలు చేసి వచ్చేవారు. జన బాహుళ్యంలోకి శ్రీవారి ఉనికి బాగా ప్రచారంలోకి వచ్చి, జనం రావడం మొదలు పెట్టాక, వాళ్ళ సౌలభ్యం కోసం వీళ్ళు కూడా కొండమీద వుంటున్నారు. అంటే, జనం లేనప్పుడూ, హుండీలో కానుకలు రానప్పుడూ కూడా ఈ అర్చకులు 'తరతరాలుగా' స్వామివారికి నిత్య దీపారాధన మొదలైన అన్ని సేవలూ చేస్తూనే వున్నారు. క్రమంగా జనం పెరిగారు. ఆదాయం పెరిగింది. సేవలన్నీ ఆర్జిత సేవలయ్యాయి. అర్చకత్వం వంశపారంపర్య హక్కుగా వస్తున్న అర్చక మిరాసీదారుల కుటుంబం కూడా కాలక్రమేణా - కొడుకులు, మనుమలుగా విస్తరించింది. (ఇప్పుడు ఒక ఏడాది అర్చకత్వ బాధ్యత నిర్వహించిన అర్చక మిరాసీ కుటుంబానికి మళ్ళీ ఆ అవకాశం రావాలంటే పదహారేళ్ళు పడుతుంది). అన్నిరకాల మిరాసీదార్ల పరిస్థితి ఇంతే. దేవుడికి ఏ ఆదాయమూ లేని ఆ కాలంలో వీళ్ళు ఏం ఆశించి, శ్రీనివాసుడికి సేవలు చేశారు? ఇవ్వాళ భక్తులు పెరిగి, ఆదాయం వస్తోంది కాబట్టి పెరిగిన సేవల్ని బట్టి, వాళ్ళ వాటా కూడా పెరిగింది కాబట్టి, ఇప్పుడు ఆ వాటా పెరగటం మీదే అందరి దృష్టీ పడుతోంది.... !!

"అయ్యా! మీకు అర్జంటు ఫోన్ కాల్ వచ్చిందట..." అంటూ ఎవరో ఆలయ అధికారి వచ్చి పిలిచేదాకా, ఇలా ఆలోచిస్తూనే వుండిపోయాను. కాని, ఆ ఆలోచనలు వచ్చిందగ్గర్నుంచీ, నాలో అంతర్మధనం మొదలైంది. ముందున్న ఆవేశం తగ్గిపోయింది. ఇప్పుడు ప్రశాంతంగా ఆలోచించగలుగుతున్నాను. నా దృక్పథంలో కూడా మార్పువచ్చింది. అయినా నా ఆరాటం తగ్గలేదు.

వాళ్ళకి (అర్చక మిరాసీదార్లకి) అన్యాయం చేస్తున్నామన్న భావన వాళ్ళకి కలక్కుండా, భక్తులకు తోడ్పడటం ఎలా? టిటిడికి అర్థికభారం తగ్గించడం ఎలా? వీలైనంత ఎక్కువమంది కళ్యాణోత్సవాలలో





పాల్గొనే అవకాశం కల్పించాలి. అర్చకులకు ఇంతవరకూ లభిస్తున్న ప్రసాదం వాటాని ఉపసంహరించుకునేలా వుండకూడదు. అదే సమయంలో ఈ ఆర్జిత సేవకి రేటు పెంచకూడదు. టిటిడి మీద ఆర్థికభారం పెరగకూడదు. ఎలా? ఎలా? ఎలా?

★ ★ ★

**ఆ** మరునాడు శుక్రవారం. శ్రీవేంకటేశ్వరుడి అభిషేకం జరిగేరోజు. విధ్యుక్తధర్మం ప్రకారం వెళ్ళి అభిషేక ఉత్సవంలో పాల్గొన్నాను. నిత్యకళ్యాణ శోభితుడైన శ్రీనివాసునికి పైనుంచి అర్చకులు పోస్తున్న క్షీరధారలు - కాంతివంతమైన ఆ విగ్రహం మీద ఎక్కడపడినా అలా అలా ప్రవహించి, చివరికి స్వామివారి పాదాల దగ్గరకే చేరుతున్నాయి. అప్రయత్నంగా స్ఫురించింది - "ఆకాశాత్పతితం తోయం యధాగచ్ఛతి సాగరం......." ఆకాశం నుండి నీరు ఎక్కడవర్షించినా, ఎలా ఎలా ప్రవహించినా చివరికి సముద్రుడ్నే చేరుతుందికదా!... ఆ క్షణంలో మెరుపులా మెరిసిందో ఆలోచన. (అక్కడే ఎందుకు కలిగింది?) "అవునూ! కళ్యాణోత్సవంలో ఇంకొక రకం కళ్యాణోత్సవం సేవ ప్రవేశపెడితే? సేవ ఏదయినప్పటికీ, స్వామివారిని సేవించే విధానమే కదా ప్రధానం. ఆ విధానంలో మార్పులేనప్పుడు ఎవరు ఎలాంటి కళ్యాణం చేయించినా - ప్రార్థన ఆ స్వామికే చేరుతుంది కదా!..." నిజానికి టిటిడి యాజమాన్యానికి వున్న అధికారం కూడా అంతవరకే. ప్రస్తుతం అమలులో వున్న సేవల్లో ఏమయినా మార్పులు తేవాలంటే సంబంధిత మిరాసీ వర్గాలవాళ్లందర్నీ ఒప్పించాల్సి వుంటుంది. కానీ, కొత్తసేవ ప్రవేశపెట్టాలంటే ఆ అవసరం లేదు.

నేనింక ఒక్కక్షణంకూడా వృధాచేయలేదు. బయటకు వస్తూనే అప్పటి పేష్కార్‌లు కృష్ణస్వామి, వాసుదేవన్‌లని పిలిపించాను. వాళ్లిద్దరూ ఆర్జితసేవల విధులు చూస్తుంటారు. ఈ ప్రత్యేక కళ్యాణోత్సవంసేవ ప్రవేశపెట్టడంలో గల సానుకూలత పరిశీలించమని చెప్పాను. ఆస్థాన విద్వాంసులు అప్పికట్ల జగన్నాధాచార్యులు గారినికూడా సంప్రదించాను. "ఐడియా బాగుంది కానీ, మళ్లీ మిరాసీదార్లు కోర్టుకెక్కితే.... ?" ఇదొక్కటే అనుమానం వాళ్లు వ్యక్తం చేశారు.

నా ఆలోచనకి ఒకరూపం వస్తోంది. కళ్యాణోత్సవానికి ఇప్పుడున్న రూపంలో అయితే ఎలాంటి మార్పులు చేయలేం. అంతేగదా! మనం ప్రతిపాదించే కొత్త కళ్యాణోత్సవంలో - ఈ కళ్యాణం మంత్ర విధానంలో ఏమార్పు వుండకూడదు. కానీ ఆడంబరాలు తగ్గిద్దాం. ఒక్కొక్క కళ్యాణోత్సవానికి ఇప్పటిలా అయిదుగుర్ని కాక ఇద్దర్ని (దంపతుల్ని) మాత్రమే అనుమతిస్తాం. బుట్టలతో అన్న ప్రసాదాల పంపిణీ, డాలరు వగయిరాలు లేకుండా, రెండు కళ్యాణం లడ్డూలు, రెండు వడలూ ప్రసాదంగా ఇస్తాం. ఒక కండువా గృహస్థుకి, ఒక రవికెలగుడ్డ గృహిణికి బహూకరిస్తాం. ఇలాంటి కళ్యాణోత్సవాలు ఎన్ని జరిగినప్పటికీ, అన్నింటికీ కలిపి ఒకే హోమం జరపటానికి అవసరమయిన

హోమ ద్రవ్యాల్ని అర్చకులకు ఇస్తాం. హోమశేషం అంటూ మిగిలిపోయిన పదార్థాలను అర్చకులకిచ్చే ప్రశ్నలేదు... ఇలాంటి ప్రత్యేక కళ్యాణోత్సవాన్ని మామూలుగా రోజూజరిగే కళ్యాణోత్సవాలతోపాటే కలిపి చేస్తాం. రెండు రకాల కళ్యాణోత్సవాలకి కలిపి ఒకే విధానం, ఒకే మంత్రం, ఒకే సమయం. తేడా వచ్చేదల్లా - సేవ టిక్కెట్టు ఛార్జిలోనూ, పాల్గొనే గృహస్థభక్తుల సంఖ్యలోనూ, వారి లభింపజేసే ప్రసాదాల పరిమాణంలోనూ మాత్రమే.

ఇలా కొత్త కళ్యాణోత్సవం సేవ కూడా చేయాల్సివస్తోంది కనుక, అర్చకులకు ఒక్కొక్క (కొత్త) కళ్యాణోత్సవానికి నిర్ణీతసొమ్మును దేవస్థానం చెల్లిస్తుంది. ఒకవేళ ఇప్పటి కళ్యాణోత్సవంతోపాటు ఈ ప్రత్యేక కళ్యాణోత్సవం చేయించటానికి అర్చక మిరాసీదార్లు వ్యతిరేకించే పక్షంలో, మామూలు కళ్యాణోత్సవాలు పూర్తయ్యాక, ఈ ప్రత్యేక కళ్యాణోత్సవాల్ని వాళ్లు విడిగా చేయాల్సి వుంటుంది. దేవస్థానం వారి ఏ సేవ చేయించటానికయినా అర్చక మిరాసీదార్లు కలిసి రాకపోతే, ప్రత్యామ్నాయ ఏర్పాటు చేసుకునే అధికారంకూడా టిటిడికి వుంది.

ఈ ప్రత్యేక కళ్యాణోత్సవం ప్రతిపాదనను ఖరారు చేశాం. ఆ ప్రకారం - అప్పటిదాకా అమలులో వున్న (పెద్ద) కళ్యాణోత్సవానికి 1250 రూపాయలువంతున వసూలు చేస్తుండగా (ఇప్పుడది 2500 రూపాయలు), ఈ ప్రత్యేక కళ్యాణం టిక్కెట్టు 500 రూపాయలు (ఇప్పుడు 750 రూపాయలు) మాత్రమే. పైగా, ఈప్రత్యేక కళ్యాణోత్సవంలో అన్న ప్రసాదాల సమస్య లేదు కనుక, గృహస్థ భక్తులు కొన్ని రోజులు, వారాలు ముందుగా రిజర్వు చేసుకోవలసిన అవసరమే లేదు. ఆ రోజుకారోజే అనుకుని కూర్చోవచ్చు. ఈ 500 రూపాయల రుసుంలో 22 రూపాయలు మిరాసీదార్లకు దేవస్థానంచెల్లిస్తుంది.

ఈ ప్రత్యేక కళ్యాణోత్సవం వార్త దావానలంలా ఆలయవర్గాల్లో వ్యాపించింది. ప్రతి చోటా ఇది చర్చనీయాంశమైపోయింది. మిరాసీదార్లు వ్యతిరేకించారు. కొందరు టిటిడిఅధికారులు సయితం ఇది అమలు జరిగే విషయంలో పెదిమ విరిచారు. ట్రస్టుబోర్డు మాత్రం - "ఇదొక విప్లవాత్మకమైన పరిణామం - మనం అమలుచేయగలిగితే" అంటూ ఉత్సాహపడింది. నా ప్రతిపాదనకు ఆమోదముద్ర వేసింది. మిరాసీదార్లతో ముఖాముఖీ చర్చించాను. "ఈ కొత్త కళ్యాణోత్సవం వల్ల మీరేమీ నష్టపోరు. ప్రసాదాలు లేవు కనుక వాటా వుండదు. కానీ ప్రతి ఒక ప్రత్యేక కళ్యాణోత్సవానికి మీకు 22 రూపాయలు వంతున లభిస్తుంది. పైగా రోజుకు 200 కళ్యాణోత్సవాలదాకా జరపటానికి కొత్తమంటపంలో సదుపాయంవుంది కనుక, కళ్యాణోత్సవాల సంఖ్య పెరుగుతుంది. ఆ రకంగా మీకు ఆదాయమూ పెరుగుతుంది..."అంటూ నచ్చజెప్పే ప్రయత్నం చేశాను. అయినా వాళ్లు ఇతమిత్థంగాఏమీ తేల్చలేదు. కానీ.... అర్చక మిరాసీదార్లలో - అధికభాగం ప్రసాదంవాటాలుపొందే ఇద్దరు మాత్రం (డాక్టర్ రమణ దీక్షితులు, శ్రీనారాయణ దీక్షితులు) నన్ను కలిసి, "మీ వాదనలో హేతుబద్ధత వుంది. కానీ





బాహాటంగా మేం మిమ్మల్ని సమర్థించలేకపోతున్నాం" అంటూ తమ నైతిక మద్దతు మాత్రం వ్యక్తం చేసి వెళ్లారు. దాంతో నాకు విశ్వాసం పెరిగింది.

చివరిసారిగా న్యాయవాద నిపుణులతో సంప్రదించాను. ఒకవేళ మిరాసీదార్లు కోర్టుకెక్కితే ఏంచేయాలో కూడా వాళ్లతో ఆలోచించుకుని, అన్నిరకాల పరిణామాలకు సిద్ధంగా తయారయ్యాను. నాలాగే మిరాసీదార్లు కూడా, న్యాయవాదులతో సంప్రదింపులు జరిపారు. వాళ్ల ఏర్పాట్లు వాళ్లు కూడా చేసుకుంటున్నారని విన్నాను. రెండువైపులా వాతావరణం బాగా వేడెక్కింది. చివరిసారిగా పరిస్థితులన్నీ సమీక్షించుకుని, "భక్తులకు సహాయపడాలన్నా, దేవస్థానానికి న్యాయం జరగాలన్నా ఇంతకన్న మార్గంలేదు" - అని నిర్ణయించుకుని రంగంలోకి దిగాను. తదనుగుణంగా మిరాసీదార్లకు నోటీసులు పంపించాను. "ఈ కొత్త సేవకు ట్రస్టుబోర్డు ఖరారు చేసిన షరతులకులోబడి సహకరించే పక్షంలో మిరాసీదార్ల సేవలను ఈ ఆర్జిత సేవక్కూడా దేవస్థానం వినియోగించుకుంటుంది" అంటూ ఆ నోటీసుల్లో వాళ్లకి స్పష్టం చేయడం జరిగింది! నేను ఇంకో అడుగు ముందుకు వెళ్లి, తొలి ప్రత్యేక కళ్యాణోత్సవంలో పాల్గొనేదంపతులుగా నాకూ, నా అర్ధాంగి గోపికకి కలిపి 500 రూపాయలు చెల్లించాను. కానీ నా అనుమానం నన్ను వెంటాడుతూనే వుంది. వాళ్లు సహకరించకపోతే? ఎందుకైనా మంచిదని ముందు జాగ్రత్తచర్యగా ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసి వుంచమంటూ కృష్ణస్వామికి, వాసుదేవన్‌కి పురమాయించాను. అంటే - మాకు ప్రత్యేక కళ్యాణోత్సవం చేయించటానికి వేరే అర్చకులు, ప్రత్యేక హోమకుండం, దానికి సరిపడా హోమద్రవ్యాలు వగయిరాలని వాళ్లు సిద్ధంగా వుంచాలి. ఆ ఏర్పాట్లు కూడా పూర్తయ్యాయి.

★ ★ ★

వివాదాస్పద ఘడియ రానే వచ్చింది. 1250 రూపాయలు వంతున చెల్లించి కళ్యాణోత్సవానికి కూర్చున్న గృహస్థులతోపాటే నేనూ, నాభార్య కూడా కూర్చుని, మా ఇద్దరికి ప్రత్యేక కళ్యాణోత్సవానికి (500రూపాయల కళ్యాణం) సంకల్పంచెప్పాలని అర్చకులనికోరాం. అంటే అక్కడ నేను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ హోదాలోకాక, ఒక గృహస్థుగా మాత్రమే పాల్గొన్నాను. నా 500 రూపాయల టిక్కెట్టు చూపించాను!!

ఇంత అకస్మాత్తుగా ఈ సేవ ప్రవేశపెడతామని గానీ, అలా ఎగ్జిక్యూటివ్ ఆఫీసరే వచ్చి గృహస్థులా పాల్గొంటాడనిగానీ ఊహించని అర్చక మిరాసీదార్లకి ఈ హఠాత్ పరిణామంతో గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లయింది. ఇంకా కొన్నాళ్లపాటు ఏవోచర్చలు, సంప్రదింపులు జరుగుతాయని ఆశిస్తున్న అర్చకులు నా వైఖరికి ప్రమాన్పడిపోయారు. ఒక ప్రక్క పెద్ద కళ్యాణోత్సవంలో పాల్గొనాలని వచ్చిన అనేక కుటుంబాలు ఆ మహత్తర కళ్యాణ ఘడియ కోసం ఎదురుచూస్తుంటే, వారిచేత సంకల్పాం చెప్పించాలని వచ్చిన అర్చకులు-నామొండితనం చూసి ఏం చేయాలో తెలీక ఒకరి ముఖాలు ఒకరు

చూసుకున్నారు. ఓ ప్రక్క నేను ఆలయ పేష్కార్ మీద అరుస్తున్నాను. "నేను మీకు ప్రత్యేక కళ్యాణోత్సవానికి 500 రూపాయలు చెల్లించాను. ఎందుకు తాత్సారం చేస్తున్నారు?...."



ప్రత్యేక కళ్యాణోత్సవం చేయించుకున్న
పి.వి.ఆర్.కె. ప్రసాద్-గోపిక దంపతులు

కాసేపటికి అర్చక మిరాసీదార్లు తేరుకున్నారు. వాళ్లలో వాళ్లు చర్చించుకున్నారు. తిరుగుబాటు జెండా ఎగరేయాలని నిర్ణయించుకున్నారు. అలా ప్రకటించేశారు. దాంతో అప్పటికే ముందుగా ఇచ్చిన నా ఆదేశాల ప్రకారం కృష్ణస్వామి, వాసుదేవన్, శేషాద్రి, సంతానంలు ప్రత్యామ్నాయ (సర్కారు) అర్చకులతో, హోమద్రవ్యాలతో ప్రత్యక్షమయ్యారు. అర్చక మిరాసీదార్లు నిర్ఘాంతపోయారు.

ఆఖరిమాటగా అర్చక మిరాసీదార్లతో చెప్పాను - "ఇక్కడున్న మిగతా గృహస్థులతో పాటే మా ప్రత్యేక కళ్యాణోత్సవం జరగడం న్యాయం. ఒక్క ప్రసాదంలో మినహా మిగతా తంతు వాళ్లకీ మాకు ఒక్కటే. ఒకవేళ వాళ్లతో కలిపి మాకు ప్రత్యేక కళ్యాణోత్సవం మీరు జరపలేమంటే, వాళ్ల కళ్యాణోత్సవం పూర్తయ్యాక, మేం ఇక్కడే, ఈ హోమకుండం ముందు కూర్చుని, ఈ స్వామి వారికే (ఉత్సవ విగ్రహాలు) కళ్యాణోత్సవం చేయించు కుంటాం..."

... పైకి బింకంగా అన్నాను కానీ ఎదురుగుండా కళ్యాణ వేదిక మీదున్న శ్రీదేవి, భూదేవి సహిత శ్రీనివాసుడ్ని చూస్తుంటే - నేనేమన్నా అపరాధం చేస్తున్నానా అన్న ఆందోళన నన్ను వెంటాడుతోంది. ఎందుకంటే - ఇంతమంది గృహస్థుల ఎదుట ఇంత గందరగోళం జరగటానికి కారకుడ్ని నేనేకదా! స్వామి చూస్తూనే వున్నాడు..... ?

అంతలో అర్చక మిరాసీదార్లు నా దగ్గరకు వచ్చారు. "అయ్యా, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ ఇలా గృహస్థుగాకూర్చోవడం ఏమీ బాగాలేదు. దయచేసి, మమ్మల్ని ఇబ్బంది పెట్టకండి..."

నేను నా మంకుపట్టు విడిచిపెట్టలేదు... వాళ్లు దిగిరాక తప్పలేదు. !!!

అయిష్టంగానే వాళ్లు - తిరుమల ఆలయ చరిత్రలో మొట్టమొదటిసారిగా వాళ్ల హక్కుల విషయంలో రాజీపడి, ఒక క్రొత్త ఆర్జిత సేవని (ప్రత్యేక కళ్యాణోత్సవం) దేవస్థానం కోరిన విధంగా జరిపించటానికి ముందుకు వచ్చారు.





ఆ మర్నాటినుంచి ఈ ప్రత్యేక (మినీ) కళ్యాణోత్సవం టిక్కెట్లు కోరిన వాళ్లందరికీ విక్రయించాలని చెప్పాను. "ఏ ఒక్క గృహస్థుకూడా కళ్యాణోత్సవానికి టిటిడి అనుమతించలేదు- అన్న అసంతృప్తితో తిరిగిపోకూడదు" అని స్పష్టంగా ఆదేశాలిచ్చాను. కళ్యాణోత్సవాల్ని రంగమంటపం నుంచి దక్షిణ ప్రాకారంలోపల కొత్తగా కట్టివుంచిన కళ్యాణ మంటపంలోకి తరలించాం. ఏమా అద్భుతం! రెండువారాల్లోనే ప్రత్యేక కళ్యాణోత్సవాల సంఖ్య (రోజుకి) వందకి చేరుకుంది. నెలగడిచేసరికి రెండు వందలయింది. క్రమంగా పెద్ద కళ్యాణోత్సవాల సంఖ్యని పరిమితంచేస్తూ, ఈ ప్రత్యేక (మినీ) కళ్యాణోత్సవాల సంఖ్యని పెంచుకుంటూ వచ్చాం.

'ఎక్కడిదా ప్రేరణ? ఎవరిదా శక్తి?'

నిజానికి ఇప్పుడున్న క్యూకాంప్లెక్స్ మధ్యలో ఒక పెద్ద కళ్యాణ మంటపం కట్టి, అక్కడే కళ్యాణోత్సవాలు నిర్వహింపజేస్తే బాగుండేది. అయితే ఆ ప్రదేశం అంతా గతంలో చెరువుండే స్థలంకాబట్టి, అది వీలుపడని పక్షంలో దానికి ప్రత్యామ్నాయంగా ఇంకోఆలోచన కూడా చేశాను. ఆర్జిత సేవలన్నీ ఆలయంలోపలే జరగడం ఆనవాయితీ. అయితే వీలైనంత ఎక్కువమంది భక్తులకు ఆర్జిత సేవల్లో స్వామివారిని దర్శించుకునే అవకాశం కల్పించాలన్నది నా తాపత్రయం. ఇందుకోసమే ముందుగా ఆలయం ముందు వీధిలోని మంటపంలో 'సహస్రదీపాలంకరణ' పేరుతో ఒక ఆర్జితసేవ ఏర్పాటు చేశాం. ఒక రకంగా ఇది ఊంజల్ సేవే.... అలా ఒకసారి ఉత్సవ విగ్రహాల్ని ఆర్జిత సేవలకోసం గుడి బయటకు తీసుకు రాగలిగాం కనుక, ఆనక బేడి ఆంజనేయస్వామి విగ్రహ ప్రతిష్ఠ సమయంలో, ఆ గుడి దాకా ఉత్సవ విగ్రహాల్ని తీసుకెళ్లి ఊంజల్ సేవ జరిపించేశాం...

ఒకసారి ఇలా ఆర్జిత సేవల కోసం స్వామి వారిని సన్నిధివీధి చివరిదాకా తీసుకు వచ్చాం కనుక భవిష్యత్‌లో కళ్యాణోత్సవాలు కూడా బయటే జరిపిస్తే బాగుంటుందనుకునే వాడ్ని. ఎందుకంటే అక్కడ



బేడి ఆంజనేయస్వామి ప్రతిష్ఠ సందర్భంగా స్వామి వారి ఊంజల్ ఉత్సవం

వెయ్యి కళ్యాణోత్సవాలు ఏకకాలంలో జరపటానికి తగిన సభామంటపం కట్టాం... అన్నింటికీ వెనకాల నాలక్ష్యం ఒక్కటే - వీలైనంత ఎక్కువమంది భక్తులు (టిక్కెట్టు కొనని వాళ్లు సయితం) శ్రీనివాసుడి వైభవాన్ని తిలకించి పులకించాలి.

కానీ, నేను అక్కడ వున్న కాలంలో కళ్యాణోత్సవాలు ఆలయప్రాకారం దాటి బయటకు రాలేదు. ఎందుకు చేయలేకపోయాను?

అది నా శక్తిహీనతా? లేక నా శక్తికి మించిన 'శక్తి' తాలూకు సంకల్పమే అదా?

★ ★ ★




తిరుమల మూర్తులు-8

## సుదర్శనం

గర్భగుడిలో శ్రద్ధగా పరికిస్తే భక్తులకు కాగల మరో పవిత్ర దర్శనం 'సుదర్శన చక్రం'. లోహంతో చేయబడిన 'చక్రాత్తాల్వార్'గా చెప్పబడే ఈ సుదర్శనం మూలవిరాట్‌కి కొద్ది దూరంలో పవిత్రంగా వుంచబడివుంటుంది. బ్రహ్మోత్సవం, తీర్థవరి, అనంత చతుర్దశి, చక్రతీర్థ ముక్కోటి వంటి కొన్ని ప్రత్యేక సందర్భాలలో మాత్రమే ఈ 'సుదర్శనం' ఆలయం బయటకు వెళ్తూంటుంది. బ్రహ్మోత్సవాలలో పుష్కరిణిలో జరిగే చక్రస్నానానంతర స్నానం పవిత్రమైందిగా భక్తులు భావిస్తారు.






# 15

# అర్ధరాత్రి ఛీఫ్ సెక్రటరీ

మద్రాసు నుంచి కారులో బయల్దేరిన ఆంధ్రప్రదేశ్ ఛీఫ్ సెక్రటరీ కుటుంబం ఆ సాయంత్రానికి తిరుపతి చేరాల్సివుంది. కాని, అయిదు - ఆరు - ఏడు - పదిగంటలు గడిచినా చేరలేదు. పైగా వాళ్లు బయల్దేరిన చోటుకి వాకబు చేస్తే, ఆ కారు బయల్దేరివెళ్లిపోయాక వాళ్లఆచూకీ తెలీటంలేదంటూ అక్కడి బంధువులు ఆందోళన పడిపోయారు.

తిరుపతికి వచ్చి, తిరుమలలో శ్రీనివాసుడి అభిషేక దర్శనంచేసుకోవాలని ఎన్నో రోజులుగా తహతహలాడుతూ, ఎంతో ఆర్తితో సకుటుంబంగా ఓ సాయంత్రం బయల్దేరిన ఛీఫ్ సెక్రటరీకి ఏం జరిగిందోనన్న బెంగ, ఆందోళన ఒక్కసారిగా నన్ను చుట్టుముట్టాయి. క్షణ క్షణానికీ ఆదుర్దా నాలో పెరిగిపోతోంది... అలా దాదాపు 13 - 14 గంటలపాటు పెరిగిపోతున్న ఆదుర్దాతో - ఆ రాత్రంతా నిద్రలేకుండా గడిపాను. ఆయన రాష్ట్రప్రభుత్వానికి ఛీఫ్ సెక్రటరీ. నేను చేసే ఉద్యోగం తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ అయినా, ప్రభుత్వ పాలనావ్యవస్థలో నాదొక జాయింట్ సెక్రటరీ స్థాయి పోస్టు. అది ఛీఫ్ సెక్రటరీకి నాలుగు స్థాయిల క్రింద వుంటుంది. పైగా అందరు ఐఏఎస్, ఐపిఎస్ అధికారుల సర్వీసులూ ఛీఫ్ సెక్రటరీ అధీనంలోనే వుంటాయి. ఒక సబ్ కలెక్టర్ నుంచి ప్రిన్సిపల్ సెక్రటరీదాకా అందరికీ - పాలనాపరంగా ప్రభుత్వానికి ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ అంటే ఛీఫ్ సెక్రటరీయే. ముఖ్యమంత్రికి భయపడినా భయపడకపోయినా, అధికారులంతా ఛీఫ్ సెక్రటరీకి భయపడేవాళ్లు. ఎందుకంటే - ముఖ్యమంత్రి సయితం గౌరవించే పోస్టు ఛీఫ్ సెక్రటరీది.

అంతశక్తివంతమైన పదవిలో వున్న ఎస్. ఆర్. రామ్మూర్తి - తిరుమల శ్రీ వేంకటేశ్వరుడ్ని అభిషేక సమయంలో దర్శించుకోవాలని కోరుకున్నారు. నా దగ్గర రెండు మూడుసార్లు ఆయన తన కోరిక వ్యక్తం చేశారు.

"ప్రసాద్! శ్రీనివాసుడి అభిషేక దర్శనం కావాలయ్యా నాకు. ఎన్నోసార్లు ప్రయత్నించినా, అభిషేకదర్శనం చేసుకోలేకపోతున్నాను. ఏదో ఒక అవాంతరం వస్తోంది. నువ్వు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగానయినా నాకు అభిషేక దర్శనం చేయించాలయ్యా.." అంటూ ఎంతో ఆశగా అడిగారు శ్రీరామ్మూర్తి. ఆయన ఆధికారికంగా ఆదేశించటంకాక అలా అభ్యర్థనగా అడిగేసరికి ఆశ్చర్యపోయాను.

ఛీఫ్ సెక్రటరీ తల్చుకుంటే పాలనా వ్యవస్థలోనే మార్పులుతీసురాగల రోజులవి. అలాంటి ఛీఫ్ సెక్రటరీ - ఆయనకన్నా ఎంతో క్రింద స్థాయిలోవున్న నన్ను అలా అడగటమేమిటి? అదే చెప్పాను - "ఏమిటి సర్! మీరు అలా అడుగుతున్నారు. మీరు ఎలాంటి దర్శనం కావాలంటే అలాంటి దర్శనం చేసుకోవచ్చు. మీరు తల్చుకుంటే ఎంతసేపు?"

"అనుకుంటాంగానీ, స్వామి దర్శనభాగ్యం మనిష్టప్రకారం జరిగేదేనంటావా?... నేను ఛీఫ్ సెక్రటరీ అయ్యాక శ్రీనివాసుడి అభిషేకదర్శనం చేసుకోవాలని ఎన్నోసార్లు కోరుకున్నాను. కానీ, ప్రతీసారీ ఏదో అవాంతరం వస్తోంది. చివరికి అభిషేక దర్శనం చేసుకోకుండానే రిటైరయిపోతానో ఏమో....." అంటూ విచారం వ్యక్తంచేశారు.

నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వచ్చి అప్పటికే రెండేళ్లుకావస్తోంది. అంచేత విఐపిలు (అత్యంత ముఖ్యమైనవాళ్లు) ఎవరైనా వస్తున్నారంటే, వాళ్లకి ఎలాంటి ఏర్పాట్లు చేయాలో - అన్నీ ఒక క్రమపద్ధతిలో జరిగేలా నిర్దిష్ట విధానాలను రూపొందించివుంచాను. పైగా "ఇలా జరగాలీ" అని ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ ఆదేశించాక, పై నుంచి క్రింద దాకా అదే పద్ధతిలో అన్నీ నడిచిపోతాయి. కనుక ఛీఫ్ సెక్రటరీగారి ఇంత 'చిన్నకోరిక' తీర్చటం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి ఏమాత్రం కష్టమూ కాదు, దుస్సాధ్యమూకాదు.

అందుకే నేను మళ్లీ హామీ ఇచ్చాను - "సర్! మీరు ఏ శుక్రవారం నాటి అభిషేకంలో శ్రీవారిని దర్శించుకోవాలనుకున్నా, ఒక్కరోజు ముందు నాకు ఫోన్ చేయండి చాలు. అన్నీ నేను చూసుకుంటాను. నేను వుండగా మీకు అభిషేక దర్శనం జరగపోవటం ఏమిటి! జస్ట్, మీరు ఒక్కఫోన్‌కాల్ చేస్తే చాలు....."

ఆయనకి ఇంకా నమ్మకం కలగటంలేదు. ఇంకా ఏదో అనుమానం వెంటాడుతూనే వుంది. "మరి మా బావమరిది పద్మనాభం విషయంలో కూడా ఇలాగే అనుకున్నాం గదయ్యా, ఏమైంది?" అంటూ తన అనుమానాన్ని శ్రీరామ్మూర్తి బయటపెట్టారు.

"ఓహ్... అదంటారా.. !" సాలోచనగా అంటూ నేను పద్మనాభంగార్ని గుర్తుచేసుకున్నాను.

★ ★ ★





**అ**ప్పటికి కొద్దికాలం క్రితం నేను ఏదో పనిమీద హైద్రాబాద్ వెళ్లాను. టిటిడికి సంబంధించిన కొన్ని విషయాలు చర్చించటానికి అప్పాయింట్‌మెంట్ తీసుకుని ఛీఫ్ సెక్రటరీ రామ్మూర్తిగారిని కలిశాను. నిరాడంబరత, నిర్మలత్వం మూర్తీభవించిన రామ్మూర్తిగారు మృదుభాషి. చాలా సమర్థుడైన అధికారిగా పేరుపొందిన శ్రీరామ్మూర్తిగారు వేంకటేశ్వరస్వామిని ఆరాధించే భక్తి తత్పరుడు.

ఆరోజు నేను కలవగానే రామ్మూర్తిగారు, "రావయ్యా ప్రసాదూ, ఈ ఉదయం నీ గురించే ప్రస్తావన వచ్చిందయ్యా" అన్నారు. ఛీఫ్ సెక్రటరీ అంతటి వ్యక్తి జాయింట్ సెక్రటరీ స్థాయి అధికారిని తలుచుకున్నారంటే, ఎక్కడో ఏదో తేడా వచ్చేవుండాలి. అందుకే అడిగాను - "ఏమైనా పొరబాటు జరిగిందా సర్?"

ఆయన నవ్వేశారు. "అదేంలేదయ్యా, నా బావమరిది పద్మనాభం బ్రిటానియాలో పనిచేస్తున్నాడు. తిరుపతికొండకి నడచి ఎక్కి, బాలాజీ దర్శనం చేసుకోవాలని చాలాకాలంగా ఆయన కోరిక. ఎన్నిసార్లు ఆయన ప్లాన్ చేసుకున్నా, ప్రతిసారీ ఏదో అవాంతరం ఎదురవటం, చివరి నిమిషంలో కార్యక్రమం మొత్తం క్యాన్సిల్ చేసుకోవడం జరుగుతోంది. ఈసారి అలా కాకుండా ప్రసాద్‌తో చెబుతాలే అన్నాను..." అంటూ ఆయన తన బావమరిది పద్మనాభంగారి గురించి చెప్పారు.

"ఓస్ ఇంతేగదండీ" అన్నాను.

"అలా తీసిపారేస్తున్నావ్‌గానీ, స్వామిదర్శనభాగ్యం మనిష్టప్రకారం లభించేదేనంటావా?... పోనీలే, పద్మనాభానికి నీ ఆధ్వర్యంలో అత్యంత సంతృప్తికరమైన దర్శనం జరగాలని నా కోరిక. నువ్వు గట్టిగా పూనుకోకపోతే, గతంలోలాగా అయిపోతుందేమోనని నాభయం?" ఇది రామ్మూర్తిగారి బెంగ....

మొత్తంమీద నేను రామ్మూర్తిగారికి హామీ ఇచ్చేశాను - పద్మనాభంగారి సంగతి నాకు వదిలేయండి అంటూ.

ఆ మర్నాడు ఉదయం నేను తిరుపతికి రావటానికి బేగంపేట ఎయిర్‌పోర్టుకి వచ్చేసరికి అక్కడ రామ్మూర్తిగారు, తన బావమరిదితో సహా వున్నారు. ఆయన కేవలం పద్మనాభంగారిని నాకు పరిచయం చేయాలని ఎయిర్‌పోర్టుకి వచ్చారు. "ఈసారి ఎలాగైనా మా పద్మనాభం - కొండకి నడిచి వచ్చిన వెంటనే మరపురాని దర్శనం చేయించాలయ్యా" అని మరోసారి రామ్మూర్తిగారు నన్ను హెచ్చరించారు.

నాలో నేను నవ్వుకున్నాను. "ఏమిటీయన చాదస్తం! ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌ని నేను హామీ ఇస్తుంటే కూడా, ఈయన ఎందుకింత ఆదుర్దాపడతారు..." అనుకొని, "నాకు వదిలేయండి సర్,

అంతా నేను చూసుకుంటాను" అని మరోసారి నా ధీమా వ్యక్తం చేసి, పద్మనాభంగారితో కలిసి తిరుపతి విమానం ఎక్కాను.

తిరుపతిలో దిగగానే పద్మనాభంగారు చెప్పిన కార్యక్రమం ప్రకారం - ఆయన మిత్రులు కొంతమంది ఆ పూట మద్రాసునుంచి తిరుపతికి వస్తున్నారు. వాళ్ళందరూ కలిసి ఆ మధ్యాహ్నం మూడున్నర గంటల ప్రాంతంలో కొండకి నడిచి ఎక్కుతారు. ఆ రాత్రి శ్రీనివాసుని దర్శనం చేసుకోవటం, రాత్రికి కొండమీద బసచేసి, తెల్లవారుఝామున సుప్రభాత దర్శనం, అర్చనానంతర దర్శనం కూడా చేసుకుంటారు.

ఛీఫ్ సెక్రటరీ గారి దగ్గర బంధువు కనుక నేను మరింత శ్రద్ధగా ఏర్పాట్లన్నీ చేసేశాను. తిరుపతిలో ఆయన తన మిత్రులతో కలిసి బయల్దేరే వరకు, ఆయన అవసరాలన్నీ తిరుపతిలోని రిసెప్షన్ ఆఫీసర్ చూసుకోవాలి. కొండెక్కేటప్పుడు వాళ్ళతో పాటు ఒక సెక్యూరిటీ గార్డు వుండాలి. తిరుమలకొండకి చేరాక, వాళ్ళ అవసరాలన్నీ (దర్శనంతో సహా) తిరుమలలో రిసెప్షన్ ఆఫీసర్ చూసుకోవాలి. మర్నాడు ఉదయం పద్మనాభం బృందం తిరుమల వదిలేదాకా ఆ రిసెప్షన్ ఆఫీసర్ వాళ్ళతోనేవుండాలి... ఇలా ఏర్పాట్లు చేసి నేను నాపనిలో మునిగిపోయాను.

ఆ మధ్యాహ్నం సరిగ్గా మూడున్నర గంటలకి తిరుపతి నుంచి రిసెప్షన్ ఆఫీసర్ నాకు టెలిఫోన్ చేశారు. "ఓహో, పద్మనాభం పార్టీ బయల్దేరినట్లున్నారు" అనుకుంటూ రిసీవర్ ఎత్తాను. అతను చెప్పింది కూడా పద్మనాభంగారి గురించే. కాని అది దుర్వార్త!

"సర్, పద్మనాభం గారి బృందం సామాన్లన్నీ కారులో పెట్టేశాం. ఘాట్ రోడ్డు మొదట్లో అలిపిరి దగ్గర వాళ్ళందర్నీ దింపటానికి ఏర్పాటు కూడా చేశాను. సరిగ్గా కారులోకి ఎక్కబోయే సమయంలో పద్మనాభంగారు భరించలేని కడుపునొప్పితో మెలితిరిగిపోతున్నారు. అసలు ఆయన్ని పట్టుకొని - ఏం బాధ? అని అడిగి తెలుసుకునే అవకాశం కూడా లేదు. ఆయన బాధ చూడలేకపోతున్నాం సర్..." అతను ఇంకా చెబుతూనే వున్నాడు. నేను అతని మాటలు కట్ చేస్తూ, "వెంటనే ఆయన్ని రూయా హాస్పిటల్‌కి తీసుకువెళ్ళండి. నేనూ అక్కడికి వస్తాను!!!..." అంటూ ఒక్క పరుగున వెళ్ళి కారులో కూర్చున్నాను. ఆ హాస్పిటల్‌కి వెళ్ళాక పద్మనాభంగారిని పరీక్షించిన డాక్టర్లు ఆయనకి తాత్కాలిక ఉపశమనానికి మందులిచ్చారు. "కిడ్నీలో రాళ్ళు చేరటంవల్ల వచ్చిందీనొప్పి, ప్రమాదం ఏమీలేదు. కాని, ఆయన కనీసం కొన్నిరోజులపాటు పూర్తి విశ్రాంతి తీసుకోవాలి...." అంటూ డాక్టర్లు స్పష్టం చేశారు.

పద్మనాభంగారి మిత్రులంతా కొండకి వెళ్లారు. సంతృప్తికరంగా దర్శనం చేసుకున్నారు. కాని పద్మనాభం మాత్రం డీలా పడిపోయారు. "ఏమిటిది ప్రసాద్‌గారూ! ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా మీరు దగ్గరుండి అన్ని ఏర్పాట్లూ చేస్తేకూడా నాకెందుకు దర్శనం కావడం లేదు. " అంటూ నిస్పృహ





వ్యక్తం చేశారు. ఏమైనా ఆయన మంచంమీంచి కదిలే పరిస్థితిలో లేరు. అంచేత మర్నాడు ఆయన్ని విమానంలో మద్రాసు(చెన్నై)కి పంపించాం. ఛీఫ్ సెక్రటరీకి టెలిఫోన్ చేసి జరిగిందంతా వివరించాను. "సారీ సర్, మీ పద్మనాభంగారికి దర్శనం చేయించలేకపోయాను" అంటూ విచారం వ్యక్తం చేశాను. ఆయన నిట్టూర్చాడు. "పోన్లేవయ్యా, నువ్వేం చేస్తావ్! అది నీ అశక్తత వల్ల జరిగిందేం కాదు గదా!" అన్నారు ఓదార్పుగా.

★ ★ ★

ఆ నేపథ్యంలో ఇప్పుడు రామ్మూర్తిగారు టెలిఫోన్ చేసి చెబుతున్నారు. రాబోయే శుక్రవారంనాడు అభిషేక దర్శనం చేసుకోవాలనుందని. నేను ధైర్యం తెచ్చుకుని, "సర్, అప్పుడేదో అలా జరిగినంత మాత్రాన ప్రతిసారీ అలాగే ఎందుకు జరుగుతుంది? మీకెందుకు మీరు వచ్చేయండి. అంతా నేను చూసుకుంటాను. (ఎవడి చేతుల్లో వుంది ఆ చూసుకోవటం?) బయల్దేరేముందు ఒక ఫోన్ కాల్ చేయండి చాలు..." అంటూ అపారమైన భరోసా ఇచ్చి వచ్చేశాను.

ఆయన భయపడినట్లుగానే ఆ గురువారంనాడు ఆయన హైద్రాబాద్‌నుంచి విమానంలో బయల్దేరటానికి కొన్ని గంటల ముందుగా, ఏదో అత్యవసర సమావేశం వుందంటూ ముఖ్యమంత్రి కబురు చేశారు. అంతే, ఛీఫ్ సెక్రటరీ కార్యక్రమం ఆ శుక్రవారానికి రద్దయింది. అయినా రామ్మూర్తి గారికి మనస్సులో అభిషేక దర్శనం చేసుకోవాలన్న కోరిక ప్రగాఢంగా వుండటంవల్ల, "కనీసం వచ్చే గురు, శుక్రవారాలైనా నేను తిరుపతి వెళ్లటానికి అనుమతించాలి" అంటూ ముఖ్యమంత్రిని సెలవుకోరటం, ఆయన "సరే" అనటం కూడా జరిగిపోయింది...

గిర్రున వారం తిరిగింది. మేం అనుకున్న ఆ పై గురువారం వచ్చేసింది. ముందుగా అనుకున్న కార్యక్రమం ప్రకారం రామ్మూర్తిగారు తమ కుటుంబంతో మద్రాసులోని పద్మనాభంగారి ఇంటినుంచి మధ్యాహ్నం మూడున్నర గంటలకి బయల్దేరాలి. సాయంత్రం ఆరున్నర ఏడుగంటలకల్లా తిరుమల చేరిపోవాలి. గురువారం రాత్రికి తిరుమలలో జరిగే పూలంగి సేవలోనూ, మర్నాడు ఉదయాన్నే జరిగే అభిషేక సమయంలోనూ ఆయన శ్రీ వేంకటేశ్వరుని దర్శనం చేసుకుంటారు.

నేను అవసరమైన ఏర్పాట్లన్నీ చేసి, ఆ మధ్యాహ్నం మూడుగంటలకి మద్రాసుకి ఫోన్ చేసి, ఛీఫ్ సెక్రటరీగారితో మాట్లాడాను. "కొద్దిగా ఆలస్యమయిందయ్యా, ఒక గంటలో బయల్దేరుతున్నాం" అన్నారు... అంతే, ఆ రోజున నేను చివరిసారిగా ఆయనతో మాట్లాడటం అదే !!!

రాత్రి ఏడు - ఎనిమిది - పదిగంటలయినా రామ్మూర్తిగారి కుటుంబం తిరుపతి చేరలేదు. ఎనిమిదిన్నరప్పుడు మద్రాసుకి ఫోన్ చేస్తే, ఆయన కుటుంబం బయల్దేరేసరికి సాయంత్రం ఆరున్నరయిందనీ, బహుశ ఏ పది గంటలకో తిరుపతి చేరతారనీ చెప్పారు. రాత్రి 11 దాటితే

క్రింద అలిపిరిలో టోల్ గేటు మూసేస్తారు. అందుకని క్రింద ఒక ఆఫీసర్‌ని ఈ పనిమీద నియోగించాను. ఎంత రాత్రయినా సరే ఛీఫ్ సెక్రటరీగారి కారు భద్రంగా కొండకు చేరేలా చూసుకోవాలని ఆదేశాలిచ్చాను... అలాగే కొండమీద నా క్యాంప్ ఆఫీసులో కూర్చొని, "ఆయన కారు ఘాట్ రోడ్డులోకి రాగానే నాకు తెలియజేయాలి" అని నా కార్యాలయ సిబ్బందికి నొక్కి నొక్కి చెప్పాను. ఎక్కడా ఏ మాత్రం లోపం జరక్కుండా, ఎలాంటి అసౌకర్యం లేకుండా ఛీఫ్ సెక్రటరీ రామ్మూర్తిగారి కుటుంబానికి మర్నాడు ఉదయం శ్రీనివాసుడి అభిషేక దర్శనం చేయించి తీరాలన్న దృఢ సంకల్పంతో మరోసారి ఏర్పాట్లు సరిచూసుకున్నాను. కాని, .... ఆ రాత్రి పూలంగి సేవ పూర్తయింది కానీ, రామ్మూర్తిగారి కుటుంబం తిరుమలకి రాలేదు. రాత్రి పదకొండున్నరకి మళ్లీ మద్రాసుకి ఫోన్ చేశాను. వాళ్లింకా తిరుమలకి చేరలేదన్న వార్త రామ్మూర్తిగారి బంధువుల్ని కూడా కలవరపెట్టింది. "అదేంటి, ఇంకా రాలేదా?" అంటూ వాళ్లు ఖంగారుపడ్డారు.

నాకు అనుమానం వచ్చింది - మధ్యలో ఎక్కడో ఏదో అవాంఛనీయ సంఘటన జరిగి వుంటుందని. ఒకటే టెన్షన్ మొదలైంది. వెంటనే మద్రాసు - తిరుపతి దారిలో చిత్తూరు సరిహద్దులో గల నగరి, పుత్తూరు పోలీసు స్టేషన్‌లకు టెలిఫోన్ చేసి, ఇలా ఛీఫ్ సెక్రటరీ ఒక ప్రైవేటు కారులో వస్తున్నారనీ, ఆ కారు ఆచూకీ తెలిస్తే వెంటనే నాకు టెలిఫోన్ చేయాలనీ పోలీసు సిబ్బందిని అప్రమత్తం చేశాను.

క్షణాలు - గంటలు దొర్లిపోతున్నాయి - మాటిమాటికి పోలీసు స్టేషన్‌లకి ఫోన్‌కాల్స్ - మద్రాసుకి ఫోన్‌కాల్స్ - పెరిగిపోతున్న టెన్షన్ - ఆందోళన.... ఆ రాత్రంతా కళ్లల్లో వత్తులు వేసుకున్నట్లుగా ఛీఫ్ సెక్రటరీగారి కుటుంబం గురించి ఎదురుచూస్తూనే వున్నాను....

"కౌసల్యా సుప్రజారామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం......."

అంటూ అర్చకుల సుప్రభాత పఠనంతో తిరుమల ఆలయంలో శ్రీనివాసుడికి శుక్రవారం వేకువఝామున మేలుకొలుపు ఆరంభమైంది. బెంగ, ఆందోళన, అయోమయం నిండిన హృదయంతో గర్భగుడిలో వున్నాను. నా చూపులన్నీ మహద్వారంకేసే. "ఏక్షణంలో ఛీఫ్ సెక్రటరీ గారి కుటుంబం వచ్చినా నేరుగా ఆలయం దగ్గరికి తీసుకొచ్చేయండి" అంటూ అధికారులకు ఆదేశాలిచ్చి వచ్చాను. అందుకే ఏ క్షణంలోనయినా వచ్చేస్తారన్న ఆశ. రాకపోతే.... ? ఏం జరిగిపోయిందోనన్న అనుమానం, ఆదుర్దా!!

అభిషేక సమయం కూడా గడిచిపోయింది.... ఏడున్నరవుతోంది. ఇక ఉండబట్టలేక, "స్వామీ! నువ్వేదారి చూపించాలి...." అంటూ శ్రీనివాసుడి మీదే రామ్మూర్తిగారి కుటుంబ భారం వేసి, ఆలయంలోనే నిస్త్రాణతో కూలబడిపోయాను....





ఆ మరుక్షణంలోనే ఫోన్ కాల్ వచ్చింది - "ప్రసాద్, నేను రామ్మూర్తిని మాట్లాడుతున్నానయ్యా.." నాకు ఒక్కసారిగా ప్రాణం లేచొచ్చినట్లయింది.

"సర్, సర్, ఎలా వున్నారు సర్, ఎక్కడున్నారు? అంతా క్షేమమేనా?..."ఉత్కంఠ, ఉద్వేగం నిండిన కంఠంతో అడుగుతున్నాను.

"అంతా క్షేమంగానే వున్నాం. మద్రాసునుంచి మాట్లాడుతున్నాను..." ఈ నాలుగుమాటలతో నా మనస్సు కొంత కుదుటపడింది. అయినా ఆదుర్దా వెంటాడింది. నేను అడక్కుండానే రామ్మూర్తిగారు ఆ "అర్ధరాత్రి మిస్టరీ" చెప్పుకుంటూపోయారు.

బావమరిది పద్మనాభంగారితో సహా రామ్మూర్తిగారి కుటుంబం అంతా సాయంత్రం ఆరున్నరకి మద్రాసునుంచి కారులోబయల్దేరారు. ముందు జాగ్రత్త చర్యగా వాళ్లు తమ వెనకాల ఒక ఖాళీకారు కూడా పెట్టుకున్నారు. రామ్మూర్తిగారి కుటుంబం వున్న కారు తమిళనాడు - ఆంధ్ర సరిహద్దు దాటేసరికి చెడిపోయింది. అప్పటికి ఎనిమిది దాటింది. చెడిపోయిన దాన్ని రిపేరుచేయాలని డ్రైవరు చూశాడు. "కాకపోయినా వెనకాల మరో స్పేర్ కారు వస్తోంది కాబట్టి దాన్లో వెళదాం" అనుకుని తిరుపతి వెళ్లే బస్సులు ఆపాలని ప్రయత్నించలేదు. అలా రాత్రి పది దాటిపోయింది. వెనకాల రావల్సిన కారు రాలేదు. చెడిపోయిన కారు బాగుపడలేదు. వీళ్లు ఆగిపోయిన స్థలం-దగ్గర్లో ఎక్కడా ఊరూవాడాలేని నిర్జన ప్రదేశం కావడంతో, ఎవరి సహాయమూ తీసుకోటానికి లేదు. టెలిఫోన్ సదుపాయం అంతకన్నా లేదు. రాత్రి పదిదాటాక ఆ రూట్లో బస్సులు కూడా రావు. మధ్యలో ఒకటి రెండు లారీలు వెళ్లినా, ఎవరూ ఆపలేదు.. అలా నిర్జన ప్రదేశంలో ఆ నిబిడాంధకారంలో ఆంధ్రప్రదేశ్ ఛీఫ్ సెక్రటరీ రామ్మూర్తిగారి కుటుంబం ఆ రాత్రంతా జాగరణ చేయాల్సివచ్చింది... తెల్లవారుఝామున అయిదుగంటల ప్రాంతంలో కారు బాగుపడింది. కానీ అప్పుడు బయల్దేరినా అభిషేకం ముగిసే లోపల వాళ్ళు తిరుమల చేరటం అసాధ్యం కనుక రామ్మూర్తిగారి కుటుంబం నిరాశతో వెనక్కి తిరిగి మద్రాసు వెళ్లిపోయారు. అలా ఆయన మద్రాసు చేరగానే స్పేర్ కారు డ్రైవరు తిరుపతి నుంచి ఆయనకి టెలిఫోన్ చేశాట్ట - "మీరు ఏ రూటులో వెళ్లారు సార్, నేను మీ వెనకాలే మీ కారు వెతుక్కుంటూ 'ఈ' రూటులో తిరుపతికి వచ్చేశాను... !"

ఒక వారం తరువాత హైద్రాబాద్‌లో కలిసినప్పుడు, రామ్మూర్తిగారు, నేను కలిసి ఈ సంఘటనలో - "మా లోపం ఎక్కడ వుందా?" అని సమీక్షించుకున్నాం. ఎంతో మెళుకువతో ప్లాన్ చేసి కూడా, ఎలా విఫలమయ్యాం?

చివరికి రామ్మూర్తిగారిలా అన్నారు -

"ప్రసాదూ.... స్వామివారి దర్శన భాగ్యం మనచేతిలో వుందటయ్యా! మన అధికారం, హోదా, మందీ మార్బలం... ఎన్నున్నా దర్శన ప్రాప్తి కలగాలంటే స్వామివారు అనుగ్రహించకుండా

అవుతుందా... ? ఇక శ్రీవారి పిలుపు ఎప్పుడు వస్తే అప్పుడే వెళతాను. సంకల్పం మాత్రం చేసి వుంచాను..."



పి.వి.ఆర్.కె.ప్రసాద్ నుండి ప్రసాదం స్వీకరిస్తున్న చీఫ్ సెక్రటరీ శ్రీ రామ్మూర్తి

చాలా త్వరలోనే ఆయన విశ్వసించిన 'పిలుపు' వచ్చింది. ఆయన కుటుంబం పద్మనాభంగారితోసహా తనివి తీరా స్వామివారి అభిషేక దర్శనం పొందారు. ఆ దర్శనం అయి బయటకు వచ్చాక, రామ్మూర్తిగారు ప్రేమగా నాభుజం తట్టి అన్నారు "ప్రసాద్, ఏదో ఒకరోజు నువ్వుకూడా చీఫ్ సెక్రటరీ కావచ్చు. కాని టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ పోస్టుకి మించిన పదవి లేదయ్యా, !... చీఫ్ సెక్రటరీగా వుండి స్వామివారి 'పిలుపు' కోసం నేను ఎంతో కష్టపడ్డాను. అదే, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నువ్వు? ప్రతిరోజు ఆయన్ని చూడటానికి, ఆయన భక్తుల్ని చూసుకోటానికి (స్వామివారిచేత) అనుగ్రహించబడ్డావ్..."

నిజానికి ఎంతో హైలెవల్ సిఫార్సుతో వచ్చిన వాళ్ళకి సయితం సంతృప్తికరమైన దర్శనం లభించకపోవటం, ఏ సిఫార్సు లేకుండా వచ్చినవారికి ఎవరో 'అనామకుల' సహాయంతో తనివితీరా శ్రీవారిని దర్శించుకున్నామన్న సంతృప్తికలగటం అనేకమందికి అనేకసార్లు జరిగింది... జరుగుతూనే వుంది.

ఎందువల్ల?

★ ★ ★



# 16

# 'పద్మావతి'పై అసెంబ్లీ ప్రశ్న

దేవాదాయశాఖామంత్రి శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ టెలిఫోన్‌లో నన్ను వాయించేశారు...

"వ్వాట్ ప్రసాద్, మీరిలా ప్రభుత్వానికి తలవంపులు తెచ్చేలా ప్రవర్తిస్తే ఎలా? లక్షలాది సామాన్య యాత్రీకుల అవసరాన్ని కాదని విఐపిల పేరుతో లక్షలు ఖర్చుపెట్టి గెస్ట్‌హవుస్‌లు కట్టించడమేమిటి?..... ఎవర్నడిగి చేస్తున్నారిదంతా? దేవాదాయశాఖామంత్రిని నాకే తెలీదే?... అసెంబ్లీలో ప్రతిపక్షాల వాళ్లు ఈ ప్రశ్న పంపించారు. అక్కడ (తిరుమలలో) ఏం జరుగుతోందో ముఖ్యమంత్రికీ తెలీదు, నాకూ తెలీదు. కాని ప్రతిపక్షాలకి మాత్రం అన్నీ తెలిసిపోయాయి... ఇప్పుడు ప్రతిపక్షాలకి ఏం జవాబివ్వాలి... సిఎం గారు ఫైరయిపోతున్నారు. ఆయనకేం చెప్పాలి?... నాకెంత అవమానం?....."

నేను అవాక్కయిపోయాను. కొద్ది క్షణాలు ఏమీ మాట్లాడలేదు. అక్కడికీ ధైర్యం తెచ్చుకుని, "సర్, మీకు ఇదంతా చాలా వివరంగా చెప్పాలి....." అని మాత్రం అనగలిగాను. కాని ఆయన అదేమీ వినిపించుకునే మూడ్‌లో లేరు.

"నాకేం చెప్పనక్కర్లేదు. ముందా ప్రతిపక్షాలిచ్చిన ప్రశ్నకి జవాబు రాసి పంపండి. ఆనక అవసరమైతే ముఖ్యమంత్రితో మాట్లాడండి" అంటూ ఆయన ఫోన్ పెట్టేశారు.

నేను గట్టిగా ఎదురు జవాబివ్వలేకపోవటానికి కారణం - ఆయన చేసిన (ప్రతిపక్షాలు లేవనెత్తిన) ఆరోపణలో కొంతవరకు నిజంవుంది కనుక. సుమారు 15 లక్షల రూపాయల వ్యయంతో ఒక అత్యంత అధునాతనమైన విఐపి గెస్ట్‌హవుస్ తిరుమలలో కట్టిస్తున్న మాట నిజమే. 1979-80 కాలంలో 15 లక్షల రూపాయలంటే - యిప్పటి లెఖ్ఖలో కోట్లలో వుంటుంది. అంత ఖర్చుతో విఐపి గెస్ట్‌హవుస్‌ని తిరుమల తిరుపతి దేవస్థానాలు తమ ఖర్చుతో నిర్మించడం అదే మొదటిసారి. పైగా నేను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా జరుగుతోంది కాబట్టి జవాబుదారీ నాది. అందులోనూ శ్రీ చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా వుండగా ప్రతిపక్షాలు ఈ ప్రశ్నలేవనెత్తారు. నేను సరైన సమాధానం ఇవ్వలేకపోతే, ప్రభుత్వం మీద ప్రతిపక్షాలు అసెంబ్లీలో దుమ్మెత్తిపోయడం ఖాయం. ముఖ్యమంత్రి ఆగ్రహానికి నేను మరోసారి గురికాక తప్పదు...

ఒక్కసారిగా నీరసం వచ్చేసింది. ఎందుకంటే, విఐపి గెస్ట్‌హవుస్ నిర్మాణం జరుగుతున్న మాట నిజం. దానికోసం భారీవ్యయం (15 లక్షలు) జరుగుతున్నమాట నిజం. అదంతా టిటిడి మాత్రమే భరిస్తున్నమాట నిజం. ఇంక నేను జవాబు ఏమని ఇవ్వాలి?

★ ★ ★

**1970** దశకంలో తిరుమలలో మంచి వసతి సదుపాయం చాలా పరిమితంగా వుండేది. ఎన్. జి. సి. కాటేజీలు, టిబి గెస్ట్‌హవుస్, టిబి కాటేజీలు, శ్రీవేంకటేశ్వర గెస్ట్‌హవుస్‌లు మాత్రమే కొంచెం విఐపిలకు పనికివచ్చేవి. అయితే అవన్నీ దాతలిచ్చిన విరాళాలతో కట్టినవే. అందువల్ల దాతలకు తమ తమ విరాళాలతో కట్టిన కాటేజీలలో ఏడాదిలో కొన్ని రోజులపాటు ఉచితంగా బసచేయటానికి హక్కు వుంటుంది. అలాగే విఐపిలు ఎవరన్నా వస్తే వాళ్లకి పనికి వచ్చే కాటేజీలు కూడా ఇవే. చాలావరకు టిబి గెస్ట్‌హవుస్ ఏరియాలోనే విఐపిలకు బస కల్పించేవాళ్లం. ముఖ్యంగా ముఖ్యమంత్రి, ప్రధానమంత్రి, ఇతర కేంద్రమంత్రుల వంటి విఐపిలు వచ్చారంటే, వాళ్లకి ఒక కాటేజీ సరిపోదు. అసలు ఒక కాటేజీలో వుండేధే రెండు రూమ్‌లు. ఇక వాళ్లతోపాటు వచ్చేఅధికారులు, సెక్యూరిటీ సిబ్బంది, ఇంటలిజెన్స్ సిబ్బంది, ఒక్కోసారి రాజకీయ వందిమాగధులు వుండాల్సి వస్తే, మరో 10-15 కాటేజీలు వాళ్లకోసం కేటాయించాల్సి వచ్చేది.

అలాంటప్పుడే ఆ కాటేజీల దాతలు వస్తూండటం, "మా కాటేజి మాకివ్వండి" అంటూ వత్తిడి చేయడం, టిటిడి సిబ్బంది ఇరకాటంలో పడటం - పరిపాటైపోయింది. 1978లో నేను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వెళ్లాక ఈ కాటేజీల దాతలనుంచి తరచూ ఫిర్యాదులు వస్తూండేవి. 'విఐపిల' పేరుతో తమ కాటేజీలను అన్యాక్రాంతం (తాత్కాలికంగా) చేస్తూ తమ హక్కుని టిటిడి కాలరాస్తోందంటూ ఈ దాతలు విరుచుకుపడుతుండేవాళ్లు. కొన్ని సందర్భాలలో దాతలు రెండు మూడు మాసాలు ముందుగానే తమ కాటేజీ రిజర్వ్ చేసుకున్నప్పటికీ, చివరినిమిషంలో ఎవరో ముఖ్యమైన విఐపి





రావటం, దాంతో మంచి కాటేజీల్ని విఐపిలకు కేటాయించాల్సిరావటం జరిగేది. అలా దాతలకి వాళ్ల కాటేజీల్ని కాక వేరేదో కాటేజి చూపించి, "సరిపెట్టుకోండిబాబూ" అంటూ బ్రతిమాలాల్సి వచ్చేది.

ఈ సమస్య రోజురోజుకి - విఐపిల రాకలు పెరిగినప్పుడల్లా - జటిలమయిపోతోంది. అప్పట్లో ఏ కాటేజి కట్టాలన్నా - దాతల విరాళాల పథకం క్రిందనే కట్టేవాళ్లు. అలా కొత్త కాటేజీలు ఎన్నికడ్తున్నా - ఈ విఐపిల తాకిడి మూలంగా సమస్య పరిష్కారంకావడం లేదు. కొంతమంది విఐపిలయితే, ఫలానా టిబి కాటేజీయే కావాలని కూడా అడుగుతుండేవాళ్లు. అదే టైమ్‌లో ఆ కాటేజీల దాతలొస్తే...?

నాకు ముందు పనిచేసిన ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ రాజగోపాలరాజుకి - ఈ కాటేజీలు, విఐపిలు, దాతల వసతి కల్పన విషయంలో తలబొప్పి కట్టేసింది. దాతల అసౌకర్యంతో పాటు, ఒక్కో విఐపి పార్టీ 10-15 కాటేజీలలో బసచేస్తే, వాళ్లందరికీ రిసెప్షన్, భోజనాలు, కాఫీలు, దర్శనం ఏర్పాట్లు, ప్రసాదాల పంపిణీ... అన్నీ టిటిడి అధికారులకు సమస్యగా తయారయ్యేవి. దీనికితోడు ఏ ఛీఫ్ మినిష్టరో, ప్రైమ్ మినిష్టరో వచ్చి బసచేస్తున్నాడంటే, ఆ చుట్టుప్రక్కలంతా సెక్యూరిటీ జోన్ చేసి పారేసి, యాత్రికుల్ని దూరంగా తరిమేస్తుండటం రివాజయిపోయింది.

ఈ సమస్యకి శాశ్వత పరిష్కారంగా శ్రీ రాజగోపాలరాజు ఒక ప్రత్యేక విఐపి గెస్ట్‌హవుస్ నిర్మాణాన్ని ప్రతిపాదించారు. అదే పద్మావతి గెస్ట్‌హవుస్. ఈ పద్మావతి గెస్ట్‌హవుస్ - మిగతా దాతల కాటేజిలకు సంబంధం లేకుండా దూరంగా, ఒక ప్రక్కగా.... కొండశిఖరం మీద వున్నట్లుంటుంది. ఇందువల్ల - అక్కడ ఎంత పెద్ద విఐపి దిగినా, సెక్యూరిటీ పేరుతో యాత్రికుల్ని ఇబ్బంది పెట్టాల్సిన పరిస్థితి జనించదు. ఈ గెస్ట్‌హవుస్‌లోనే వంటశాల, భోజనశాల వుంటాయి. రాష్ట్రపతి స్థాయివరకు ఎలాంటి విఐపి వచ్చినా, ఆయనా, ఆయన అధికారులు, సెక్యూరిటీ సిబ్బంది, ఒకవేళ ఆయనతోపాటే ముఖ్యమంత్రి వస్తే - ఆయన, ఆయన సిబ్బందీ కూడా బసచేయటానికి తగినంత విశాలమైంది ఈ పద్మావతీ గెస్ట్‌హవుస్. అక్కడే వంటలు, అక్కడే భోజనాలు, అందరూ అక్కడే వుంటారు. కనుక దర్శనాలు ప్లాన్‌చేయటం, ప్రసాదాలు పంపిణీ చేయటం సులభమైపోతుంది. ఎంత పెద్ద విఐపి వచ్చినా, వాళ్ల కారణంగా డోనార్ కాటేజిలను ఆక్రమించాల్సిన పరిస్థితి జనించదు. పైగా ఈ పద్మావతీ గెస్ట్‌హవుస్ ఒక కొండ శిఖరం మీద వుండటం వల్ల, విఐపికి భద్రతా ఏర్పాట్లు చూడటం కూడా సులభమవుతుంది... ఇన్ని రకాలుగా ఆలోచించి, శ్రీ రాజగోపాలరాజు అప్పటి టిటిడి బోర్డుని ఒప్పించి, టిటిడి ఖర్చుతో ఈ గెస్ట్‌హవుస్ నిర్మాణాన్ని చేపట్టారు. 1978లో నేను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వెళ్ళేనాటికి ఈ గెస్ట్‌హవుస్ నిర్మాణం అప్పుడే మొదలైంది.

శ్రీరాజగోపాలరాజు దూరదృష్టితో చేపట్టిన ఈ ప్రాజెక్టు నన్ను బాగా ఆకర్షించింది. కొండశిఖరం మీద పద్మావతి గెస్ట్‌హవుస్‌లోంచి చూస్తే, ఉత్తర దిశలో తిరుమల శ్రీనివాసుడి ఆలయం తాలూకు 'ఆనందనిలయం' (గర్భగుడి శిఖరం) దర్శనమిస్తూంటుంది. దక్షిణ వైపు (చంద్రగిరి దిశగా) ప్రకృతి

అందాలను సంతరించుకున్న పచ్చటి లోయకనుపిస్తూంటుంది. ఈ గెస్ట్‌హవుస్ విషయంలో నాకు బాగా నచ్చిన అంశం ఏమిటంటే - ప్రధానమంత్రీ, ముఖ్యమంత్రీ కూడా వచ్చి ఒకే సమయంలో ఇక్కడ మకాం చేసినా, వీళ్ల ఉనికి వల్ల సాధారణ యాత్రికుల రాకపోకలకిగానీ, తిరుమలలో వాళ్ల సంచారానికిగానీ ఎలాంటి అవరోధం వుండదు. అందుకే, ఈ గెస్ట్‌హవుస్‌ని వీలైనంత త్వరగా పూర్తిచేయించాలని నేను నడుంకట్టాను. 1980 నాటికి దీని నిర్మాణం పూర్తికావచ్చింది. (అప్పటికే దాదాపు 15 లక్షల రూపాయల్ని టిటిడి దీనిమీద వెచ్చించింది.) అయితే ఈ గెస్ట్‌హవుస్ నిర్మాణాన్ని ఎంత వేగంగా నేను జరిపించాలని ప్రయత్నిస్తున్నానో అంత వేగంగానూ దీనిమీద దుమారం లేచింది.

అప్పటికే మాస్టర్‌ప్లాను అమలు చేసే ప్రయత్నంలో తిరుమలలో కొన్ని వర్గాలకు నేను శత్రువులా కనబడుతున్నాను. అయినా నా మాస్టర్‌ప్లాన్ కొనసాగుతూనే వుంది. ఆలయంచుట్టూ ఇళ్లన్నింటినీ కూల్చేసి, వాళ్లందరికీ వేరే టౌన్‌షిప్ ఏర్పాటు చేస్తున్నాం. క్యూ కాంప్లెక్స్ నిర్మాణం చేపట్టాం. డోనార్ కాటేజీల సంఖ్య పెంచే ప్రయత్నం కొనసాగిస్తున్నాం. ఒక్కొక్కటి నాలుగు నుంచి అయిదు లక్షలరూపాయలదాకా ఖర్చయ్యే కాటేజిల నిర్మాణాన్ని, ఎస్. వి. గెస్ట్‌హవుస్ నమూనాలో ఆ ప్రక్కనే నారాయణాద్రి, గరుడాద్రి గెస్ట్‌హవుస్‌ల నిర్మాణానికి ప్లాన్‌లు తయారుచేస్తున్నాం. దాతల విరాళాల పథకం క్రింద మరో వందగదుల సత్రం నిర్మాణం కూడా ఖరారు చేశాం. అప్పటికే వినియోగంలో వున్న కాటేజీల మీద మరో అంతస్థు కాటేజిల నిర్మాణం ప్రతిపాదన కూడా బోర్డు ఆమోదించింది....

ఇలా శరవేగంతో మాస్టర్‌ప్లాన్ అమలుజరుగుతున్న తరుణంలో - ఈ పద్మావతి గెస్ట్‌హవుస్ తిరుమలలోని కొన్ని వర్గాలలో చర్చనీయాంశంగా తయారైంది. మాస్టర్‌ప్లాన్ అమలు కావడం వల్ల తిరుమలలో తమ ఆధిపత్యానికి భంగం వాటిల్లుతోందనుకుంటున్న వాళ్లు కొందరూ, అప్పటికే స్థానిక మురికివాడల నిర్మూలనవల్ల అసంతృప్తితో వున్న స్థానిక నాయకులూ - నేనేదో దుబారా చేస్తున్నానంటూ తిరుమలలో ప్రచారం ఆరంభించారు. టిటిడిలోని కొన్ని అసంతృప్త యూనియన్ వర్గాలు కూడా ఈ ప్రచారానికి ఆజ్యం పోస్తున్నాయి. సామాన్య యాత్రికుల ప్రయోజనాల్ని పణంగా పెట్టి, ముఖ్యమంత్రి, ఇతరమంత్రుల మెహర్బానీకోసం, హంసతూలికా తల్పాలతో కూడిన విలాసవంతమైన భవంతిని నిర్మిస్తున్నానన్నదే ఆ ప్రచారం. అలాంటి భవంతి కోసం మొట్టమొదటిసారిగా టిటిడి చేత 40-50 లక్షల రూపాయలు ఖర్చు పెట్టిస్తున్నానన్నది నామీద వీళ్లు చేస్తున్న ఆరోపణ... కానీ, ఈ పద్మావతి అతిథి భవనం ఎంత త్వరగా పూర్తయితే, అంతమేలు - పాత కాటేజిల దాతలకి, ఇతర యాత్రికులకు జరుగుతుందన్నది నా ఆశ. అందుకే ఈ ప్రచారాల్ని నేను ఖాతరు చేయలేదు. కాని, అసెంబ్లీలో ప్రతిపక్షాలు చేసిన ప్రశ్నను ఎలా నిర్లక్ష్యం చేయగలను?





పైగా, దేవాదాయశాఖామంత్రి తను ముఖ్యమంత్రి ముందు సమాధానం చెప్పుకోలేక పోయానంటూ నన్ను నిందించటంతో నాపరిస్థితి ఇంకా ఇరుకున పడింది. పదిహేను లక్షలరూపాయలతో విఐపి గెస్ట్‌హవుస్ నిర్మిస్తున్న విషయం నిజమేకాని, దాని నేపథ్యం ఒక్క వాక్యంలో నేను టెలిఫోన్‌లో దేవాదాయశాఖామంత్రికి చెప్పేటంత సులభంగా లేదు. పైగా ఈ ప్రశ్న అసెంబ్లీలో రావడానికి దారి తీసిన స్థానిక నాయకుల అసంతృప్తి, ఆగ్రహం గురించి క్లుప్తంగా టెలిఫోన్‌లో ఏం చెప్పగలను? అన్ని లక్షలు ఖర్చుపెట్టి ఒక విఐపి గెస్ట్‌హవుస్ కట్టేబదులు, అదే డబ్బుతో నాలుగు సత్రాలు కడితే నాలుగొందల మంది యాత్రికులకి బస కల్పించవచ్చుకదా అని ప్రతిపక్షాలు అడిగితే ఏం చెబుతాం - అని ముఖ్యమంత్రి, దేవాదాయశాఖామంత్రి ప్రశ్నిస్తే ఏం చెప్పాలి?

అక్కడికీ దేవాదాయశాఖామంత్రి టెలిఫోన్‌లో అనేశారు కూడా - "ఇన్ని లక్షలు పెట్టి మనం ఎందుక్కట్టించాలి గెస్ట్‌హవుస్? అది కూడా ఏదో దాతల కాటేజిల పథకం క్రింద కట్టిస్తేపోయేది కదా? మాక్కూడా ప్రతిపక్షాల ముందు ఇలా తలెత్తుకోలేని పరిస్థితి వచ్చేది కాదు కదా!"

నిజానికి అప్పటి వరకూ దాతల కాటేజిల పథకం క్రింద నిర్మించే ఏ కాటేజి వ్యయంకూడా రెండు మూడు లక్షల రూపాయలకు మించలేదు. ఇప్పుడు ఒక్క గెస్ట్‌హవుస్ కోసం 15 లక్షల రూపాయలు ఏ దాత ఇస్తాడు? ఎవరూ ఇవ్వరు? అలాగని టిటిడి ఇన్ని లక్షలు ఖర్చు పెట్టడం ఎంతవరకు సమంజసం? - అని ముఖ్యమంత్రి శ్రీచెన్నారెడ్డి నిలదీస్తే ఏమిటి జవాబు? ఒకవేళ మళ్లీ దాతల పథకం క్రిందనే (ఎవరన్నాదాత ఇస్తేగిస్తే, ) ఈ గెస్ట్‌హవుస్ కట్టించాల్సివస్తే, రేపు మళ్లీ విఐపిలు వచ్చినప్పుడే ఆ దాతలొచ్చి గెస్ట్ హవుస్ కావాలంటే? - సమస్య పునరావృతం కాదా? పైగా ఈ గెస్ట్‌హవుస్‌లో ఇంకా ఫర్నిషింగ్, లైటింగ్ వగైరాల కోసం మరో ఆరు లక్షలదాకా ఖర్చు పెట్టాల్సివుంది. మరి ఆ ఖర్చు మాటేమిటి?

.. ఇలా అనేక ప్రశ్నలు, సందేహాలు, అనుమానాలు నన్ను చుట్టుముట్టాయి. దొరికిపోయాను. చేస్తున్నపని మంచిదా చెడ్డదా అన్న అంశానికన్నా, అసెంబ్లీలో ప్రభుత్వం ఇరుకునపడకుండా చేయడం ఎలా-అన్నదానికే ముఖ్యమంత్రి, దేవాదాయశాఖామంత్రి ప్రాధాన్యత ఇస్తున్నారు. వాళ్ల దృష్టిలో ఇది టిటిడి ప్రతిష్ఠక్కూడా భంగం కలిగించే విషయమే. ఒకవేళ నేను - ఈ పద్మావతి గెస్ట్‌హవుస్ నిర్మాణాన్ని టిటిడి ఎందుకు చేపట్టాల్సివచ్చిందో హేతుబద్ధంగా వివరిస్తూ జవాబు రాసి పంపినా, దాన్ని ముఖ్యమంత్రి హర్షించే అవకాశం లేదని దేవాదాయశాఖామంత్రి మాటల్లోనే అర్థమైపోతోంది. వాళ్లక్కావలసిందల్లా - ప్రతిపక్షాల దృష్టిలో ప్రభుత్వం (టిటిడి) తప్పు చేయటం లేదనిపించుకోవటమే.

విఐపిల కోసం ప్రత్యేక అతిథి గృహం లేకపోవటం వల్ల కలుగుతున్న సమస్య ఎన్ని రకాలుగా ఇతరత్రా ఇబ్బందుల్ని సృష్టిస్తోందో - నేనిక్కడ రాసినంత వివరంగా ప్రభుత్వం తన జవాబులో ప్రతిపక్షాలకు ఆమోదయోగ్యంగా అసెంబ్లీలో వివరించలేదు. అలా చెయ్యాలంటే ముందు ఈ

నిర్మాణం అవసరాన్ని ముఖ్యమంత్రీ, దేవాదాయశాఖామంత్రీ మనస్ఫూర్తిగా గుర్తించి, ఆమోదించితీరాలి. ఒకవేళ వాళ్లు ఈ నిర్మాణం సమర్ధనీయమే అని భావించినా, అంతే విశ్వాసంతో ఆ విషయాన్ని ప్రతిపక్షాల ముందు చెప్పగలరన్న నమ్మకం లేదు. ఎందుకంటే, ఎక్కడ అవకాశం దొరుకుతుందా పాలకపక్షాన్ని తూర్పారపట్టడానికి అని వెయ్యికళ్లతో గాలించటం ప్రతిపక్షాల లక్షణం. ఆసంగతి తెలిసి తెలిసీ, టిటిడి తీసుకున్న నిర్ణయాన్ని సమర్థించటానికి ముఖ్యమంత్రి ఎందుకు రిస్క్ తీసుకుంటారు? ఒకవేళ ఆయన రిస్క్ తీసుకున్నా, ఆ అవకాశాన్ని ప్రతిపక్షాలు ఎందుకు వదులుకుంటాయి? సామాన్యయాత్రికుల కడుపుకొట్టి, మహానాయకులకోసం విలాసవంతమైన ఆకాశహర్మ్యాలు నిర్మిస్తున్న ప్రజావ్యతిరేక ప్రభుత్వం - అంటూ అల్లరి చేయకుండా వదుల్తాయా? ఆ పరిస్థితికి నేను కారణమని తెలిసీ, ముఖ్యమంత్రి వూరుకుంటారా?

... ఆలోచించిన కొద్దీ నా మెదడు వేడెక్కిపోతోంది... వున్నదున్నట్లుగా జవాబు రాస్తే, ప్రభుత్వానికి తలవంపులూ, అందువల్ల నాకు శ్రీముఖాలు. పోనీ విషయాన్ని వక్రీకరించి, ప్రతిపక్షాల్ని మభ్యపెట్టేలా ఏదో రాసి పారేద్దామా అంటే, అలా వాస్తవాల్ని మరుగుపర్చి విషయాన్ని మసిపూసి మారేడుకాయ చేసేటంత నైపుణ్యం నాకు లేదు. ఒక వేళ అలా చేయగలిగినా, రేపు ప్రభుత్వం ఇచ్చిన జవాబు - ప్రతిపక్షాల్ని తప్పుదారి పట్టించేదిగా వుందనీ, వాస్తవ విరుద్ధమనీ బయటపడితే - పాలక పక్షానికి అసెంబ్లీలో అభిశంసనా తప్పదు. నాకు ఉద్వాసనా తప్పదు.

నిజానికి, ఈ గెస్ట్‌హవుస్ నిర్మాణం ప్రతిపాదన చేసింది నేను కాదు. కాని అనేక కోణాల్లోంచి చూసినప్పుడు ఇది జరగడం అవసరం అని నేను కూడా విశ్వసిస్తున్నాను. అయితే నా విశ్వాసానికి అనుగుణంగా ప్రభుత్వాన్ని ఒప్పించనూలేను, దానికి విరుద్ధంగా ప్రవర్తించనూలేను. కిం కర్తవ్యం? నా జవాబు రెండు మూడు రోజుల్లో ప్రభుత్వానికి పంపించెయ్యాలి. తెల్లవారితే దేవస్థానాల బోర్డు మీటింగ్. దాని ఎజెండా వేరేవుంది. ఇంకా దానికి తయారవ్వాలి! ... నిండా ఊబిలో కూరుకుపోయాను. ఆ రాత్రంతా ఇదే ఆలోచనతో నిద్ర సరిగ్గా పట్టలేదు. అర్థరాత్రి దాటాక, నేను చేయగలిందేమీ లేదని నిర్ధారించుకున్నాక, చివరి ప్రయత్నంగా శ్రీనివాసుడ్ని తలుచుకున్నాను. "స్వామీ! నేను ఏ నేరమూ చేయటం లేదనీ, అందరి మంచి కోసమే ఈ పని చేస్తున్నాననీ నమ్ముతున్నాను. ఇదెలా పరిష్కరిస్తావో... నీదే భారం.." ఇలా అనుకున్నాక నిమిషాల్లో నిద్రపట్టేసింది.

★ ★ ★

తెల్లవారింది.

బోర్డు మీటింగ్ ఎజెండా అంతా మరోసారి చూసుకున్నాను. నాలో అసెంబ్లీ ప్రశ్న తాలూకు టెన్షన్ పెరిగిపోతోంది. ఏదో రకంగా శ్రీనివాసుడు నా మొర ఆలకించకపోతాడా అన్న ఆశ. బోర్డు





మీటింగ్‌కి టైమైపోయింది కాని, నా సమస్యకి పరిష్కారం దొరకలేదు. ఇంక చేయగలిగిందల్లా, బోర్డు మీటింగ్‌లోనే ఈ విషయాన్ని వివరించి, సభ్యుల అభిప్రాయాలు తీసుకున్నాక, వాళ్లెలా చెబితే అలా చేయటమే. (నాకు తెలుసు - వాళ్లెవరూ ముఖ్యమంత్రి ప్రతిష్ఠకి భంగం కలిగించే విధంగా రాయటానికి ఇష్టపడరు. ఆ బోర్డులో సభ్యులంతా శ్రీచెన్నారెడ్డి చేత నియమించబడిన వాళ్లే.)

చిట్టచివరి ప్రయత్నంగా తిరుమలలో బోర్డు మీటింగ్‌కి వెళ్లబోయేముందు, ఆలయంలోకి వెళ్లాను. స్వామికి నమస్కరించాను. "నేనింకేమీ ఆలోచించను స్వామీ. అన్యథాశరణం నాస్తి. ఇక నీదే భారం" అనుకుంటూ ధ్యానం చేశాను.... అంతే, 'ఆయన'కి మరో నమస్కారం పెట్టి అక్కడ్నుంచి కారెక్కి, నేరుగా శ్రీవేంకటేశ్వర గెస్ట్‌హవుస్‌లో బోర్డు మీటింగ్‌కి వెళ్లిపోయాను. అక్కడ కారు దిగగానే నాకు 'ఆయన' ఎదురుపడ్డాడు.

.... ఆయన పేరు ఆర్. పి. గోయెంకా. టిటిడి బోర్డులో ఆయన కూడా ఒక సభ్యుడు. ఆయన ఆర్‌పిజి గ్రూపుకి ఛైర్మన్. పెద్ద పారిశ్రామికవేత్త. ఆయన క్రిందటిసారి బోర్డు మీటింగ్‌లో అయిదులక్షల రూపాయలలోపు విరాళంతో ఒక కాటేజి నిర్మాణానికి మంచి స్థలం చూపించమని అడిగి వున్నాడు. ఆయన నన్ను పలకరించగానే నాకు ఆయన క్రిందటిసారి చేసిన అభ్యర్థన గుర్తొచ్చింది. నన్నెవరో వెంటబడి తరుముతున్నట్లుగా ఆయన దగ్గరకెళ్లాను. "అవునూ, మీరు డోనార్ కాటేజికి స్థలం అడిగారు కదా! అలా ఏదో చిన్న కాటేజి కట్టించేకన్నా, ఇప్పుడు మేం కడ్తున్న పద్మావతి గెస్ట్‌హవుస్‌కే మీరు విరాళం ఇవ్వచ్చుగదా!" అని అడిగేశాను.

నా స్పీడుకి ఆయన ఆశ్చర్యపోయాడు. అంతలోనే తేరుకుని, "పద్మావతి గెస్ట్‌హవుస్‌కి ఏమాత్రం అవుతుందంటారు?"అని అడిగాడు.

నేను నా పద్ధతిలో చెప్పుకుంటూ పోయాను - "గోయెంకాగారూ! ఇదొక అద్భుతమైన గెస్ట్‌హవుస్... వివిపిల కోసం కట్టిస్తున్నాం. దీనికి అనేక ప్రత్యేకతలున్నాయి... దాతలకివ్వాలని ముందు అనుకోలేదు. నాకెందుకో ఇప్పుడు మిమ్మల్ని చూడగానే అనిపించింది. మీ కిష్టమైతే ఇప్పుడే తీసుకెళ్లి చూపించేస్తాను...."

"తప్పకుండా చూద్దాం. విరాళం ఎంతవుతుందంటారూ?" ఈ గెస్ట్‌హవుస్ గురించి నేనిచ్చిన వివరణ ఆయన్ని వూరిస్తోంది. అయినా డబ్బు విషయంలో ఆయన ఆచి తూచి అడుగులేసే మనిషి.

"మీకు పెద్ద భారం అనుకోను గోయెంకాగారు. ఇప్పటిదాకా ఓ పదిహేను లక్షలు ఖర్చుపెట్టాం. ఇంకా ఫర్నిషింగ్, లైటింగ్ వగైరాలతో కలిపి మొత్తం ఇరవైలక్షల్లో తేలిపోతుంది.. అసలు మీరొకసారి గెస్ట్‌హవుస్ నిర్మాణం ఎలా వచ్చిందో చూడండి. చూశాక మాట్లాడుకుందాం...." అంటూ మరింత ఉత్సాహపరిచాను. గోయెంకా గారిలో ఆసక్తి పెరిగింది. (ఎవరు పెంచారో?)

"పదండి చూద్దాం" అన్నారు. అప్పటికి బోర్డు మీటింగ్‌కి ఇంకా 15-20 నిమిషాలవ్యవధి వుంది. "ఇప్పుడే వస్తాను" అని ఛైర్మన్ నాగిరెడ్డిగారికి చెప్పి, గోయెంకాగారిని నా కారులో ఎక్కించుకుని పద్మావతీ గెస్ట్‌హవుస్‌కి తీసుకెళ్లాను.

ఆ అతిథిభవనాన్ని, అందులో వున్న సదుపాయాల్ని చూస్తూనే గోయెంకా ముచ్చట పడిపోయారు. ఒక ప్రక్కన చంద్రగిరి లోయఅందాలు, మరోవైపు సూర్యకాంతిలో మెరుస్తున్న 'ఆనందనిలయం' ఆయన్ని మరింత ఆనందపారవశ్యంలో ముంచెత్తాయి. ఆయన అలా మధురానుభూతిలో వుండగానే, నేను మెల్లగా చెబుతున్నాను...

"తిరుమలలో ఇంతపెద్ద గెస్ట్‌హవుస్ ఇది ఒక్కటే వుంటుంది. దీన్ని రాష్ట్రపతి, ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి లాంటి అతి పెద్ద వివిపిల కోసం మాత్రమే వినియోగిస్తాం. అలాంటి అతి పెద్ద వివిపిలు మహాఅయితే ఓ పదిమంది వుంటారు అంతే!.. అంచేత వాళ్లు లేనప్పుడు 'డోనార్ కాటేజిల పథకం' క్రింద ఏడాదిలో ఎన్ని రోజుల పాటు మీరు దీన్ని వాడుకోవచ్చో అన్ని రోజులూ యధేచ్ఛగా వాడుకోవచ్చు...."

ఆయన "ఊ" కొడ్తూనే గెస్ట్‌హవుస్ అంతా కలయ తిరిగేస్తున్నారు... సంకోచించి, సంకోచించి, అసలు విషయం అప్పుడు బయటపెట్టాను. "ఎప్పుడయినా మీరు రావాలనుకున్నప్పుడే ఈ వివిపిలు వస్తే మాత్రం, మీకు వేరే కాటేజిలో బసకల్పిస్తాం. అదొక్కటే.." ఇలా చెబుతున్నప్పుడు ఆయన ఎలా ప్రతిస్పందిస్తారో అన్న అనుమానం నన్ను వెంటాడుతూవుంది. కాని అవేమీ ఆయన పట్టించుకోలేదు.

"ప్రసాద్‌గారూ! గెస్ట్‌హవుస్ చాలా ముద్దొస్తోంది....... అయితే మేం ముందుగా అనుకొన్నది ఓ అయిదు లక్షల రూపాయల కాటేజి కట్టించాలనే. ఇప్పుడు 20 లక్షల రూపాయలనేసరికి, ఇది నేను ఒక్కడుగా తీసుకునే నిర్ణయం కాదు. నేను మా వాళ్లతో కొంచెం మాట్లాడాల్సి వుంటుంది..."

ఇంక నేను తాత్సారం చేయలేదు. "అంతేనా, మాట్లాడండి, ఇప్పుడే మాట్లాడండి" అంటూ ఆయన సంభ్రమాశ్చర్యాల్లోంచి తేరుకునే లోపల మా సిబ్బందిని పిలిచి, అప్పటికప్పుడు ఆయనక్కావల్సిన లైట్నింగ్ ట్రంక్ కాల్స్ చేసుకోవటానికి ఏర్పాట్లు చేయమని చెప్పాను.

"గోయెంకాగారూ, ఈ విషయం ఈపూటే తేలిపోవాలి. మీరు టెలిఫోన్ కాల్స్ చేసి, బోర్డు మీటింగ్‌కి రండి. ఈ విషయంలో మనం ఈ బోర్డు మీటింగ్‌లోనే ఒక నిర్ణయం తీసేసుకుందాం. మీరొచ్చేదాకా ఎజెండాలో చిన్న చిన్న విషయాలు చర్చిస్తుంటాం...." అంటూ ఆయన్ని మరింత ఉత్సాహపరిచి, మా సిబ్బందిని వెంట ఇచ్చి, తిరుమలలోని నా క్యాంప్ ఆఫీస్‌కి పంపించాను.... ఇంకా నా టెన్షన్ తగ్గలేదు - చివరికి గోయెంకా ఒప్పుకోకపోతే!!





బోర్డు మీటింగ్ ఆరంభమైన 10-15 నిమిషాలకి గోయెంకా వచ్చి నన్ను ప్రక్కకి పిలిచి చెప్పారు. "మీకిష్టమైతే ఇప్పుడు అయిదు లక్షలిస్తాం. ఒక నెలరోజుల వ్యవధిలో మిగతా పదిలక్షలిస్తాం. ఈ వాయిదాల చెల్లింపుకి మీరు ఒప్పుకుంటే, ఫర్నిషింగ్ వగైరా పనులన్నింటినీ మా ఖర్చుతోనే చేయిస్తాం... ఇంకా మీరు..."

ఓహ్! ఏం చెప్పను? ఒక్కసారిగా నాలో ఆనందం పరవళ్లు త్రొక్కింది. అమాంతం గోయెంకాని కౌగిలించుకున్నాను. "యు ఆర్ గ్రేట్" అనేశాను. అవ్యక్తమైన కృతజ్ఞతా భావాలు నా మనసంతా నిండిపోయాయి. నా ఉద్వేగానిక్కారణం - గోయెంకాకి తెలీదు.... వెంటనే గోయెంకా నిర్ణయాన్ని బోర్డు మీటింగ్‌లో ప్రకటిస్తూ, "హి ఈజ్ ది బిగ్గెస్ట్ డోనార్ ఆఫ్ ది కాటేజెస్ స్కీమ్" అనగానే సభ్యులంతా చప్పట్లు కొట్టేశారు. గోయెంకా కొంచెం సిగ్గుపడిపోయారు.

అప్పటికి కొన్ని క్షణాల క్రితం వరకూ బరువెక్కిన హృదయంతో, టెన్షన్‌తో తలబాదుకుంటున్న నేను - ఈ పరిణామంతో ఒక్కసారిగా 'అమ్మయ్య' అంటూ నిట్టూర్చాను. సంక్లిష్టమైన సమస్య అనుకున్నది కాస్తా దూది పింజలా ఎగిరిపోయింది. మనసు తేలికైపోయింది. అది అలా గాలిలో తేలిపోయి, అసంకల్పితంగా తిరుమల ఆలయంలోకి దూసుకుపోయి, శ్రీనివాసుడికి పాదాభివందనం చేసి వచ్చేసింది... నేను చెమర్చిన నా కళ్ళు తుడుచుకున్నాను.

పద్మావతి గెస్ట్‌హవుస్ విషయంలో నా వివరణ విన్నాక, సభ్యులంతా పద్మావతి గెస్ట్‌హవుస్‌ని 'డోనార్ గెస్ట్ హవుస్'గా మార్చటానికి ఏకగ్రీవంగా తీర్మానించారు. మరోసారి గోయెంకాని అభినందించారు.

అప్పుడు గోయెంకా కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. "ప్రసాద్‌గారు! నేనేదో అయిదు లక్షల రూపాయల కాటేజీకి మీరు మంచి స్థలం చూపిస్తే చాలనుకున్నాను. అదేదో ఈ రోజు మీటింగ్‌లో తేల్చుకొని పోవాలనే వచ్చాను. కాని 20 లక్షలరూపాయల గెస్ట్‌హవుస్‌కి దాతలమయిపోయాం. ఏమిటీ మాయ (ఎవరిదా మాయ?)" అంటూ శ్రీ గోయెంకా ఆనందంతో పొంగిపోయారు.



పద్మావతి గెస్టు హవుస్ - ప్రారంభోత్సవానికి ముందు

★ ★ ★

కొన్ని రోజుల తరువాత అసెంబ్లీలో దేవాదాయశాఖా మంత్రి ప్రతిపక్షాలకిచ్చిన జవాబు - "వివిపి గెస్ట్ హవుస్ నిర్మాణం కోసం టిటిడి లక్షలాది రూపాయలు దుర్వినియోగం చేస్తున్నమాట నిజంకాదు. ఈ వివిపి గెస్ట్‌హవుస్‌ని ఆర్‌పిజి గ్రూపు వారి విరాళంతో మాత్రమే నిర్మిస్తున్నారు...."!!

★ ★ ★




తిరుమల మూర్తులు-9

## వకుళమాలా దేవి

బంగారు వాకిలి దక్షిణ ప్రవేశద్వారానికి ఎదురుగా వుండే పోటు (వంటశాల)లో ప్రవేశించగానే ఎడమవైపు 'పోటు అమ్మ'గా చెప్పబడే వకుళమాలాదేవి విగ్రహం కనుపిస్తుంది. శ్రీనివాసుడు తిరుమలకొండ మీదకి వచ్చినప్పుడు ఆయనకి భోజన, వసతి సదుపాయాలు కల్పించి సాకటానికి వకుళమాలాదేవి వచ్చి వెలిసిందనీ, యశోదగా కృష్ణుణ్ని పెంచి కూడా కృష్ణుడి వివాహం చూడలేకపోయానని దిగులుపడిన స్త్రీ మూర్తే కృష్ణుడి వాగ్దానం మేరకు వకుళమాలాదేవిగా అవతరించిందనీ చెబుతారు.






# 17

# ఏడోమైలురాయిలో హత్య

తిరుమల కొండకి వెళ్ళే కాలిబాటలో 1979లో ఒక స్త్రీ హత్య జరిగింది! ఈ వార్త వినగానే టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నేను హుటాహుటిన హత్యా స్థలానికి చేరుకున్నాను.

కొండకి నడిచి ఎక్కటమనేది అనాదిగా శ్రీ వారి పాదదర్శనం కోసం భక్తులు అనుసరిస్తున్న పథం. శ్రీనివాసుని మీద భక్తితో నెలలు, సంవత్సరాల తరబడి ముడుపులు కట్టుకుని, ఎన్నో మైళ్ళదూరం నుంచి రైల్లోనో, బస్సులోనో తిరుపతికి వచ్చినా, అక్కడ్నుంచి మూటాముల్లె నెత్తిన పెట్టుకుని 3200 అడుగుల ఎత్తునున్న తిరుమల కొండలో శ్రీ వేంకటేశ్వరుని చేరుకునేదాకా "గోవిందా, గోవిందా" అనుకుంటూ, ఆ స్వామి స్మరణతో నడకలో కష్టాన్ని మర్చిపోతూ, తొమ్మిది కిలోమీటర్ల దూరం - భార్యా పిల్లలతో ఆపసోపాలు పడుతూ భక్తులు నడిచివెళ్ళే మార్గంలో - ఈ హత్య జరగటం నన్ను ఒక్కసారిగా కుదిపేసింది. వార్త విన్నప్పుడు నిర్ఘాంతపోయాను. కాని హత్యా స్థలానికి వెళ్లి చూశాక, దిగులుపడిపోయాను. మనసంతా కకావికలమైపోయింది.

ఎందుకంటే - కొండకి పాదచారులై భక్తులు వెళ్ళేదారిలో ఏడో మైలురాయి దగ్గర జరిగిందీ సంఘటన. చుట్టూ అడవి. నడిచేదారిలో ఎగుడు దిగుడు రాళ్ళు. రాత్రయితే - అక్కడక్కడా వెలిగే లైట్లు మినహా దారంతా చీకటి. చీకటి పడినకొద్దీ తగ్గిపోయే జనసంచారం. హత్య, అలాంటి ఏ నేరం జరగటానికైనా అనువుగా వుండే వాతావరణం అక్కడ కనుపిస్తోంది. నిజానికి ఇలాంటి హత్యలు దేశంలో ఎన్ని జరగడంలేదు. జరుగుతున్నాయి. కాని తిరుమల కొండకి వెళ్ళేదారిలో జరగటమేమిటి?

కొండకి బస్సులు వెళ్ళే ఘాట్ రోడ్ల నిర్మాణం జరిగిందగ్గర్నుంచి, పాదచారుల సంఖ్య తగ్గుతూ వచ్చింది. అందుక్కారణం - ఈ నడిచే దారిలో అభద్రతా వాతావరణం. పైగా పగలు ఎండకి కాళ్ళు కాలుతుంటాయి. ఈ విషయాన్ని అర్థం చేసుకున్నాక నేను తీసుకున్న మొదటి నిర్ణయం ఏమిటంటే - కొండకి నడిచి వెళ్ళే దారిలో సదుపాయాలు బాగా పెంచాలి. నడిచి కొండకి ఎక్కడం అనేది ఒక విహారయాత్రకి వెళ్ళినంత ఉల్లాసపూరితంగా వుండేలా పరిసరాలలో మార్పులు తీసుకురావాలి. అలా చేయాలంటే, ముందు అసలు కాలిబాటలో అవసరాలేమిటో బాగా అవగతం చేసుకోవాలి.

ఇలా అనుకున్నాక, ముందు నేనే కనీసం నెలకొకసారయినా కొండకి భార్యాపిల్లలతో నడిచి ఎక్కాలని తీర్మానించుకున్నాను. అలా ఆ మూడు నాలుగు గంటలూ కుటుంబమంతా కలిసివుంటాం. ఇందులో పుణ్యం, పురుషార్థం కలిసొస్తాయి గదా!

వీలైనప్పుడల్లా అలా నడిచి వెళ్తూనే వున్నాం. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ హోదాలో నేను నడుస్తున్నాను. కనుక నాతోపాటు టిటిడిలో కొందరు ఇతర అధికారులు కూడా నడిచేవారు. క్రమంగా కాలిబాటలో సమస్యలు అర్థమవుతూ వచ్చాయి. అందుకు తగినట్లుగా సదుపాయాల్ని మెరుగుపరుస్తూ వచ్చాం.

ఎగుడు దిగుడుగా వుండే రాళ్ళ మెట్లన్నీ సరి చేయిస్తూవచ్చాం. దారిపొడవునా త్రాగునీటి సదుపాయాన్ని మెరుగుపరిచాం. పరిసరాలు మరీ దట్టమైన అడవిలా లేకుండా చేశాం. వీలైనంత దగ్గర దగ్గరగా లైటింగ్ ఏర్పాటుచేశాం. మధ్యమధ్యలో స్వామివారి నామస్మరణను గుర్తుచేసే బోర్డులు పెట్టాం.. ఇవన్నీ చేశాక "చాలాచేశాం" అనుకున్నాను. అయినా నేను కొండకి నడిచి ఎక్కినప్పుడల్లా చూస్తున్నాను - నడిచి వెళ్ళే భక్తుల సంఖ్యలో చెప్పుకోదగ్గ పెరుగుదల లేదు... నాకు అర్థం కాలేదు.

మళ్ళీ అధ్యయనం సాగించాను. ఒకసారి నేను కొండకి నడిచి వెళ్తున్నప్పుడు - ఒక భక్తుల కుటుంబం ఆయాసపడుతూ కొండెక్కుతోంది. మొక్కుతో వచ్చినట్లున్నారు. కుటుంబ పెద్ద - శిరోజాలు, గడ్డం పెంచుకున్నాడు. నెత్తి మీద మూటలు, చంకలో సంచీలు, వెనకాల భార్య చంకలో పెట్టి, ఇంకా, పెద్ద పిల్లవాడనుకుంటాను - చంటిపిల్లణ్ణి చంకలోనూ, భుజాల మీద మార్చి మార్చి మోస్తున్నాడు. ఆ బరువులతో ఎక్కలేక ఎక్కలేక అవస్థపడుతూ, "వడ్డీకాసులవాడా, గోవిందా, గోవిందా" అనుకుంటూ ఎక్కుతున్నారు. చెమటలు కక్కుతున్నారు. ఆయాసపడుతున్నారు, ఆ శ్రమ మర్చిపోవాలని గోవిందుణ్ణి పిలుస్తున్నారు. ఇదంతా శ్రీనివాసుడి దర్శనంకోసమే కదా! శ్రీనివాసుడికి వినబడుతుందా ఈ పిలుపు??-- ఇలా అనుకోగానే నాకనిపించింది - వాళ్ళ ఈ గోవింద నామస్మరణను సామాన్లు మోయడం వల్ల కలిగే శ్రమను మర్చిపోవడం కోసం చేసే ప్రయత్నంగా కాక, ఉల్లాసంగా ఉత్సాహంగా భక్తితో చేసే శ్రీనివాసుని అర్చన స్మరణగా ఎందుకు చేయకూడదు? అప్పుడు కలిగిన ఆలోచనే - నడిచి వెళ్ళే భక్తులకు సామాను మోత భారం లేకుండా చేయటం. ఆ ఐడియాని వెంటనే అమల్లో పెట్టాను. కొండకి నడిచి వెళ్ళే భక్తులు తమ సామానంతా కాలిబాట





ప్రారంభంలోని అలిపిరి వద్ద టోల్ గేటులో గాని, సత్రాలలోగాని డిపాజిట్ చేస్తే, ఆ లగేజిని టిటిడి వారే తమ వాహనాల్లో కొండపైకి ఉచితంగా చేరుస్తారు. మూడు నాలుగు గంటల తరువాత భక్తులు కొండెక్కేసరికి అక్కడ వాళ్ళ సామాను భద్రంగా వుంటుంది. నిజానికి గతంలో కొంతమంది భక్తులైతే బస్సులో కొండెక్కి, సామాను సత్రంలో పెట్టి, బస్సులో కిందకు వచ్చి, కొండకి నడిచి ఎక్కేవాళ్ళు - కేవలం నడిచి ఎక్కామన్న సంతృప్తి కోసం, లేదా మొక్కు తీర్చుకోవడంకోసం.

నేనిలా ఉచిత లగేజి సదుపాయం కల్పించడంతో నడిచే భక్తుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. అయినా - స్త్రీ హత్య జరిగిన రోజు నాలో ప్రారంభమైన అలజడి తగ్గలేదు. ఇంకా ఏదో జరగలేదన్న భావన, ఇంకా ఏదో మిగిలిపోయిందన్న వెలితి నన్ను వెంటాడుతూ వచ్చాయి.

మరోసారి నడిచి ఎక్కేటప్పుడు, దారి మధ్యలో వుండగా అకస్మాత్తుగా వర్షం వచ్చింది. నడుస్తున్న భక్తులంతా దగ్గరలో వున్న చెట్ల క్రిందకు పరుగెత్తారు. అక్కడక్కడ గోపురాలు వున్నా - అవి చాలా దూరంలో వున్నాయి. నేను అలా తడుస్తూనే ముందుకెళ్తున్నాను. - "ఈ వర్షం ఎప్పుడు వెలుస్తుందో? బాలాజీ దర్శనం ఎప్పుడు చేసుకుంటామో... ?" అంటూ ఓ భక్తుల గుంపు చెట్టుక్రింద నిలబడి తడిసీ, తడవకుండా అవస్థపడుతూ చిరాకుపడుతున్నారు. వాళ్ళల్లోంచి ఒకడు శ్రీనివాసుడికి ఒక ఛాలెంజ్ విసిరాడు - "మేం నిజమైన భక్తులమైతే, మాకోసం ఒక గొడుగు పంపించవయ్యా బాలాజీ..." అంటూ. అవును, నడిచి ఎక్కే భక్తులకోసం దారంతా గొడుగుమయమే అయితే... ! ఈ ఆలోచన వచ్చిందే తడవుగా నేను టిటిడి బోర్డులో ఒక ప్రతిపాదన ప్రవేశపెట్టాను. ఈ ప్రతిపాదనలో కాలిబాట పొడవునా సిమెంట్ షెల్టర్ ఏర్పాటు చేయాలి. బాలాజీ దర్శనం కోసం నడిచి వెళ్ళే భక్తుడికి ఎండ, వానల నుంచి శాశ్వత రక్షణ కల్పించాలి.

ఈ ప్రతిపాదన విని మా బోర్డు సభ్యులు నవ్వుకున్నారు. "ఏమిటండీ ప్రసాద్‌గారు, మీకేమన్నా వెర్రా? మామూలుగా సాఫీగా వున్న రోడ్డు మీద షెల్టరు వెయ్యటమే కష్టం. ఎగుడుదిగుడుగా వున్న ఎనిమిదిన్నర కిలోమీటర్ల తిరుమల ఫుట్‌పాత్‌లోకి సిమెంటూ, ఇసుక ఎలా మోసుకెళ్తారు. షెల్టరు ఎలా కడ్తారు? ఇది జరిగేదేనా..." అంటూ పరిహాసం చేశారు. వాళ్ళ ఉద్దేశ్యం నన్ను వేళాకోళం చేయటంకాదు. కాని అసాధ్యమైన ప్రతిపాదన చేశానన్న అభిప్రాయం. నాకు మాత్రం - వర్షంలో తడుస్తూ "బాలాజీని గొడుగుపంపమని" అడిగిన భక్తులే గుర్తొస్తున్నారు. "భక్తులకి గొడుగు పంపాలి" అని బాలాజీ అనుకుంటే అది జరగదా అన్న ఆశ. ఆ ఆశతోనే నేను పట్టుదల వదలకుండా బోర్డులో నచ్చజెప్పే ప్రయత్నం చేశాను. అనేకసార్లు చర్చజరిగింది. చివరకి బోర్డు ఆమోదించింది - మొదటి దశలో అలిపిరి నుంచి శ్రీవారి నామాలు కనుపించే గోపురం దాకా షెల్టరు నిర్మించటానికి.

అంతే! బాలాజీ భక్తుల కోసం 'శాశ్వత గొడుగు' నిర్మాణం ప్రారంభమైంది. కాని అది ఒక్క రోజులోనో, నెలలోనో పూర్తయ్యేపనికాదు. అందుకని, ఈ లోపల దీనితో పాటే, కాలిబాటలో ఎగుడు దిగుడుగా వున్న మెట్లఎత్తు వీలైనంత తక్కువ చేస్తూ, రాళ్ళన్నీ మళ్ళీ పేర్చుకుంటూ వెళ్దామన్నాను.

బోర్డు ఒప్పుకుంది, అదీ ఆరంభించాం. మెడిసిన్ చదివి, సాంఘిక సేవలో ఆసక్తితో పనిచేసే డాక్టర్ జనార్దన నాయుడ్ని టిటిడిలో సెక్యూరిటీ - విజిలెన్స్ ఆఫీసర్‌గా నియమించి, ఈ కాలిబాట భద్రతకు శ్రద్ధవహించమని చెప్పాను. అతను చొరవ తీసుకుని ఉత్సాహంగా ప్రతిమైలుకి ఇద్దరు సెక్యూరిటీగార్డుల్ని 'ప్రతి షిఫ్టుకి' ఏర్పాటు చేశాడు. పాత లైటింగ్ ఏర్పాట్లు మార్చేసి కాంతివంతమైన కొత్త లైట్లు వీలైనంత దగ్గరగా వేశాం. దారంతా పరిశుభ్రమైన తినుబండారాలు దొరికేలా చర్యలు తీసుకున్నాం. మధ్య మధ్యలో భక్తులు వండుకొని తినడానికి వీలుగా షెల్టర్ల సదుపాయం కల్పించాం. దారి మధ్యలో భక్తుల్ని ఆకర్షించడం కోసం, కొంత మానసికోల్లాసం కల్పించటం కోసం జింకల పార్కు ఏర్పాటుచేశాం. దారి పొడవునా మ్యూజిక్ సిస్టం పెట్టించి, శ్రీవారి భక్తి సంగీతఝరి నిరంతరం ప్రవహించేలా చేశాం. అసంపూర్తిగా వున్న గోపురాలు పూర్తిచేశాం.... అద్భుతం! అంతకు ముందు నాలుగైదు వందల మంది నడిచే దారిలో ఇప్పుడు నాలుగైదు వేలమంది నడుస్తున్నారు ప్రతిరోజు.... ఇంత చేసినా, హత్య జరిగిన నాటి ఆందోళన నాలో తగ్గలేదు. ఇంకా ఏదో మిగిలిపోయింది, ఇంకా ఏదో జరగలేదన్న చింత నన్ను వెంటాడుతోంది.

మరోసారి కొండ మీదకెళ్తూ, నడిచి వచ్చే భక్తులు క్రింద డిపాజిట్ చేసిన లగేజిని, వారికి తిరిగి అప్పగించే క్లోక్ రూమ్ దగ్గరకి వెళ్లాను. అక్కడి దాకా ఉచితంగా టిటిడి వ్యాన్‌లో లగేజి వచ్చినా, భక్తులు అక్కడ్నుంచి మళ్లీ వాళ్లకి సత్రాల్లో రూమ్‌లు దొరికి, ఆ రూమ్‌లకి చేరేదాకా లగేజి మోసుకువెళ్లటం తప్పడం లేదు... దాని కోసం ప్రైవేటు కూలీల దోపిడీ. "వెంకటేశూ, (అలాంటి పేరేఏదో) ఈ సామాను నువ్వు మోసుకురారా" అంటూ ఓ పెద్దాయన తన కొడుక్కి లగేజి అప్పగిస్తుంటే విన్నాను.... ఇన్ని వేల మంది భక్తుల నుంచి ముడుపుల రూపంలో కోట్లు తీసుకుంటున్న వెంకటేశుడు ఆ మాత్రం లగేజి మోసే ఏర్పాటు చేయలేడా? - అనిపించింది. అలా అనిపించిన కొద్దిరోజుల్లోనే కొండమీద ఎక్కడ్నుంచి ఎక్కడికైనా ఉచిత బస్సుల్లో భక్తులు లగేజిలతో ప్రయాణించే సదుపాయం కల్పించాను. (ఎవడు కల్పించాడు? నేనా? ఎక్కడిదా ప్రేరణ?) ప్రతి 15 నిమిషాలకోసారి అలా ఫ్రీ బస్సులు తిరుగుతూనేవుంటాయి.

.... అయినా, స్త్రీ హత్యనాటి దిగులు నన్ను పట్టుకునేవుంది. ఇంకా ఏం చేయాలి? తెలీదు. కానీ ఏదో జరగాలి. ఏమిటిదీ? ఏమిటిదీ? ఎవరు చెబుతారు నాకు? "స్వామీ! నీ భక్తుల సేవకోసం ఇక్కడికి వచ్చాను. ఏం చేయాలో చెప్పు చేస్తాను - ఏమిటి నాకీ వేదన.... ఎంతకాలం?" - ఇలా ఒకరోజు ఆ హత్యజరిగిన చోట నిలబడి ప్రార్థన చేశాను. ఆ మర్నాడు, లేదా దానికి మర్నాడు ఓ అద్భుతం జరిగింది!!

★ ★ ★





**నేను** - నా భార్య గోపిక, పిల్లలు మాధవి, సంజీవ్‌లతో కలిసి కాకినాడకి కారులో బయల్దేరాను. నెల్లూరు, విజయవాడ, కాకినాడలో నిర్మాణంలో వున్న కళ్యాణమండపాలన్నీ ఇన్‌స్పెక్షన్ చేసుకుంటూ కాకినాడలో చివరి మజిలీ చేయాలన్నది మా కార్యక్రమం. (కాకినాడ గోపిక పుట్టిల్లు.)

ఆ రోజు రాత్రి విజయవాడలో బసచేశాం. మర్నాడు ప్రొద్దుటే బయల్దేరాం. నిర్ణీత కార్యక్రమం ప్రకారం 11 గంటలకల్లా మేం కాకినాడ చేరిపోవాలి. కాని రాజమండ్రి చేరేసరికి ఒంటిగంటయింది. పిల్లలకి ఆకలేస్తోంది. రాజమండ్రిలో గోదావరి పుష్కరాల కోసం టిటిడి స్నానాల ఘాట్ కడ్తున్నాం.

ఆ ఇన్‌స్పెక్షన్ ఎంత త్వరగా ముగించుకున్నా, భోజనం వేళ దాటిపోయింది. కాకినాడలో మాకోసం మామగారి కుటుంబం ఎదురుచూస్తూంటుంది. కాబట్టి సహజంగానే గోపిక చాలా అసహనంగా వుంది. "సరే, సరే, వెళ్లిపోదాం, వెళ్లిపోదాం, "అంటూ డ్రైవర్‌ని "పోనీవయ్యా" అంటున్నాను. అలా అలా పెద్దాపురంలోంచి వెళ్తుంటే అక్కడ 12 అడుగుల ఎత్తున్న ఒక ఆంజనేయస్వామి విగ్రహం కనుపించింది. "డ్రైవర్, కారాపు" అన్నాను. ఆపేశాడు.

ఏదో అనిర్వచనీయమైన దివ్యశక్తి నన్ను ఆ విగ్రహం వైపు ఆకర్షించింది. అప్రయత్నంగా, కారు దిగి ఆ విగ్రహం వైపు నడిచాను. ఆశ్చర్యం! అప్పటిదాకా చిర్రుబుర్రులాడుతున్న గోపిక కూడా నాతోపాటే ఆ విగ్రహాన్ని చూస్తూ ఆ అందానికి ముగ్ధురాలైపోయి, "ఎంత బాగుందో కదండీ" అనకుండా వుండలేకపోయింది. ఓహ్! ఏం సౌందర్యం! ఏం వర్చస్సు? క్రమంగా మనస్సులో ఏదో మూల వెతుకుతున్నదేదో దొరుకుతోందన్న భావన తాలూకు ప్రకంపనాలు... అదేమిటో తెలీటంలేదు కాని....! అప్పటికప్పుడు ఈ విగ్రహం చేసిన వ్యక్తి గురించి ఆరా తీశాను. అతని పేరు తోగు లక్ష్మణస్వామి. అతను పెద్దాపురం సమీపంలోని ఓ కుగ్రామంలో వుంటాడుట. "గోపికా, ఈ కళాకారుడ్ని ఇప్పుడే చూడాలనుందయ్యా", సంశయిస్తూనే అన్నాను. "పదండి చూద్దాం....." అంటూ నాకన్నా ఉత్సాహంగా గోపిక చొరవ తీసుకుంది. మరుక్షణంలో మా కారు ఆ గ్రామాన్ని వెతుక్కుంటూ గతుకుల రోడ్డులో మరో గంట ప్రయాణం చేసింది.

అక్కడ ఒక చిన్న గుడిసెలో యాభయ్యోపడిలో వున్న లక్ష్మణస్వామి విగ్రహాలు చేసుకుంటున్నాడు. అంత మధ్యాహ్నం వేళ ఎండలో వచ్చిన మమ్మల్ని చూసి ఆశ్చర్యపోయాడు. "లక్ష్మణస్వామీ! పెద్దాపురంలో మీరు చేసి హనుమాన్ విగ్రహంలాంటి విగ్రహాలు తిరుపతిలో కూడా పెట్టించాలంటే, మీరు అక్కడికి వచ్చి చేయగలరా?"

"మీరెవరు?"

"నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌ని" -

లక్ష్మణస్వామి ఆనందానికి అవధుల్లేవు. శ్రీరాముడే ఒకదూతని పంపించి, "నేనిక్కడున్నాను రావయ్యా" అంటే లక్ష్మణుడు ఎంతటి గౌరవప్రపత్తులతో ఎగిరిగంతేస్తాడో - అంతటి ఉద్వేగంతో,

సంభ్రమాశ్చర్యాలతో పులకించిపోయాడు లక్ష్మణస్వామి. కాని అతను ఎన్నడూ ఆ పరిసరగ్రామాలు దాటి బైట ప్రపంచంలో విహరించిన నాగరీకుడు కాడు. అందుకే అతను తన ఇద్దరు సహాయకులతో కలిసి తిరుపతి వచ్చివుండటానికి, మాకు కావలసిన విగ్రహాలు చేయటానికీ ఏర్పాట్లు నేను స్వయంగా చేస్తానని హామీ ఇచ్చి, కారెక్కాను. క్రమంగా మనసు స్థిమితపడుతోంది... మా భోజనాలు ఆ రోజు సాయంత్రం అయిదుగంటలకయ్యాయి - కాకినాడలో.

★ ★ ★

**తి**రుపతికి తిరిగి రాగానే - అంకితభావంతో పనిచేసే ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ వైఖానసాచారిని, అసిస్టెంట్ ఇంజనీర్ బెల్లం వెంకట్రామయ్యని పిలిపించి, లక్ష్మణస్వామికి కావలసిన ఏర్పాట్లు చేసే బాధ్యత అప్పగించాను. లక్ష్మణస్వామికి నేను అప్పగించిన మొదటి బాధ్యత - అప్పటికి నిర్మాణం పూర్తికావస్తూన్న టిటిడి అడ్మినిస్ట్రేషన్ భవనం (హుజూర్ ఆఫీస్) ముందు ఆవరణలోని పార్కులో పెద్దాపురంలో నేనుచూసిన ఆంజనేయస్వామి విగ్రహంకన్నా పెద్ద విగ్రహ నిర్మాణం. సిమెంటుతో విగ్రహం నిర్మించి, దానికి మొజాయిక్ పూత పూయటం ద్వారా దీర్ఘకాలం నిలిచేలా చేయటం లక్ష్మణస్వామి విధానం. ఎంత పెద్ద విగ్రహం చేసినా, వేలాడే జులపాల వంటి అతి సూక్ష్మమైన భాగాలను కూడా అత్యంత సహజంగా కళాత్మకంగా రూపొందించడం లక్ష్మణస్వామి నైపుణ్యంలో విశిష్టత.... ఇంకా, గరుడాద్రి, అంజనాద్రిలకు తగినట్లుగా గరుడ, ఆంజనేయ విగ్రహాలు కూడా చేయమని కోరాను. గరుడాద్రి అంటే క్రింద అలిపిరి నుంచి పైకి చూస్తే కనుపించే కొండ. మరి అంజనాద్రి ఎక్కడుంది? తెలీదు. కానీ "చేసేయండి, తరువాత చూద్దాం" అన్నాను.


అలిపిరిలో గరుత్మంతుడు

ఈ పనులు తిరుపతిలో జరుగుతుండగా - ఒక రోజు నేను తిరుమలకి నడిచి వెళ్తున్నాను. యధాలాపంగా ఏడోమైలురాయి దగ్గర - గతంలో హత్య జరిగినచోట -





ఆగిపోయాను. మళ్లీ పాత వ్యధ పైకి తన్నుకొస్తోంది. ఏదో సమాధానం కనుపిస్తున్నట్లే అనిపిస్తోంది, కానీ అదేమిటో తెలీటం లేదు. గట్టిగా కళ్లు మూసుకుని ధ్యానం చేసుకున్నాను.... నా కళ్లలో మెదిలిన ఒకే ఒక రూపం - పెద్దాపురం ఆంజనేయస్వామి! ఓహ్, దొరికిపోయింది పరిష్కారం. ఆనందంతో ఎగిరి గంతేయాలనిపించింది. పదేళ్ల కుర్రాడిలా ఉత్సాహంగా ఉరకలు వేయాలనిపించేలా నాలో అణువణువూ స్పందించింది.

ఆ తరువాత పండితులతో చర్చిస్తే చెప్పారు భవిష్యపురాణం. - మాతంగముని ఆదేశాల మేరకు అంజనాదేవి, కేసరి - నారాయణగిరికి వచ్చి పన్నెండేళ్లు తపస్సు చేశాక, వాళ్లకి కలిగిన సంతానమే ఆంజనేయస్వామి.

పమ్పాయాః పూర్వా దిగ్భాగేపఞ్చాశద్యోజనాన్తరే।
నారసింహాశ్రమం దేవి వర్తతే వసుధాతలే ॥

తస్య దక్షిణదిగ్భాగే నారాయణ గిరే స్తటే ।
ఉత్తరే స్వామితీర్థస్య వర్తతే క్రోశమాత్రకే ॥

వియద్గజేతి విఖ్యాతా తత్ర గచ్ఛయథాసుఖమ్।
తత్రస్నాత్వాఽథ కళ్యాణి ద్వాదశాబ్దం తప శ్చర ॥

తేన పుణ్యేన పుత్రో భవిష్యతి గుణాధికః ।
మతఙ్గే నైన ముక్తాసా నారాయణగిరిం యయౌ॥

హనూమన్త మిమం ప్రాహుః మునయో వీతకల్మషా
అఞ్జనా వ్రత మాస్థాయ పుత్రం ప్రాప గిరీశ్వరే
తస్మా దఞ్జనశైఽలోయం లోకే విఖ్యాతకీర్తిమాన్

ఆలస్యం చేయకుండా లక్ష్మణస్వామికి ఏడోమైలురాయి దగ్గర ఆ స్థలాన్ని చూపించాం. ఆ ప్రకృతి అందాలకి పరవశించిపోయాడు లక్ష్మణస్వామి. "అయ్యా! ఇంత సుందరమైన కొండమీద భక్తులకు అండగా వుండే హనుమాన్ విగ్రహాన్ని నాశక్తినంతా ధారపోసి రూపొందిస్తాను. నా జన్మ సార్థకం చేసుకుంటాను..."అన్నాడు లక్ష్మణస్వామి భక్తిపారవశ్యంతో. అలా అతని కళాత్మక హస్తాలనుండి జాలు వారిందే ఇప్పుడు ఏడో మైలురాయి దగ్గర భక్తులు చూస్తున్న ఎత్తైన ఆంజనేయస్వామి విగ్రహం. ఇంకా విచిత్రం ఏమంటే - నాకు స్ఫురించిన ఆ స్థలంలోనే కార్లు వెళ్లే ఘాట్ రోడ్డు, కాలిబాట - రెండూ కలుస్తాయి. అంటే, తిరుమల కొండమీద శ్రీనివాసుడ్ని దర్శించటానికి భక్తులు ఎలా వెళ్లినా, దారిలో ఏడో మైలురాయి దగ్గర అంజనీ పుత్రుడి దర్శనం అనివార్యం.

అలా 1980లో అక్కడ భద్రాంజనేయస్వామి విగ్రహ ప్రతిష్ఠ జరిగాకే - అంతకాలం (హత్య జరిగిననాటినుంచి) నన్ను వెంటాడిన వెలితి, వేదన మటుమాయమైపోయాయి!

**బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వం అరోగతా**
**అజాడ్యం వాక్పటుత్వంచ హనుమత్ స్మరణాత్ భవేత్॥**

తిరుమల ఆలయం చేరుకునేదారిలో వున్న సప్తగిరుల మీదా - (వెంకటాద్రి, గరుడాద్రి, శేషాద్రి, అంజనాద్రి, వృషభాద్రి, నారాయణాద్రి, ఆనందాద్రి) అలాంటి ఏడు విగ్రహాలు ఆయారూపాలతో ఏర్పాటు చేయాలని కోరిక వుండేది కానీ.......



శ్రీ ఆంజనేయ విగ్రహ ప్రతిష్ఠా సమయంలో

* * *



# 18

## రామకృష్ణమఠం-స్వామి రంగనాధానంద

**ము**ఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డి నావంక అసహనంగా చూస్తున్నారు.

అంత హడావుడిగా పన్నెండు లక్షలరూపాయలు నేను రామకృష్ణ మఠానికి ఇచ్చేయాలని చూడటం ఆయనకు సుతరామూ నచ్చలేదన్న విషయం ఆయన మొహంలో కొట్టొచ్చినట్లు కనబడుతోంది. అప్పటికే ఆయనతో వున్న అనుభవం దృష్ట్యా, ఆ చర్చ పొడిగించడం నాకూ ఇష్టంలేదు. కాని.... రామకృష్ణ మఠానికి తిరుమల తిరుపతి దేవస్థానాల విరాళంగా 12 లక్షలు ఇచ్చి తీరాలన్న సంకల్పం విరమించుకునే ఉద్దేశ్యం నాకులేదు... అలాగని నేను చెప్పగానే తలూపేసి "నీ ఇష్టం ప్రసాద్, అలాగే చెయ్"అనే తత్త్వం చెన్నారెడ్డి గారికీ లేదు.

నాలోపట్టుదల పెరిగిందో, ఎవరన్నా పెంచేలా చేశారో తెలీదుకాని నేను చివరి బాణం వదిలాను. "సర్! ఇది దైవసంకల్పం. ఇలా జరగాలన్నదే శ్రీనివాసుడి అభీష్టం అయితే, మనమెవరం సర్ కాదనటానికి?...."

శ్రీచెన్నారెడ్డి ఛివాల్న తలెత్తి నాకళ్లలోకి చూస్తూ " అహ, అలాగా!" అన్నారు. అందులో వెటకారం ధ్వనించింది. నేను మాట్లాడలేదు.

"చూడు ప్రసాద్, ఆధ్యాత్మిక చింతనకీ, అడ్మినిస్ట్రేషన్‌కీ నీ మెట్టవేదాంతంతో ముడిపెట్టాలని చూడకు.... అది పొసగదు.."

అర్థమైంది - ఇది జరగదు. మనసంతా ఒక్కసారిగా వ్యాకులతతో నిండిపోయింది. డబ్బులేక మధ్యలోనే ఆగిపోతున్న రామకృష్ణమఠం నిర్మాణం, ఆ ప్రక్కనే అకుంఠితదీక్షతో శ్రీనివాసుడి మీద మొక్కవోని ఆత్మవిశ్వాసంతో ఆశగా చూస్తున్న స్వామి రంగనాథానంద - క్షణకాలం నాకళ్లల్లో మెదిలారు. నా నిస్సహాయత నన్ను ఒక్కసారిగా క్రుంగదీసింది. ముఖ్యమంత్రిని ఎదిరించి మాట్లాడే ధైర్యం - (నాకున్నంతవరకూ) అప్పటికే ఖర్చయిపోయింది. ఇంక మిగిలిందేమన్నా వుంటే - అది ముఖ్యమంత్రి ఛీత్కారాన్నిభరించే సహనం మాత్రమే. అది కూడా ఎంతవరకో తెలీదు.

"నీవేమైనా రామకృష్ణమఠం సభ్యుడివా?" నిశ్శబ్దాన్ని చీలుస్తూ ముఖ్యమంత్రి సూటిగా ప్రశ్నించారు.

"లేదు సర్!.... నిజానికి స్వామి రంగనాథానంద గారితో టెలిఫోన్‌లో మాట్లాడటం మినహా ఆయన్ని నేనెన్నడూ చూడలేదు కూడా..." "మరి... ?"

అంటే, నీకేం ఆసక్తి వుందని ఇంత అర్జంటుగా 12 లక్షలూ రామకృష్ణమఠానికి ఇవ్వాలనుకుంటున్నావ్ - (కామన్ గుడ్ ఫండ్ కొత్త నిబంధనలు అమల్లోకి వచ్చేదాకా వెయిట్ చేయకుండా) - అన్నది ముఖ్యమంత్రి ప్రశ్న. ఈ 12 లక్షల అర్జంటు డొనేషన్ వ్యవహారంలో నా ఆసక్తి ఏమిటో తెలుసుకోవాలని ఆయన ఆరా తీస్తున్నట్లపించింది. ఇది నా వ్యక్తిత్వానికి ఓ పరీక్ష. ఈ విరాళం విషయంలో నేను తీసుకున్న నిర్ణయంలోని స్వచ్ఛత, హేతుబద్ధత ఆయన్ని ఒప్పించేలా వివరించాల్సి వచ్చింది...

★ ★ ★

**1979**లో ఇలా నేను ముఖ్యమంత్రి శ్రీచెన్నారెడ్డిని కలుసుకోవటానికి కొన్ని రోజుల క్రితమే ఒక రోజు నేను టిటిడి హుజూర్ (అడ్మినిస్ట్రేటివ్) ఆఫీసులో పనిలో వుండగా హైద్రాబాద్‌లోని రామకృష్ణమఠానికి చెందిన స్వామిరంగనాథానంద నుండి నాకు ఫోన్‌కాల్ వచ్చింది. ఆయన్ని అంతకుముందు నేను కలుసుకోలేదు. కనీసం చూడలేదు. కాని విని వున్నాను. అప్పటికే ఆయన ఢిల్లీలో రామకృష్ణ మఠాన్ని అభివృద్ధి చేయడం ద్వారా సేవారంగంలో ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకుని వున్నారు.

అపార విజ్ఞానవేత్తగా, ఆధ్యాత్మిక తత్త్వవేత్తగా, శ్రోతలను సమ్మోహితుల్ని చేస్తూ మానవ జీవితానికి పరమార్థాన్ని వివరించేలా గంటల తరబడి అనర్గళంగా ప్రసంగించగల మహాజ్ఞానిగా, సమర్థుడైన ఆర్గనైజర్‌గా ఆయన గురించి నలుగురూ చెప్పుకుంటూండగా విన్నాను తప్ప ఆయనతో ముఖాముఖి మాట్లాడే అవకాశం నాకెప్పుడూ రాలేదు.

అలాంటి రంగనాథానంద స్వయంగా నాకు టెలిఫోన్ చేశారనగానే ఒక్కసారిగా ఎక్కడలేని ఉత్సాహం తన్నుకొచ్చింది. మామూలు పరామర్శలయ్యాక స్వామీజీ అసలువిషయం చెప్పారు.





హైద్రాబాద్‌లోని లోయర్‌ట్యాంక్ బండ్ క్రింద రామకృష్ణమఠం నిర్మాణంకోసం విశాలమైన స్థలాన్ని వెంగళరావుగారు ముఖ్యమంత్రిగా వుండగా రాష్ట్రప్రభుత్వం కేటాయించింది. ఆ స్థలంలో ఇప్పటికి మఠం కాంప్లెక్స్ నిర్మాణం జరుగుతోంది.

"మేం ఈ భవన సముదాయం ప్రారంభించే ముందు మాదగ్గర చెప్పుకోదగ్గ నిధులేవీ లేవు. అయితే ఒక మంచి పనికి భగవంతుడే దారి చూపిస్తాడు అని నా నమ్మకం. అలా అనే ఈ నిర్మాణంలోకి దిగాను. ఇందులో ఆడిటోరియమ్, గెస్ట్‌రూమ్స్, సన్యాసుల క్వార్టర్సు, ప్రార్థనామందిరం, లైబ్రరీ, బుక్‌స్టాల్ వస్తాయి... నేను విశ్వసించినట్లుగానే విరాళాలు ఎక్కడెక్కడ్నుంచో వచ్చాయి. మొదటిదశ పూర్తికావచ్చింది. ఇప్పుడింకా 15 లక్షలు వెంటనేకావాలి. లేకపోతే పని ఆగిపోతుంది. నాకు విరాళాలొచ్చే వనరులన్నీ వాడేసుకున్నాం. ఇంకాగట్టిగా పట్టుపడితే ఓ 2-3 లక్షలరూపాయలు రావచ్చు. మిగతా 12 లక్షలు ఎలా వస్తాయి?... అందుకే ప్రసాద్‌గారు, ఈ స్థితిలో నాకు వేంకటేశ్వరుడే స్ఫురించాడు. ఆయన తప్ప ఇంకెవరూ ఈ మహత్కార్యానికి చేయూతనివ్వలేరు. ఆయన ప్రతినిధిగా మీరే ఇందుకు పూనుకోవాలి..." ఇదీ స్వామి రంగనాథానంద అభ్యర్థన.

ఆయన మాటల్లోని నిస్సహాయత నన్ను కదిలించివేసింది. ఇంత పెద్ద ప్రాజెక్టు 12 లక్షలు రూపాయలకోసం స్తంభించిపోయే పరిస్థితి వస్తోంది. ఇప్పుడా 12 లక్షలు టిటిడి విరాళంగా రావాలన్నది ఆయన ఉద్దేశ్యం. విరాళాలు ఇవ్వడం - తిరుమల తిరుపతి దేవస్థానాలకి ఒక సమస్య కాదు. పైగా ఇలాంటి అనేక పథకాలకి గతంలో టిటిడి విరాళాలు ఇచ్చిందికూడా. అయినా, ఇదొక మహత్తరమైన మానవసేవా పథకం. స్వామి వివేకానంద ఆధ్వర్యంలో బేలూరులో ప్రారంభమైన రామకృష్ణ మిషన్ దేశంలోని అనేక నగరాలకు విస్తరించింది. మానవసేవ ద్వారానే మాధవసేవ చేయాలన్న స్ఫూర్తిని ఆచరణలోకి తీసుకువచ్చింది. దేశంలో ప్రకృతి వైపరీత్యాలు సంభవించిన అనేక సందర్భాలలో సహాయ, పునరావాస కార్యక్రమాలలో రామకృష్ణ మిషన్ సేవలు వెలకట్టలేనివి, కొలబద్దలకు అందనివి....

మామూలు పరిస్థితుల్లో అయినా 12 లక్షల రూపాయల విరాళం చాలా పెద్ద మొత్తమే. పైగా ఇప్పుడు స్వామి రంగనాథానంద ఫోన్ చేసే సమయానికి నా పరిస్థితి మరింత వేరుగా వుంది.

రాష్ట్రంలోని వివిధ ఆలయాల ట్రస్టులు ఎవరికిష్టంవచ్చినట్లు వాళ్లు దాన ధర్మాలు చేసేస్తున్నారనీ, ఇందువల్ల అనేక సందర్భాలలో అపాత్రదానం జరగటం, లేదా నిధులు దుర్వినియోగం కావటం జరుగుతోందనీ ప్రభుత్వం భావించింది. అందుకని 'కామన్ గుడ్‌ఫండ్' నిబంధనలు మార్చాలని నిర్ణయించింది. ఈ ఫండ్ ప్రభుత్వ ఆధీనంలోనే వుంటుంది. అయితే ఇటు పై ప్రతి దేవాలయ ట్రస్టు నుంచీ ఈ ఫండ్‌కి ఏటా కొంత మొత్తం వచ్చి చేరుతూంటుంది. టిటిడి కూడా తన

ఆదాయంలో కొంత శాతాన్ని ఈ కామన్‌గుడ్ ఫండ్‌కి ఇవ్వాల్సి వుంటుంది. ఆలయాల జీర్ణోద్ధరణకిగానీ, ఏ ఇతర ధార్మిక కార్యక్రమాలకిగానీ విరాళం కావల్సివుంటే, ఈఫండ్ నుంచి ఇవ్వాలే తప్ప, ఆయాట్రస్టులు నేరుగా ఇవ్వటానికి వీల్లేదు. టిటిడికి కూడా ఇదే నిబంధన వర్తిస్తుంది.

ఈ కొత్త నిబంధన మరోనాలుగైదు రోజుల్లో అమల్లోకి రానున్న సమయంలో స్వామి రంగనాధానంద నుంచి ఈ రిక్వెస్టు వచ్చింది. ఇప్పుడేం చేయాలీ? నాకు ఇవ్వాలనే వుంది - కానీ, కామన్ గుడ్ ఫండ్ కొత్త నిబంధన మరో నాలుగు రోజుల్లో అమల్లోకి రాబోతోందని తెలిసి కూడా నేనిలా ఇచ్చేశానంటే - ప్రభుత్వమూ, టిటిడి ట్రస్టుబోర్డు స్థానంలోని పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీ కూడా నన్ను దోషిగా చూస్తాయి. పోనీ పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీ ముందు పెడదామా అంటే, ఆ కమిటీ అప్పటికి రెండూ మూడు రోజుల క్రితమే కలిసింది. మళ్లీ నెల రోజులదాకా కలిసే అవకాశం లేదు.

నేనీ పరిస్థితి అంతా స్వామీజీకి వివరిస్తూ, "మీరొకసారి ముఖ్యమంత్రిని, దేవాదాయశాఖా మంత్రిని, అలాగే రెవెన్యూ ప్రిన్సిపల్ సెక్రటరీని, ఎండోమెంట్స్ కమీషనర్‌ని కూడా కలిసి ఓ మాట చెప్పండి. వాళ్లకి అభ్యంతరం లేదంటే నేను వెంటనే ఇచ్చేస్తాను..." అంటూ సలహా ఇచ్చాను. నా మాటలతో స్వామీజీ ఆశాభంగం చెందారు. నిధుల కోసం మంత్రులచుట్టూ తిరగటం పట్ల ఆయన అనాసక్తత ఆయన మాటల్లో నాకు అప్పటికే అర్థమైంది - అయినా నేను చెప్పాల్సింది చెప్పాను. అప్పటి నా పరిస్థితి అలాంటిది.

"ప్రసాద్‌గారూ, మేం చేస్తున్నది ఒక మంచిపని అనీ, మంచిపనికి భగవంతుని అనుగ్రహం ఎప్పుడూ వుంటుందనీ నేను గాఢంగా విశ్వసిస్తున్నాను. నాకింకా శ్రీనివాసుడి చేయూతపట్ల ఆశ, విశ్వాసం చావలేదు... దయచేసి మీరు చొరవ తీసుకుని ఒక్కసారి ప్రయత్నం చేయండి. ఆపైన, అంతా ఆ వేంకటేశ్వరుడి దయ..." అంటూ ముగించారు స్వామి రంగనాధానంద.

నాకు తెలిసినంతవరకు స్వామి రంగనాధానంద ఎన్నడూ రాజకీయనాయకుల దగ్గరికి విరాళాలకోసం తిరిగిన మనిషికారు. ఇప్పుడు కూడా ఆయన నా మాటవింటారనిగానీ, సి.ఎం గారినీ దేవాదాయశాఖామంత్రినీ, ఈ రెవెన్యూ సెక్రటరీ తదితరుల్నీ కలుస్తారనిగానీ నాకే మాత్రం అనిపించలేదు. మరేమిటి ఆయన ధైర్యం? ఎవ్వర్నీ అడక్కుండానే డబ్బులొచ్చేసి, మఠాలు నిర్మాణమైపోతాయా? అన్నీ దేవుడే చూసుకుంటాడు - అని గుడ్డిగా నమ్మేసి కూర్చుంటే, ఆదేవుడు దిగొచ్చి, కట్టించేస్తాడా? ఇంత పెద్ద ప్రాజెక్టు నిర్మాణం చేపట్టినప్పుడు ఎంత ప్లానింగ్ వుండాలీ? నిధుల సమీకరణకి ఎంత ప్రయత్నం చేయాలీ? ఇప్పుడేదో అవసరంలో ఆయనకి టిటిడి గుర్తొచ్చింది కాబట్టి నన్నడగగలిగారు. టిటిడియే లేకపోతే ఏం చేసేవారు?

... సరి, ఇప్పుడు నేనేం చేయాలీ?... పన్నెండు లక్షలంటే చిన్న మొత్తం కాదు. పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీ మరో నెల రోజులదాకా కలిసే అవకాశంలేదు. నెల రోజుల పాటు నిరీక్షించే





అవకాశం స్వామీజీకి లేదు. ఆయన పని అత్యవసరమైంది. రామకృష్ణమఠానికి ఇవ్వదల్చుకుంటే ఇప్పుడిస్తే వున్నంత ఉపయోగం నెలరోజుల తర్వాత నేనిచ్చినా వుండకపోవచ్చు... ఏం చేయాలీ? పోనీ, నేను స్వతంత్రించి ధైర్యంచేసి ఇచ్చేస్తే ఏమవుతుంది? ఇచ్చేసింతర్వాత రాటిఫికేషన్‌కి పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీలో పెడితే? అప్పుడు మిగతా సభ్యులు ఒప్పుకోకపోతే?.. ఆ ఊహతో ఒక్కసారిగా నాకు ఒళ్లు జలదరించింది? ఎందుకంటే అప్పటికి నా వయస్సు 38. కమిటీలో మిగతా సభ్యులు వయస్సులోనూ, హోదాలోనూ కూడా నాకన్నా పెద్దవాళ్లు. "ప్రసాద్‌కి ఆవేశం ఎక్కువ - ఆలోచనకన్నా"అని మాట పడాల్సివస్తుందేమో?...

సందిగ్ధంలో పడిపోయాను. "ఇది మంచిపని చేసెయ్" అంటూ బుద్ధి ప్రోత్సహిస్తోంది. "ఎందుకు రిస్క్ తీసుకుంటావ్?"అంటూ పరిపాలనా అనుభవం హెచ్చరిస్తోంది... ఇలా సందిగ్ధంలో కొట్టుమిట్టాడుతూ కుర్చీలోంచి లేచిపోయాను. ఎందుకు లేచానో తెలీదు. లేచి ప్రక్కకి తిరగ్గానే ఎదురుగా నిలువెత్తు శ్రీనివాసుడి చిత్రపటం. "స్వామీ నీదే భారం... ఏం చేయిస్తావో" అంటూ ఒక నమస్కారం పెట్టాను. కళ్లు మూసుకుని ధ్యానం చేయబోయాను.

అప్పుడే అకస్మాత్తుగా మనస్సులో మెదిలింది - "భారం అంతా నీదే స్వామీ" అని అనుకోవడంలో నాకు చిత్తశుద్ధి వుందా? వుండి వుంటే, నేను వెనుకాడాల్సిన అవసరం ఏమిటి? చేయదల్చుకున్న పని మంచిది. రాబోయే రోజుల్లో అనేక మందికి ఒక సంస్కారవంతమైన వ్యక్తిత్వాన్ని అందించటానికి దోహదపడే, 'మానవసేవే మాధవసేవ' అన్న స్ఫూర్తితో పరిపూర్ణమైన అంకిత భావంతో పనిచేసే సేవాసంస్థ నిర్వహించే - బృహత్ యజ్ఞంలో తిరుమల తిరుపతి దేవస్థానాలు కూడా ఒక భాగస్వామి కావటం మంచివిషయమే కదా. చేయదల్చుకున్న కార్యం మంచిదైనప్పుడు, ఆ పని చేయటం వల్ల కలిగే "పర్యవసానాల భారం అంతా నీదే స్వామీ" అన్న ప్రార్థన మనస్ఫూర్తిగా (with a feeling of total surrender) చేస్తున్నట్లయితే, ఇంక జంకవలసిన అవసరం ఏముంది? ఆ క్షణంలో నాకు ".. అంతా వేంకటేశ్వరుడి దయ" అంటూ స్వామి రంగనాధానంద ఆత్మ విశ్వాసంతో అన్నమాటలు స్ఫురణకు వచ్చాయి... అంతే! నేనింక ఆలస్యం చేయలేదు... వెంటనే మళ్లీ నా సీట్లోకి వచ్చాను. మా ఫైనాన్షియల్ అడ్వయిజర్‌కి ఫోన్‌చేసి, రామకృష్ణ మఠం పేరుమీద పన్నెండు లక్షల రూపాయలకి చెక్కు తయారుచేయమని అప్పటికప్పుడు ఆదేశాలిచ్చాను. ఆ చెక్కు తీసుకుని ఆ మర్నాడే హైద్రాబాద్‌కి బయల్దేరాను.

హైద్రాబాద్‌లో దిగీ దిగగానే ముందు జాగ్రత్తచర్యగా పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీలో సభ్యులైన రెవెన్యూ ప్రిన్సిపల్ సెక్రటరీ రమేశన్ గారితో, దేవాదాయ శాఖ కమీషనర్ చంద్రమౌళిరెడ్డిగారితో టెలిఫోన్‌లో మాట్లాడాను. విషయం అంతా విన్నాక ఇద్దరూ పెదిమ విరిచేశారు.

ఇద్దరు చెప్పిందాని సారాంశం ఒక్కటే - "రామకృష్ణమఠం సేవా నిరతిని, నిజాయితీని శంకించనఖ్కర్లేదు. పైగా అలాంటి కార్యక్రమాలకి టిటిడి విరాళం ఇవ్వటం కూడా తప్పుకాదు.. కానీ, ఇప్పుడు కామన్‌గుడ్‌ఫండ్ కొత్త నిబంధనలు అమల్లోకి వస్తున్న తరుణంలో నువ్విలా చేయటం నీకు సమస్య కావచ్చు. ముఖ్యంగా ముఖ్యమంత్రికి, దేవాదాయశాఖామంత్రిక్కూడా తెలీకుండా చేయటం లేనిపోని సమస్యల్ని సృష్టించవచ్చు... ఆలోచించుకో.."

వాళ్లమాటలు విన్నాక్కూడా నా మనసు మారలేదు. అవ్యక్తమైన శక్తి ఏదో బలంగా నన్ను ముందుకు నెడుతోంది. "ఇది మంచి పని, నేను చేసే తీరాలి.. అంతా ఆ స్వామే చూసుకుంటాడు.." ఇంతకుమించిన ఆలోచనే లేదు.

అయితే పర్సస్స్ ఇన్‌ఛార్జి కమిటీలో సభ్యుల మాటలు విన్నాక - చివరిసారిగా ఒక్కసారి ముఖ్యమంత్రికి, దేవాదాయశాఖామంత్రికి ఒక మాట చెప్పడం మంచిదనిపించింది. (చెబితే వాళ్లు 'ఓ.కే' అంటారని ఆశ) దేవాదాయశాఖామంత్రి నగరంలో లేరు. చివరగా ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారి అప్పాయింట్‌మెంట్ కోసం ప్రయత్నించాను. దొరికింది. ఆ సాయంత్రమే ముఖ్యమంత్రిని కలిసి - రామకృష్ణమఠం ప్రాజెక్టు విశిష్టత, 12 లక్షలు టిటిడి విరాళంగా ఇవ్వటంలో ఔచిత్యం, అర్జెన్సీ... అన్నీ వివరించాను. కానీ.. !!

★ ★ ★

**అ**ప్పటిదాకా నాకేదో వుందనుకొంటున్న వాక్చాతుర్యంలో పస ఎంతుందో - ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారి 'విముఖత' స్పష్టం చేస్తోంది. ఇంతదాకా వచ్చాక, ఇప్పుడాయన 'నో' అన్నారంటే, నేను ఎట్టి పరిస్థితిల్లోనూ ధైర్యంచేసి రామకృష్ణ మఠానికి విరాళం ఇవ్వటం జరగదు. "అనవసరంగా ఈయన దగ్గర కొచ్చామే. అదేదో చెక్కుఇచ్చేసింతర్వాత వచ్చినా పోయేదేమో. నాలుగు దులిపేస్తే దులిపేసేవాడు. ఇప్పుడిక ఈయనొప్పుకోకపోతే చెక్కివ్వటం సాధ్యపడదు... ఎలా? ఎలా?" అని కొద్దిక్షణాలు మధనపడ్డాను. అంతలోకే, మళ్లీ స్పృహలోకి వచ్చాను. "నేనెందుకింత మధనపడుతున్నాను. భారం అంతా శ్రీనివాసుడి మీదే వేశాం గదా! జరగాలని వుంటే ఆయనే జరిపిస్తాడు గదా!" ఈ ఆలోచన రాగానే మనసు తేలికైపోయింది. లేచి పోవడానికి ఉద్యుక్తుణ్నయ్యాను.

లేవబోతూ, అనాలోచితంగా ముఖ్యమంత్రితో ఒక్కమాట అన్నాను. "సర్, దైవచింతన గురించి, సేవా భావం గురించి మీకు చెప్పేటంత వాణ్ణికాదు. ఏదిమంచో ఏది చెడో, ఏది ఉచితమో ఏది అనుచితమో నిర్ణయించగల అపారమైన విచక్షణా శక్తిని మీకు ఆ శ్రీనివాసుడు ప్రసాదించాడు. ఈ ప్రాజెక్టు హైద్రాబాద్‌లో కడ్తున్నారు. రంగనాథానంద పట్టుకు పోయేదేమీలేదు. దీనివల్ల ప్రయోజనం ఇక్కడి ప్రజలకే వుంటుంది. ఆలోచించి చెప్పండి.... మీరెలా చెబితే అలాగే చేస్తాను" నేను లేచాను.





శ్రీ చెన్నారెడ్డి చురుక్కున నాకేసి చూశారు. ఏమనుకున్నారో - "ఒక్క నిమిషం ప్రసాద్" అంటూ, ప్రైవేట్ సెక్రటరీకి ఫోన్‌చేసి, "నిన్న రామకృష్ణ మిషన్ స్వామీజీ అప్పాయింట్‌మెంట్ అడిగారని చెప్పినట్లున్నావ్‌గదా!... ఆయన్ని ఫోన్‌లో కలుపు. మాట్లాడతాం..." అని ఆదేశాలిచ్చారు.

మరో రెండు నిమిషాల్లో ఛీఫ్ మినిష్టర్ స్వయంగా స్వామి రంగనాథానందతో ఫోన్‌లో మాట్లాడడం, ఆ ప్రాజెక్టు గురించి, అక్కడి అవసరం గురించి అడిగి తెలుసుకోవడం, ప్రాజెక్టుకి కావలసిన సహాయం వచ్చేలా చూస్తానని హామీ ఇవ్వడం చక చకా జరిగిపోయాయి. నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను. ఇది నిజమా!.. నేను ఆ సంభ్రమంలోంచి తేరుకునే లోపల మళ్లీ ముఖ్యమంత్రే కల్పించుకుంటూ, "సరే, ఈ 12 లక్షలూ ఆయనకి పంపించెయ్. ఏమైనా ప్రసాద్, స్వామీజీ చెప్పినదాని ప్రకారం ఇదో మెగా ప్రాజెక్టు. ఈ పన్నెండులక్షలతోనయినా అది పూర్తవుతుందన్న నమ్మకం మాకులేదు.. ఒక వేళ ప్రాజెక్టు మిగతా దశ పూర్తవటానికి కావలసిన నిధులు స్వామీజీ సమకూర్చుకోలేకపోతే, ప్రాజెక్టు ఏమవుతుంది?.."

"సర్ సర్, స్వామీజీ నాకు చెప్పిందల్లా తాను భగవంతుని ప్రేరణతోనే ఈ బృహత్‌కార్యం నిర్వహిస్తున్నానని. అంచేత అది పూర్తయ్యే భారం అంతా ఆ శ్రీనివాసుడే చూసుకుంటాడని ఆ స్వామీజీ విశ్వాసం.... సర్, మీరేమీ అనుకోనంటే ఒక్కమాట.. ఆ శ్రీనివాసుడి దయవుంటే, ఈ ప్రాజెక్టు పూర్తయి తీరుతుంది. ఆ కార్యంలో చేయూతనందించే వాళ్లెవరయినా - ముఖ్యమంత్రితో సహా - నిమిత్త మాత్రులే."

ముఖ్యమంత్రి ఓ చిరునవ్వు నవ్వి, "టిటిడికి వెళ్లాక నీకు ఈ వేదాంతం బాగా ఒంట బట్టినట్లుంది.." అంటూ ఓ చిరువ్యాఖ్య విసిరారు.

"అంతా స్వామి దయ సర్" అంటూ బయటకొచ్చేశాను... (దేవాదాయశాఖామంత్రి ఆమోదం కోసం నేను వెయిట్ చేయనఖ్కర్లేదని కూడా సి.ఎం. చెప్పినా, ఆయనకి టెలిఫోన్‌లోవిషయం చెప్పాను.) నాకు స్వామి రంగనాథానంద చెప్పినమాటలే గుర్తుకొచ్చాయి... "ఇది జరిగేదీ లేనిదీ.. అంతా వేంకటేశ్వరుడి దయ ప్రసాద్‌గారూ... !"

మరో గంటలో నేను రమేశన్ గారిని, చంద్రమౌళిరెడ్డిగారిని సమావేశపరిచి, పర్సస్స్ ఇన్‌ఛార్జి కమిటీ సమావేశమయినట్లు రాయించి, 12 లక్షల విరాళానికి తీర్మానం చేయించాను. అయితే చెక్కు తీసుకెళ్లి స్వామీజీకి ఇచ్చేటంత టైమ్ నాకు లేదు. హైద్రాబాద్‌లో టిటిడి లైజాన్ ఆఫీసర్ ప్రొఫెసర్ శ్రీరామ్మూర్తిని పిలిచి, ఈ చెక్కు స్వామీజీకి అందించమని చెప్పేసి, నేను తిరుపతి విమానం ఎక్కేశాను. నేను తిరుపతి చేరేసరికి, అక్కడ నాకోసం స్వామి రంగనాథానంద నుంచి టెలిఫోన్ మెసేజ్ సిద్ధంగా వుంది. ఫోన్ చేశాను. రంగనాథానంద నాకు కృతజ్ఞతలు తెలుపుతూ అన్నారు. "ప్రసాద్‌గారూ, అసాధ్యాన్ని సుసాధ్యం చేయటమే శ్రీనివాసుడి ప్రత్యేకత. ఈ ప్రాజెక్టు జరగాలన్నదే స్వామి అభీష్టం. అందుకే మీ ద్వారా ఇలా..."(నిజమా?)

నేను ముఖ్యమంత్రి వ్యక్తం చేసిన సందేహం బయటపెట్టాను. ఇంత భారీప్రాజెక్టు నెత్తిన వేసుకొన్నారు. తరువాత దశకి నిధులు సమకూరకపోతే ఏం చేస్తారు?... మరోసారి స్వామీజీ ఆ దైవశక్తిపట్ల తనకున్న విశ్వాసాన్ని నొక్కి చెప్పారు. "ఇది జరగాల్సిందీ లేనిదీ ఆయనే నిర్ణయిస్తాడు. ఆయన వద్దనుకుంటే మనం జరిపించలేం. ఆయన జరగాలనుకుంటే మనం నిరోధించలేం. అవసరమైతే మరోసారి నేను మీ శ్రీనివాసుడి దగ్గరకే రావాల్సి వస్తుందేమో కూడా.."

కొన్నిరోజుల తరువాత స్వామి రంగనాధానంద తిరుపతి వచ్చారు. శ్రీనివాసుడి దర్శనం చేసుకున్నారు. ఆ సందర్భంగా ఆయనతో కొంత సమయం గడిపే అదృష్టం నాకు లభించింది. What a great scholar he is? ఆయనలోని స్పష్టమైన ఆలోచనా విధానం, అపారమైన దూరదృష్టి, అచంచలమైన అంకితభావంతో కూడిన సేవాతత్వం నన్ను బాగా ఆకర్షించాయి. నన్నోసారి వచ్చి రామకృష్ణమఠం నిర్మాణం (అప్పటికి 75శాతం పూర్తయింది) ఎలా వస్తోందో చూడమన్నారు. మరో వారం పది రోజుల్లోనే ఇది సాధ్యపడింది. అక్కడ నిర్మాణంలో ప్రతి ఇటుకలోనూ స్వామి రంగనాధానంద, ఆయన బృందంలోనిస్వామి పరమార్ధానంద తదితరుల అంకిత భావం కొట్టొచ్చినట్లు కనుపిస్తోంది. అప్పటికే దాదాపు ఒక కోటిరూపాయలు పైగా ఖర్చయింది. ఆర్కిటెక్చర్ బాధ్యత నిర్వర్తిస్తున్న టౌన్ ప్లానింగ్ డైరెక్టర్ వెంకట్రమణారెడ్డిగారిని అడిగాను. "ఇంకాఎంత ఖర్చుంది?"... కనీసం 40 - 50 లక్షలు వుంటేనే గాని అది పూర్తికాదన్నారు. అంత డబ్బు స్వామీజీ ఎక్కడ్నుంచి తెస్తారూ? ఇదే ప్రశ్న అనాలోచితంగా అడిగేశాను.

ప్రశాంతత ఉట్టిపడే ఆ మొహంలో చిరునవ్వు తొంగి చూసింది. ఇంత పెద్ద ప్రాజెక్టు ఇంతవరకూ ఎలావచ్చింది? నేను కట్టానా? ఇదెలా కట్టబడిందో, ఏ మహత్తర శక్తి ఇలా నడిపించిందో ఆ శక్తే అంతా చూసుకుంటుందని తెలీదా?... ఇవన్నీ ఆయన చెప్పలేదు. కాని ఇలాంటి అనేక భావాల సమూహం ఒక్కక్షణంలో నాకు అర్ధమయ్యేలా, ఆ స్థితప్రజ్ఞుడు, తన కుడిచేతి చూపుడు వేలుని ఆకాశంలోకి చూపించి తెలియపర్చారు. ఆయన ఆత్మవిశ్వాసాన్ని నేను మనస్ఫూర్తిగా అభినందించకుండా వుండలేకపోయాను.

★ ★ ★

కొన్ని మాసాలు గడిచాయి. అకస్మాత్తుగా ఒక రోజు స్వామి రంగనాధానంద హైద్రాబాద్‌నుంచి ఫోన్‌చేసి, ఏదో అర్జంటు విషయం మాట్లాడాలనీ, వీలైతే అర్జంటుగా ఒక్కసారి హైద్రాబాద్ రావలసిందనీ కోరారు. దేని గురించి అని అడిగితే, రామకృష్ణ మఠం భూములు రక్షణశాఖ ఆక్రమణలో వున్నాయనీ, వాటి గురించి ఏం చేయాలో ఎలా చేయాలో తెలీక నా సలహా తీసుకోవాలనుకుంటున్నాననీ చెప్పారు. ఇదేదో - ఇప్పుడు నిర్మాణంలో వున్న ప్రాజెక్టుతో ముడిపడి వుందన్నట్లు నాకనిపించింది. "సరే, వస్తాలెండి" అనేశాను.





రెండు రోజుల తర్వాత హైద్రాబాద్ వెళ్లాక విషయం బోధపడింది. నా అనుమానం కరెక్టే. మఠం నిర్మాణం రెండో దశ వ్యయం అంచనా క్రితంసారి మేం మాట్లాడుకున్నప్పుడు 40-50 లక్షలు మాత్రమే. ఇప్పుడు ప్రేయర్ హాలుకి మరో సెల్లార్ కలపటం వల్లా, ఫ్లోరింగ్ నాణ్యతని పెంచాలని చూడటం వల్లా, ఈ అంచనా మరో15 లక్షలు పెరిగిపోయింది. ఆయనకున్న వనరులన్నీ పూర్తిగా వాడేసుకున్నారు. ఇంకా ఆయన గట్టిగా పట్టుబడితే రెండు మూడు లక్షలు తేగలగొచ్చు. మిగతా 12 లక్షల సంగతి? ఇక్కడే ఆయన టిటిడి ఏమైనా సహాయపడగలదా? అని ప్రశిస్తున్నారు. ఎలా?

స్వామి రంగనాధానంద చేసిన రిక్వెస్ట్ చూడటానికి చాలా చిన్నది. కానీ అమలు చేయటానికి నాకు చాలా క్లిష్టమైంది.....

రామకృష్ణమఠానికి బేగంపేట పాత ఎయిర్‌పోర్టు దగ్గర సువిశాలమైన ఏడెకరాల స్థలం వుంది. అదెవరో ఒక వితరణశీలి మఠంకోసం విరాళంగా ఇచ్చిన భూమి. అయితే అది ఎప్పడ్నుంచో డిఫెన్సు వాళ్ల ఆక్రమణలో వుంది. ఆ భూమిని అమ్మేస్తే 50-60 లక్షల దాకా వస్తుంది. అయితే దాన్ని, డబ్బుకోసం ఎవరో రియల్ ఎస్టేట్ వాడికో, ఏదన్నా ట్రస్టు పేరుమీద దుర్వినియోగం చేసే వాళ్లకో అమ్మటం ఆయనకిష్టంలేదు. ఏదైనా ధార్మిక సంస్థ, లేదా ఆధ్యాత్మిక సంస్థకి బదిలీ చేయాలన్నది ఆయన కోరిక. అందుకే ఆయన ఆ భూమికి మార్కెట్ విలువ కావాలని కోరుకోవటంలేదు. తనక్కావలసిన 12 లక్షలు ఇస్తే చాలంటున్నారు..

ఇదంతా జరుగుతుండగా మా హైద్రాబాద్ లైజాన్ ఆఫీసర్, సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ ప్రొఫెసర్ శ్రీరామ్మూర్తి నన్ను ప్రక్కకి తీసుకెళ్లి, "సార్, ఈ స్థలాన్ని మన సంస్కృత కళాశాల కోసం తీసుకుంటే పోలేదా?" అంటూ సలహా ఇచ్చాడు. (అప్పటి వరకూ మా సంస్కృత కళాశాల సిటీలోని ఒక హనుమాన్ మందిరం ఆవరణలో నడుస్తోంది.)

కాని నా సమస్య ఇంకోరకంగా వుంది. అప్పటికి ఎక్కడెక్కడో వూళ్లల్లో శ్రీనివాసుడి భక్తులిచ్చిన ఆస్తుల్ని నిర్వహించటమే టిటిడికి జటిలమైపోయింది. పైగా టిటిడికి ఇలా ఆస్తులుకొనే రివాజు లేదు. ఎక్కడన్నా అవసరమయితే ప్రభుత్వమే భూమి కేటాయిస్తోంది. మొత్తం మీద శ్రీరామ్మూర్తి సూచనపట్ల నేను విముఖత వ్యక్తం చేశాను. అయినప్పటికీ స్వామి రంగనాధానంద వత్తిడితో నేను ఆ భూములు చూడటానికి బయల్దేరక తప్పలేదు.

తీరా వెళ్లాక చూద్దునుగదా, అదొక అమూల్యమైన భూమి. ఎయిర్ పోర్టుని ఆనుకుని వుంది. నగరం అప్పటికే అటువైపు విస్తరిస్తోంది. మరో కొన్ని సంవత్సరాలలో ఆ భూమి విలువ కోట్లలోకి చేరుతుంది. ఆ ఏడెకరాల స్థలాన్ని, మధ్యలోవున్న బిల్డింగ్‌తో సహా డిఫెన్సువాళ్లు, తమ అధీనంలో పెట్టుకున్నారు. వాళ్లు ఎప్పుడు ఖాళీ చేస్తారో తెలీదు. ఎలా చేయించాలో కూడా స్వామీ రంగనాధానందకి తెలీదు.

"ప్రసాద్‌గారూ! ఈ స్థలం విలువ ఎంత అన్నది ప్రక్కన పెట్టండి. నాక్కావలసింది 12 లక్షలరూపాయలు. ఈ స్థలాన్ని నేను టిటిడికి బదిలీ చేస్తాను. ఈ లావాదేవీ అంతా రెండు ధార్మిక సంస్థల మధ్య జరిగేది కాబట్టి ఇందులో ఎవరూ ఏమీ అనుమానించే అవకాశం, అవసరం వుండదు.. ఆ 12 లక్షలు మీరిచ్చేస్తే, నా ప్రాజెక్టు పూర్తయిపోతుంది." ఇదీ ఆయన అభ్యర్ధన.

నేను సందిగ్ధంలో పడిపోయాను. స్థలం బాగుంది. రాబోయే రోజుల్లో విలువ పెరుగుతుంది. కానీ రామకృష్ణమఠానికి డబ్బు కావాలి కాబట్టి నేనీ స్థలం సేకరించాను అంటే టిటిడి ట్రస్టుబోర్డు (అప్పటికి పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీ స్థానంలో పూర్తి స్థాయి ట్రస్టుబోర్డు ఏర్పాటయింది.) ఒప్పుకుంటుందా? పోనీ సంస్కృత కళాశాల పేరు చెప్పినా, ఇప్పుడేదో హనుమాన్ మందిరం ఆవరణలోఉచితంగా లభించిన స్థలంలో నడుస్తున్న కాలేజి కోసం 12 లక్షలతో ఏడెకరాలు ఎందుకు కొనాలి? - అని బోర్డు సభ్యులు ప్రశ్నిస్తే? ఒకవేళ బోర్డుని ఒప్పించి కొన్నా, రేపు డిఫెన్స్ వాళ్లు ఖాళీచేయకపోతే? మళ్లీ ఎప్పుడన్నా ఈ స్థలాన్ని ఎవరికన్నా అమ్మాలంటే అమ్మగలమా?.. ఇలాంటి సవాలక్ష సందేహాలు నా మెదడు తొలిచేస్తున్నాయి.

స్వామీజీ నా మనసు చదివేసినట్లున్నారు - "చూడండి ప్రసాద్, దీన్ని ఒక వ్యాపార లావాదేవీగా చూడకండి. ఒక మహత్తరమైన కార్యానికి సహాయపడే అవకాశంగా చూడండి. డిఫెన్స్‌వారిని ఖాళీ చేయించడం నాకు కష్టం కావచ్చుగానీ మీక్కాదు గదా!..." మరోసారి ఆయన అభ్యర్ధించారు. నేనేమీ తేల్చుకోలేకపోయాను. చూస్తూచూస్తూ అనవసరమైన వివాదంలోకి కూరుకుపోతున్నానేమో అనిపించింది. ఎందుకయినామంచిదని, "సర్, నాకో నాలుగురోజులు టైమివ్వండి. ఆలోచించి చెబుతాను" అంటూ శెలవు తీసుకున్నాను. నిజానికి నాకైతే, రామకృష్ణమఠానికి సహాయపడాలనే వుంది. అదొక మంచి కార్యం. గొప్పకార్యం. అలాంటి ప్రాజెక్టుకి సహాయపడగలగటం ఒక అదృష్టం. పైగా 12 లక్షలు బ్యాంకులో పెడితే వచ్చే వడ్డీకన్నా, రాబోయే రోజుల్లో స్థలం విలువ అపారంగా పెరుగుతుంది. అలాగని, అందుకోసం నేనిప్పుడు భూములు కొందామంటే కొత్తగావచ్చిన ట్రస్టుబోర్డు సభ్యులు అంగీకరించకపోవచ్చు. ఖచ్చితంగా అంగీకరించరు. (కొత్తగా ఏర్పాటైన బోర్డుగదా!) ఎలా!

బోర్డు సమావేశం జరిగింది. ఈ విషయం ఎలా ఎత్తాలా అని ఆలోచిస్తున్నాను. అంతలో స్ఫురించింది - ఆ శ్రీనివాసుడి మీదే భారం వేస్తే పోలేదా? వేశాను. "నీదే భారం స్వామీ" అనుకుంటూ, ఈ అంశం లేవనెత్తబోయాను. అంతలో ఒక మెంబరు గళం విప్పాడు - "హైద్రాబాద్ మన రాష్ట్రానికే రాజధాని కదా! అక్కడ మన కళ్యాణమంటపం లేకపోవటం ఏమీ బాగాలేదు. బెంగుళూరులో యింకా చాలా ఇతరచోట్ల టిటిడి కళ్యాణ మంటపాలు కట్టాం కదా. హైదరాబాద్‌లో వెంటనే కట్టడానికిమనం ప్రయారిటీ ఇవ్వాలి.."





ఓహ్! గ్రేట్ ఐడియా! నాకు పరిష్కారం దొరికిపోయింది. వెంటనే అందుకున్నాను- "అదే అదే నేనూ చెప్ప బోతున్నాను.." అంటూ ఎయిర్‌పోర్టు దగ్గర ఏడెకరాల భూమి ఎలా చవగ్గా 12 లక్షలకి టిటిడికి లభించే అవకాశంవుందో టకటకా చెప్పుకుంటూ పోయాను. వాళ్లు అడగబోయే అన్ని ప్రశ్నలకి సందేహాలకి కూడా నా నోటినుంచి వివరాలు వచ్చేశాయి. "అక్కడ ఒక అద్భుతమైన 4-5 కళ్యాణమంటపాల కాంప్లెక్స్‌ని కట్టవచ్చు. ఒక విశాలమైన ప్రేయర్ హాలునిర్మించవచ్చు. మన సంస్కృత కళాశాలకి బిల్డింగ్ ఏర్పాటు చేయొచ్చు... ఇక డిఫెన్స్‌వాళ్ళనంటారా, ఏ ప్రైమ్‌మినిష్టరో, ప్రెసిడెంటో తిరుపతి వచ్చినప్పుడు చెప్పి ఖాళీ చేయించుకోవచ్చు..." ఇంక చెప్పేదేముంది. నా ప్రతిపాదనని బోర్డు ఏకగ్రీవంగా ఆమోదించేసింది. (ఆ శక్తి నాదా?) నేను మఠానికి 12 లక్షల చెక్కు పంపించేశాను. ఆ స్థలం టిటిడికి బదిలీ చేస్తూ రామకృష్ణమఠం రాసిచ్చేసింది.

ఇది జరిగిన మరో 15 రోజుల్లో కేంద్ర రక్షణ శాఖామంత్రి బాబూ జగ్జీవన్‌రామ్ తిరుమల వచ్చారు. శ్రీవారి దర్శనం చేసుకున్నారు. దర్శనం అయిన వెంటనే, నేను శ్రీవారిని తల్చుకుని నా వినతి పత్రం ఆయన చేతుల్లో పెట్టాను.

ఏమిటా మాయ? పదిరోజుల్లో నాకు జవాబు వచ్చింది. ఏడాదిలోగా ఆ స్థలాన్ని ఖాళీచేయాలని డిఫెన్స్ మినిష్టర్ ఆదేశాలు జారీచేశారు. ఖాళీ చేయాల్సిన తుది గడువుకూడా ఆయనే నిర్ణయించారు. సరిగ్గా ఏడాది కాగానే ఒక సీనియర్ ఆఫీసర్ నా దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చి, "ఒక్క 15 రోజులు గడువివ్వండి సర్"అంటూ బ్రతిమాలాడు. అలా 15 రోజులతర్వాత వాళ్లు బేగంపేటకి (ఇప్పుడు హైద్రాబాద్ పబ్లిక్ స్కూలుకి ఎదురుగావున్న డిఫెన్స్ కాంప్లెక్స్ స్థలంలోకి) మారిపోయారు. ప్రొఫెసర్ శ్రీరామ్మూర్తి ఎగిరి గంతేశాడు - హనుమాన్ మందిరం వరండాలోంచి సంస్కృత కళాశాలని సొంత బిల్డింగ్‌లోకి మార్చేసినందుకు. ఆనక ఒకసారి శ్రీరామ్మూర్తి నన్ను కాలేజీకి తీసుకెళ్లి తన సహజ ధోరణిలో ప్రాసలూ, విశేషణాలూ వేసి నన్ను ఆకాశానికెత్తుతూ చెప్పిన మాటల సారాంశం "...



డిప్యూటీ ప్రైమ్ మినిష్టర్ - రక్షణశాఖామంత్రి
శ్రీ బాబూ జగ్జీవన్‌రామ్‌తో ప్రసాద్

సర్, మీ వల్ల కాకపోతే ఈ పని ఇంకెవ్వరివల్లా..."

అతని మాటలు మధ్యలోనే త్రుంచేసి, "ఇదంతా జరిగింది ఎవరివల్లనో తెలుసా?" అన్నాను. ప్రశ్నార్థకంగా చూశాడు. నాకు రంగనాథానంద జ్ఞాపకం వచ్చారు. నా కుడి చేతి చూపుడు వేలు పైకెత్తి ఆకాశం కేసి చూపించాను!!!

కాదా?



స్వామి రంగనాథానంద సారధ్యంలో హైదరాబాద్‌లో నిర్మించబడిన రామకృష్ణ మఠం

★ ★ ★



# 19

# ఎమ్మెస్ గళంలో పెరుమాళ్

"ఇలా జరగాలని నాలుగొందల సంవత్సరాల క్రితమే శ్రీనివాసుడు నిర్ణయించాడు. ఏమంటారు ప్రసాద్‌గారూ?" ఆత్మ ప్రశ్నించాడు.

ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ చేత 'క్వీన్ ఆఫ్ ది మ్యూజిక్'గా అభివర్ణించబడిన మధురగాయని ఎం. ఎస్ సుబ్బలక్ష్మి (ఎమ్మెస్), ఆమె భర్త శ్రీసదాశివం, నేనూ, మరో ఇద్దరు ముగ్గురు మాత్రమే మద్రాసులోని ఎమ్మెస్ ఇంట్లో కూర్చుని, సంతకాలు చేసుకుంటున్నాం. ఆ సమయంలో ఆత్మ అడుగుతున్నాడు.

నేను యథాలాపంగా తలెత్తి, "ఏమంటున్నారు" అని అడిగాను. ఆత్మ తన స్టేట్‌మెంట్‌ని మరోసారి వినిపించాడు. నేను నవ్వాను. "గుడ్ జోక్" అంటూ కామెంట్ కూడా చేసి, నా పనిలో నిమగ్నమయ్యాను.

ఆత్మ వదల్లేదు. "అలా తీసి పారేయకండి సర్, ఒక్కసారి నా మాట పూర్తిగా ఆలకించండి..." అంటూ నాలుగు వందల సంవత్సరాలు వెనక్కి వెళ్లాడు. అది విని, నాతో సహా అక్కడ వున్న వాళ్లందరం నవ్వుల్లో మునిగిపోయాం.

★ ★ ★

మధురగాయని, మహాగాయని, అపర సంగీత సరస్వతి వంటి అనేక విశేషణాలతో ప్రస్తుతించదగిన అపురూప గాయని శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి. ఇటీవలి కాలంలో 'భారతరత్న' అవార్డుతో కేంద్ర ప్రభుత్వ సత్కారం అందుకున్న ఏకైక గాయనీమణి శ్రీమతి సుబ్బులక్ష్మి. దేశంలోకెల్లా అత్యున్నతమైన అవార్డు ఆమెను వరించడానికి కారణం ఒక్కటే - గానం ఆమె ప్రాణం. అనునిత్యం పరమేశ్వరుణ్ణి తన గానామృతంతో అర్చించే మహాభక్తురాలు శ్రీమతి సుబ్బులక్ష్మి. ఎందుకు ఆమె గాత్రంలో - పశుపక్ష్యాదుల్ని సయితం పరవశింపజేయగల మాధుర్యం దాగుంది?-అని ఆమె గురించి తెలియనివాళ్లెవరికైనా సందేహం రావచ్చు.

అక్బర్ చక్రవర్తి ఆస్థానంలో తాన్‌సేన్ అనే మహాగాయకుడు వుండేవాడు. అతనంతటి గొప్ప గాయకుడు ప్రపంచంలోనే లేడని అక్బర్ విశ్వాసం. ఒకసారి అక్బర్ వ్యాహ్యాళికి వెళ్లి వస్తుండగా నగరం బయట కొత్త సంగీత గళం వినబడింది. శ్రద్ధగా విని అక్బర్ పరవశించిపోయాడు. ఆ ఆనందం పట్టలేక మర్నాడు అక్బర్ తన సభలో తాన్‌సేన్‌తో అన్నాడు - "నిన్న సాయంత్రం నేనొక అద్భుతమైన గాత్రాన్ని విన్నాను తాన్‌సేన్. నువ్వు అసూయచెందనంటే చెబుతాను. అతని గాత్రం మాత్రమే ప్రపంచంలోకెల్లా గొప్పది....."

తాన్‌సేన్ చిరునవ్వు నవ్వి, "మహాప్రభూ, అలాంటి గాయకుణ్ణి నేను చూడలేదు. మీరు చెప్పేది నమ్మశక్యంగా లేదు. ఆ గాయకుణ్ణి నాక్కూడా చూపించండి" అన్నాడు. ఆ సాయంత్రం అక్బర్, నగరం బయట ఒక గుట్ట మీద కూర్చొని పిచ్చివాడిలా పాటపాడుతున్న ఒక వ్యక్తిని తాన్‌సేన్‌కి చూపించాడు. ఆ గానం వింటూనే తాన్‌సేన్ సయితం ఆ సంగీత శ్రవణానందంలో మునిగిపోయాడు. కొంతసేపటికి అక్బర్ అడిగాడు - "ఇప్పుడేమంటావ్ తాన్‌సేన్?"

తాన్‌సేన్ చిరునవ్వు నవ్వి అన్నాడు "నిజమే మహాప్రభూ, అతని గాత్రం ముందు నా గాత్రం - సూర్యుడి ముందు దివిటీలాంటిది. ఎందుకంటే న్నా గాత్రం ఢిల్లీశ్వరుణ్ణి కీర్తించటానికే పరిమితమైంది. కాని, అతడి గాత్రం ఆ జగదీశ్వరుణ్ణి కీర్తించటానికి అంకితమైంది కదా... !"

అదిగో, అలాంటి ధన్యజీవి ఎమ్మెస్. ఆమె గాత్రం నుండి జాలువారే భక్తి సంగీతప్రవాహంలో ఓలలాడటం కోసం సంగీతాభిమానులు విరగబడి వెళ్లేవాళ్లు. సామాన్యులనుంచి అనేకమంది మఠాధిపతుల వరకు అందరి హృదయాల్లో సుబ్బులక్ష్మికి గల పవిత్రస్థానం విశిష్టమైంది. ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ సయితం ఎమ్మెస్ గాత్రజలధిలో సమ్మోహన సంగీత తరంగాలమీద తన్మయత్వంతో తేలిపోతున్నప్పుడు, ఇలా అన్నారు : "Who am I, mere Prime Minister of India, before you the queen of music?"





(ప్రధానమంత్రినయితే మాత్రం, నీవంటి మహోన్నత సంగీత సామ్రాజ్ఞిముందు నేనెంత?) అందుకే ఆమెకి 'భారతరత్న' పురస్కారం లభించింది.

ఎమ్మెస్ గళంలోని మాధుర్యాన్ని గుర్తించి, ప్రోత్సహించి, ఆమెకు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు లభించేలా చేసిన ఘనత ఆమె భర్త సదాశివంకి దక్కుతుంది. గాంధేయవాది, రాజాజీ అనుయాయుడు అయిన సదాశివం, అనేక ధార్మిక సంస్థలకు ఆర్థిక సహాయం అందించటానికి సుబ్బులక్ష్మి గాత్రాన్ని వినియోగింపజేశారు. ఎమ్మెస్ కుమార్తె రాధకూడా మంచి గాయకురాలు. 1960-1980 కాలంలో శాస్త్రీయ భక్తి సంగీత సామ్రాజ్యానికి మకుటంలేని మహారాణి ఎమ్మెస్. ఆమె కోరుకుని వుంటే సంగీత సభలద్వారా కోట్లు సంపాదించి వుండవచ్చు. కాని, తమ కోసం సంపాదించి మూటకట్టుకోవాలన్న తాపత్రయం ఆమెకీ లేదు. సదాశివానికీ లేదు. ధార్మిక సంస్థలకి వితరణకోసమే తన భక్తి సంగీత సౌరభాల్ని ఆమె దేశమంతా వ్యాపింపజేసింది.

1979 ఆరంభంలో అనుకోకుండా ఒకరోజు నాకు రెండు అర్జంటు మెసేజెస్ వచ్చాయి. ఒకటి కంచి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి నుంచి, మరోటి పుట్టపర్తి సత్యసాయిబాబా దగ్గర్నుంచి. ఆ రెండింటి సారాంశం ఒక్కటే - "శ్రీమతి సుబ్బులక్ష్మిని ఆదుకోవటానికి టిటిడి ఏదో ఒకటి చేయాలి".

ఇదేమిటి? మహాగాయని ఎమ్మెస్ కోసం టిటిడి ఏదో చేయాలంటున్నారేమిటి?-నాకు అర్థంకాలేదు. నిజానికి అప్పటికే ఆమె టిటిడి ఆస్థానవిద్వాన్‌గా వున్నారు. ఇంకా ఏం చేయగలం?.. ఇలా ఆలోచనల్లో వుండగా ఆరోజు పత్రికలలో వచ్చిన వార్త మీద నా దృష్టిపడింది. అది ఎమ్మెస్ కుటుంబం గురించే.

ఆర్థిక ఇబ్బందులవల్ల ఒక్కసారిగా సదాశివం కుటుంబం, మద్రాస్ (చెన్నై)లో 'కల్కి' ఎస్టేట్‌లోని తమ బంగళా అమ్మేసి, వళ్లువార్‌కొట్టం దగ్గర ఓ చిన్న అద్దె ఇంట్లోకి వెళ్లిపోవాల్సివచ్చింది. సదాశివం నడుపుతున్న 'కల్కి' పత్రిక నష్టాల్లో పడటంతో అప్పటికే దాన్ని మూసేయటం జరిగింది. రకరకాల బకాయిల్ని వదిలించుకునే ప్రయత్నంలో ఆస్తులన్నీ అమ్మేసుకోవాల్సి వచ్చింది.... నా మనస్సు ఆవేదనతో తల్లడిల్లిపోయింది.

నిజానికి ఆమె కావాలనుకుంటే, ఆ కుటుంబానికి ధన సహాయం చేసే సంగీతాభిమానులు కోకొల్లలు. కాని అలాంటి సహాయం ఆశించే, స్వీకరించే మనస్తత్వం సదాశివంకీలేదు. ఎమ్మెస్‌కీ లేదు. వాళ్లకి వాళ్ల ఆత్మగౌరవం చాలా ముఖ్యం. అందుకే వాళ్లు ఎవర్నీ అడగరు. ఎవరన్నా దానం చేసినా తీసుకోలేరు. మరి ఎలా?.... ఇంతకాలం కోట్లాది ప్రజల్ని భక్తి సంగీతంతో పరవశింపజేసిన సంగీత సామ్రాజ్ఞికి ఈరోజు నిలవనీడలేని పరిస్థితి ఏర్పడబోతోందా?...

ఈ ఆలోచన నన్ను నిలవనీయలేదు. ఏదో చేయాలి, ఏదో చేయాలి? ఎలా?ఎలా?

ఇలా మధనపడుతూనే, ఆ సాయంత్రం కొండకి వెళ్లినప్పుడు, శ్రీనివాసుడ్ని ప్రశ్నించాను - "నా పెరుమాళ్లు అనుకుంటూ నిన్ను అనునిత్యం తన గాత్రంతో అర్చించిన ఆ విశ్వగాయనికి సహాయపడలేవా స్వామి?"

.... ఇలా ప్రార్థన చేసి, గుడి బయటకురాగానే ఎదురుగా మెట్లమీద ఒక భక్త బృందం మధ్యలో కూర్చుని, ఒక వృద్ధురాలు గోవిందుడి కీర్తనలుగానం చేస్తోంది. బృందంలో అంతా తన్మయత్వంతో తాళం వేస్తున్నారు.... అంతే! నాకు తెలిసిపోయింది - నేను "ఏం చేయాలో, ఎలా చేయాలో"!

ఆ ఆనందంతో ఆ రాత్రి నిద్రపట్టలేదు. తెల్లవారుతూనే కంచికి ప్రయాణమయ్యాను. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామీజీని కలుస్తూనే నేను అనుకున్నదంతా గడా గడా చెప్పేశాను.... ".... మీ సందేశం అందింది. నేను ఆలోచించాను. ప్రస్తుతం మేం అన్నమాచార్య ప్రాజెక్టుద్వారా అన్నమయ్య కీర్తనలని ప్రచారంలోకి తీసుకువచ్చే ప్రయత్నంలో వున్నాం... ఇప్పుడు నాకనిపిస్తోంది - ఎమ్మెస్ గారి చేత అన్నమాచార్య కీర్తనల్ని పాడించి, లాంగ్ ప్లే రికార్డుల రూపంలో దేశమంతా విడుదల చేస్తే బాగుంటుందేమోనని. ఆమె ప్రముఖ గాయని కనుక ఆ గాత్ర మాధుర్యం కోసం (ఆ కీర్తనలు తెలుగులో వున్నప్పటికీ) ఆ రికార్డుల్ని అందరూ వింటారు కదా! అలా - గోవిందుడ్ని కీర్తించిన అన్నమయ్య కీర్తనలకి ప్రచారమూ వస్తుంది. ఆ ఎల్ పి రికార్డుల మీద వచ్చే ఆదాయంలో ఎమ్మెస్‌కి వాటా కూడా వస్తుంది..."

స్వామీజీ నా ప్రతిపాదనకు హర్షం వ్యక్తం చేశారు. "కానీ ప్రసాద్, వాళ్ళు లౌకికం తెలిసున్న వాళ్ళుకారు. రేపు గురించి ఆలోచించే వాళ్ళూకారు. నువ్వు ఎలా చేసినా, మీకు (టిటిడి) ఇబ్బందిలేకుండా, అదే సమయంలో ఎమ్మెస్ కుటుంబానికి వాళ్ళ జీవితకాలంపాటు వెతుక్కోకుండా గడిచిపోయేలా చూడగలిగితే అర్థవంతంగా వుంటుంది..." అంటూ సలహా ఇచ్చారు.

నేను తిరిగి వస్తూనే అప్పటి పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీలో ఈ విషయం చర్చించాను. ఎమ్మెస్ ద్వారా అన్నమయ్య కీర్తనల్ని దేశవ్యాప్తంగా ప్రచారంలోకి తీసుకురావచ్చన్న ఐడియా కమిటీకి నచ్చింది. కమిటీ ఛైర్మన్ శ్రీరమేశన్, సభ్యులు శ్రీచంద్రమౌళిరెడ్డి, "గో ఎహేడ్" అంటూ నన్ను ప్రోత్సహించారు. రమేశన్ గారితో కలిసి నేను మద్రాసు వెళ్ళాను. ఎమ్మెస్ కుటుంబం వళ్ళువార్‌కొట్టం దగ్గర ఓ చిన్న ఇంట్లో అద్దెకుంటున్నారు. వెళ్తూనే సదాశివంగారికి శ్రీనివాసుడి ఫొటో బహూకరించాం.





నేనీ ప్రాజెక్టు గురించి వివరించగానే సదాశివం ముందు చాలా ఉత్సాహపడిపోయారు. కానీ, అంతలోనే కొంచెం వెనక్కి తగ్గారు. "అన్నమయ్య కీర్తనలన్నీ తెలుగులో వుంటాయి. మాకు తమిళం తప్ప తెలుగు రాదు. చిన్నప్పట్నుంచీ సాధన చేసిన త్యాగరాజ కీర్తనలు పాడటం తేలిక. కాని ఇప్పుడు అరవయ్యేళ్ళవయసులో ఆమె ఇన్ని తెలుగు కీర్తనల్ని సాధన చేయాలంటే, ముఖ్యంగా ఆ తెలుగు ఉచ్చారణలో తమిళయాస చొరకుండా పాడాలంటే, ఆమెని బాధ పెట్టడమే అవుతుంది..." ఇదీ ఆయన సందేహం.

ఆయన చెప్పిందానికి కారణం వుంది. కీర్తనలోని భావాన్ని, స్ఫూర్తిని అర్థంచేసుకోకుండా గానం చేయటం ఎమ్మెస్ ఇష్టపడదు. ఆ రకంగా ఒక్కొక్క అన్నమయ్య కీర్తనని అర్థం చేసుకుని, తెలుగు శబ్దం చెడకుండా సాధనచేయాలంటే కనీసం ఒక వారంరోజులు పడుతుంది. అయిదు లాంగ్ ప్లే రికార్డులు చేయాలనుకుంటున్నాం. అంటే 50 కీర్తనలు. కనీసం 50 వారాలు - ఇంచు మించు ఒక ఏడాదిపాటు - సాధన చేయాలి.... సదాశివం పెదిమ విరిచేశారు. "ఇది జరిగేది కాదు" అన్న భావం సదాశివం మాటల్లో ధ్వనించింది....

నాకు నీరసం వచ్చింది. ఇంత కష్టపడి ఈ కుటుంబానికి ఏదో ఉపయోగపడదామని వస్తే, ఈయనేమిటి ఇలా అంటున్నాడు? అలాగని, "ఏదో మీకు సాయం చేయాలనే ఈ కార్యక్రమం చేపట్టాం" అని బాహాటంగా చెబుదామా అంటే, మొదటికే మోసం రావచ్చు. "ఎవరి దయాదాక్షిణ్యాలని ఆశించే మనుషులుకారు వాళ్ళు" అని కంచి స్వామీజీ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. మరెలా ఈయన్ని ఒప్పించగలను? ఎలా? ఎలా?

మళ్ళీ శ్రీనివాసుడ్ని తలుచుకున్నాను. "స్వామీ! ఈయన్ని నువ్వే ఒప్పించగలవు?". అంతలో ఎమ్మెస్ అక్కడికొచ్చారు. అక్కడ నేను బహూకరించిన శ్రీనివాసుడి చిత్రపటాన్ని చూస్తూనే ఆవిడ ప్రగాఢభక్తితో ఆ స్వామికి నమస్కరించి, "పెరుమాళ్, యనక్కాగ నీంగళె వందుతేళా?" (శ్రీనివాసా, నాకోసం తమరే వచ్చేశారా?) అనుకొని పరవశించిపోతూ, కొద్ది క్షణాలపాటు ధ్యానంలోకి వెళ్ళిపోయారు.

స్వామిని చూడగానే ఏమా తన్మయత్వం? నిరంతర భక్తి సంగీత సాధనా తేజస్సుతో వెలిగిపోతున్న ఆ ముఖారవిందంలో "నన్ను కడతేర్చే స్వామివి నీవే సుమా" అన్న అచంచలమైన, పరిపూర్ణ విశ్వాసం తొంగిచూస్తోంది. ఆ సన్నివేశం చూడగానే, అప్పటికి కొన్ని మాసాల క్రితం నాకు కలిగిన ఒక అనుభవం జ్ఞప్తికొచ్చింది. అప్పుడూ ఇలాగే జరిగింది....

* * *

**1978** లో టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా చేరిన కొన్ని మాసాలకి టిటిడి నిర్వహిస్తున్న కుష్ఠు నివారణా కేంద్రాన్ని సందర్శించాను. ఆ సెంటర్‌కి ఇన్‌ఛార్జి అయిన డాక్టర్ భాస్కరరావు అక్కడి కుష్ఠురోగుల్ని పరిచయం చేస్తున్నారు. వాళ్ళలో ఒకడైన వీరాచారి గురించి చెబుతున్నప్పుడు ఆగిపోయాను.

అతని గురించి తెలుసుకోవాలన్న కుతూహలం పెరిగింది. వీరాచారికి నిండా పాతికేళ్ళు లేవు. బళ్ళారి దగ్గర బోనమానహళ్ళి గ్రామానికి చెందిన వీరాచారి కుటుంబం - చెక్కల మీద బొమ్మలు చెక్కటంలో సిద్ధహస్తులు. అది వారి కులవృత్తి. వీరాచారి చిన్నతనం నుంచే అద్భుతమైన కళాఖండాలు సృష్టించేవాడు. టీనేజ్‌లోనే మంచి చేతివృత్తి నిపుణుడిగా గుర్తింపు పొందాడు.

అకస్మాత్తుగా ఒక రోజు అతనికి తన ఒంటిమీద అక్కడక్కడా తెల్లటిమచ్చలు కనుపించాయి. అవి క్రమంగా శరీరమంతా విస్తరిస్తూన్నాయి. ముఖ్యంగా చేతి వ్రేళ్ల మీద, ముక్కుమీద మచ్చలు పెరుగుతున్నాయి. ఇదేదో చర్మవ్యాధి అనుకొని కొన్నాళ్ళ తరువాత పట్నంలో డాక్టర్లని సంప్రదించాడు. వాళ్ళు నిర్ధారించారు - అది కుష్ఠువ్యాధి! వీరాచారికి ఏడుపొచ్చింది. 'కుష్ఠురోగి' అని ముద్రపడగానే గ్రామంలో అందరూ అతనికి దూరంగా మసులుకోవటం మొదలెట్టారు. సాంఘిక బహిష్కరణ! ఎన్నో రాత్రులు, పగళ్ళు గుండెలవిసేలా రోదించాడు. దేవుడ్ని ప్రార్థించాడు. వీరాచారిలోని కళా నైపుణ్యాన్ని గుర్తించిన డాక్టర్ జె.ఎస్.నారాయణ అనే డాక్టరు చొరవతీసుకుని, వీరాచారిని తిరుపతిలోని టిటిడి కుష్ఠు నివారణ కేంద్రానికి పంపించాడు.

ఇక్కడ నాలుగేళ్ళ ట్రీట్‌మెంట్ తరువాత అతనిలోని కుష్ఠువ్యాధి శరీరంలోని ఇతర భాగాలకు విస్తరించకుండా నిరోధించగలిగారు. కానీ అప్పటికే కళాఖండాలు చెక్కే ఆ చేతుల వ్రేళ్లకొనల్ని కుష్ఠు వ్యాధి హరించేసింది. పైగా వ్యాధి పూర్తిగా నశించలేదు.

సౌమ్యుడు, మితభాషి అయిన వీరాచారి నన్ను చూస్తూనే నమస్కారం పెట్టి, ఓ ప్రక్కగా నుంచున్నాడు. అతని కథంతా విన్నాక, మనసు విలవిల్లాడింది. ఒక మంచి హస్త కళాకారుడు కేవలం కుష్ఠువ్యాధి కారణంగా మరుగున పడిపోతున్నాడే అన్న బాధ వెంటాడింది. కానీ మా దగ్గరున్న వైద్యుల శక్తి అంతకు మించి ఏమీ చేయలేదు. వాళ్ళ శక్తి మేరకు వాళ్ళు చేశారు?

వీరాచారి చేతులు చూస్తూనే జాలేసింది. "ఏం వీరాచారి, వేళ్ళు దెబ్బతిన్నాయి గదా, బొమ్మలు చెక్కటం మానేశావా?" అని ఉత్సుకత ఆపుకోలేక అడిగాను. వీరాచారి ఆనందపడ్డాడు - నేనీ మాత్రం అతని గురించి అడిగినందుకు. "ఒక్క నిమిషం సార్" అంటూ తన గదిలోకి





పరుగెత్తి, రెండు నిమిషాల్లో తిరిగొచ్చాడు. కుష్ఠువ్యాధి వచ్చాక అతని చేతుల్లో రూపుదిద్దుకున్న అందమైన, జీవం ఉట్టిపడే నాలుగైదు చెక్క శిల్పాలు. అందులో ఒకటి శ్రీనివాసుడిది.

ఆహా! ఏమిటా పనితనం? భగవంతుడు ఇతనికి ఎక్కడిచ్చాడీ నైపుణ్యం! ఆ చెక్క శిల్పం రూపంలోని స్వామిని చూస్తూనే నన్ను నేను మర్చిపోయాను. నా ఆసక్తిని గమనించిన వీరాచారి మంద్ర స్వరంతో "ఇంతదూరం వచ్చాను. ఆ స్వామి (గోవిందుడే) మేలు చేస్తే ఈ వ్రేళ్ళని ఈ వ్యాధి ఇంకా తినెయ్యకుండా వుంటే, ఇంకా చాలా శిల్పాలు చెక్కాలని ఆశ...."

ఓ ప్రక్క కుష్ఠువ్యాధికి వ్రేళ్ళు బలైపోతున్నా, కళాత్మకమైన శిల్పాల్ని చెక్కనుంచి మలుస్తున్నాడు. ఆ శ్రీనివాసుడే గట్టెక్కిస్తాడని నమ్ముతున్నాడు. శ్రీనివాసుడిపట్ల ఆ భక్తి పారవశ్యం, ఆ విశ్వాసం నన్ను కదిలించివేశాయి. కొద్ది క్షణాల ఆనందం!... ఇలాంటి గొప్ప కళాకారుడ్ని సమాజం వదులుకోకూడదనుకున్నాను - వెంటనే ఎవరో వెంటబడి తరుముతున్నంత వేగంగా, టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కుండే హోదా, పరపతి ఉపయోగించి, వెల్లూరులో సి.ఎం.సి. హాస్పటల్‌కి వస్తూండే ఒక జర్మన్ స్పెషలిస్టు చేత వీరాచారికి శాశ్వతంగా కుష్ఠువ్యాధి నుంచి విముక్తి కలిగేలా కొన్నివారాల ట్రీట్‌మెంట్ ఇప్పించాను.

వీరాచారి ఆనందంతో పొంగిపోయాడు. నేను బదిలీ అయివెళ్ళే రోజున ఒక ఘనపుటడుగు పరిమాణం వుండే ఏక చెక్కనుంచి సజీవంగా వున్నట్లనిపించేలా కృష్ణార్జునులతో ఒక గీతోపదేశం శిల్పాన్ని చెక్కి నాకు బహూకరించాడు. "ఎందుకిదంతా వీరాచారి?" అని అడిగాను. "ఆ స్వామి మీ ద్వారా నా కళని మళ్ళీ జీవింపచేశాడు. ఉద్యోగమిచ్చి, శాశ్వతంగా ఇక్కడే (టిటిడి కృత్రిమ అవయవాల కేంద్రంలో) వుంటూ, ఆయన్ని సేవించుకునే భాగ్యం కల్పించాడు కదా సార్..." (అవునా?)

* * *

అదిగో, ఆ రోజు ఆ కళాకారుడు వీరాచారిలో శ్రీనివాసుడి పట్ల కలిగిన భక్తి ఉద్వేగం ఇప్పుడు భక్తి పారవశ్యంలో ఎమ్మెస్‌ని చూడగానే నా మనసులో మెదిలింది...

సరి, ఇప్పుడు వీళ్ళని నా ప్రాజెక్టుకి ఒప్పించటం ఎలా? మరోసారి ఆ స్వామినే తలుచుకున్నాను. మళ్ళీ ఒప్పించే ప్రయత్నం చేశాను - మా అన్నమాచార్య ప్రాజెక్టు ఆఫీసర్ కామిశెట్టి శ్రీనివాసులు శెట్టి (తెలుగు ప్రొఫెసర్)ని, భాష, భావం, తెలుగునుడికారం ఆమెకు నేర్పడానికి నియమిస్తానని శ్రీ సదాశివంకు హామీ యిచ్చాను. అదిగో, అప్పుడు ఎమ్మెస్ మా

మాటలు వింటూనే తమిళంలో అన్నారు - "ఆ పెరుమాళ్ కోసం ఎంత కష్టమైనా సాధన చేస్తాను. ఒప్పుకోండీ... !" అద్భుతం! ఎక్కడ్నుంచి వచ్చాడు పెరుమాళ్ ఆమె మనసులోకి?

చివరికి ఆమె కొత్తగా సాధన చేయాల్సిన అన్నమయ్య కీర్తనల్ని మూడు ఎల్.పి రికార్డులకి పరిమితం చేస్తూ, మిగతా రెండు ఎల్.పి రికార్డులమీద గణేశపంచరత్నం, మధురాష్టకం, గీతగోవిందం, నామరామాయణం, హనుమాన్ చాలీసా, లక్ష్మీ అష్టోత్రం, శ్రీ వేంకటేశ్వర కరావలంబ స్తోత్రం, గోవిందాష్టకం, కనకధారాస్తవం, దుర్గాపంచరత్నం, రంగనాధగద్యం, ద్వాదశస్తోత్రం, శిష్టాష్టకం రికార్డు చేయించాలని నిర్ణయించాం. అలా ఆదిశంకర, రామానుజ, మధ్వాచార్యులతో పాటు ఇతర ఆచార్యుల విరచిత స్తోత్రాలన్నీ వచ్చేలా చూశాం.

అంతా బాగుంది కానీ, చివరికి వారికి వచ్చే ఆదాయం గురించి చర్చించే విషయంలో ఎమ్మెస్ ఆసక్తి చూపించలేదు. "పెరుమాళ్ కోసం గానం చేయటమేమిటి - ఆదాయం గురించి చర్చేమిటి?" అంటూ ఆమె తప్పుకున్నారు. సదాశివం కూడా చాలా ఇబ్బంది పడ్డారు ఆ విషయం మాట్లాడటానికి, కాని మాట్లాడితీరాలి. కంచి పీఠాధిపతులు చెప్పిందే నా మనసులో మెదుల్తోంది - "మేము ఎవరికి చెప్పినా, వారి జీవితాంతం యిబ్బంది లేకుండా సహాయం చేస్తారు. కాని దానికి ఎమ్మెస్, సదాశివం ఒప్పుకోరు. అందుకే వాళ్ళకి సహాయపడటంకోసం ఈ ప్రాజెక్టు చేపట్టామని మీరు చెబితే వాళ్ళిష్టపడరు. ఒకరి దయా దాక్షిణ్యాల్ని ఆశించే వాళ్ళు కారు. వాళ్ళని ఆ శ్రీనివాసుడే ఆదుకోవాలి..."

మొత్తం మీద ఒక ఒప్పందం కుదిరింది. రికార్డింగ్ ఖర్చులన్నీ హెచ్. ఎం. వి కంపెనీ భరిస్తుంది. ఏడు లక్షల రూపాయల్ని ఎమ్మెస్ పేరుమీద బ్యాంకులో టిటిడి డిపాజిట్ చేస్తుంది. దాని మీద నెలనెలా వచ్చే వడ్డీ ఎమ్మెస్‌కి (ఆమె జీవితాంతం) చెందుతుంది. ఆమె తదనంతరం అది టిటిడికి చెందుతుంది. అయితే ఎమ్మెస్ సలహామేరకు కొంచెం మార్పు చేశాం. ఆ ప్రకారం ఎమ్మెస్ పేరుమీద నాలుగు లక్షలు, సదాశివం పేరుమీద రెండు లక్షలు, ఎమ్మెస్‌తో కలిసి ఈ ప్రాజెక్టులో పాల్గొంటున్న ఆమె కుమార్తె రాధ పేరు మీద ఒక లక్ష - టిటిడి జాయింట్ ఫిక్సెడ్ డిపాజిట్‌లుగా బ్యాంకులో టిటిడి వేసేటట్లు అంగీకారం కుదిరింది. ఆయా డిపాజిట్‌ల మీద వచ్చే నెల వారీ వడ్డీలు వాళ్ళ జీవితకాలం వాళ్ళకు అందుతాయి.

★ ★ ★

ఆ అగ్రిమెంటు కాగితాల మీద సంతకాలు చేస్తున్నప్పుడు, సదాశివంగారి కొడుకు, ఎమ్మెస్‌కి సెక్రటరీ అయిన ఆత్మనాధన్ నవ్వాడు.







శ్రీమతి ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మికి ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య సన్మానం

"మన బాగోగులు ఇలా వుంటాయని పెరుమాళ్ కి నాలుగొందల సంవత్సరాల క్రితమే తెలిసినట్లుంది - అన్నమాచార్య చేత వేలకొద్ది కీర్తనలు రాయించి పెట్టాడు...." ఆత్మనాధన్ వ్యాఖ్యకి అందరం నవ్వుకున్నాం. ఎమ్మెస్ మాత్రం "పెరుమాళ్"ని తల్చుకుని అలౌకికమైన ఉద్వేగానికి లోనయింది. ఆమె కళ్ళవెంట ఆనందాశ్రువులు రాలటాన్ని నేను గమనించాను.... మొత్తం మీద ఆ రకంగా ఎమ్మెస్ గళం నుండి జాలు వారినవే ఇప్పుడు మార్కెట్లో వున్న (టిటిడివారి) 'బాలాజీ పంచరత్నమాల' క్యాసెట్లు, ఎల్.పిలు.

ఇంత జరిగాకకూడా నా మనసులో ఒక సందేహం వెంటాడుతోంది. ఈ మొత్తం ప్రాజెక్టులో సదాశివం పాత్ర ఏమిటి? ఆయన పేరుమీద కూడా రెండు లక్షలు జాయింట్‌గా డిపాజిట్ చేశాంగదా? ఈ చర్యని నేను ఎలా సమర్ధించుకోవాలి?

"ఎలా చేద్దాం సదాశివంగారూ" అని అడిగాను. "అంతా పెరుమాళ్ళే చూసుకుంటాడు" అన్నారు. ఎవరు చేయించారో తెలీదు కాని, ఎమ్మెస్ - రాధగానం చేసిన ఎల్ పి రికార్డు విడుదలని గతంలో ఎన్నడూ జరగనంత ఘనంగా సదాశివం జరిపించారు.

ఒక ఎల్.పిని రాష్ట్రపతి సంజీవరెడ్డిగారిచేత విడుదల చేయించారు. మరొటి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ చేత, మరొకటి అన్ని రాష్ట్రాలలోనూ ఏక కాలంలో ఆయా రాష్ట్ర గవర్నర్ల చేత. ప్రధాని విడుదల చేసిన రోజునే అన్ని రాష్ట్రాల్లో ముఖ్యమంత్రులు కూడా విడుదల చేశారు. ప్రతి చోట ప్రముఖ సంగీత విద్వాంసులు, మఠాధిపతులు, స్వామీజీలు వచ్చి ఆ ఎల్.పిల విడుదలలో పాల్గొన్నారు. ఒక ఎల్.పి పూర్తిగా మఠాధిపతుల చేతనే విడుదల చేయించారు.

తిరుమల తిరుపతి దేవస్థానాల పేరుకి, ఎమ్మెస్ కీర్తి ప్రతిష్ఠలు జోడించి సదాశివం చేసిన ప్రచారం ఫలితంగా చిట్టచివరి ఎల్.పి విడుదలయ్యేనాటికే 10 లక్షల రూపాయల రాయల్టీని టిటిడి సంపాదించింది. అంటే డిపాజిట్స్‌గా వేసిన ఏడు లక్షల రూపాయల్ని మించిపోయే ఆదాయం మొదటి ఏణ్ణర్థంలోనే టిటిడి ఆర్జించింది. ఆదాయంతో పాటు అన్నమయ్య కీర్తనలను దేశ విదేశాలలో ఎమ్మెస్ గాత్రం ద్వారా ప్రచారంలోకి తీసుకురాగలిగింది. ఒక మహత్తర గాయనీమణికి సరైన సమయంలో ఊతమిచ్చిన ఆనందం కూడా టిటిడికి మిగిలింది. అదే సమయంలో ఒక మహాభక్తురాలికి న్యాయం జరిగిందన్న సంతృప్తి కంచి స్వామీజీకి చేకూరింది.

ఇదంతా ఎలా సాధ్యపడింది? ఏ శక్తి జరిపించింది?

* * *




తిరుమల మూర్తులు-10

## విమాన శ్రీనివాసుడు

గర్భాలయానికి ప్రదక్షిణగా వెళ్ళినప్పుడు గర్భగుడికి వాయువ్యమాల, ఉత్తర ముఖంగా ఆనందనిలయం మీద కనుపిస్తాడు విమాన-శ్రీనివాసుడు. క్రూరుడైన ఒక విజయనగర రాజు ఒక వైఖానస అర్చకుణ్ణి ఆలయంలోనే హత్యచేశాడనీ, ఆ పాతకం పోగొట్టడానికి వ్యాసరాయస్వామి పన్నెండేళ్ళపాటు గర్భగుడిలో ఆరాధనలో గడిపారనీ, ఆ కాలంలో మూలవిరాట్ దర్శనానికి ప్రత్యామ్నాయంగా విమాన వేంకటేశ్వరుడి దర్శనాన్ని భక్తులకు లభింపజేశారని ప్రతీతి.






# 20

## శ్రీవారి 'నామం'

నా మీద జనం రాళ్ళ వర్షం కురిపించారు...... అది కూడా తిరుమలలో శ్రీనివాసుడి ఆలయ మహద్వారం ముందే జరిగింది!

తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ మీద జనం రాళ్ళతో దాడిచేయడం అదే మొదటిసారి. ఊహించని ఈ పరిణామాన్ని గమనించి, ఏం చేయాలో ఆలోచించే లోపల నన్ను కాపాడాలని అడ్డుపడిన విజిలెన్స్ ఆఫీసర్ ధిల్లేశ్వరరావు, మరో సెక్యూరిటీగార్డు తీవ్రంగా గాయపడ్డారు. నిమిషాల్లో టిటిడి సెక్యూరిటీ సిబ్బంది రక్షణవలయంలా ఏర్పడి నన్ను ఆలయంలోపలికి తీసుకువెళ్ళారు. ఈ గొడవమూలంగా తిరుమల వేంకటేశ్వరుడి దర్శనం కోసం వచ్చిన భక్తుల క్యూని స్తంభింపజేయాల్సి వచ్చింది. పైగా, ఈగొడవ అంతా సద్దుమణిగేదాకా, మహద్వారం తలుపులు మూసివేయాల్సి వచ్చింది..... ఇదంతా జరిగింది 1982లో.

అయితే ఇలా ధర్మదర్శనం నడుస్తుండగా అకస్మాత్తుగా భక్తుల క్యూని స్తంభింపజేసి, మహద్వారం తలుపులు మూసివేయడం అప్పటికి రెండోసారి. 1981 చివర్లో కూడా ఇలాంటిదే మరో గొడవ జరిగింది. నడుస్తూ నడుస్తూవున్న క్యూలోని భక్తుల కళ్ళముందే, అదే మహద్వారం దగ్గర, టిటిడి సిబ్బందికీ, పోలీసులకీ మధ్య ఘర్షణ చెలరేగింది. క్షణాల్లో కొట్లాట తీవ్రరూపం దాల్చడంతో, మహద్వారం తలుపులు మూసివేశారు.

నిజానికి ఈ సంఘటనలు రెండూ కాకతాళీయంగా జరిగినవి కావు. అసలు జరిగిందేమిటంటే.....

* * *

**తి**రుమల వేంకటేశ్వరుడు వారంలో అన్ని రోజులూ వెడల్పాటి తెల్లటి కర్పూరనామంతో దర్శనమిస్తాడు. ఒక్క గురువారం రాత్రి పూలంగి సేవ తరువాత దర్శనంలోనూ, మర్నాటి ఉదయం అభిషేక సమయంలోనూ, అభిషేకానంతర దర్శనకాలంలోనూ మాత్రమే నామం లేకుండా స్వామివారి నిజరూపదర్శనం సాధ్యపడుతుంది. దీన్నే నేత్ర దర్శనం అనీ, నిజపాదదర్శనం అనీ అంటారు.

ఈ నామం కూడా వైష్ణవులలోని రెండుశాఖల (వడగలై, తెంగలై) వారి సాంప్రదాయాన్ని కలుపుకొంటూ, అటుపూర్తిగా 'Y' ఆకారమూ కాక, ఇటు 'U' ఆకారమూ కాని విధంగా మధ్యస్థంగా వుంటుంది. ఆ మధ్యలో కస్తూరి తిలకం వుంటుంది. అలా కర్పూరనామాన్ని 'Y'కి 'U'కి మధ్యస్థంగా వుండేలా తీర్చిదిద్దడం ఎంతో నైపుణ్యంతో కూడుకున్న పని. పైగా ఒకసారి పెట్టిన నామం మళ్ళీ వారం అభిషేకం జరిగేదాకా అలాగే వుండాలి కూడా.

నేను టి.టి.డి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్న కాలంలో చాలామంది భక్తులు ఈ నామం గురించి నాదృష్టికి తీసుకువస్తూ వుండేవారు. అనేకమంది అపరిచిత భక్తులు లెటర్స్ రాసేవారు. పరిచయస్థులు చర్చకు దిగేవారు... ఇంతకీ వాళ్ళందరి వాదనల్లో సారాంశం ఏమంటే, శ్రీవారి నామం కాలక్రమేణా వెడల్పుగా పెరిగిపోయి, పెరిగిపోయి చివరికి స్వామివారి నేత్రాలు కనబడకుండా పోయే స్థాయికి చేరుకొన్నది. స్వామివారి నేత్రాలు దర్శించాలంటే, గురువారం నాడు పూలంగి సేవ సందర్భంగా నామం చిన్నదైనప్పుడే కొంతవరకూ సాధ్యపడుతుంది. లేదంటే శుక్రవారం నాడు అభిషేక కాలంలో పూర్తిగా నామరహితమైన నేత్రాల్ని (అలంకరణలేని పాదాలతోపాటు) దర్శించుకోవాలి.

ఈ నామం గురించి నా దృష్టికి తీసుకువచ్చిన వాళ్ళంతా పురాతన కాలం నాటి పెయింటింగ్స్‌లో వేంకటేశ్వరస్వామిని చూపించి, అప్పటి నామం చాలా చిన్నదనీ, ఇప్పుడు కూడా అలా ఎందుకు చేయకూడదనీ వాదిస్తూ వచ్చారు. నేను టి.టి.డి లో చేరిన కొత్తలో (1978) ఈ విషయాన్ని పట్టించుకోలేదు. కాని కాలక్రమేణా ఇలా చెప్పేవారు పెరుగుతుండటంతో నాక్కూడా ఈ విషయంపై ఆసక్తి పెరిగింది.

1980-81 కాలంలో నేను ఈ నామం విషయంలో సుదీర్ఘమైన అధ్యయనం చేశాను. టి.టి.డి రికార్డుల్లోనూ, బయట భక్తుల దగ్గరా లభించిన శ్రీనివాసుడి ఫోటోల్ని, పెయింటింగ్స్‌నీ, డ్రాయింగ్స్‌నీ నిశితంగా పరిశీలించాను. అలాంటి పురాతనకాలపు చిత్రాలన్నింటిలోనూ శ్రీవారి కర్పూర నామం వెడల్పుగా కాక సన్నదిగానే వుంది. కొన్నింటిలో కళ్ళుపూర్తిగా కనబడుతున్నాయి. కొన్నింటిలో కళ్ళు చాలావరకు కనబడుతున్నాయి.

అప్పుడిక, ఈ వెడల్పాటి కర్పూరనామం ఎప్పుడు ప్రాక్టీసులోకి వచ్చిందీ - అని విచారించాను. అర్చకులు, మిరాసీదార్లు, జియ్యంగార్ సయితం తాము ఆ పెయింటింగ్స్‌లోని సన్న నామంగురించి





ఎరగమనీ, తమకు ఊహ తెలిసిందగ్గర్నుంచీ ఈ వెడల్పాటి నామమే స్వామివారికి ధరింపజేస్తున్నామనీ తేల్చిచెప్పేశారు. మరయితే ఆ పురాతన చిత్తరువుల్లో శ్రీవారినామం సన్నగా ఎందుకుందీ? ఈ ప్రశ్నకు వారంతా ఇచ్చిన ఊహాజనితమైన జవాబు ఏమిటంటే - స్వామివారి విగ్రహానికి ఫోటోలు తీయటాన్ని అనుమతించరు. ఇది ఫోటోగ్రఫీ అనేది మనకు అందుబాటులోకి వచ్చినప్పట్నుంచీ వున్న పరిస్థితి. అందువల్ల అంతకు ముందుగానీ, ఫోటోగ్రఫీ అందుబాటులోకి వచ్చిన తరువాతగానీ, ఆసక్తి వున్న చిత్రకారులు గర్భగుడిలో కూర్చుని, తిరుమలేశుడి చిత్రాన్ని స్వయంగా చూస్తూ చిత్రీకరించుకొంటూ వుండేవారు. అలా చిత్రకారులు తమ తమ కంటికి ఎలా కనబడితే అలా, లేదా ఎలా తమకిష్టమైతే అలా శ్రీవారినామాన్ని చిత్రిస్తూవచ్చారు. అందుకే పాత పెయింటింగ్స్‌లో నామం అలావుంది!!

ఈ వివరణ నాకు సంతృప్తి కలిగించలేదు. అందుకే ఇంకా నిష్ణాతులైన ఆచార్య పురుషులనీ, ఆస్థాన విద్వాంసులైన పండితులనీ కూడా ఈ విషయంలో సరైన సమాచారం అందించవలసిందిగా అభ్యర్థిస్తూ లెటర్స్ రాశాను. ఫలితం లేకపోయింది.

ఇంతలో నేనిలా నామం పుట్టు పూర్వోత్తరాల గురించి వాకబు చేస్తున్న సంగతి తెలుసుకున్న భక్తులు కొంతమంది నాదగ్గరకు వచ్చి "శ్రీవారి నేత్ర దర్శనం కోరుకునే భక్తులు - పూలంగిసేవ, అభిషేక సేవ, అభిషేకానంతరసేవ కాలంలో మాత్రమే రుసుము చెల్లించి ఆ అదృష్టాన్ని పొందగలగడం న్యాయంకాదు. మీ హయాంలోనయినా, వారంలో అన్నిరోజులూ, అన్ని స్థాయిలలో భక్తులూ ఎలాంటి సేవలతో నిమిత్తం లేకుండా శ్రీవారి నేత్రాల్ని కొంతవరకైనా దర్శించుకునే అవకాశం కల్పించండి......" అంటూ సలహాలిస్తూ వచ్చారు. ఈ సలహా నచ్చింది.

నేను జియ్యంగార్‌తోటి, అర్చకులతోటి చర్చించాను. పాతపెయింటింగ్స్ వాళ్ళకి చూపించి వాటిల్లో వున్నట్లుగా నామం ఎందుకు సన్నగా పెట్టకూడదు? అలా చేస్తే, భక్తులంతా వారమంతా శ్రీవారి నేత్రాల్ని ఆనందంగా దర్శించుకుంటారు గదా! పైగా ఇంత వెడల్పాటి నామం పెట్టడానికి పట్టే సమయంలో సగం కాలాన్ని మాత్రమే వెచ్చించి సన్న నామాన్ని పెట్టేయొచ్చు. అలా ఓ 15-20 నిమిషాలు ఆదా చేసి, ఆ కాలాన్ని ధర్మదర్శనానికి కలిపితే, రోజుకి మరో అయిదారు వందలమంది భక్తులు శ్రీనివాసుడ్ని దర్శించుకోవచ్చు గదా! అలా ఎందుకు చేయగూడదు!... అంటూ తరచూ ప్రశ్నిస్తూ వచ్చాను. నా వాదన అంతా విన్నమీదట, వాళ్ళకి కూడా ఇదేదో అభ్యంతర పెట్టాల్సిన విషయంగా కనుపించలేదు. "మీ ఇష్టం" అన్నారు. అంతే, నామం సైజు తగ్గింపజేయాలని నిర్ణయం తీసుకున్నాను. అయినా వెంటనే అమలు చేసే ధైర్యం చేయలేకపోయాను.

చివరికి 1981 అక్టోబరు ఆరంభంలో అర్చకస్వామికి చెప్పాను - "ఈసారైనా అభిషేకం తరువాత నామాన్ని సన్నగా పెట్టండి". అక్టోబరు 8 విజయదశమినాడు బ్రహ్మోత్సవాల చివరిరోజు.

పుష్కరిణిలో (శ్రీవారి) చక్రస్నానం కూడా ఆ రోజే. దాంతో ఆ రోజు భక్తుల రద్దీ చాలా విపరీతంగా వుంది.

ఆ ఉదయం 10. 30 గంటల ప్రాంతంలో నేను తిరుమల కొండ మీద క్యాంప్ ఆఫీసు దగ్గరవుండగా, ఎవరో ఫోన్ చేసి, ఆలయం దగ్గర పెద్దగొడవ జరుగుతోందని చెప్పారు. ఆఘమేఘాల మీద నేను ఆలయందగ్గరికి వెళ్ళేసరికి, పరిస్థితి చాలా బీభత్సంగా వుంది. దర్శనాలు ఆపేశారు. మహద్వారం తలుపులు మూసేశారు. నేను వెళ్ళి మహద్వారం తలుపులు తెరిపించి, లోపల ప్రవేశించిన మరుక్షణం అక్కడ బైఠాయింపు సాగిస్తున్న టిటిడి ఉద్యోగులంతా నా చుట్టూ చేరిపోయారు. కసి, ఆవేశం, ఉద్రేకం, ఉద్వేగం నిండిన కంఠాలతో వాళ్ళంతా పోలీసుల మీద విరుచుకుపడ్డారు.

వాళ్ళ కథనం ప్రకారం - బ్రహ్మోత్సవాలలో డ్యూటీ మీద వచ్చిన ఒక రిజర్వ్ పోలీసు ఆఫీసర్ సకుటుంబంగా శ్రీవారిని దర్శించుకోవడం కోసం నేరుగా మహద్వారంగుండా వెళ్ళాలని ప్రయత్నించాడు. ఆలయసిబ్బంది అతన్ని ఆపి, "మీ అనుమతి పత్రం చూపించండి" అని అడిగేసరికి, అతనికి కోపం వచ్చింది. అడిగినవాణ్ని నాలుగు తిట్లు తిట్టి పక్కకు తోసేసి లోపలికి వెళ్ళే ప్రయత్నం చేశాడు. దాంతో ఆలయ సిబ్బంది నలుగురూ చేరి, అతన్ని నిరోధించేశారు. అతను ఆ అవమానం భరించలేక, వెనక్కివెళ్ళిపోయి, మరో పదినిమిషాల్లో తన రిజర్వ్ పోలీసు బలగంతోసహా ఆలయం మీదకి దాడిచేస్తున్నంత విసురుగా వచ్చాడు. వాళ్ళంతా బూటుకాళ్ళతోటే ఆలయంలోకి చొచ్చుకుపోయి, కంటికి కనబడిన ప్రతి టిటిడి ఉద్యోగినీ చితకబాదారు. విచక్షణారహితంగా లాఠీలతో కొట్టారు. ఆలయ ప్రాకారంలోపల స్వైరవిహారం చేశారు. అనూహ్యమైన ఈ దాడి వార్త క్షణాల్లో తిరుమలలో వ్యాపించటంతో, ఆలయం బయటవున్న టిటిడి సిబ్బంది పరుగెత్తుకువచ్చి, ఆలయంలోని ఇతర సిబ్బందితో కలిసి ఈ రిజర్వ్ పోలీసుదళంతో తలపడ్డారు. హోరాహోరీ కొట్టుకున్నారు. రెండువైపులా కొంతమంది గాయపడ్డారు. చివరికి టిటిడి సిబ్బంది ధాటికి తట్టుకోలేక పోలీసుదళం మహద్వారం బైటకు వెళ్ళిపోయారు.

అయితే, ఈ పోలీసుదాడికి నిరసనగా టిటిడి సిబ్బంది - ఆలయ మహద్వారం తలుపులు మూసేసి, లోపల బైఠాయింపు జరుపుతున్నారు.

ఈ కథంతా విన్నాక నాకు కూడా మనసు పాడైపోయింది. నా ఆదుర్దా అంతా ముందుగా క్యూలో వున్న భక్తుల దర్శనం ఆగకూడదు. అది కొనసాగాలంటే, మహద్వారం తలుపులు తెరవాలి. అవి తెరవాలంటే, ఆలయ సిబ్బందిని ఒప్పించాలి. కానీ, వాళ్ళు నా మాట వినే మూడ్‌లో లేరు. తక్షణం ఆ పోలీసు ఆఫీసర్‌ని సస్పెండ్ చేయాలి. ఇంకేదో చేసేయాలి... ఇది వాళ్ళ డిమాండు. ఎలా? సరే నాకున్న అధికారాల్ని వుపయోగించి తక్షణం జాయింట్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, జిల్లా





పోలీస్ సూపరింటెండెంట్‌ల చేత ఒక జాయింట్ ఎంక్వయిరీకి ఆదేశాలిచ్చాను. ఎంక్వయిరీ ఆ సాయంత్రానికే పూర్తయిపోయేలా చూస్తానని హామీకూడా ఇచ్చి, అతికష్టంమీద మహద్వారం తలుపులు తెరిపించడానికి సిబ్బందిని ఒప్పించగలిగాను. మొత్తం మీద, మరో 15-20 నిమిషాల తర్వాత దర్శనం మళ్ళీ ప్రారంభమైంది... ఆ సాయంత్రానికి విచారణ పూర్తయింది. ఆ దుర్ఘటనకు బాధ్యులైన కొంతమంది మీద తగిన చర్యలు తీసుకోవడం కూడా జరిగింది. కానీ, ఆసంఘటనతో చెదిరిపోయిన నా మనసు కుదుటపడ్డానికి చాలా కాలం పట్టింది... కొన్ని నెలలు గడిచాయి.

ఈ మధ్యకాలంలో మళ్ళీ భక్తుల దగ్గర్నుంచి నామం గురించి గుర్తుచేస్తూ లెటర్స్ వస్తున్నాయి. ఎందుకో ఒక భక్తుడు - "ఎన్నిసార్లు మీ దృష్టికి తీసుకువచ్చినా, మీరు నామాన్ని పాతకాలం నాటి సైజుకి ఎందుకు తగ్గించరూ?..." అంటూ ఝాడిస్తూ రాసిన ఓ లెటర్ చూడగానే, నాకు మళ్ళీ ఆ నామం విషయంగుర్తుకు వచ్చింది. "నిజమే సుమా! తగ్గించాలనుకుని నిర్ణయం తీసుకున్నాను. అర్చకులకి చెప్పాను కూడా, అయినా ఎందుకు అమలు కాలేదు?...." ఇలా అనుకున్న తరువాత వచ్చిన మొదటి శుక్రవారం నాడు అర్చకులకి చెప్పాను. "శ్రీవారి కర్పూరనామం ఇవ్వాళ్టి నుంచీ సన్నగా చేయండి. శ్రీవారి నేత్రాలు వారమంతా బాగా కనబడాలి...."

"అలాగే" అన్నారు అర్చక స్వామి.

అంతకు ముందే - ఆలయం ఎదురుగా వున్న సన్నిధి వీధిని విస్తరించే విషయంలో టిటిడి నిర్ణయాన్ని సవాల్ చేస్తూ స్థానిక వ్యాపారులు కోర్టులో కేసు వేసి తీసుకొచ్చిన స్టే ఉత్తర్వుల్ని - హైకోర్టు తొలగించింది. దాంతో ఆ శుక్రవారం ఉదయమే టిటిడి రెవెన్యూ - ఇంజనీరింగ్ విభాగాలు సన్నిధి వీధిలో పాత నిర్మాణాల్ని నేలకూల్చే కార్యక్రమం మొదలు పెట్టారు. క్షణాల్లో ఈ కార్యక్రమం ఊపందుకుంది. ఆ మధ్యాహ్నం నేను మహద్వారం దగ్గర నిలబడి, స్వయంగా ఈ కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తున్నాను. ... అంతా సవ్యంగా జరుగుతున్నట్లుగానే వుంది - అనుకుంటున్నాను. ఛివాల్న ఎక్కడ్నుంచే ఒక రాయి నా వేపుకు దూసుకు వచ్చింది. అటు తల తిప్పిచూశాను.

..... ఒకళ్ళు కాదు, ఇద్దరు కాదు, ఒక పెద్ద జన సమూహం! సన్నిధి వీధి వెడల్పు చేయించడం కోసం పాత దుకాణాలు కూలగొడుతున్నామన్న కడుపుమంటతో అక్కడి వ్యాపారులు, తిరుమల స్థానికవాసులు కలిసి మూకుమ్మడిగా నామీద రాళ్ళు రువ్వుతున్నారు.

"అరెరె ఇ. ఓ. గారి మీద రాళ్ళేస్తున్నార్రా" అంటూ మా విజిలెన్స్ ఆఫీసర్ ధిల్లేశ్వరరావు, ఇతర సెక్యూరిటీ సిబ్బంది పరుగెత్తుకుంటూ వచ్చి, నాకు రక్షణ నివ్వాలనిచూశారు. ఫలితంగా ధిల్లేశ్వరరావుతో సహా కొంతమంది రాళ్ళదెబ్బలు తిన్నారు. కొన్ని రాళ్ళు క్యూలోని యాత్రికుల మీద పడ్డాయి. కేకలు, అరుపులు, నిరసన నినాదాలతో ఆలయ సన్నిధి ప్రతిధ్వనిస్తోంది. రాళ్ళవర్షం ఆపడం కోసం టిటిడి సెక్యూరిటి సిబ్బంది గాలిలోకి కాల్పులు జరుపుతూ, ఆ సమూహాన్ని

చెదరగొట్టడానికి వెళ్ళారు. మరికొందరు వెంటనే దర్శనం క్యూని నిలిపేసి, మహద్వారం తలుపులు మూసేశారు. కొద్దినిమిషాలు గడిచాక, పోలీసులు, సెక్యూరిటీ సిబ్బంది వచ్చి, దాడి చేసిన వాళ్ళందర్నీ తరిమేశామనీ, దుకాణాల నిర్మూలన నిరాఘాటంగా సాగిపోతోందనీ చెప్పాక, అప్పుడు మహద్వారం తలుపులు తెరిచారు.

కానీ, ఈ సంఘటనతో నేను అవాక్కయిపోయాను. మహద్వారం ముందు రాళ్ళ వర్షమా? సెక్యూరిటీ సిబ్బంది కాల్పులు జరపటమా! సమయం కాని సమయంలో మహద్వారం తలుపులు మూసివేయటమా? దర్శనం క్యూని స్తంభింపజేయడమా?.... ఏమిటీ వైపరీత్యం?..... ఆలోచించినకొద్దీ నా మెదడు మొద్దుబారిపోయింది. అచేతనంగా, అన్యమనస్కంగా ఆలయంలో అలా ఎంతసేపుండి పోయానో తెలీదు.

ఆ ఆందోళన నుంచి మనసుకి ఉపశమనం కోసం శ్రీవారి దర్శనం చేసుకుందామని గర్భగుడిలోకి వెళ్ళాను. స్వామివారిని చూస్తూ, "ఎందుకిలా జరిగింది స్వామి" అనబోతున్నాను. ఆశ్చర్యం!....!. స్వామివారి కర్పూరనామం సన్నగా - అతి సన్నగా విప్పారిన నేత్రాలు కనుపించేలా - వుంది. నేను కోరినట్లుగా ఒక శుక్రవారం సాయంత్రం అలాంటి నేత్ర దర్శనం జరగటం అదే మొదటిసారి. అయినా ఎందుకో నాలో - ఆ ఆనందం కలగటం లేదు. ఎక్కడో ఏదో ఆందోళన?

నా మానసిక పరిస్థితి గమనించిన సీనియర్ అర్చక మిరాసీదార్ నాదగ్గరకు వచ్చి సన్నగా అంటున్నారు: "అయ్యా! కొన్ని మాసాల క్రితం మీరు చెప్పారని నామం సైజు తగ్గించాం. అలా చేసిన కొన్ని గంటల్లోనే ఆలయ సిబ్బందికీ పోలీసులకూ మధ్య ఘర్షణ జరిగింది. మహద్వారం తలుపులు మూసేసి, దర్శనం నిలిపేయాల్సి వచ్చింది. అక్కడితో మీకు చెప్పకుండానే - కర్పూరనామం సైజు తగ్గించే కార్యక్రమాన్ని మేం విరమించుకున్నాం. ఇవ్వాళ మళ్ళీ మీరు ఆదేశించారని, మరోసారి నామం సైజు తగ్గించాం. ఈ సారి మీ మీదే దాడిజరిగింది. మహద్వారం తలుపులు మళ్ళీ మూసేయాల్సి వచ్చింది. దర్శనాలు నిలిపేయాల్సి వచ్చింది. అందుచేత....."

ఆ మాటలు వింటూ సాలోచనగా తలపంకిస్తున్నాను. క్రమంగా నాలో ఆందోళన తగ్గుతోంది. అర్చకులతో నేనింకేమీ అనలేదు. వచ్చేశాను... వెంటనే అర్చకులు ఆ నామాన్ని యథాతథస్థితికి (ఇప్పుడు కనిపిస్తున్న విధంగా) తీసుకువచ్చేశారు. ఇంకెప్పుడూ ఆవిషయం నేను ఎవరిదగ్గరా ప్రస్తావించలేదు... ??

★ ★ ★



# 21

## "ప్రసాద్ డౌన్... డౌన్"

"డౌన్ డౌన్ ... గోమాతల శత్రువు ప్రసాద్‌ని బదిలీ చేయాలి.. పేదల వ్యతిరేకి ప్రసాద్ డౌన్ డౌన్... పేదల పెన్నిధి ముఖ్యమంత్రి అంజయ్య జిందాబాద్.."

ఈ నినాదాలహోరు మధ్యలో నాలుగైదు వందలమంది తిరుమల వాసులు తిరుమల గెస్ట్‌హవుస్ దగ్గర ముఖ్యమంత్రి శ్రీ అంజయ్యని చుట్టుముట్టారు.

1980లో ముఖ్యమంత్రి పదవీబాధ్యతలు స్వీకరించాక అంజయ్య తిరుమలకి రావడం అదే మొదటిసారి. ఆయనతోపాటు దేవాదాయశాఖామంత్రి శ్రీపిళిచౌదరి, తిరుమల తిరుపతి దేవస్థానాల ట్రస్టుబోర్డు ఛైర్మన్ శ్రీనాగిరెడ్డి తదితర అధికారుల సమక్షంలో - నేను చూస్తూండగానే నాకు వ్యతిరేకంగా వీరావేశంతో నినాదాలు చేసుకుంటూ స్థానిక నాయకుల ఆధ్వర్యంలో ముఖ్యమంత్రిని ఆశ్రయించిన "బాధితులు" అంతాతిరుమల వాళ్ళే. వీళ్లల్లో కొంతమంది - తిరుమలలో మాస్టర్‌ప్లాను అమలుచేయటం వల్ల శ్రీనివాసుడి గుడిదగ్గర (అయిష్టంగా) ఇళ్లు కోల్పోయిన వాళ్లు, మరోవర్గం-సన్నిధివీధి విస్తరణ (అప్పటికింకా పూర్తి కాలేదు) వల్ల షాపులు కోల్పోతున్నామన్న భయాందోళనలలో మునిగిపోయిన వాళ్లు. మరి కొంతమంది - కొండమీద అన్నిరకాల విక్రేతలకి లైసెన్స్ విధానం ప్రవేశపెట్టడాన్ని వ్యతిరేకిస్తున్న వాళ్లు, మిగిలిన వాళ్లంతా కొండమీదశాశ్వత ప్రాతిపదికన భిక్షాటన చేసేవాళ్లు.

ముఖ్యమంత్రిని చూస్తూనే వీళ్లంతా దండలు వేశారు. "ముఖ్యమంత్రి జిందాబాద్" అంటూ నినాదాలు చేశారు. "పేదల పెన్నిధి అంజయ్య వర్ధిల్లాలి" అంటూ ప్రశంసాపూర్వక కరతాళధ్వనులతో ముఖ్యమంత్రిని ఆకాశానికెత్తేశారు. "నువ్వు తప్ప మాకు దిక్కేలేరు అన్నా" అంటూ కొంతమంది సాష్టాంగ ప్రణామాలు కూడా చేసేశారు. "నువ్వే కాపాడాలి మహాప్రభో" అంటూ ఎలుగెత్తికేకలు పెట్టారు. ఈ పొగడ్తలు, దండలు, నమస్కార బాణాలతో - అప్పటికే పేదల పక్షపాతిగా పేరుబడ్డ అంజయ్య మురిసిపోయారు. ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోతూ, "ఏం భయంలేదు బిడ్డ, నేనున్న. మీకష్టం నే తీరుస్త, చెప్పు.."అంటూ అభయం ఇచ్చేశారు!

.... ఈ ప్రసాద్ వ్యతిరేక నినాదాలు, ముఖ్యమంత్రి అభయంతో నేను అవాక్కయి పోయాను....అర్థమైపోయింది. ఏం జరగబోతోందో ఊహించుకున్నాను. క్రమంగా తేరుకుని, మనసు కుదుట పరుచుకుని, రాబోయే పరిణామానికి తలవంచటానికి సిద్ధపడ్డాను. (Be prepared to face the worst, any improvement over the worst, ultimately, gives you pleasure)... నా ఊహకి అందినంతవరకు, అంజయ్య తనకున్న 'పేదలపక్షపాతి' అన్న పేరు సార్థకం చేసుకోవాలంటే ఆయన ముందున్న మార్గాలు మూడు:

1. వాళ్ల కోరిక మేరకు నన్ను అక్కడ్నుంచి వెంటనే బదిలీ చేయటం, లేదా
2. వాళ్లు అడిగిన డిమాండ్లన్నీ అంగీకరించాలంటూ నన్ను ఆదేశించటం, లేదా
3. వాళ్ల సంతృప్తికోసం వాళ్లందరి సమక్షంలో నన్ను ఎడాపెడా చీవాట్లు పెట్టడం.

వీటిల్లో ఆయన ఏదిచేసినా నాకు అవమాన భారం తప్పదు. అందుకే అత్యంత భరించలేని అవమానం ఎలావుంటుందో ఊహించుకుని దానిక్కూడా మానసికంగా సిద్ధపడిపోయాను.

ఇలా ఓ ప్రక్క నా మనసంతా వ్యాకులతతో నిండిపోతుంటే, మరో ప్రక్క వాళ్ల నినాదాల జోరు రెచ్చిపోతోంది. పరిశీలనగా చూస్తే, వాళ్లలో ముందువరసలో స్థానిక నాయకులు. ఆ వెనకాల వున్నవాళ్లంతా తిరుమలలో లైసెన్సుల్లేకుండా వడ్డీకాసులు, ఫోటోలు, పూలు, పుస్తకాలు, తినుబండారాలు వగైరా అమ్మకాలు సాగిస్తుండేవాళ్లు. వాళ్లకి నా మీద పీకలదాకా కసి, కడుపుమంట వున్నాయి. ఎందుకంటే, తిరుమలలో కొండమీద ఇలా రకరకాల వస్తువుల విక్రయాలు సాగించే వాళ్లందర్నీ గుర్తించి, 'అర్హులైన' వాళ్లకు లైసెన్సులు యివ్వాలనే నిబంధన అంతకుముందే ప్రవేశపెట్టాను. కొండమీదకి వచ్చే యాత్రికులకి ఈ విక్రేతల బెడద చాలా ఎక్కువ. యాత్రికుల భక్తీ, ఆరాధనా చూసి, వాళ్లకి మాయమాటలు చెబుతూ వడ్డీకాసులు వగైరా అంటగట్టాలని చూసే ఈ హాకర్స్‌లో చెడ్డవాళ్లు కూడా వున్నారు. వీళ్ల చేతుల్లో యాత్రికులు మోసపోవడం అనేది కొండమీద సర్వసాధారణమైపోయింది. అందుకే ఈ మోసాల్నుంచి యాత్రికులకి రక్షణ కల్పించాలని ఓ ప్రయత్నం చేశాం.





అందుకోసం కనీసం మూడేళ్లకు పైబడి తిరుమలకొండమీద వ్యాపారాలు చేసుకుంటున్నవాళ్లని మాత్రమే ఈ లైసెన్సుకి అర్హులుగా నిర్ణయించాం. లైసెన్స్ పొందాలంటే - మూడేళ్ల స్థానిక నివాసంతోపాటు వాళ్లకి ఖచ్చితమైన స్థానిక చిరునామా వుండివుండాలి. 1979లో చేపట్టిన మాస్టర్ ప్లాను సందర్భంగా జరిగిన తిరుమల ఇంటింటి సర్వేలోగానీ, 1971నాటి జనాభాలెక్కల జాబితాల్లో గానీ, కనీసం ఓటర్లలిస్టులోగానీ వాళ్ల పేర్లు వుండి వుండాలి - అంటే, ఈ మూడు జాబితాల్లో దేన్లోనూ పేరు లేని వాళ్లు ఖచ్చితంగా కొత్తగా తిరుమల కొండమీదకి బ్రతుకుతెరువు కోసం వచ్చిన వాళ్లయి వుంటారు. ఇలాంటి వాళ్లందర్నీ తిరుమల కొండమీంచి ఖాళీచేయించక తప్పదు - ఎందుకంటే అప్పటికే కొండమీదున్న నీళ్ల వసతి వగైరా సదుపాయాల్ని పెరుగుతున్న యాత్రికుల సంఖ్యకి తగినట్లుగా పెంచే అవకాశాలు తగ్గిపోతున్నాయి. రోడ్లమీద యాత్రికుల కార్లు తిరిగే స్థలం లేకుండా పోతోంది. ఇలాంటప్పుడు, స్థానిక జనాభాని నియంత్రించకపోతే రాబోయే రోజుల్లో యాత్రికులకి అసలు సదుపాయాలు కల్పించలేం...

మొత్తంమీద ఈ లైసెన్సు విధానం వల్ల కొండమీద హాకర్స్‌లో ఒక బాధ్యతాతత్వాన్ని తీసుకురావాలని ప్రయత్నంచేశాను.. ఈ స్థితిలో, టిటిడి ఎప్పుడయితే కొత్త తిరుమలవాసులందర్నీ ఖాళీచేయించే ప్రయత్నం మొదలుపెట్టిందో, నిరసన ధ్వనులు ప్రారంభమయ్యాయి. వాళ్లకి తోడు (యాత్రికుల ప్రయోజనాల దృష్ట్యా) భిక్షాటనలో వున్న వాళ్లందర్నీ కొండమీంచి దింపేయాలని కూడా నిర్ణయించడం, అమలు చేయటం ఆరంభించాను. దాంతో వాళ్లూ, వీళ్లూ కూడా ఈ స్థానిక నాయకుల అండతో నా మీద దండయాత్రకి దిగారు. నా చర్యలవల్ల వాళ్లకి కష్టం కలుగుతున్నమాట నిజమే. కానీ, ఎక్కడో మారుమూల పల్లెల్నుంచి ముడుపులు కట్టుకుని ఆయాసపడుతూ, శ్రీనివాసుడ్ని చూడాలని తిరుమలకి వచ్చేవాళ్లకి - ఇక్కడ బస ఆహ్లాదకరంగావుండేలా చేయటం - నా విధ్యుక్త ధర్మం కాదా!

ఇది నా వాదన. కాని నా వాదన వినిపించేదాకా అక్కడ అవకాశంలేదు. అసలు ముఖ్యమంత్రి నన్ను అడిగితే కదా నేను ఏం చెప్పాలన్నా! ఆయన నన్ను అడిగే అవకాశాలు కనబడటంలేదు. ఈ తిరుమల జనం నినాదాల హోరు మధ్యలో ముఖ్యమంత్రికి దండలు వేసి ఫోటోలు దిగుతున్నవాళ్లంతా ఈ జనాన్ని ప్రోగుచేసి, స్థానికంగా తమ ప్రాబల్యాన్ని పెంచుకోవాలని, కనీసం నిలబెట్టుకోవాలని ఆరాటపడుతున్న వాళ్లు. ముఖ్యమంత్రి కూడా వాళ్లకి అనుకూలంగా మాట్లాడే ధోరణి కనుపిస్తున్నది. పైగా అప్పటికే హైద్రాబాద్‌లో జరిగిన సంఘటనలన్నీ, కొత్త ముఖ్యమంత్రిగారు బలహీనవర్గాల ప్రయోజనాలకి వ్యతిరేకంగా ఏం జరిగినా సహించడం లేదని స్పష్టం చేస్తున్నాయి... క్రమంగా పరిస్థితులు నాకు ఎంత వ్యతిరేకంగా వున్నాయో నాకు తేటతెల్లమైపోతోంది.

"కృష్ణుడు ప్రేమించిన ఆవుల పాలిటి అసురుడు... గోమాత పాలిటి కసాయి ప్రసాద్ డౌన్‌డౌన్...."

మరోసారి ఈ నినాదాలు నా మనోస్థైర్యాన్ని మరింత దిగజార్చేశాయి. ఈ గోమాత ప్రేమికుల పట్ల నేను చేసిన అపరాధం ఏమిటో నాకు అంతుపట్టలేదు. తిరుమల కొండమీద తమ తమ ఆవుల్ని యధేచ్ఛగా తిరిగేలా స్థానికవాసులు వదిలేస్తుంటే, దాన్ని కట్టడి చేయాలని ప్రయత్నంచేశాను.

కొండమీద ఆలయంఅవసరాలకి, క్యాంటీన్‌కి, సిబ్బంది క్వార్టర్సుకి కావలసిన పాలను తిరుపతిలో టిటిడి డెయిరీ ఫారం సరఫరా చేస్తూంటుంది. ఇవికాక, పరిమిత పరిమాణంలో పాలను విజయ డెయిరీ సరఫరా చేస్తూంటుంది. అయినా కొండమీద మొత్తం పాల అవసరాలకు ఇవి సరిపోవు. ఈ స్థితిలో ప్రైవేటుగా ఆవులు, బర్రెలు పెంచుకుంటున్న స్థానికులే కొంతమేరకు ఈ పాల అవసరాలను తీరుస్తున్నారు.

ముఖ్యంగా స్థానికంగా వుండే ప్రైవేటు కాఫీస్టాల్స్, సిబ్బంది క్వార్టర్సు, యాత్రికుల అవసరాలు.. వగైరా చోట్ల పాలకొరతను ఈ పాలు కొంతమేరకు తీరుస్తున్నాయి. కానీ, ఈ ఆవులు పెంచేవాళ్లకి కొండమీదున్న ఇళ్లు - ఆవుల్ని పెంచేటంత విశాలమైనవి కావు కనుక వాటన్నింటినీ వీధుల్లోకి వదిలేస్తారు. అవి మేతకి వెళ్తే పరిసరాల్లోని అడవుల్లోకి వెళ్లివస్తాయి. లేదా, తిరుమల వీధుల్లో సహజ స్పీడ్ బ్రేకర్లుగా సంచరిస్తూ, భక్తులిచ్చే ప్రసాదాల మీద బతికేస్తుంటాయి. వాటిని పెంచడానికి వాటి యజమానులకి ఎలాంటి గోశాలలూ లేవు. తిరుమల వీధులన్నీ గోమూత్రంతో, పేడ ముద్దలతో నిండిపోతుంటాయి. కొంతమందైతే వాటిపోషణ కోసం అసలు తాపత్రయపడరు - ఎలాగూ యాత్రికులే పోషిస్తారు కదా. పాలు మాత్రం పితుక్కుంటారు. ఈ లాభసాటి వ్యాపారాన్ని గమనించిన కొందరు టిటిడి ఉద్యోగులు సయితం ఆవుల్ని పెంచడం మొదలెట్టారు. దీంతో వాళ్ల పొరుగువాళ్లనుంచి ఫిర్యాదులు వస్తున్నాయి - "ఈ అపరిశుభ్ర వాతావరణం నుంచి కాపాడండి మహాప్రభో" అంటూ. కొన్ని సందర్భాలలో అయితే, కొన్ని పొగరుబోతు ఆవులు యాత్రికుల్ని కుమ్మేయటం, వాళ్లు గాయపడటం, హాస్పిటల్, టిటిడి సంజాయిషీ.... వగైరా కథంతా నడుస్తూండేది... ఈ వ్యవహారం ఇలావుండగా ఆవుల్ని మేపటానికి అడవుల్లోకి వెళ్లే కొంతమంది తిరుమల చుట్టూ పదిన్నర చదరపు కిలోమీటర్ల అడవి అంతా టిటిడికి చెందిన, టిటిడి అభివృద్ధి చేసిన వన సంపద, ఆ అడవుల్లోంచి సాయంత్రం చెట్లు నరికి తీసుకువచ్చి తిరుమలలోనే యాత్రికులకు వంటచెరుకుగా అమ్మేస్తుంటారు. అడవిలో వున్నప్పుడు వాళ్లు - కాలుతున్న బీడి, సిగరెట్లు పారవేయడంవల్ల, అడవిలో తరచుగా అగ్నిప్రమాదాలు జరిగి కాలిపోవడం జరుగుతుండేది. అంటే - పరిస్థితులు సరిగ్గా లేకపోవటం వల్ల తిరుమల పారిశుధ్యరహితంగా తయారవటం, క్వార్టర్సులో ఫిర్యాదులు, యాత్రికుల నుంచి ఫిర్యాదులు, వనసంపద అభివృద్ధికి ఆటంకం... వగైరా సమస్యలు





నన్ను చుట్టుముట్టాయి. ఇలా ఎన్ని సంవత్సరాలుగా జరుగుతోందో తెలీదు. కాని, నేను మాత్రం చూస్తూ వుండలేకపోయాను.

తిరుమలలో మాస్టర్‌ప్లాను అమలు చేయాలంటే, ముఖ్యంగా పారిశుధ్యం బాగుండి తీరాలి. రోడ్ల నిర్వహణ బాగుండాలి. చుట్టూ పచ్చదనాన్ని కాపాడలేకపోతే తిరుమల కొండ కూడా ఉష్ణ ప్రదేశంగా మారిపోతుంది. యాత్రికులకి (ఆవుల నుంచి) రక్షణ కల్పించాలి....

సరిగ్గా ఈ తిరుమల మాస్టర్ ప్లాన్ అమలు జరిగే సమయానికి రెవెన్యూ ప్రిన్సిపల్ సెక్రటరీగా (టిటిడి పర్చేస్ ఇన్‌ఛార్జి కమిటీకి చైర్మన్‌గా) కొన్ని నెలలు శ్రీ శ్రావణ్‌కుమార్ వున్నారు. ఆయన అటవీ శాఖనుంచే రావటంతో, తిరుమల కొండమీద వన సంపద రక్షణ, అభివృద్ధిపట్ల ఆయన అమితంగా ఆసక్తి చూపించారు. టిటిడికి చెందిన మొత్తం పదిన్నర చదరపు కిలోమీటర్ల విస్తీర్ణాన్ని 18 మండలాలు (వనాలు)గా విభజించి, ఒక వనంలో కేవలం వంటచెఱకు, ఒక దాంట్లో పళ్లతోటలూ, మరో దాంట్లో రకరకాల పూలమొక్కల ఉద్యానవనాలు, ఇంకో దాంట్లో ఔషధ మొక్కలు, ఆ ప్రక్కదాంట్లో సువాసన ద్రవ్యాలనిచ్చే మొక్కలు... ఇలా రకరకాల వనాలు పెంచాలని పథకం తయారుచేయించాం. ఈ పథకం క్రింద వనసంపద అభివృద్ధి సజావుగా జరగటంకోసం సమర్థుడైన కన్సర్వేటర్ (శ్రీ రాజశేఖరరెడ్డి) సారధ్యంలో ఒక అటవీ విభాగాన్ని ఏర్పాటు చేసి, అయిదేళ్లకాలంలో ఈ వనసంపదని అపారంగా విస్తరింపజేయాలనీ, పురాణాలలో వర్ణించిన నందన వనాలలాగా తిరుమలతిరుపతి పరిసరాలను తీర్చిదిద్దాలనీ ఒక బృహత్ కార్యక్రమాన్ని ప్రారంభించాం. దీనికితోడు వందలాది పుష్పజాతుల మొక్కలతో గార్డెన్ సూపరింటెండెంట్ తమ్మన్న సారధ్యంలో నేత్రపర్వంగా పుష్పవనాలను అభివృద్ధి చేసే కార్యక్రమానికి కూడా శ్రీకారం చుట్టాం. ఆ పూతోటలఅందాలు ఇప్పటికీ కనువిందుచేస్తుంటాయి.

ఈ కార్యక్రమం విజయవంతం కావాలంటే తీసుకోవలసిన చర్యలు ఏమిటి అని చర్చకు కూర్చున్నప్పుడు, లెఖ్ఖకొచ్చిన అంశాలు ఒకటికాదు రెండుకాదు. ఏ సమస్య తీసుకున్నా అది అటు తిరిగి ఇటు తిరిగి, 'ఆవుకథ' దగ్గరకొచ్చేస్తోంది.

ఒక శుక్రవారం అభిషేక సమయంలో స్వామివారికి క్షీరాభిషేకం చూస్తున్నప్పుడు - "ఈ అభిషేకాలు మనుషులు ప్రవేశపెట్టకమునుపు స్వామివారికి ఎలా జరిగేవి?" అని ఒక సందేహం వచ్చింది. ఆ సందేహం వెనకాలే, పుట్టలో వున్న స్వామివారికి బ్రహ్మదేవుడే ఆవుగా వచ్చి ప్రతిరోజూ తనంతతానుగా క్షీరధారలతో అభిషేకించిన కథ గుర్తుకు రావటంతో గోమాతల పట్ల నాకేదో బాధ్యత వుందనీ, స్వామివారి సేవకుడిగా తిరుమలలో గోసంపదకి తగిన సంరక్షణ కల్పించాలనీ సంకల్పం కలిగింది. ఆ సంకల్పం ఎంతబలంగా కలిగిందంటే - కొన్ని రోజుల్లోనే, తిరుమలలో గో సంరక్షణ శాలలు ఏర్పాటు చేశాం. అందరూ తమ ఆవులన్నింటినీ ఆ గోశాలల్లో వుంచుకోవాలనీ, వాళ్ల దగ్గర

నామ మాత్రపు ఫీజు తీసుకోవటం ద్వారా టిటిడి వారే ఆ ఆవులన్నింటికీ గ్రాసం ఏర్పాటు చేయాలనీ, వాటి పవిత్రత, అక్కడ పారిశుద్ధ్యం కాపాడే బాధ్యతను తిరుమల తిరుపతిదేవస్థానాలే తీసుకోవాలనీ నిర్ణయించాను. గోవులకి కావలసిన నీళ్లు, గ్రాసం, వైద్యం వగైరా వసతుల్ని టిటిడి కల్పించింది. ఈ నిర్ణయంవల్ల ఆవులు దేవస్థానం వారి వనాల్లో మొక్కలు, చెట్లు తినేయటం ఆగిపోయింది. తిరుమల రోడ్లమీద పేడవేయటం, మూత్రవిసర్జన మాయమయ్యాయి. యాత్రికులనుంచి, క్వార్టర్సులో సిబ్బంది నుంచి ఫిర్యాదులు నిల్చిపోయాయి... ఏతావాతా, పశుసంపద మీద ప్రేమతో ఆవుల్ని పెంచుతూవచ్చిన స్థానికులంతా ఈ ఏర్పాటు పట్ల హర్షం వ్యక్తం చేశారు. అయితే అంతవరకూ ఏ మాత్రం ఖర్చులేకుండా ఆవుల పోషణ యాత్రికులకి వదిలేసి, ఆవుపాల మీద ఆర్జన మాత్రం జేబులో వేసుకుంటూ వచ్చిన వాళ్లకి ఈ ఏర్పాటు అసంతృప్తి, ఆగ్రహం కలిగించాయి. ఎందుకంటే - గోశాలలు కట్టిచ్చి, గోపోషణ సదుపాయాలు కల్పిస్తున్నందుకు నామమాత్రపు ఫీజుని టిటిడికి వాళ్లు చెల్లించాల్సి వుంటుంది. పైగా, ఇలా ఏర్పాట్లు చేశాం కనుక, తిరుమల రోడ్లమీద ఆవుల సంచారాన్ని నిషేధించాం. (తిరుమల పంచాయితీ ఆఫీసర్ హోదాలో ఇలాంటి నిబంధనలు ప్రవేశపెట్టే అధికారం టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి వుంటుంది.)

దీనికి తోడు, టిటిడి వనాల్లో చెట్లునరకటాన్ని నిషేధించాం. తిరుమల వాసులకి వంటచెరకు లేదని ఎవరూ గొడవ చేసే పరిస్థితి లేకుండా అటవీశాఖ సహకారంతో వంటచెరకు డిపోలు పెట్టించాం. పైగా తిరుమల క్యాంటీన్, ప్రైవేట్ హోటళ్లు, కళ్యాణకట్ట, టిటిడి క్వార్టర్సు, తిరుమల వంటశాలలో పలుచోట్ల వంట చెరకు వాడకం మానేసి, ఆ స్థానంలో కేంద్ర ప్రభుత్వ పెట్రోలియమ్ మంత్రిత్వ శాఖ సహకారంతో వంటగ్యాస్ ప్రవేశపెట్టాం. సత్రాలు, కళ్యాణకట్ట, కాటేజీలు, గెస్ట్‌హవుస్‌లలో వేడినీటికోసం సౌరశక్తితో పనిచేసే వాటర్ హీటర్ సదుపాయం కల్పించాం. "విజయ డైరీతో మాట్లాడి, రాత్రింబవళ్లు తిరుమల కొండమీద పాలు దొరికే ఏర్పాటు కూడా చేశాం.. ఈ చర్యలన్నీ యాత్రికుల ప్రశంసలు చూరగొన్నాయి. కానీ, దీంతో ప్రైవేటు పాలవిక్రేతల వ్యాపారం దెబ్బతింది. అలాగే వంట చెరకుని సమీప వనాల్లోంచి ఉచితంగా తీసుకువచ్చి అమ్ముకుంటూ వచ్చిన వాళ్ల ఆదాయానికి గండిపడింది... ఇలా టిటిడి నిర్ణయాలమూలంగా నష్టపోతున్నా మనుకుంటున్న వాళ్లందర్నీ స్థానిక నాయకులు చేరదీశారు.

మాస్టర్ ప్లాను అమలు చేయటం మొదలు పెట్టినప్పట్నుంచి, స్థానికంగా తమ పట్టు నిలబెట్టుకోటానికి అదనుకోసం ఎదురు చూస్తున్న స్థానిక నాయకులు ఇదేఛాన్సని రంగంలోకి దూకారు. వినతి పత్రాలతో, ఆరోపణలతో ముఖ్యమంత్రిని చుట్టుముట్టారు. నిజానికి ఈ నాయకులెవరూ 'ఆవుకథ'ల బాధితులు కాదు, లైసెన్సు బాధితులు కాదు. వాళ్లు కొండమీద కొన్ని మఠాల్ని కబ్జాచేశారు. కొన్ని టిటిడి స్థలాల్ని ఆక్రమించారు. అనేక సంవత్సరాలుగా వాళ్ల అక్రమ ఆక్రమణలో వున్న ఈ స్థలాల్ని - మాస్టర్‌ప్లాను అమలు చేయటంలో భాగంగా స్వాధీనం చేసుకోవాలని





టిటిడి ప్రయత్నంచేసింది. ఇంకా చేస్తోంది. అదే నేను వాళ్ల ఆగ్రహానికి లక్ష్యం కావటానికి కారణమైంది.

నా విశ్వాసం అంతా నేను తీసుకున్న చర్యల మీదే. "అన్నీ మంచి పనులే చేశాం కదా" అని ఓ ప్రక్క అపారమైన ఆత్మవిశ్వాసం. కాని నా చర్యల వల్ల ఆనందపడుతున్న యాత్రికులు గానీ, ఇతర స్థానికులుకానీ అక్కడ లేరు. ముఖ్యమంత్రి ముందు చేరిన జనం అంతా నన్ను ద్వేషిస్తున్న వాళ్లే. వాళ్లు నా మీద ఆరోపణాస్త్రాలు సంధిస్తే, నాతరఫున వాదించేదెవరు? నన్ను సమర్థించేదెవరు?... ఇలా డీలా పడిపోతున్నాను.

అంతలో మరింత గట్టిగా నినాదాలు వినిపిస్తున్నాయి. "బెగ్గర్ల (భిక్షకుల) కడుపుకొడ్తున్న ప్రసాద్‌ని తిరుమల నుంచి తరిమేయాలి... ప్రసాద్ డౌన్ డౌన్..." వాళ్ల నినాదాలు ముఖ్యమంత్రి అంజయ్య దృష్టిని ఆకర్షించాయి.

"ఏంటీ, కడుపుకొడ్తన్నరా? ఎవరు?"అంటూ వాళ్లని ముందుకు రమ్మన్నారు ముఖ్యమంత్రి. వాళ్లంతా మాకుమ్మడిగా నామీద తమ అక్కసునంతా ఆయన ముందు వెళ్లబోసుకున్నారు.

"అన్నా, తాతముత్తాతల కాలం నుంచీ ఇక్కడే అడుక్కుంటన్నాం. ఇయ్యాల ఈ ప్రసాదొచ్చి మమ్మల్నందర్నీ తిరుపతికి గెంటేసిండు. మా కడుపు కొట్టేసిండు..." అంటూ వాళ్లు శ్రీ అంజయ్య కాళ్లమీద పడ్డారు.

నిజమే! స్వామిని నిర్మలచిత్తంతో, ప్రశాంత వాతావరణంలో సేవించాలని వచ్చే భక్తుల్ని కొండమీద ప్రతిక్షణం "పుణ్యం, దానం" పేరుతో వేధిస్తున్న భిక్షకుల సంఖ్య నేను వెళ్లేనాటికే వందల్లో వుంది. వీళ్ల మీద యాత్రికుల ఫిర్యాదులు కోకొల్లలుగా వస్తున్నాయి. శ్రీవారిని నమ్మి, మనస్ఫూర్తిగా ఆయన్ని కలవాలని వచ్చే భక్తుల సదుపాయం చూడడం నా విధ్యుక్తధర్మం తప్ప "పెట్టుబడిలేకుండా, శ్రమ లేకుండా యాత్రికుల్ని వెంటాడి పొట్టబోసుకుంటున్న వాళ్లని ప్రోత్సహించటం కాదు" అని విశ్వసించాను. అందుకే తిరుమల కొండ మీద భిక్షాటనని పూర్తిగా నిషేధించాను. కొండమీద ఎక్కడన్నా ఎవరన్నా భిక్షాటన చేస్తూ కనుపిస్తే, వాళ్లని మరుక్షణం, తిరుపతికి రవాణా చేయించేయాలని ఆదేశాలిచ్చేశాను. ఈ ఆదేశాల్ని అప్పటి విజిలెన్స్ - సెక్యూరిటీ ఆఫీసర్ జనార్దన నాయుడు నిర్దాక్షిణ్యంగా అమలు చేయసాగాడు! అంతే! నేను వాళ్ల దృష్టిలో పరమ కర్కోటకుడిగా కనుపించాను. వీళ్లందరికీ సలహాదార్లు ఇద్దరు ముగ్గురు స్థానిక నాయకులు. "తినటానికి గతిలేని నిరుపేదల్ని అతి నిరంకుశంగా పాశవికంగా తిరుమల నుంచి గెంటేసిన రాక్షసుడు ఈ ఇ.ఓ. దానం చేసుకుని పుణ్యం సంపాదించుకునే అవకాశం యాత్రికులకు లేకుండా చేసిన దుర్మార్గుడు. ఈయన్ని బదిలీ చేసి, మా పేదల్ని నువ్వే కాపాడాలన్నా"అంటూ ఆ నాయకులు ఆ నినాదాల మధ్యలో ముఖ్యమంత్రి అంజయ్యని అర్థిస్తున్నారు.

వాళ్ల ఒత్తిడి, వాళ్ల ప్రార్థన, వాళ్ల నినాదాలు - ముఖ్యమంత్రిని కదలనీయలేదు. ఆయన ముఖంలో వాళ్లకి వచ్చిన కష్టం పట్ల సానుభూతి తొంగిచూస్తోంది. ఆయన ముఖ్యమంత్రి అయి వారం పదిరోజులుకూడా గడవలేదు. తిరుమల శ్రీనివాసుడి దర్శనం కోసం ముఖ్యమంత్రి హోదాలో వచ్చీరాగానే "నాయకుల కష్టాలన్నీ" ఆయన్ని చుట్టుముట్టాయి. స్థానిక నాయకుల పార్టీ అనుబంధాలు (వాళ్ళూ, ఆయనా ఒకటే పార్టీ) కూడా ఆయన్ని మొహమాట పెట్టేస్తున్నాయి. నా ఆత్మ విశ్వాసం క్రమంగా క్షీణిస్తోంది... అక్కడున్నవాళ్లలో దేవాదాయశాఖామంత్రి శ్రీ పివి చౌదరి, టిటిడి ఛైర్మన్ శ్రీనాగిరెడ్డి, బోర్డు మెంబర్లకి మాత్రమే నేను తీసుకున్న ఈ చర్యల వెనుక లక్ష్యం ఏమిటో తెలుసు. కాని ఈ స్థానిక నాయకుల వత్తిడికి ముఖ్యమంత్రి లొంగిపోయే పరిస్థితిలో - వాళ్లెవరూ ఆయన్ని కాదని ఏమీ చెయ్యలేరు.

అసలు ముఖ్యమంత్రి తిరుమలకి వస్తున్నారని తెలిసినప్పుడే టిటిడి ఛీఫ్ సెక్యూరిటీ ఆఫీసర్ - అడిషనల్ పోలీస్ సూపరింటెండెంట్ శ్రీరామచంద్రారెడ్డి, జనార్దననాయుడు వచ్చి, ఇలా స్థానిక నాయకులు - ఈ అసంతృప్త వర్గాలన్నింటినీ కూడగట్టుకొని ముఖ్యమంత్రిని కలిసి, నా మీద ఫిర్యాదు చేయాలని చూస్తున్నారని నన్ను హెచ్చరించారు.

"వాళ్లు చాలా పెద్ద నిరసన ప్రదర్శన ప్లాన్ చేస్తున్నారు. స్థానిక నాయకులంతా తాడో పేడో తేల్చుకోవాలని బలప్రదర్శనకి దిగుతున్నారు. మనం ముందుగానే దాన్ని నిషేధించకపోతే, మీరు చాలా ఇబ్బందుల్లో పడతారేమో సార్" అంటూ నాకు సలహాలిచ్చారు. "నిజంగా ఈ నిరసన ప్రదర్శన నాకు అంత ఇబ్బంది కలిగిస్తుందా? దీన్ని నిషేధించాలా?" బాగా ఆలోచించాక, అనవసరమనిపించింది.

"నేను చేసిందంతా తిరుమల వేంకటేశ్వరుడ్ని ఆరాధించాలని వచ్చే భక్తకోటికి సరైన సదుపాయాలు కల్పించాలన్న లక్ష్యంతో చేసిందే. ఒకవేళ నా నిర్ణయం తప్పయితే, స్వామి నన్ను శిక్షించినా, నేను అనుభవించి తీరాలి. నా నిర్ణయం సరయినదయితే ఎవరెన్ని నిరసన ప్రదర్శనలు చేసినా స్వామే చూసుకుంటాడు..." అన్న ఒకే ఒక ఆశతో, ఆఫీసర్స్ ఇచ్చిన సలహాను నేను ఖాతరు చేయలేదు. "ఎంతమంది వచ్చి, ముఖ్యమంత్రికి ఏం చెప్పినా చెప్పనివ్వండి. వాళ్ల వాదనలు అన్యాయమైనవనీ, నిర్హేతుకమైనవనీ చెప్పటానికి మనమెవరం? అయినా వాళ్లకి నష్టం, కష్టం కలిగించటం కోసమే మనం ఈ పనులు చేయలేదు కనుక వాళ్ల పట్ల మనకి ద్వేషభావం వుండక్కర్లేదు. రానీయండి - ముఖ్యమంత్రిని కలుసుకుని విన్నవించుకునే హక్కు ప్రజాస్వామ్యంలో అందరికీ వుంటుంది..." అంటూ 'ప్రదర్శన నిషేధం' సూచనని తీసి పారేశాను. ఫలితం? ఇప్పుడీ పంచాయితీలో దోషిలా నిలబడిపోయాను. ఏం చేయాలీ?

ఈ ప్రమాదాన్ని ముందే పసిగట్టిన దేవాదాయమంత్రి శ్రీచౌదరీ, టిటిడి ఛైర్మన్ శ్రీనాగిరెడ్డి కొంచెం ముందుగానే ముఖ్యమంత్రికి వాస్తవాలు వివరించాలనుకున్నారు. కాని, రేణిగుంట





విమానాశ్రయంనుంచి తిరుమల కొండమీద గెస్ట్‌హవుస్‌కి వచ్చేదాకా వాళ్లకి ఎక్కడా సందు దొరకలేదు. గెస్ట్‌హవుస్‌కి వచ్చేసరికి నిరసన ప్రదర్శన సిద్ధం.

నినాదాల హోరు తగ్గాక, ముఖ్యమంత్రి ఒక ప్రతినిధి బృందాన్ని లోపలకు పిలిపించారు. జిల్లా కలెక్టరూ, నేనూ ఓ ప్రక్కగా వున్నాం. దేవాదాయ మంత్రి, బోర్డు ఛైర్మన్ కూడా చూస్తున్నారు.... నాయకులు గళం విప్పారు. నేను ఎలా "హాకర్స్ కడుపుకొట్టానో, గోపోషకుల్ని హింసిస్తున్నానో, భిక్షకుల పొట్టకొడుతున్నానో, స్థానికుల్ని వేధిస్తున్నానో..." ఇలా పుంఖాను పుంఖాలుగా ఆరోపణలు వీరావేశంతో గుప్పించారు. "ప్రసాద్ ఇక్కడ వుంటే మనపేద జనం బ్రతకలేరన్నా, ఆయన్ని మార్చేయండి, తిరుమలని బాగుచేయండి.." అంటూ మళ్లీ "అంజయ్య జిందాబాద్" నినాదాలిచ్చారు. అంతలో బయట గుమిగూడిన మూడువందల మందీ పెద్ద పెట్టున నినాదాలు చేశారు. "అంజయ్య జిందాబాద్, ప్రసాద్ డౌన్ డౌన్.."

నిస్సత్తువ నన్ను ఆవరించింది. గట్టిగా మాట్లాడలేని స్థితి నాది. నా స్థితి గమనించిన దేవాదాయమంత్రి (నన్ను సమర్థించగలిగిన, వాస్తవాలు తెలిసున్న వ్యక్తి) శ్రీ చౌదరి - ముఖ్యమంత్రి దగ్గరకెళ్లి ఆయన చెవిలో "మీరు తొందరపడి ఏ నిర్ణయమూ..." అంటూ చెప్పబోయారు. శ్రీ అంజయ్య సీరియస్‌గా ఆయన్ని వారిస్తున్నట్లుగా చేత్తో సైగ చేస్తూ, చౌదరిని ఆపేశారు. నాకున్న ఒకే ఒక్క ఆశ అక్కడితో అడుగంటిపోయింది.

నా కాళ్ల క్రింద భూమి కదిలిపోతున్నట్లు, అవమానభారంతో నేను మరి కొన్ని క్షణాల్లో భూమిలోకి కూరుకుపోతున్నట్లు... ఏవేవో భావాలు నన్ను ఆవరించేస్తున్నాయి.

ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య సీరియస్‌గా వాళ్లందరివంకా చూస్తూ "ప్రసాద్ సంగతి నాకు ఇప్పుడు కాదు, ఆయన ముఖ్యమంత్రి పి.వి. నరసింహారావుగారి దగ్గర సెక్రటరీగా వున్నప్పట్నుంచీ తెలుసు..." అంటూ ఓసారి నాకేసి చూశారు. అంటే! అగ్నికి ఆజ్యంలా ఈ గొడవకి పొలిటికల్ ఈక్వేషన్స్ కూడా తోడయ్యాయా? అయ్యో! ఇంకెవరు నాకు దిక్కు???... నన్నెవరు ఇక్కడకు (తిరుపతికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా) తీసుకువచ్చాడని నమ్ముతున్నానో ఆ శ్రీనివాసుడే దిక్కు.. "త్వమేవ శరణం మమ..."


ముఖ్యమంత్రి శ్రీ అంజయ్యగారితో

"స్వామీ, నీవే దిక్కు" అని కళ్లుమూసుకుని శ్రీనివాసుడ్ని తలుచుకుంటున్నాను. అంతలో-

"... అంచేత ప్రసాద్ గురించి నాకు చెప్పొద్దు. ప్రసాద్ వల్ల మీకు మంచి జరక్కపోతే ఇంకెవరి వల్లా జరగదు. మీరిచ్చిన కాగితాలన్నీ ఇ.ఓ. కే ఇస్తున్నా.."

ఒక్కసారిగా నా చెవుల్లో అమృతం చిలికినట్లు అనిపించిన ఈ మాటలు ఇక్కడ్నుంచేనా? నమ్మలేక, కళ్లు తెరిచి చూశాను. ముఖ్యమంత్రి ఆ వినతిపత్రాలన్నీ నా చేతుల్లో పెట్టి, నా వంక ప్రసన్నవదనంతో ఓ చూపు చూసి ఆ జనంతో ఇలా అన్నారు-

"ఓ మంచి పని జరగాలంటే కొంతమందికి జర ఇబ్బంది వుండొచ్చు. అలాగని అసలు మంచి పనులే వద్దంటే ఎట్ల? ప్రసాద్ చేస్తున్న మంచి పనులన్నీ నాకు తెలుసు. పోండి. మీరు పోయి ఆయనతో మాట్లాడుకోండి...".

నాయకులు అయోమయంతో ఒకరి మొహాలొకరు చూసుకుంటూ, జరిగిందేమిటో అర్థం చేసుకునే లోపల ముఖ్యమంత్రి బయల్దేరారు - శ్రీనివాసుడి దర్శనానికి.

... ఓహ్! నాకు తెలీకుండానే నాకంటినిండా ఆనందబాష్పాలు... క్షణకాలం క్రితం కాళ్లక్రిందభూమి కదిలిపోతున్నట్లుంది. ఇప్పుడు మనసుకి రెక్కలొచ్చి ఆకాశంలోకి ఎగిరిపోతున్నట్లుంది.

ఎవరిచ్చారీశక్తి?



ఉద్యానవనాల అభివృద్ధిలో దేశంలోకెల్లా ఉత్తమసంస్థగా టీ.టీ.డి ఎన్నికైన సందర్భంగా ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీతో పి.వి.ఆర్.కె.ప్రసాద్, శ్రీ శ్రావణ్‌కుమార్, షీల్డ్‌తో గార్డెన్ సూపరింటెండెంటు శ్రీ తమ్మన్న

★ ★ ★



# 22

# అంధకారంలో ఓ అనుభవం

ఏటా గోదాదేవి కళ్యాణం రోజున శ్రీనివాసుడి దగ్గర్నుంచి ఆలయ మర్యాదలతో ఒక పట్టుచీరె - తమిళనాడులోని శ్రీవిల్లి పుత్తూరులోగల గోదాదేవి అమ్మవారి ఆలయానికి 'శ్రీవారి బహుమతి'గా వెళ్తూంటుంది. ఈ సాంప్రదాయం మొదలవటానికి కారణం ఒక తుఫాను రాత్రి - కుండపోతవానలో, పెనుగాలి బీభత్సంలో, అంధకారంలో నాకు ఎదురైన అనుభవం!

★ ★ ★

శతాబ్దాలుగా తిరుమల శ్రీ వేంకటేశ్వరుడికి, శ్రీవిల్లి పుత్తూరులోని అమ్మవారికి మధ్య అవినాభావ సంబంధం వుంది. అక్కడ అమ్మవారు అంటే గోదాదేవి శ్రీ మహావిష్ణువు సతి భూదేవి అవతారమే అని చెబుతుంటారు. చారిత్రక ఆధారాల ప్రకారం - విష్ణు చిత్తుడు అనే వైష్ణవ మహా భక్తుని (పెరియాళ్వార్)కి తన తులసి తోటలోఒక ఆడశిశువు దొరికింది. ఆనందాశ్చర్యాలతో, ఆ భక్తుడు ఆ శిశువు తనకి లభ్యంకావటాన్ని దైవఘటనగా భావిస్తూ, ఆ శిశువును తెచ్చి పెంచుకుంటాడు. ఆమే గోదాదేవి. ఆ చిరంజీవికి మాటలు వచ్చిందగ్గర్నుంచీ 'రంగనాథా' అని కలవరిస్తూ పెరిగింది. క్రమేణా ఆమెలో శ్రీరంగంలోని శ్రీరంగనాథుని (మహావిష్ణువు) పట్ల ప్రేమారాధన పెరిగిపోతూ వచ్చింది. అనుక్షణం రంగనాథుని స్మరణతప్ప మరో చింతన లేదు గోదాదేవికి. చివరికి ఆమె రంగనాథస్వామినే వివాహమాడింది. అయితే రంగనాథస్వామి చింతనలో పొంగిపొర్లే భక్తిపారవశ్యంతో స్వామిని ఆరాధిస్తూ, ఆశువుగా గోదాదేవి గానం చేసిన పదాలే నేటికీ 'తిరుప్పావై'గా ప్రచారంలో వున్నాయి.

నిజానికి శ్రీరంగంలో శ్రీరంగనాథుడన్నా, తిరుమలకొండ మీద శ్రీ వేంకటేశ్వరుడన్నా ఒకరే - 'శ్రీ మహావిష్ణువు'. దక్షిణాది రాష్ట్రాల్లో మ్లేచ్ఛుల దండయాత్రలు సాగినకాలంలో, శ్రీరంగంలోని రంగనాథుని ఆలయాన్ని భక్తులు మూసివేసి, స్వామివారి ఉత్సవ విగ్రహాలను, ఇతర విలువైన ఆభరణాలను తిరుమల కొండకుతరలించి, శ్రీనివాసుని ఆలయంలో భద్రపరిచారు. అలా, శ్రీరంగనాథుడు తిరుమల ఆలయంలో అనేక సంవత్సరాలు వుండిపోయారు. (మ్లేచ్ఛుల దండయాత్రల తాకిడి క్షీణించిపోయాక, ఆ విగ్రహాలను, ఆభరణాలను తిరిగి శ్రీరంగం తరలించారు.) ఆ కారణంగానే ఇప్పటికీ తిరుమల ఆలయంలో అప్పట్లో రంగనాథుడు వున్న మంటపాన్ని 'రంగమంటపం' అని పిలుస్తుంటారు. మనకు తెలిసినంతవరకూ ఒక శతాబ్దానికిపైగా సాగుతున్న సాంప్రదాయం ఏమిటంటే, తిరుమలలో శ్రీనివాసుని బ్రహ్మోత్సవాల కాలంలో, స్వామివారికి శ్రీవిల్లి పుత్తూరు ఆలయం నుండి గోదాదేవి పేరుమీద ఒక వస్త్రం, పూలమాలలు బహుమానంగా వస్తూంటాయి. దీనికి ప్రతి బహుమానంగా తిరుమల నుంచి ఒక చీరె, ప్రసాదం అమ్మవారి ప్రతినిధికిచ్చి పంపిస్తుంటారు.

నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా (1978లో) బాధ్యతలు తీసుకున్నదగ్గర్నుంచి, దక్షిణాదిలోని అనేక ఆలయాలను సందర్శించాను కానీ, శ్రీవిల్లి పుత్తూరుకి వెళ్లటం ఎప్పుడూ జరగలేదు... 1981లో కేరళలోని గురువాయూరులో శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయంలో ఒక మంటపం నిర్మాణం సందర్భంగా నేను గురువాయూరు వెళ్లటం సంభవించింది. నా కార్యక్రమం ప్రకారం గురువాయూరు కార్యక్రమం తరువాత నేను కారులో బయల్దేరి తిరువనంతపురంకి, అక్కడ్నుంచి తిరుచందూరుకి, కొర్తాళం, మధురై, తిరుచ్చి, శ్రీరంగం మీదుగా మద్రాసుకి రావల్సి వుంది. నేను బయల్దేరబోయే ముందు, పారె పత్తేదారు శేషాద్రి వచ్చి, నేను తిరిగి వచ్చేటప్పుడు శ్రీరంగం దారిలో వున్న శ్రీవిల్లి పుత్తూరు కూడా వెళ్లి, అమ్మవారిదర్శనం చేసుకుంటే బాగుంటుందని సూచించాడు. (నిజానికి అంతకుముందు కూడా ఒకసారి అక్కడి అర్చకులు తిరుమల వచ్చినప్పుడు నన్ను కలిసి శ్రీవిల్లిపుత్తూరు రమ్మని ఆహ్వానించి వున్నారు.) శేషాద్రి చెప్పగానే, నాకు మనస్ఫూర్తిగా అనిపించింది -"అవును, అక్కడ అమ్మవారి దర్శనం చేసుకు తీరాలి. ఆ తల్లి దీవెనెలు తీసుకోవాలి". నా ఆసక్తి గమనించిన శేషాద్రి, నేను ఎక్కడదారి మళ్లితే శ్రీవిల్లి పుత్తూరు కూడా వెళ్లగలనో చెప్పాడు. "మీరు ఏరోజు సుమారుగా ఏ సమయంలో అక్కడికి వెళ్లగలరో చెబితే, నేను అక్కడి అర్చకులకు ఫోన్‌చేసి చెబుతాను సర్" అన్నాడుశేషాద్రి. కాని అక్కడికి ఏరోజు ఎన్నిగంటలకి వెళతానో నాకే తెలీదు. అందుకే "నువ్వేం చెప్పొద్దు. నేను వెళతాను లేవయ్యా" అనేశాను. కారెక్కేశాను... ఆ తరువాత ఆ విషయమే మర్చిపోయాను.

గురువాయూరులో కార్యక్రమం పూర్తయింది. తిరుచందూరు మీదుగా కొర్తాళం వచ్చాను. అప్పటికి నిర్ణీత కార్యక్రమంలో ఒకరోజు వెనుకబడిపోయాను. ఒకదానికొకటిగా అనేక సంఘటనలు





నా కార్యక్రమంలో జాప్యాన్ని పెంచేశాయి. లేటవుతున్న కొద్దీ, ఎంతత్వరగా మద్రాసు చేరుకుంటానా అన్న ఆత్రుత పెరిగిపోతోంది.

ఉదయాన్నే బయల్దేరాలనుకున్నప్పటికీ బాగా లేటయిపోయింది. వాతావరణం మారిపోయింది. బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడిందట. కుండపోతగా వాన మొదలైంది. సాయంత్రం 5. 30 గంటలకల్లా మధురై చేరాల్సి వుంది. కాని రాత్రికైనా చేరగలమో లేదో తెలీని పరిస్థితి. క్షణాల్లో ఆకాశంలో వర్షంతో పాటు మబ్బులు దట్టంగా కమ్మేశాయి. చుట్టూ చిమ్మచీకటి అలుముకుంది. పది గజాల అవతల ఏముందో డ్రైవర్‌కి కనబడటం లేదు. మేం ఏ ప్రాంతంలో వున్నామో కూడా తెలీటం లేదు.

నాకు ధీమా తగ్గలేదు. ఎందుకంటే రోడ్డుబాగా వుంది కాబట్టి గట్టిగా ప్రయత్నిస్తే ఒకగంటన్నర - రెండు గంటల్లో మధురై చేరిపోవచ్చని నా నమ్మకం. డ్రైవర్‌ని ప్రోత్సాహ పరచటం ఆరంభించాను. "రోడ్డు బాగుంది కదా, మెల్లగా నడుపు ఫరవాలేదు. మధురై చేరిపోయేలా చూడు" అంటూ డ్రైవర్‌కి కూడా ధీమా పెంచే ప్రయత్నం చేస్తున్నాను...

సడన్‌గా డ్రైవర్ కారాపేశాడు. ఆ చీకట్లో, ఆ జడివానలో - కారు హెడ్‌లైట్ల వెలుగులో మాత్రమే కనబడిన ఆ దృశ్యం చూసి అవాక్కయిపోయాను - అంత పెద్ద రోడ్డుకి గండి పడింది. కారు ఒక్క అడుగుకూడా ముందుకుపోలేని పరిస్థితి ... నాలో పట్టుదల పెరిగింది. కారు వెనక్కు తిప్పమన్నాను. ఒక టీ దుకాణం కనబడినచోట ఆపి, "ఏ మార్గంలో వెళితే, ఈ మెయిన్ రోడ్డుని మళ్లీ కలవగలం?" అని అడిగాం. వాళ్లు చెప్పిన దాని ప్రకారం - మేం ఇంకో రెండు కిలోమీటర్లు వెనక్కు వెళ్లి, ఎడమ ప్రక్కకు తిరగాలి. ఆ రోడ్డు మీద నేరుగా వెళితే, మధ్యలో ఓ వూరు వస్తుంది. ఆ వూరు దాటగానే ఆ రోడ్డు కుడివైపుకి ఒక మలుపు తిరిగి ఈ మెయిన్ రోడ్డుని కలుస్తుంది.

వాళ్లు ఇచ్చిన సూచనల ప్రకారమే - రెండు కిలోమీటర్లు వెనక్కి వచ్చాం. ఎడమ పక్క రోడ్డులోకి తిరిగాం. ఆ దారిలో వున్న వూళ్లోకి వచ్చేసరికి, అక్కడ కరెంటు పోయింది. వూరిమధ్యలోకి వచ్చేసరికి, కారు సడన్‌గా ఆగిపోయింది. నాకు చిరాకు వచ్చేసింది. "ఏమిటిది? ఈ ప్రయాణం ఇలా అయిపోయింది" అనుకుంటూ డ్రైవర్‌ని - కారు ఎందుకు ఆగిపోయిందో దిగి చూడమన్నాను. నేను గొడుగు పట్టుకోగా ఆ కుంభవృష్టిలో, అంధకారంలో అతను నా మాట కాదనలేక కారు దిగి, బాయ్‌నెట్ ఎత్తి, టార్చిలైటు వేసుకొని ఇంజన్‌లో ఎక్కడ లోపం వుందో చూసే ప్రయత్నం చేస్తున్నాడు. క్షణాలు, నిమిషాలు... ఓ పది నిమిషాలపాటు అలా వర్షంలో తడుస్తూనే ఇంజన్‌తో కుస్తీపడుతున్నాడు...

అంతలో వర్షం ఒక్కసారిగా వెలిసింది. గాలులు తగ్గిపోయాయి. అంతా చిమ్మచీకటిగానే వున్నా, వర్షం తగ్గింది కదాని మేం ఎక్కడ వున్నామా అని విచారించాను...

అద్భుతం! ఆ వూరి పేరు శ్రీవిల్లి పుత్తూరుట. నాకుచీకట్లో తెలియలేదు కానీ తలెత్తి చూస్తే పక్కనే అమ్మవారి గుడి గోపురం కనుపిస్తోంది. అప్పుడే - అప్పుడే నాకు జ్ఞాపకం వచ్చింది శేషాద్రి చెప్పిన విషయం. నేను అనుకున్న కోరిక మనసులో మెదిలింది. ఎలా మర్చిపోయాను? మర్చిపోయినా, ఇక్కడికే ఎలావచ్చాను? వచ్చినా, నా కారు ఇక్కడే ఎందుకు ఆగిపోయింది? భయంకరంగా కురిసిన జడివాన ఇప్పుడే ఎందుకు ఆగిపోయింది? కారు దిగాలని ఎందుకు అనిపించింది?... ఎన్నో ప్రశ్నలు, సందేహాలు!

వాటికి సమాధానం వెతికే ప్రయత్నం చేయలేదు. కోరుకున్న ప్రకారం అమ్మవారి దర్శనం చేసుకోవాలనుకున్నాను. డ్రైవర్‌ని తీసుకుని, ఆలయంలో అడుగు పెట్టాను. మరుక్షణంలో వూరంతా కరెంటు వచ్చేసింది. ఆలయంలో అర్చకులు నన్ను చూస్తూనే గుర్తు పట్టారు. సాదరంగా ఆహ్వానించి అమ్మవారికి అర్చన చేయించారు. అపారమైన తేజస్సు ఉట్టిపడే గోదాదేవిని చూస్తూ నన్ను నేను మైమరిచిపోయాను. "దారి తప్పబోయిన నన్ను దారి మళ్లించి, తన దారిలోకి రప్పించి అమ్మవారే నా ఈప్సితాన్ని నెరవేర్చిందేమో.."అనిపించింది.

మేం బయటకొచ్చాక, కారు క్షణాల్లో స్టార్టయింది. క్షేమంగా వచ్చేశాం. ఆ అనుభవం కలిగించిన ప్రేరణ కారణం కావచ్చు- నేను తిరుపతికి రాగానే ప్రతి ఏటా 'ఫాల్గుణమాసంలో - ఉత్తర నక్షత్రం రోజున జరిగే గోదాదేవి కళ్యాణానికి శ్రీ వేంకటేశ్వరుని తరపున ఆలయమర్యాదలతో పట్టుచీరె వగయిరా బహుమతులు పంపాలని ప్రతిపాదించాను. టిటిడి బోర్డు ఆమోదించింది. గత 20 ఏళ్లుగా ఇది అమలు జరుగుతూనే వుంది!!

* * *



# 23

## నేను నేరస్థుణ్ణి (కర్మణ్యేవాధికారస్తే...)

**త**మిళనాడులోని మీనాక్షిపురంలో హిందువుల సామూహిక మతమార్పిడులు జరిగిన ఒక ఏడాది - ఏణ్ణర్థం తరువాత ఒక రోజు రాష్ట్రప్రభుత్వం నాకు సంజాయిషీ నోటీసు జారీచేసింది!

"రాష్ట్రంలో మత సామరస్యానికి భంగం కలిగిస్తున్నందుకుగాను మీమీద ఎందుకు చర్యతీసుకోకూడదు?..."

ఇదీ ఆ నోటీసు సారాంశం.

చేసిన 'నేరా'నికి నేను "తల వంచక" తప్పలేదు. నిజానికి జరిగింది 'నేరమే' అయివుంటే, "నేరస్థుడెవరు?" అన్నది ఇప్పటికీ ప్రశ్నార్థకమే!

* * *

**1978**లో నేను తిరుమలతిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా బాధ్యతలు స్వీకరించేనాటికి ఒకే దేవాదాయధర్మాదాయ చట్టం క్రింద రాష్ట్రంలోని అన్ని ఆలయాలతోపాటు తిరుమల ఆలయంకూడా వుండేది. క్రమంగా తిరుమలకి వస్తున్న భక్తుల సంఖ్య, ఆదాయం పెరుగుతూండటం, ఆలయ సేవల నిర్వహణాపరిధి విస్తరిస్తూండటం వంటి కారణాలవల్ల, టిటిడికి ఒక ప్రత్యేకచట్టం వుండాలని ప్రభుత్వం భావించింది. అందుకు తగినట్లుగా ఈ చట్టాన్ని రూపొందించడంలో అప్పటి ముఖ్యమంత్రి డాక్టర్ మర్రిచెన్నారెడ్డి ప్రత్యేక శ్రద్ధ వహించారు. పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీగావున్న ట్రస్టుబోర్డు ఛైర్మన్ డాక్టర్ రమేశన్, దేవాదాయశాఖ కమీషనర్ శ్రీచంద్రమౌళిరెడ్డి, నేను కలిసి ఈ చట్టం రూపకల్పన కార్యక్రమం చేపట్టాం.

ఈ చట్టం ప్రకారం - తిరుమల తిరుపతి దేవస్థానాలు నిర్వర్తించాల్సిన విధులను వాటివాటి ప్రాధాన్యతలను బట్టి ఇలా నిర్ణయించటం జరిగింది....

శ్రీనివాసుని సేవలు-ఆలయనిర్వహణ, తిరుమలలో యాత్రికుల సదుపాయాలు, తిరుపతిలో యాత్రికులసదుపాయాలు, సనాతన ధర్మరక్షణ- ప్రచారం, ఇదే లక్ష్యాలతో పనిచేసే ఇతర సంస్థలకు తగిన చేయూతనందివ్వడం, వివిధ ప్రాంతాలలో ప్రార్థనామందిరాలు - కళ్యాణమండపాలు నిర్మించడం, ధార్మిక, విద్యా, సాంఘిక సేవాకార్యక్రమాలు నిర్వహించటం.

ఉచిత మెడికల్ సదుపాయాలు, వికలాంగులకు చేయూత వగైరా సేవల్ని తిరుపతిలోనే నిర్వహించాలని కూడా ఈ చట్టంలో సూచించడం జరిగింది....

అయితే హిందూధర్మ రక్షణ - ప్రచారం బాధ్యతలను టిటిడి చేపట్టాలా? చేపడితే ఎంతవరకు చేపట్టవచ్చు? అసలు దాని ఆవశ్యకత వుందా?... అన్న అంశం కూడా మేం ఈ చట్టాన్ని రూపొందిస్తున్నప్పుడు చర్చకు వచ్చింది. ఈ అంశం మీద చాలా సుదీర్ఘమైన చర్చ జరిగింది.

★ ★ ★

బ్రిటిషువారు ఈ దేశాన్ని పాలించినప్పుడు, హిందూమత సాంప్రదాయాల ఆచారాల జోలికిమాత్రం వాళ్లుపోలేదు. అయితే క్రైస్తవమతం పట్ల వాళ్లకున్న పక్షపాత వైఖరికారణంగా క్రైస్తవవిద్యా, వైద్య సంస్థల ఏర్పాటుకి, చర్చిల నిర్మాణానికి సహకరించడంద్వారా, బ్రిటిష పాలకులు ఈ దేశంలో క్రైస్తవమత వ్యాప్తికి తోడ్పడ్డారు. హిందూరాజులు, ముస్లింరాజులు పాలిస్తున్న ప్రాంతాలలో - ఆయా పాలకుల మత విశ్వాసాల కనుగుణంగా విద్యా, మత విశ్వాసాలు పాటించబడినప్పటికీ, దేశంలో అధికభాగం బ్రిటిషు పాలకుల ప్రభావంలో వుండటంతో, ప్రత్యేకంగా హిందూ మత సంబంధమైన కార్యక్రమాలకు పాలకుల ప్రోత్సాహం తగినంతగా





లేకుండాపోయింది. ఆ పరిస్థితుల్లో హిందూధర్మ రక్షణ బాధ్యత పూర్తిగా హిందూ ధార్మిక సంస్థలు, మఠాలు, ఆలయ నిర్వాహకుల మీదే వుండిపోయింది. పాలకుల ప్రోత్సాహం కరువైన కారణంగా - హిందూ మత సిద్ధాంతాలు, విశ్వాసాల ప్రచారం తగ్గి, ఏదో అనాదిగా వస్తున్న రోజువారీ పూజలు, పండుగలు, ఉత్సవాలు, తిరణాళ్ళు వగయిరా సాంప్రదాయిక కార్యక్రమాలకు మాత్రమే ఈ సంస్థలు సయితం పరిమితమవుతూ వచ్చాయి.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక పరిస్థితిమరింత మారిపోయింది. సెక్యులర్ రాజ్యాంగం అమలులోకి రావటంవల్ల, ప్రభుత్వం ఏ ఒక్క మతాన్నీ ప్రోత్సహించే పరిస్థితిలో లేదు. దీంతో పీఠాధిపతుల చెదురు మదురు ప్రసంగాలు మినహా - హిందూమతరక్షణ బాధ్యతను పట్టించుకునే వాళ్లు కరువయ్యారు. ఒక నిర్దుష్టమైన సంస్థ లేదా సంస్థలు హిందూమత ప్రచారాన్ని ఒక స్పష్టమైన దిశలో నడిపించే వాతావరణం లేదు.

హిందూత్వం ఒకమతం కాదనీ, ఒక జీవన విధానంమాత్రమే అని చాలామంది వాదిస్తుంటారు. హిందూమతంలోని ఏ శాఖకి చెందినవారైనా ఈ విషయంలో ఏకీభవిస్తుంటారు. ఆదిశంకరాచార్యులు అద్వైతాన్ని బోధించినా, రామానుజాచార్యులు విశిష్టాద్వైతాన్ని ప్రచారం చేసినా, మధ్వాచార్యులు ద్వైత సిద్ధాంతాన్ని ప్రబోధించినా, అన్ని శాఖలకిచెందిన వాళ్లూ వేదాలనూ, సనాతన ధర్మాన్నీ మాత్రం స్థిరమైన, శాశ్వతమైన మూలసత్యాలుగా అంగీకరిస్తారు. ఆయాశాఖలకి చెందిన మఠాధిపతులు తమ తమ పరిధిలో ఆధ్యాత్మిక భావాలను, తమ సాంప్రదాయాలను ప్రచారం చేస్తూ వచ్చారేతప్ప, పరస్పరసహకారంతో కార్యక్రమాలు చేపట్టడంగానీ, ఒకేసంస్థద్వారా ఏకోన్ముఖమైన ఆధ్యాత్మిక, ధార్మిక కార్యక్రమాల ప్రచారం సాగించడం గానీ జరగడంలేదు. ఫలితంగా అనేక మంది కొత్త కొత్త స్వామీజీలు వచ్చారు. ఎవరి సంస్థవారిది. అందరు బోధించేది సనాతన ధర్మం గురించే అయినా, ఎవరి విధానం వారిది. తమ తమ సంస్థల లేదా మఠాల గుర్తింపుని కాపాడుకోవాలన్న ప్రయత్నం కూడా అందరూ చేస్తూవచ్చారు.

ఈ పరిణామాల ప్రభావం కారణంగా - ఆలయాలు సయితం ఆయా స్థానిక కారణాల వల్లనో, యాజమాన్య కమిటీలలో వ్యక్తుల అభిరుచుల కారణంగానే ఏదో ఒకమఠానికి లేదా పీఠానికి అనుబంధ ఆలయాలుగా ముద్రపడుతూ వచ్చాయి. అయినప్పటికీ ఆలయాల యాజమాన్యం విషయంలో స్థానిక కమిటీల పెత్తనమే నడుస్తుండేది. వాళ్లుకూడా ఏదో సాంప్రదాయాల పేరు చెప్పి తిరుణాళ్లవంటి సంబరాలు నిర్వహించడం, లేదా దేవాలయమాన్యాల మీద ఆదాయాన్ని భోంచేయటం మినహా యాత్రికుల సదుపాయాలు చూడటంగానీ, హిందూధర్మ రక్షణ-ప్రచారం గురించి పట్టించుకోవటంగానీ పెద్దగా జరగటంలేదు. దీనికి తోడు, కౌలుదారీ విధానాన్నీ, ఇనాముల్నీ రద్దుచేస్తూ చట్టాలురావటంతో, ఆలయాల ఆదాయవనరులు

దెబ్బతిన్నాయి. దాంతో ఆలయాల, మఠాల పరిధిలో సయితం హిందూధార్మిక కార్యక్రమాల నిర్వహణ కుంటుపడింది.

క్రమంగా సెక్యులర్ రాజ్యాంగ పరిధిలో రూపొందిన విద్యా విధానం ప్రభావం వల్ల, హిందూ సంస్కృతీ సంబంధమైన ఆధ్యాత్మిక, నైతిక విలువలతో కూడిన విద్యా విధానం స్థానంలో - ఇంగ్లీషు విద్య రూపంలో ఆధునిక విలువలతోకూడిన బోధనావిధానం అమల్లోకి వచ్చింది. ఆ రకంగా ఏ ఆధ్యాత్మిక, నైతిక విలువల బోధన అయితే వేలాది సంవత్సరాలుగా ఈ దేశంలో విద్యా విధానానికీ, జీవన విధానానికీ పునాదులుగా నిలిచిందో, ఆ ప్రమాణాలు కనుమరుగయ్యే వాతావరణం నెలకొంటోంది. అలాగే సినిమాలు, టెలివిజన్‌ల రాకతో - పురాణాలు, భజనలు, హరికథలు, బుర్రకథలు, తోలుబొమ్మలాట వగైరా కళా రూపాలద్వారా ప్రజల్లోకి ఆధ్యాత్మిక చైతన్యం విస్తరించే అవకాశాలు సన్నగిల్లుతూవచ్చాయి.

ఏతావాతా, ఒక క్రమబద్ధమైనరీతిలో హిందూధర్మ ప్రచారం జరపటానికి తగిన ప్రోత్సాహం, మద్దతు కొరవడటం, ఏ ఒక్క మఠాధిపతినిగానీ, స్వామీజీని గానీ అందరు హిందువులూ అంగీకరించలేని స్థితి నెలకొనడం మాత్రమే నిత్యసత్యాలుగా మిగిలాయి. హిందూ జీవన విధానానికి సంబంధించిన పరిస్థితి ఇలా తిరోగమన దిశలో వున్నప్పుడే, హిందూయేతర సంస్థలు ఐక్యతాభావంతో పనిచేయడంతో, విదేశాలనుంచి లభించే ఆర్థిక మద్దతుతో అవి తమ మత ప్రచార కార్యక్రమాలను దేశంలోఅన్ని ప్రాంతాలకు చురుగ్గా విస్తరిస్తూండటం, అందులోభాగంగానే బలహీన హిందూ వర్గాలు మత మార్పిడులకు గురికావడం జరుగుతూ వచ్చింది.

ఆంధ్రప్రదేశ్ విషయంలో - ఆలయ నిర్వహణని క్రమబద్ధంచేస్తూ చర్యలు తీసుకోవటంలో రాష్ట్రప్రభుత్వం దేశంలోకెల్లా అగ్రగామిగావుంది. అయితేఆలయ భూముల్ని, ఇతర ఆస్తుల్ని రక్షించే లక్ష్యంతో పనిచేసినట్లుగా, ఈ చట్టం-ధార్మిక విషయాల ప్రచారలక్ష్యసాధన దిశలో తగిన శ్రద్ధ వహించలేకపోయింది.... ఈ నేపథ్యంలో తిరుమల తిరుపతి దేవస్థానాల ప్రత్యేకచట్టం రూపొందింది.

★ ★ ★

**నేను** కూడా సభ్యుడిగా వున్న పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీ రూపొందించిన, 1981లో అసెంబ్లీ ఆమోదించిన ప్రత్యేక టిటిడి చట్టంలో హిందూ ధర్మ పరిరక్షణ - ప్రచారానికి చోటు కల్పించబడింది. టిటిడి ఆదాయంలోంచి కొంత మొత్తాన్ని ఏటా హిందూ ధర్మ రక్షణ ప్రచారానికి వినియోగించాలని ఈ చట్టం నిర్దేశిస్తోంది. ఇందుకోసం టిటిడిలో భాగంగానే 'హిందూ ధర్మరక్షణ





సంస్థ'ని ఏర్పాటుచేశాం. ఈ సంస్థకి మొదట్లో శ్రీ జయేంద్ర సరస్వతి (కంచి కామకోటి పీఠం), శ్రీ విశ్వేశ తీర్థస్వామీజీ (పెజావర్ మఠం), శ్రీ జీయర్‌స్వాములతో కూడిన ఒకసలహాసంస్థ కూడా ఏర్పాటయింది. ఈ ముగ్గురూ మూడు విభిన్న (అద్వైత, ద్వైత, విశిష్టాద్వైత) శాఖలకు చెందిన పీఠాధిపతులు.

ఇది జరిగాక కొన్నాళ్లకి మహారాష్ట్రలోని సతారాలో మౌనదీక్షలో వున్న శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామీజీ (కంచిపీఠాధిపతుల) నుంచి నాకు వర్తమానం వచ్చింది. నేను వెళ్లాక, ఆయన నాతో చర్చించడం కోసం తమ 45 రోజుల మౌనదీక్ష విరమించి, ఆ సాయంత్రం అయిదున్నర గంటలపాటు వేదరక్షణ, శాస్త్ర రక్షణ ఆవశ్యకత గురించి మాట్లాడారు. ఆయన ఆదేశాల ప్రకారం-

1) రాష్ట్రంలోని ఆలయాలలో రోజుకి ఎనిమిది గంటల పాటు పారాయణ చేసే వేద పండితులకు నెలవారీ ఉపకార వేతనాలు చెల్లించాలి.

2) ఆసక్తి గల విద్యార్థులకు ఉచితంగా వేదాలు బోధించేందుకు గురువులకు తగిన ఆర్థిక సహకారం అందించాలి.

3) 'కుమార అధ్యాపక' పథకం క్రింద గురుకుల విధానంలో వేద, శాస్త్రాలబోధన జరగాలి.

4) శాస్త్ర రక్షణ కార్యక్రమం క్రింద శాస్త్రాలలో, వేదాలలో లోతుగా అధ్యయనం చేసే వాళ్లకి (గురుశిష్యులిద్దరికీ) ఉపకార వేతనాలు అందించాలి... ఈ పథకాలను టిటిడి చేపట్టాలి.



హిందూ ధర్మ సంరక్షణ సంస్థ మీటింగ్‌లో (కుడినుండి ఎడమకు వరుసగా)
శ్రీ శ్రీమన్నారాయణ పెద జీయర్ స్వామి, శ్రీ విశ్వేశతీర్థ స్వామీజీ (పెజావరు మఠం, ఉడిపి), శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామీజీ (కంచి కామకోటి పీఠం), శ్రీ మధుర ఆధీనం స్వామీజీ, ప్రసాద్, టిటిడి ఛైర్మన్ శ్రీ ఎన్.రమేశన్, హిందూధర్మ రక్షణ సంస్థ సెక్రటరీ డా॥ అర్క సోమయాజి

... నేను ఆలస్యం చేయలేదు. వీటన్నింటినీ హిందూ ధర్మరక్షణ సంస్థ ద్వారా, టిటిడి నిధులతో కొన్ని నెలల్లోనే అమలుచేశాం. అలాగే హిందూ ధర్మ రక్షణ కార్యక్రమంక్రింద జిల్లాల్లో పూర్తికాలం పనిచేసే వారిని నియమించాలనుకున్నాం. అయితే సీనియర్ స్వామీజీలంతా తమ తమ శిష్యులనే ఇలా నియమింపజేయాలని కోరుతూ వచ్చారు. ఒక ఏడాది పాటు అలా జరిగాక, ప్రత్యామ్నాయ విధానాన్ని అన్వేషించడం ఆరంభించాను.

అప్పుడే తమిళనాడులోని మీనాక్షిపురంలో జరిగిన సామూహిక మత మార్పిడి వ్యవహారం దేశవ్యాప్తంగా సంచలనాన్ని సృష్టించింది. దాంతో అనేక హిందూ ఆధ్యాత్మిక సంస్థలు, పెద్దలు - హిందూధర్మ పరిరక్షణ - ప్రచార కార్యక్రమాల కోసం తిరుమల తిరుపతి దేవస్థానాలు నిర్వహించా ల్సిన పాత్ర నిర్వహిం చడం లేదంటూ విమర్శలు సంధించారు.

టిటిడి ఏం చేస్తుంది? ఏం చేయాలీ? ఎలా చేయాలో నాకు తెలీదు. ఏదో తాత్కాలికంగా కొన్ని వాహనాల్ని, హిందూ ధర్మ ప్రచార సామగ్రిని కొందరు స్వామీజీలకు అందజేశాను. కాని అక్కడితో ఆగలేదు. తమ ద్వారా హిందూధర్మ ప్రచారానికి టిటిడి నిధులు విడుదల చేయాలంటూ అనేక ధార్మిక సంస్థలు, స్వామీజీలు వత్తిడి తీసుకువచ్చారు. మీనాక్షిపురం మతమార్పిడుల నేపధ్యంలో హిందూత్వ పరిరక్షణ చాలా అత్యవసరమనీ, ఇందుకోసం తాము చేసే కార్యక్రమాలకి టిటిడి చేయూతనివ్వాలనీ అంటూ ఎవరికి వారే పట్టుబడుతూ వచ్చారు. టిటిడి అనేది ఒక హిందూధార్మిక సంస్థ కనుక వాళ్ల డిమాండులో ఒక హేతుబద్ధత వుందని వాళ్ల నమ్మకం.

కానీ, నా పరిస్థితి ఏమిటి? నేను ఎవరిని నమ్మి నిధులు ఎవరికి విడుదల చేయాలి? కోట్లాదిభక్తులు శ్రీనివాసుడికి భక్తితో సమర్పించిన సొమ్ము వెచ్చించే విషయంలో - వాళ్ళ లక్ష్యశుద్ధిని శంకించనుకానీ, ఎవరి సమర్థత ఎంతో తెలీదు? ఎవరు ఎంత బాధ్యతాయుతంగా చేస్తారో తెలీదు?

అయినప్పుడు, నిధులు నేరుగా ఎలా విడుదల చేస్తాం? ఒకవేళ నిధులు విడుదల చేసినా అందువల్ల టిటిడి సేవలకి వచ్చే గుర్తింపు ఏమిటి? అలాగే, ప్రభుత్వ నిబంధనలకు లోబడి టిటిడి పనిచేస్తున్నప్పుడు, బయట పనిచేసే ఏ ఒక్క సంస్థనో టిటిడి ప్రోత్సహించటం సమర్థనీయంకాదు కదా! కాదంటే, ఎన్ని సంస్థలకి ఎన్ని నిధులు ఇవ్వగలం? పోనీ మన సిబ్బందితో చేయిద్దామా అంటే, నెలజీతాలకి పనిచేసే సిబ్బందితో - అంకితభావంకల మత సంస్థలకి దీటుగా పనిచేయించగలమా?

నేను ప్రభుత్వ అధికారిని. మాకు కాండక్టు రూల్సు వుంటాయి. అవి టిటిడి లాంటి సంస్థల్లో పనిచేసేటప్పుడు వర్తిస్తాయా? ఎంతవరకు? నేను దేవస్థానానికి విధేయుడినా? సెక్యులర్





ప్రభుత్వానికి విధేయుడినా? దేవస్థానం ఉప్పుతింటూ, దేవస్థానం విధులు నిర్వహించాలా లేదా? ఎందుకొచ్చిన గొడవ! అసలు ఏమీ చేయకుండా వుండిపోతే?....

ఈ అయోమయ పరిస్థితికి పరిష్కారం కోసం శ్రీవారిని ప్రార్థిస్తూ దర్శనంలో మరోసారి ప్రార్థన చేశాను... "ఏం చేయాలి స్వామీ? ప్రజల్లో దైవచింతన, సనాతన ధర్మ విలువలు నిలబెట్టే పని ఎవరు చేయాలి? ఇందులో నా పాత్ర ఎంత? ఏదన్నా చేస్తే దానికి ఫలితం వుంటుందా? ఎలా వుంటుంది? ఏ రకంగా ముందుకు వెళ్ళాలి?..." అలా ప్రార్థన చేసి, బయటకు రాగానే, ఆలయ సన్నిధివీధిలో ఒక క్యాసెట్ల షాపులోంచి ఘంటసాల పాడిన భగవద్గీత వినబడుతోంది......

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన
మాకర్మ ఫలహేతుర్భూమా తే సఙ్గోస్త్వ కర్మణి"....

".... ఫలితాన్ని ఆశించకుండా నీ విధి నువ్వు నిర్వర్తించు. నీ విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించటంలో అనాసక్తుడవుకాకు...." అది వింటూనే - క్రమంగా అంతవరకు నాలో వున్న సందిగ్ధం తొలగిపోయింది. నేను ఏం చేయాలో అర్థమైనట్లనిపించింది. నా కార్యక్రమానికి స్పష్టమైన రూపం లభించినట్లయింది.

అందరు హిందువులూ అంగీకరించే దైవం శ్రీనివాసుడు. అలాగే అన్ని మఠాలవారు, అందరు స్వామీజీలూ గౌరవించే ధార్మిక సంస్థ తిరుమల తిరుపతి దేవస్థానాలు. కాబట్టి, నేను (టిటిడి) ఇలాంటి భావసారూప్యంకల వాళ్ళందర్నీ ఒకచోటుకి చేర్చి, అందరికీ ఆమోదయోగ్యంగా వుండే ఒక కనీస కార్యాచరణ ప్రణాళికని తయారుచేసి, దాన్ని ఆయా సంస్థల అధిపతుల ద్వారానే అమలు చేయిస్తే ఎలా వుంటుంది? ఇందుకు అవసరమైన సామగ్రిని - అంటే పోస్టర్లు, పుస్తకాలు, స్టిక్కర్లు, వాహనాలు వగయిరా సరంజామాని నేను (టిటిడి) సమకూరిస్తే.... ?

ఈ ఆలోచన రాగానే నేను శరవేగంతో రంగంలోకి దిగి, భావసారూప్యంగల వాళ్ళందరికీ ఆహ్వానాలు పంపాను. అలా ఏర్పాటు చేసిన సమావేశంలో - వివిధ హిందూశాఖలకి చెందిన మఠాధిపతులు, అనేకమంది సీనియర్ స్వామీజీలతో సహా మొత్తం 51 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. వాళ్ళల్లో వివిధ శాఖల పీఠాధిపతులతోపాటు కర్నాటకకి చెందిన శ్రీవీరేంద్ర హెగ్డే, స్వామి చిన్మయానంద, శుక బ్రహ్మాశ్రమానికి చెందిన శ్రీవిద్యా ప్రకాశానందస్వామి, విశ్వహిందూ పరిషత్, సాధుసమాజ్, బ్రహ్మకుమారి సంస్థల ప్రతినిధులు కూడా వున్నారు.

నేను ఆశించినట్లే (ఎవరిదా ఆదేశం?) ఇందరు ప్రముఖులతో కలిసి, హిందువులందరికీ ఆమోద యోగ్యంగా వుండే ఒక కనీస హిందూ ధర్మప్రచార కార్యక్రమాన్ని రూపొందించాం.

ఒక స్టీరింగ్ కమిటీ ఏర్పాటైంది. ముందుగా నాలుగు దక్షిణాది రాష్ట్రాల రాజధానులలో టిటిడి ఆఫీసులు పెట్టి, ఈ స్టీరింగ్ కమిటీ సూచనల ప్రకారం ప్రచార సామగ్రిని పంపిణీ చేసే సమన్వయకర్తగా టిటిడి వ్యవహరిస్తుంది. హిందూ ధర్మ ప్రచారానికి సంబంధించిన సాహిత్యం, స్టిక్కర్లు వగైరా ఈ సామగ్రిని ఆసక్తిగల ధార్మిక సంస్థల ద్వారా ప్రచారానికి ఉచితంగానూ, నామమాత్రపు ధరకీ టిటిడి సరఫరా చేస్తుంది.... కొద్ది వారాల్లోనే ఈ కార్యక్రమం కార్యరూపం దాల్చింది. తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ భాషల్లో ఈ సాహిత్యం అంతా వందలాది ధార్మిక సంస్థల ద్వారా జన బాహుళ్యంలోకి చొచ్చుకు పోవటం మొదలైంది.

ఇదిలావుంచి, టిటిడి కొన్ని పెద్ద కార్యక్రమాలను కూడా చేపట్టింది - ఆధ్యాత్మిక సాహిత్యంతో నిండిన పుస్తకాలు ప్రచురించి, సబ్సిడీ ధరలకి ప్రజలకి అందించటం, ధార్మిక అంశాల మీద పుస్తకాలు రాసే రచయితలకి ఆర్థిక సహాయం చేయటం, పురాణాలు, భజనలు, కోలాటాలు వంటి కళారూపాల ద్వారా హిందూధర్మ ప్రచారానికి శిక్షణ కార్యక్రమాలు నిర్వహించటం, వేదపారాయణ - వేదరక్షణ పథకాలు అమలు చేయటం, స్కూలు టీచర్లకి ధార్మిక అంశాలలో బోధన, విద్యార్థులకి హిందూధార్మిక అంశాలలో పఠనాసక్తి పెంచేలా పోటీల నిర్వహణ, హిందూత్వాన్ని విమర్శిస్తూ వెలువడే సాహిత్యానికి దీటైన సమాధానం ఇచ్చే సాధికారికమైన సాహిత్యాన్ని తయారుచేయించటం, హరిజనవాడలలో రామాలయాల నిర్మాణం, భజన మండపాలకి ప్రోత్సాహం, ఆలయాలకి ఉచితంగా మైక్ సెట్ల పంపిణీ, శ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రి, శ్రీశ్రీ భాష్యం అప్పలాచార్యులవంటి ఉద్దండులైన పండితుల ద్వారా పురాణప్రవచనం చేసేవారిని తయారుచేయించటం, ప్రముఖవక్తల ద్వారా ధార్మిక ప్రసంగాల్ని ప్రోత్సహించటం, నిష్ణాతులైన వేదపండితుల సాయంతో అన్ని వేదాలను టేప్‌రికార్డ్ చేయించటం... వగైరా కార్యక్రమాలకు టిటిడి శ్రీకారం చుట్టింది. క్రమంగా అవి కూడా ఊపందుకున్నాయి.

ఇదే కాలంలో - ప్రధానంగా సామూహిక మతమార్పిడులనుంచి తమను తాము రక్షించుకునేలా హిందువులను చైతన్యవంతుల్ని చేసే పథకంలో భాగంగా - 'సింహగర్జన' వాల్ పోస్టర్లు తయారు చేయించాం. అన్ని దక్షిణాది భాషల్లోనూ తయారైన వీటిని గ్రామగ్రామానా ప్రచారంలో పెట్టేలా చూశాం. "మనధర్మం గంగనీరు - పరధర్మం ఎండమావి" అనే నినాదంతో ఈ పోస్టర్లు ప్రతి కుగ్రామంలోనూ (మత మార్పిడులకు గురవుతున్న) అన్ని వర్గాలలోకి చొచ్చుకుపోయేలా కార్యక్రమం తయారుచేశాం. "ధర్మోరక్షతి రక్షితః - ధర్మాన్ని కాపాడండి, అదే మిమ్మల్ని కాపాడుతుంది" - అనే నినాదంతో పాటు, 'ఓం' కార చిహ్నంతో కూడిన గుండ్రటి స్టిక్కర్లు, ఇంటింటికీ పంపిణీ చేసేలా చర్యలు తీసుకున్నాం. అన్ని ప్రసాదం సంచీల మీద ప్రతి హిందువూ ఆచరించాల్సిన కనీస నియమాలను ప్రచురించాం.





శ్రీకాళహస్తి సమీపంలోని శుక బ్రహ్మాశ్రమానికి చెందిన శ్రీ విద్యా ప్రకాశానంద స్వామి ద్వారా తెలుగులో అనేక చోట్ల గీతా జ్ఞాన యజ్ఞాలు నిర్వహింపజేశాం. ఒక్కొక్క జ్ఞానయజ్ఞానికి 50-60 వేలమంది హాజరయ్యేవారు. వాటన్నింటినీ ఆడియో, వీడియో టేపులపై రికార్డు చేసి ప్రజల్లో విడుదల చేశాం. స్వామి చిన్మయానంద ధార్మిక బోధనలు రోజుల తరబడి అనేక పట్టణాల్లో జరిగేలా ఏర్పాటు చేశాం. వారి ప్రసంగాలు ఇంగ్లీషులో వున్నప్పటికీ, ప్రతిచోట వేలాదిమంది ఆసక్తితో హాజరయ్యేవారు. అలా అంతవరకు పరిమిత విద్యావంతుల సంఖ్యనే ఆకర్షిస్తూ వచ్చిన చిన్మయానంద ప్రసంగాలు, విద్యాప్రకాశానంద స్వామి ప్రసంగాలు టిటిడి మద్దతువల్ల లక్షలాది జనంలోకి విస్తరించాయి.

మరో అడుగు ముందు వేసి, హైద్రాబాద్‌లో జరిగే గణేశ్ నిమజ్జనోత్సవంలో కొంత సమన్వయం తెచ్చి, దారిపొడవునా గణేశ్ ఆతిథ్యం పందిళ్ళువేయించి, భక్తులలో ధార్మిక సాహిత్యం పంపిణీ చేయించటంలో టిటిడి కీలకపాత్ర నిర్వహించింది. ఈ కార్యక్రమాలన్నీ, ప్రజల్లో నివురు గప్పివున్న భక్తి భావాల్నీ, ఆధ్యాత్మిక చింతననీ ఉవ్వెత్తున ప్రజ్వలింపచేస్తున్నాయంటూ వివిధ హిందూ వర్గాలు టిటిడి మీద ప్రశంసల వర్షం కురిపించాయి.

★ ★ ★

**కానీ**, ఈ పరిణామాలన్నీ పోలీసు ఇంటెలిజెన్స్ నివేదికల ద్వారా భిన్న రూపంలో ప్రభుత్వానికి నివేదించబడ్డాయి. దాంతో 1982లో ప్రభుత్వం నాకు సంజాయిషీ నోటీసు జారీ చేసింది.

"....ప్రభుత్వ అధికారిగా, టిటిడి ఇ.ఓగా మీ అధికారాన్ని దుర్వినియోగం చేసి రాష్ట్రంలో మత సామరస్యానికి భంగం కలిగిస్తున్నట్లు ప్రభుత్వానికి నివేదికలు అందాయి. ఇలాంటి చట్ట వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడుతున్నందుకు మీమీద ఎందుకు క్రమశిక్షణా చర్యలు తీసుకోకూడదు...?" - ఇదీ ఆ సంజాయిషీ నోటీసు సారాంశం. పోలీసు రిపోర్టుల ఆధారంగా రాష్ట్ర ప్రభుత్వం నా సంజాయిషీ కోరింది.

ఆ నోటీసు చదువుతూనే నేను మ్రాన్పడిపోయాను. ఒక్కసారిగా నీరసం, నిస్తేజం నన్ను చుట్టుముట్టాయి. "టిటిడి చేయాల్సిన పని ఏమిటో గుర్తించి. బాగా చేస్తున్నావ్" అంటూ అందరూ అభినందిస్తుంటే, ప్రభుత్వం మాత్రం నన్ను నేరస్థుణ్ణి అంటోంది. "నువ్వు నేరం చేశావ్...." అంటూ ప్రభుత్వం నన్ను వేలెత్తి చూపిస్తున్న దృశ్యమే రాత్రీ పగలు కూడా నన్ను వెంటాడింది. ఎవరికి చెప్పుకోవాలీ? ఏమని చెప్పుకోవాలీ? ఎవరు ఈ క్లిష్ట పరిస్థితుల్లో నాకు ఆసరా ఇవ్వగలరు?... ప్రభుత్వ అధికారిగా మాత్రమే ఈ పనులు నేను చేసుంటే, కాండక్టు రూల్సు

ప్రకారం తప్పు పట్టవచ్చు. కానీ చేసింది టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా .... చేయాల్సిన బాధ్యత నాకు లేదా?



టిటిడి ప్రచురించిన గ్రంథాలను పరిశీలిస్తున్న రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి, ఛైర్మన్ శ్రీ నాగిరెడ్డి, దేవాదాయశాఖామంత్రి శ్రీ చౌదరి, ప్రసాద్, చిత్తూరు జిల్లా కలెక్టరు శ్రీ సంపత్

"స్వామీ!" అనుకుంటూ ఖిన్నవదనంతో శ్రీనివాసుడి ముందు మోకరిల్లాను నేరస్థుడిలాగా 'తలవంచాను'. సంజాయిషీ నోటీసు గుర్తుచేసుకుంటూ, "నేను నేరస్థుణ్ణా? నేను నేరస్థుణ్ణా?" అని పదేపదే ప్రశ్నించాను. అసలు ఇంత కార్యక్రమం చేయటానికి నాకు ప్రేరణ ఎక్కడిది? ఆ రోజు ఆ ధైర్యం ఎక్కడిది? "... మాకర్మఫల హేతుర్భూమా తే సఙ్గోస్త్వకర్మణి...." అంటూ స్వామి పలుకులు నా మనసులో దూరి వుండకపోతే ఇదంతా జరిగేదా? ఆ ప్రేరణ కారణంగా పనిచేసిన నేను నేరస్థుణ్ణి అవుతున్నానా? "...నీ విధి నువ్వు నిర్వర్తించు..." అన్నదే కదా స్వామి ఆదేశం. అదేకదా చేశాను. ఇందులో నేరం ఏమిటి?..

స్వామి దివ్యమంగళ విగ్రహం చూస్తూ మరోసారి అవే మాటలు అనుకున్నాను అంతలో ఏదో స్ఫురించింది.... మరోసారి "కర్మణ్యేవాధికారస్తే..." శ్లోకాన్ని నెమరు వేసుకున్నాను. అంతే! సమాధానం దొరికిపోయింది.... ఆనందంతో మరోసారి స్వామి ముందు మోకరిల్లాను. నా కళ్ళవెంబడి నాకు తెలీకుండా ధారాపాతంగా ఆనందాశ్రువులు!

ప్రభుత్వానికిచ్చిన సమాధానం ఇది : "... నేను ఏ రకంగా మతసామరస్యానికి భంగం కలిగించానో ప్రభుత్వం వివరించలేదు. పోతే, ప్రభుత్వం రూపొందించిన తిరుమల తిరుపతి దేవస్థానాల చట్టం - 1981 ప్రకారం హిందూ ధర్మాన్ని పరిరక్షించడం, ప్రచారం చేయటం అనేవి టిటిడి బాధ్యత. ఇప్పుడు టిటిడి చేసింది కూడా ప్రతి హిందువూ తాను హిందువునని గర్వించేలా హిందూ సంస్కృతి, సిద్ధాంతాల విలువలనీ, శక్తినీ ప్రజల్లో ప్రచారం చేయడం మాత్రమే. ఒక ఐఏఎస్ ఆఫీసర్‌ని టిటిడికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా ప్రభుత్వం నియమించిందీ అంటే దానర్థం - తిరుమల ఆలయాన్ని ఒక జాతీయ సెక్యులర్ సంస్థగా మార్చినట్లుకాదు.... నన్నిక్కడ





నియమించినప్పుడు, - చట్టానికి లోబడి, టిటిడి లక్ష్యాలకి అనుగుణంగా పనిచేస్తానని - శ్రీనివాసుని సన్నిధిలో ప్రమాణం చేశాను. నిజానికి నేను కనుక టిటిడి లక్ష్యాల మేరకు పనిచేయకపోతే - అంటే హిందూ ధర్మ రక్షణ ప్రచార బాధ్యతల పట్ల 'అనాసక్తత' ప్రదర్శిస్తే - నా విధ్యుక్తధర్మాన్ని విస్మరించినట్లుగానూ, తిరుమల తిరుపతి దేవస్థానాల చట్టం - 1981ని ఉల్లంఘించినట్లుగానూ పరిగణించి, ప్రభుత్వం నామీద చర్య తీసుకోవాల్సివుంది. దురదృష్టవశాత్తు, ఇప్పుడు నేను టిటిడి ఎగ్జిక్యూటీవ్ ఆఫీసర్‌గా నాకు నిర్దేశించబడిన 'విధి' నిర్వర్తించటాన్నే ప్రభుత్వం నేరంగా పరిగణిస్తోంది. ...నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్నంతకాలం టిటిడి లక్ష్యాల మేరకు పనిచేయటమే నా 'విధ్యుక్తధర్మం' అవుతుంది. ఈ పరిస్థితుల్లో నేనుగానీ, నా సారథ్యంలో టిటిడి గానీ ఏ రకంగానూ పరిధుల్ని అతిక్రమించలేదు కనుక, నేను ప్రభుత్వానికి ఎలాంటి సంజాయిషీ ఇచ్చుకోనవసరంలేదు..." (ఇలా జవాబివ్వటానికి ఎవడిచ్చాడా ధైర్యం?)

ఈ సంజాయిషీ లెటర్‌ని నేను ఛీఫ్ సెక్రటరీకి పంపిన రెండురోజులకే "మీరొకసారి ముఖ్యమంత్రి గారిని కలవండి" అంటూ ఛీఫ్ సెక్రటరీ టెలిఫోన్ చేశారు. మర్నాడు నేను వెళ్ళగానే ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రామ్ అనునయంగా మాట్లాడుతూ, ఇంటెలిజెన్స్ రిపోర్టు ఎలా నా కార్యకలాపాలు నిలిపివేయించాలంటూ వచ్చాయో వివరిస్తూ, "నీమీద వ్యక్తిగతంగా నాకు ఎలాంటి వ్యతిరేకత లేదయ్యా" అన్నారు. అయినప్పటికీ ఆయన ఛీఫ్ సెక్రటరీని, డైరక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌నీ, ఇంటెలిజెన్స్ ఇనస్పెక్టర్ జనరల్‌నీ పిలిపించి కూర్చోపెట్టారు. నేను వాళ్ళతో మాట్లాడి పరిష్కరించుకోవాలన్నది ఆయన సూచన. ఇందులో పరిష్కరించుకోవటానికి ఏమీ లేదన్నది నా వాదన. ఎందుకంటే - నామనస్సులో గీతాకారుడిచ్చిన సమాధానమే మెదుల్తోంది... "కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన...."



గోదావరి పుష్కరాల (1979) సందర్భంగా రాజమండ్రిలో టిటిడి పుస్తకప్రదర్శన

అందుకే వాళ్ళందరిముందూ మరింత ధైర్యంగా,

ఆవేశంగా మరోసారి స్పష్టం చేశాను... "టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నేనేమీ మత మార్పిడులు చేయించడంలేదు. టిటిడి చట్టం - 1981కి లోబడి నా'విధ్యుక్త ధర్మా'న్ని నిర్వర్తించాను. నేను అక్కడ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్నంతకాలం ఇదేపని చేస్తాను. ఒక వేళ నా పనితీరు నచ్చకపోతే ప్రభుత్వం నన్ను అక్కడ్నుంచి బదిలీ చేయవచ్చు... సామూహిక మతమార్పిడులకు పాల్పడుతూ, నిజంగా మతసామరస్యాన్ని దెబ్బతీస్తున్న శక్తుల్ని నిరోధించలేకపోగా, విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించేవాళ్ళని (తప్పుడు సమాచారం ఆధారంగా) వేధించాలని చూడటం సిగ్గుచేటు...!!"

ముఖ్యమంత్రి భవనం వెంకట్రామ్ మరోసారి అనునయంగా, ప్రశంసాపూర్వకంగా నాభుజం తట్టారు. అంతే!....

అలా ఆ 'కర్మ' ఆచరించటంవల్ల కలిగిన 'చేదుఫలం' (సంజాయిషీ నోటీసు) మళ్ళీ ఎప్పుడూ నా దరిదాపుల్లోకి రాలేదు. మరి ఆ'ఫలం' సంగతి ఎవరు చూసుకున్నారు?

★ ★ ★





# 24

# నాహం కర్తా, హరిః కర్తా

అకస్మాత్తుగా బయటపడిన విషయం ఏమిటంటే - తిరుమల కొండమీద వేంకటేశ్వరుని ఆలయంలో ధ్వజస్తంభం మాను పుచ్చిపోయింది!

అది ఎంతగా పుచ్చిపోయిందంటే, 50 అడుగుల ఎత్తున ఆ ధ్వజస్తంభం మీద నిలిచి వుండాల్సిన పతాకభాగం, కేవలం ధ్వజస్తంభాన్ని అంటిపెట్టుకుని వుండే బంగారు ప్లేట్ల తాపడం ఆధారంగా మాత్రమే నిలిచి వుంది తప్పిస్తే, ఆ క్రింద కొన్ని అడుగుల లోతు వరకు అసలు మాను కనబడటం లేదు. బయటనుంచి చూసే భక్తులకు ధ్వజస్తంభం యధాతథంగా కనిపిస్తున్నా, అలా పుచ్చిపోయిన మానుని అంటిపెట్టుకున్న బంగారు రింగుల తాపడం ఎంతకాలం నిలుస్తుంది? ఏ క్షణంలోనయినా కుప్పకూలిపోవచ్చు. భక్తి, సాంప్రదాయాలకు లోబడిన ఏ వ్యక్తికయినా ఆ భావం ఒక్కసారిగా ఒళ్ళు జలదరింపచేస్తుంది. నాకూ, టిటిడిలోని నా సహచర అధికారులకూ కూడా అలాగే ఈ విషయం బయటపడినప్పుడు ఒక్కసారిగా చెమటలు పట్టేశాయి. సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాం. అసలు అప్పటిదాకా ధ్వజస్తంభం ఇంకా ఎలా నిల్చివుందీ, ఏ శక్తి నిలబెట్టిందీ, ఇప్పుడేం చేయాలీ, ఎలా చేయాలీ.... ఇలా అనేక సందేహాలు మమ్మల్ని ముంచెత్తాయి. .... అలా మమ్మల్ని సంకటంలో పడేసిన ఈ సంఘటన 1982 ఆరంభంలో నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా జరిగింది.

★ ★ ★

అప్పట్లో తిరుమల ఆలయంలో అనేక మరమ్మత్తుల కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. శ్రీవారి ఆలయంపై వున్న ఆనంద నిలయం విమానాన్ని పాలిష్ చేయడం, పెరుగుతున్న లడ్డు తదితర ప్రసాదాల అవసరాలకు తగినట్లుగా పోటు (వంటశాల) మొత్తాన్ని పునః పటిష్ఠం చేయటం, శ్రీవారి ఆలయం ఆవరణలోని అన్ని చిన్న చిన్న ఆలయాలను మెరుగు పరచటం, శ్రీవారి కళ్యాణోత్సవం జరిగే చోట కళ్యాణమండపాన్ని నిర్మించడం, భక్తుల క్యూ మార్గాలకు ఇరువైపులా ప్రత్యేకంగా డిజైన్ చేసిన ఇత్తడి గ్రిల్స్ ఏర్పాటు చేయడం వగయిరా కార్యక్రమాలన్నీ ఒకేసారి చేపట్టాం. ఇందులో భాగంగానే ధ్వజస్తంభానికీ, ఆ ప్రక్కనే వున్న బలిపీఠానికి గల బంగారు తాపడాన్ని మళ్ళీ పాలిష్ చేయాలనీ, అవసరమైన చోట పాత ప్లేట్లను తీసి కొత్త ప్లేట్లలను వేయాలనీ నిర్ణయించాం.

మహద్వారంలోంచి ఆలయంలోకి ప్రవేశించగానే ముందుగా ఎదురుగా ఆరడుగుల ఎత్తులో బలిపీఠం, ఆ వెనకాల పై కప్పును చీల్చుకుని ఆకాశంలోకి చొచ్చుకుపోయినట్లున్న ధ్వజస్తంభం కనుపిస్తాయి. అక్కడ నిర్మాణాన్ని పరికిస్తే, ధ్వజస్తంభం ఏర్పాటయిన చాలాకాలం తరువాత ధ్వజస్తంభానికి అవసరమైనంత రంధ్రం వదిలి, మిగతా కప్పుని వేశారని అర్థమవుతుంది. నేలనుంచి 50 అడుగుల ఎత్తుండే ధ్వజస్తంభానికి పై కొసన గంటలు, ఇతర అలంకారాలతో పతాక భాగం నిలిచివుంటుంది. అలా నిలిచి వుండే పతాక భాగం కొద్దిగా ఒక ప్రక్కకి వాలినట్లుండటంతో, దాన్నికూడా సరి చేయవలసిందనీ అవసరమైనచోట్ల ప్లేట్లు మార్చవలసిందనీ ఆదేశాలిచ్చాను. పనులు జరిగిపోతున్నాయి.

హఠాత్తుగా ఓరోజు ఉదయం ఈ పనులు పర్యవేక్షిస్తున్న ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ వెంకట్రామయ్య దగ్గర్నుంచి ఫోన్‌కాల్ వచ్చింది. నన్ను అర్జంటుగా ఆలయానికి రమ్మంటూ వెంకట్రామయ్య చేసిన అభ్యర్థనలో ఆదుర్దా, ఖంగారు కొట్టొచ్చినట్లు తెలుస్తున్నాయి. నేను ఆలయానికి చేరుకొన్న మరుక్షణం - వెంకట్రామయ్య నన్ను తాత్కాలికంగా ఏర్పాటు చేసిన చెక్కమెట్ల మీద నుంచి ధ్వజస్తంభంపైన పతాకభాగం దగ్గరికి తీసుకువెళ్ళి చూపించాడు. ఆ పతాకభాగం తొలగించి చూస్తే, దానిక్రింద ఆధారంగా వుండాల్సిన ధ్వజస్తంభం మాను ఎక్కడా కనబడటం లేదు. ఒక్కసారిగా నేనుకూడా షాక్ తిన్నాను... వెంటనే ఆ పతాకం క్రింద ధ్వజస్తంభానికి చుట్టూ అంటిపెట్టుకున్న గుండ్రటి బంగారు ప్లేట్లని నాలుగు వరసల దాకా తొలగించాక కానీ, ధ్వజస్తంభం మాను బయటపడలేదు. కాని అదంతా పుచ్చిపోయింది....అయితే పైన ధ్వజం ఎలా నిల్చివుంది? - కేవలం ఆ బంగారు ప్లేట్ల ఆధారంగా మాత్రమే వుంది. (పైన చిట్టచివరి రింగు చుట్టుకొలత మూడున్నర అడుగులు వుంటుంది.)

ఇప్పుడేం చేయాలి? కొందరు అధికారులు ఇచ్చిన సలహా ఏమిటంటే, యధాతథంగా గోల్డ్ ప్లేట్లు తాపడం చేసి వదిలేద్దాం. ధ్వజస్తంభం అలా ఎంతకాలం వుంటే అంతకాలం వుంటుంది. వాళ్ళ ఆలోచనకి కారణం - అంత ఎత్తైన ధ్వజస్తంభం తొలగించి, అక్కడికి కొత్త మాను తీసుకువచ్చి





ప్రతిష్ఠించటం దుస్సాధ్యం. క్రమంగా నా ఆదేశాల మేరకు మరింత క్రిందకు ప్లేట్లు తీసుకుంటూ వెళ్ళారు ఇంజనీర్లు. ఎంత క్రిందకు చూసినా ధ్వజస్తంభం మాను పుచ్చిపోయి, మానుకీ గోల్డ్ ప్లేట్లకీ మధ్య ఖాళీ ఏర్పడిన విషయం మరింత భయంకరంగా బయటపడుతూ వచ్చింది. నేను మ్రాన్పడిపోయాను ఆ పరిస్థితి చూస్తూ. మాను ఎంతలావు వుంటే, అంతటి చుట్టుకొలతతో ఆ మానుని పూర్తిగా అంటిపెట్టుకుని వుండేలా గోల్డ్‌ప్లేట్లు తయారుచేసి చుట్టి, తాపడం చేస్తారు. ఇప్పుడు లోపల మాను చిక్కి, శల్యమైపోతుంటే, ఆ గోల్డ్‌ప్లేట్ల తాపడం మాత్రం నిలబడివుంది - ఎందుకంటే, వాటి చుట్టుకొలత - క్రింద ఏడెనిమిది అడుగులతో ప్రారంభమై, పైకి వెళ్ళిన కొద్దీ తగ్గుతూ, చివరి ప్లేటు చుట్టుకొలత మూడున్నర అడుగులుగా వుంది.

సరే, ఇప్పుడేం చేయాలి? కొన్నేళ్ళుగా ఈ మాను పుచ్చిపోతూ వచ్చిందన్న విషయం ఇప్పుడే బయటపడింది. అప్పుడు మేం చూసి వుండకపోతే అది అలాగే పూర్తిగా పుచ్చిపోయి, గోల్డ్‌ప్లేట్లు తాపడం మాత్రమే మిగిలి, ఏదో ఒకరోజు అది కూడా కుప్పకూలి పోవచ్చు. పోనీ దాదాపు 80 అడుగుల పొడవైన మాను తెచ్చి మార్చేద్దామా అంటే, అది బజారులో దొరికే బంగారం కూడా కాదు.

ఇంత ఆలోచన కూడా ఆ క్షణంలో చేయలేదు. అలా పుచ్చిపోయిన మానుతో ధ్వజస్తంభం పునర్నిర్మాణం చేయటానికి నా మనస్సాక్షి అంగీకరించలేదు. ఏదో ఆవేశం నాలో పొంగింది. నాకు తెలీని శక్తి ఏదో నన్ను ఆవహించినట్లనిపించింది. అంతే, నేను సంప్రదింపులు ఆపేసి అప్పటికప్పుడు ప్రకటించేశాను - "మనం కొత్తమాను తీసుకువచ్చి ధ్వజస్తంభాన్ని పునర్నిర్మిద్దాం....."

★ ★ ★

అసలు సమస్య అప్పుడే మొదలైంది. భూమిపై నుంచి ధ్వజస్తంభం ఎత్తు 50 అడుగుల దాకా వుంది. నేలమీద ఏడడుగుల ఎత్తు వరకు ధ్వజస్తంభం చుట్టూ ఒక ప్లాట్‌ఫారమ్‌లాగా రాతి కట్టడం వుంది. గోల్డ్‌ప్లేట్లు తొలగించి, భూమి లోపల ఎంత లోతువరకు మానువుందో అంతలోతు వరకు తవ్వితీస్తే కాని ఆ పాతమానుని తొలగించలేం. అలా చేయాలంటే, ధ్వజస్తంభం ప్లాట్‌ఫారమ్‌కి ఆనుకుని ముందున్న బలిపీఠం వేదికను కూడా తొలగించాలి. అంటే, ఆలయం మధ్యలో మహద్వారం ముందర ఓ పెద్దగొయ్యి తవ్వాలి. ఇదంతా ఒక వారంరోజులు పడుతుందని ఇంజనీర్ల అంచనా. ఇంత చేసినా, పాత మాను తొలగిస్తాం. మరి కొత్త మాను ఎక్కడ్నుంచి వస్తుంది?- ఇది రెండో సమస్య. పాత మాను ఎప్పుడు పెట్టారో, ఎక్కడ్నుంచి తెచ్చారో చూస్తే తెలిసిపోతుంది గదా అని రికార్డు తనిఖీ చేశాం. మాకు లభ్యమైన గత 180-190 సంవత్సరాల రికార్డులో ఎక్కడా ఈ ధ్వజస్తంభం ప్రస్తావనే లేదు. అంటే ఇది ఎంతపాతదో? సరే, ఈ వెతుకులాట మానేద్దాం. కొత్తగా చెట్టు కొట్టించి మాను తెచ్చేద్దాం అనుకుంటే - ఆగమశాస్త్రానుసారం, ధ్వజస్తంభానికి వాడే మానుకి నిర్ణీత లక్షణాలు చాలా వుండాలి. ఆ మానుకి ఎలాంటి తొర్రలు వుండకూడదు. కొమ్మలు వుండకూడదు. ఎలాంటి

పగుళ్ళు వుండకూడదు. ఏ మాత్రం వంకర వుండకూడదు. వీటికి తోడు, మన అవసరాన్ని బట్టి కనీసం 75 అడుగుల ఎత్తు వుండాలి. దీర్ఘకాలం మన్నిక వుండాలంటే, టేకు చెట్టు మానై వుండాలి..... ఇవన్నీ వినేసరికి నాకు నీరసం వచ్చేసింది. అయినా ఆశ చావలేదు. క్షణాల మీద మన రాష్ట్ర ప్రభుత్వ అటవీశాఖ అధికారుల్ని సంప్రదించాను. అటవీశాఖ నిపుణులంతా చర్చించి, "ఇలాంటి లక్షణాలుండే టేకు చెట్లు మన రాష్ట్రంలో దొరకడం అసాధ్యం" అని తేల్చారు. కర్నాటకలోగానీ, కేరళలోగానీ పడమటి కనుమల అడవుల్లో దొరకవచ్చు అని కూడా స్పష్టం చేశారు.

ఈ సంప్రదింపులన్నీ టెలిఫోన్‌లో ఓ ప్రక్క జరుగుతుండగానే, ధ్వజస్తంభం దగ్గర చాలామంది అర్చకులు, మిరాసీదార్లు, విలేకర్లు గుమికూడారు. ఎవరికి వారు తమకు 'తెలుసు' అనుకుంటున్న విషయాన్ని పదిమందికీ చెప్పేస్తున్నారు. ఆలయం మహంతుల యాజమాన్యంలో వున్నప్పుడు ధ్వజస్తంభం క్రింద నిధి వుందని చెప్పుకునేవారుట. కాబట్టి నిధి ఖాయంగా వుందనే వార్త క్షణాల్లో ప్రచారమైపోయింది. దీనికి తోడు ముఖ్యమంత్రి దగ్గర్నుంచి, దేవాదాయశాఖ మంత్రి నుంచి ఇంకా అనేకమంది ప్రముఖుల దగ్గర్నుంచి ఫోన్‌కాల్స్. ఎవరి ఉత్కంఠత వాళ్ళది. అందరికీ, ఒకటే సమాధానం - "ధ్వజస్తంభం పుచ్చిపోయింది. కాబట్టి పాత మాను మార్చేస్తున్నాం".

అలా చెబుతున్నానే కానీ, క్షణక్షణానికీ నాలో టెన్షన్ పెరిగిపోతోంది. ఓ పక్క మనకి కావలసిన టేకు చెట్టు దొరకడం ఒక సమస్య అని తలబాదుకుంటుంటే, మరోప్రక్క ఈ నిధి ప్రచారం. రెండో మహద్వారం ముందే ధ్వజస్తంభం వుంది. భక్తులు దర్శనానికి వెళ్ళే క్యూ ఈ ధ్వజస్తంభం ప్రక్కనుంచే లోపలికి వెళ్ళాలి, బయటకు రావాలి. వంటశాల నుంచి ప్రసాదాలు కూడా అట్నుంచే (లోపల్నుంచి) రావాలి. వివిధ ఆర్జిత సేవలకోసం శ్రీవారి ఉత్సవ విగ్రహాల్ని ప్రతిరోజు ఆ ద్వారంలోంచే తీసుకు రావాలి, తీసుకు వెళ్ళాలి. ధ్వజస్తంభం మాను తొలగించడం కోసం త్రవ్వకాలు మొదలు పెడితే యాత్రికుల క్యూకి ఇబ్బంది కలుగుతుంది. పైగా ఆ 'నిధి' ఏదో చూడాలని ఆరాటం అందరికీ వుంటుంది కదా! ..... అదొక క్లిష్టమైన పరిస్థితి. కొత్త మానుకోసం కేరళ, కర్నాటక అడవుల్లో వెతికించాలి. ఒకవేళ అంత ఎత్తైన, అలాంటి లక్షణాలుండే టేకు చెట్టు కనబడకపోతే...? తీరా కనబడినా, దాన్ని అక్కడ్నుంచి ఈ కొండమీదకు ఎలా తేవాలి? ... తేగలిగినా, ఇక్కడ గొయ్యితవ్వి, పాత మాను తీసి, కొత్త మాను ప్రతిష్ఠ చేయటం ఎలాగ...? ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా అప్పటికే నా టరమ్ మూడేళ్ళు దాటింది. కాబట్టి ఏ క్షణంలోనయినా బదిలీ రావచ్చు. అంచేత, నా హయాంలో ఈ ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠింపజేయగలనా....? ఇంకో నాలుగు అయిదు నెలల్లో బ్రహ్మోత్సవాలు రాబోతున్నాయి. ధ్వజస్తంభంపై ధ్వజారోహణతోనే ఉత్సవాలకు నాంది. అప్పటికి ధ్వజస్తంభం తయారు చేయగలనా?.... ఆలోచించిన కొద్దీ, టెన్షన్ పెరుగుతోందే తప్ప, జవాబు దొరకడం లేదు..... ఒక్కటే అనుకున్నాను. "నన్ను ఇక్కడకు తీసుకువచ్చిన శక్తే వీటికి పరిష్కారం కూడా చూపిస్తుంది."





అలా ఆలోచిస్తూనే ఆ రాత్రి పదిన్నర గంటల ప్రాంతంలో ఇక ఆలయం నుండి బయల్దేరబోతుండగా, బెంగుళూరు నుంచి హెచ్. ఎస్. ఆర్. అయ్యంగార్ అనే భక్తుడు నాకోసం టెలిఫోన్ కాల్ చేశారు. ఆయనెవరో నాకు అంతకు ముందు తెలీదు. పైగా రాత్రివేళ ఫోన్‌కాల్. అసహనంగానే ఆ ఫోన్ అందుకొని నేను మాట్లాడగానే, ఆయన ప్రవాహంలాగా చెప్పుకుంటూ పోతున్నాడు.... "అయ్యా, మీరు ధ్వజస్తంభాన్ని మార్చాలనుకుంటున్నారని రేడియోలో విన్నాను. అలాంటి ధ్వజస్తంభానికి మానుకావాలంటే కనీసం 280-300 సంవత్సరాల వయసున్న టేకుచెట్టు కావాలి. కర్నాటకలోని దండేలి అడవుల్లో మాత్రమే అది దొరికే అవకాశంవుంది.... నాకు బెంగుళూరులో విస్తృత పరిచయాలున్నాయి. ఇక్కడి అటవీశాఖ ఛీఫ్ కన్సర్వేటర్ నాకు చాలా మిత్రుడు.... మీరు అనుమతిస్తే, నేను నా మిత్రుడి సహాయంతో అడవుల్లో గాలించి అలాంటి చెట్టుని ఎంపిక చేయిస్తా. మీరు లాంఛనప్రాయంగా ఒక లెటర్ ఆయనకి వ్రాయండి. మిగతా సమన్వయం బాధ్యత అంతా నాకు వదిలేయండి. స్వామివారికి ఇది నా సేవగా పరిగణించి, అనుమతించండి..." - అంతే, మరుక్షణం నేను అక్కడే ఆలయంలో కూర్చునే, కర్నాటక ఛీఫ్ సెక్రటరీతో, ఛీఫ్ కన్సర్వేటర్‌తో లాంఛనప్రాయంగా టెలిఫోన్‌లోకూడా మాట్లాడి, వాళ్ళ హామీ కూడా తీసుకున్నాను. ఇదంతా అయ్యేసరికి రాత్రి 11 గంటలు దాటింది.... అప్పటికి నా మనసు కుదుటపడింది. పర్వతంలా కనుపించిన సమస్య దూదిపింజలా మారిపోయింది!

★ ★ ★

**ఆ** మర్నాడు ఉదయాన్నే ఆరంభించి వారంరోజులపాటు తవ్వితేగానీ, పూర్తిగా పునాది ఆరంభందాకా వెళ్ళలేకపోయాం. ఈ లోపల నేను కొందరు రిటైర్డ్ అధికారులు, విజిలెన్స్ సిబ్బంది, పత్రికా విలేకరులు, స్థానిక పెద్దలు, యాత్రికుల నుంచి అప్పటికప్పుడు ఎంపిక చేసిన ప్రతినిధులతో - ఈ నిధి సంగతి చూడటానికి ఒక కమిటీ వేశాను. వాళ్ళందరి సమక్షంలో ధ్వజస్తంభం అడుగున బయటపడిన నిధి ఏమిటంటే - కొద్దిపాటి బంగారు, వెండి ఆభరణాలు మాత్రమే. (అయితే స్తంభం మాను మొదలు భాగం వరకూ కూడా పాడయిపోయింది.)

ఈ వారంలోగా బెంగుళూరులో అయ్యంగార్ ప్రోద్బలంతో ఛీఫ్ కన్సర్వేటరూ, వారి సిబ్బందీ గాలింపు జరిపి, ఒక వందచెట్లు పరీక్షించాక, దండేలి ప్రాంతంలోని కొండవాలుల్లో ఒక పదహారు టేకుచెట్లు వరకూ మాకు పనికి రావచ్చని తేల్చారు. సరిగ్గా అదే వారంతో కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ గుండూరావు సకుటుంబంగా తిరుమలకు రావడం, నేను ఈ ధ్వజస్తంభం విషయం వారికి చెప్పడం, ఆయన వెంటనే "నూతన ధ్వజస్తంభం మానుని టిటిడికి కర్నాటక విరాళంగా తీసుకోండి" అని ప్రకటించడం జరిగిపోయాయి, ఆ వారాంతంలోపు నేను, మా ఇంజనీర్లతో కలిసి వెళ్ళి, అయ్యంగార్, ఛీఫ్ కన్సర్వేటర్‌లు వెంటరాగా, ఆ 16 టేకుచెట్లు పరీక్షించాం. చివరకి వాటిల్లో మా కంటికి కనుపించినంతవరకు ఆరు చెట్లు మాత్రమే నిర్దిష్ట ప్రమాణాలకు అనుగుణంగా వున్నాయి. వాటిల్లో రెండు చెట్లు మా అవసరానికి మించిన ఎత్తులో వున్నాయి. నేను టిటిడి అవసరాలు


తిరుమల ఆలయంలో కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ గుండూరావు

దృష్టిలో వుంచుకొని, మొత్తం ఆరు చెట్లూ మాకే కావాలన్నాను. అయితే వాటి నాణ్యత పైకి కనుపిస్తున్న అంశాల్ని బట్టే చెప్పలేం. లోపల చేవకూడా పరిపూర్ణంగా వుండాలి. ఏ మాత్రం రంధ్రం వున్నా పనికి రావు. కానీ వాటి చేవ గురించి, నరికి చూసేవరకు ఏమీ చెప్పలేమని ఛీఫ్ కన్సర్వేటర్ స్పష్టం చేశారు. దాంతో నాకు మళ్ళీ బెంగ పట్టుకుంది. ఇంత కష్టపడి చెట్లు ఎంచుకుంటే, తీరా నరికాక, చేవలో లోపం వుంటే...? అంతలోనే మళ్ళీ - "ఏ శక్తి నన్ను ఇంతవరకూ నడిపించిందో, ఆ శక్తే అన్నీ చూసుకుంటుంది" అన్న ధీమా నన్ను ఆవహించింది.

అద్భుతం ! బెంగుళూరుకు తిరిగివచ్చి, ముఖ్యమంత్రిని, ఛీఫ్ సెక్రటరీని కలిసి మాట్లాడితే, ఆ ఆరు చెట్లూ విరాళంగా ఇస్తున్నట్లు ప్రకటించారు. అంతే, చెట్లు నరకడం ఆరంభమైంది. కానీ అప్పుడే ఎదురైంది - మరో జటిలమైన సమస్య....

దట్టమైన అడవిలో ఎత్తైన కొండ వాలుల్లో ఈ చెట్లు వున్నాయి. వాటిని మొదలుకంటా నరికి, ఆ అడవిలోంచి ఘాట్ రోడ్డు వరకూ చేరవేయాలంటే కొన్ని చోట్ల రెండు మూడు కిలోమీటర్లు, మరికొన్ని చోట్ల ఎనిమిది కిలోమీటర్లు - ఇలా రకరకాల దూరాల వరకూ వాటిని మోసుకు వెళ్ళాలి. చెట్లు నరికిందగ్గర్నుంచీ, సమీపంలోని రోడ్ల వరకు దారి అంతా కంపలు, చెట్లు, పొదలు. వాటిని నరికించి మార్గం సుగమం చేయటానికి ఛీఫ్ కన్సర్వేటర్ ఏర్పాటు చేశారు. మామూలుగా కలప కోసం అయితే, చెట్లు నరికాక, వాటిని తగినంత సైజులో పొడవాటి ముక్కలుగా కోసి మోసుకువెళ్తారు. కాని ఇక్కడ, మేం ఎంచుకున్న మానుల్ని ముక్కలుగా నరికితే అవి నిరర్థకమై పోతాయి. ఎలా చేయాలి..... ఏం చేయాలి? మరోసారి అనుకున్నాను. "ఈ ధ్వజస్తంభం ఎవడికోసం? వాడే చూసుకుంటాడు...."

★ ★ ★

**వి**చిత్రం! ఆ అడవిలో సోమానీ వారి పేపర్ మిల్లుకోసం కలప నరికే వాళ్ళకి తెలిసింది మా హడావుడి అంతా. ఆ మిల్లు యాజమాన్యం, సిబ్బందీ వచ్చేశారు. "అయ్యా! ఈ పని మాకు వదిలేయండి. ఇది శ్రీనివాసునికి మా సేవగా భావించండి" అంటూ ఆ కార్యభారం వాళ్ళు తలకెత్తుకున్నారు. ఇంక చెప్పేదేముంది. వారం రోజుల్లో చెట్లు నరకటం, వాటిని సోమానీ మిల్లు





సిబ్బంది - తాళ్ళు, కప్పీలు, గొలుసులు వగయిరా సామగ్రి వుపయోగించి రోడ్డు మీదకు యధాతథంగా చేర్చటం పూర్తయిపోయింది.

'అమ్మయ్య' అంటూ వూపిరి పీల్చుకున్నాను. - కానీ అక్కడ్నుంచి తిరుమల కొండమీదకు కొన్ని వందల కిలోమీటర్ల దూరం ఆ మానుల్ని రవాణా చేయించటం ఎంత దుర్లభమో అప్పటిదాకా నాకు తోచలేదు. ఈ లోపల అయ్యంగార్ మళ్ళీ చొరవ తీసుకుని, ఒక 16 చక్రాలుండే పొడవాటి ట్రక్‌ని మాట్లాడాడు. ఆ ట్రక్ యజమాని ఒకటే చెప్పాడు. - "ఈ పొడవాటి ఆరు మానుల్ని తీసుకుని తిరుపతి దాకా రావటానికి నాలుగైదు రోజులు పట్టొచ్చు. ఎందుకంటే దారిలో చాలా రైల్వేగేట్లు, పాతకాలపు వంతెనలూ, క్లిష్టమైన మలుపులూ వుంటాయి. కాని తిరుపతినుంచి తిరుమలకు ఘాట్ రోడ్డులో ప్రయాణం ఎన్నిరోజులు పడుతుందో తెలీదు. మధ్యలో ఎక్కడన్నా మలుపు తిరగలేక ఆగిపోయినా ఆగిపోవచ్చు. ఎన్నిరోజులు అలా వుండిపోతామో తెలీదు కాబట్టి మీరు రోజుల్నిబట్టి ఛార్జీలు చెల్లించండి, దూరాన్ని బట్టి కాదు". నేను ఒప్పుకున్నాను.

రెండురోజుల్లో ఆరుమానుల్నీ తీసుకుని ఆ ట్రక్ బెంగుళూరు వచ్చింది. అక్కడ విధానసౌధ దగ్గర చిన్న పూజా కార్యక్రమం అనంతరం ముఖ్యమంత్రి వాటిని టిటిడికి విరాళంగా ఇస్తున్నట్లు లాంఛనప్రాయంగా ప్రకటించి, నా చేతికి అప్పగించారు. వేలాది ప్రజల సమక్షంలో జరిగిన ఆ అప్పగింతలో ఆ మానుల్ని తాకగానే అనిర్వచనీయమైన ఆనందంతో నా ఒళ్ళు పులకించింది. (ఎందుకలా?)....... ఆ మర్నాడు సాయంత్రం నాలుగు గంటలకే ట్రక్ తిరుపతి చేరుకుంది. వూరి బయట డెయిరీ ఫారం దగ్గర వేలాది స్త్రీ, పురుషులు గుమికూడారు. ఆ మానులు రాగానే హారతులిచ్చారు. 'గోవిందా, గోవిందా' అనుకుంటూ తన్మయత్వంతో నినాదాలు చేశారు. మరోగంటలో ఆ ట్రక్ ఘాట్ రోడ్డు మొదలుకి (అలిపిరి) చేరుకుంది.

అక్కడిదాకా అంతా ఆనందమే. డ్రైవర్ ట్రక్ దిగాడు. కొండకేసి చూశాడు. ఘాట్‌రోడ్డు 18-19 కిలోమీటర్ల దూరం.... ఏడెనిమిది సంక్లిష్టమైన మలుపులు.... నా దగ్గరకు వచ్చాడు. "సర్, ఇది నా జీవితంలో ఒక గొప్ప సాహసం. ఎట్టి పరిస్థితుల్లోనూ ట్రక్ ఆపకుండా కొండమీదకు నడపగలగాలి. అలా నడిపితేనే నాకు సంతృప్తి. మధ్యలో ఘాట్‌రోడ్డు పిట్టగోడలు దెబ్బతినొచ్చు. - ట్రెయిలర్ తగిలి బండరాళ్ళు దొర్లిపడొచ్చు. ఎన్నిరోజులు పడుతుందో తెలీదు. ఏమైనా కానీ, నేను ఇది చేసి తీరాలి....."

నేను హామీ ఇచ్చాను - "బండలు విరిగిపడినా, పిట్టగోడ కూలిపోయినా, నీకు బాధ్యతలేదు. అదంతా మేం చూసుకుంటాం...." (అక్కడికేదో అంతా మేమే చేస్తున్నట్లు, మా శక్తితోనే అంతా నడిచిపోతున్నట్లు ఆత్మవిశ్వాసం. నిజమా?)....

మొత్తంమీద ఆ సంధ్యా సమయంలో అరుణ కాంతుల వెలుగులో ఆ టేకుమానులు భగవంతుని ముంగిట్లో ధ్వజస్తంభాలుగా మారటం కోసం ఆ ట్రక్ మీద ఘాట్ రోడ్డులో ప్రయాణం


నూతన ధ్వజస్తంభం ప్రతిష్ఠిస్తున్నప్పుడు

సాగించాయి. (ముందుగా చేసుకున్న ఏర్పాట్ల ప్రకారం యాత్రికుల, బస్సు ట్రాఫిక్‌ని అంతటినీ, పాతఘాట్ రోడ్డుమీదకు మళ్లించాం. అంటే కొండపైకి వెళ్ళేవీ, తిరిగివచ్చేవీ కూడా పాతఘాట్ రోడ్డులోంచే జాగ్రత్తగా వెళ్లాలి.)... భయపడినట్లుగానే ట్రక్ మలుపుతిరిగినప్పుడల్లా కొన్నిచోట్ల ట్రెయిలర్ పైన మానులు కొండని కొట్టుకుని బండలు పడ్డాయి. కొన్ని మలుపుల్లో లోయవైపున్న పిట్టగోడకూలిపోయింది. మరికొన్ని మలుపుల్లో ట్రెయిలర్ వెనకాల ఒకవైపు చక్రాలు పిట్టగోడని గుద్దేసి, లోయ మీంచి దూకేశాయి.. వెనకాల కారులో వస్తున్న నాకూ, మా ఇంజనీర్లకీ ఈ ఫీట్లు చూస్తుంటే ఒళ్లు జలదరిస్తోంది. ఒకటి రెండు మలుపుల్లో సగం ట్రెయిలర్ లోయ అంచుమీంచి గెంతినట్లే అయింది. "ఆఁ ఆఁ.." అనుకుంటూ వెనకాల కార్లలో మేం ఆందోళనతో వూగిపోతున్నాం. ఏ మలుపులో నయినా ట్రెయిలర్ క్రిందపడిపోతే.... ! ఇలాంటి ఆలోచనలు నాలో టెన్షన్ పెంచేస్తున్నాయి. క్షణాలు- నిముషాలు - గంటలు దొర్లిపోయాయి.

★ ★ ★

**...లేదు**, ఒక గంట దొర్లేలోపలే, అంటే 55 నిమిషాల్లోనే ఫీట్లు చేసుకుంటూ, మా సంభ్రమాశ్చర్యాలమధ్య ధ్వజస్తంభాల మానులతో ట్రక్ తిరుమలకి చేరిపోయింది. ఒక్కసారిగా వందలాది భక్తులు, టిటిడి ఉద్యోగులు ఆనందోత్సాహాలతో చేస్తున్న "గోవిందా-గోవిందా" పిలుపులతో తిరుమల గిరులు ప్రతిధ్వనించాయి. నా కళ్లని నేనే నమ్మలేకపోతున్నాను. నాలో ఆనందపు అలలు పొంగి ఆకాశాన్ని తాకుతున్నంత ఉద్వేగం కలిగింది. నాకు తెలీకుండానే నా కంట్లోంచి ఆనంద (భక్తి) బాష్పాలు రాలుతున్నాయి. ఆ ఆనంద రసానుభూతిలో కొన్ని క్షణాలపాటు చేష్టలుడిగి అలా వుండిపోయాను!!

ఏమిటా అద్భుతం! సూర్యాస్తమయం ఆరంభమయ్యే సమయంలో అలిపిరిలో బయల్దేరిన ట్రక్, సూర్యుడు పశ్చిమాద్రిన పూర్తిగా అస్తమించే సమయానికి కొండకి చేరిపోయింది. ఇంకా విచిత్రం, ట్రక్ యజమాని మా వెనకాలే కారులో వచ్చి నమస్కారం పెడుతూ అన్నాడు - "స్వామి వారికి ఇంత గొప్ప సేవ చేసే అవకాశం లభించడం నా అదృష్టం. అందుకే నేను ఒక్క నయాపైసా కూడ





రవాణా ఛార్జీలు తీసుకోవటం లేదు". (అతనికా ప్రేరణ ఎక్కడ్నుంచి కలిగింది?) - అయ్యంగార్‌ని, ట్రక్ యజమానిని, డ్రైవర్‌ని వేదపండితుల ఆశీర్వచనాలమధ్య, ప్రత్యేక దర్శనంతో, శ్రీవారి శేష వస్త్రంతో సత్కరించాం.

అప్పటికే ఆరడుగుల నుంచి 100 అడుగులకి వెడల్పు చేసిన (ఆలయం ఎదురుగా గల) సన్నిధి వీధిలో మానులు దించారు. వాటిల్లో ఉత్తమమైనదాన్ని శ్రీనివాసుని ఆలయంలో నూతన ధ్వజస్తంభానికి ఎంపిక చేశాం. మరో వంద ఏళ్ల వరకూ పాడవకుండా దానికి కెమికల్ ట్రీట్‌మెంట్ ఇప్పించాం. పురుగు చొరకుండా, ముందుగా తగరపు రేకువేసి, ఆ పైన గోల్డ్ ప్లేట్లు తొడగాలని నిర్ణయించాం. - ఇదంతా ఒకవారం పట్టింది. అమ్మయ్య! ఇంకేముంది ధ్వజస్తంభం పని పూర్తయినట్లే - అనుకున్నాను. కాని మరో అవరోధం సంగతి అప్పుడే బయటపడింది!

మొత్తం 75 అడుగుల పొడవున్న ధ్వజస్తంభం మానుని, పూర్వపు ధ్వజస్తంభం వున్న చోట ప్రతిష్ఠించాలంటే అక్కడ పై కప్పులా వున్న మంటపాన్ని పగల గొట్టాలని తేల్చారు అధికారులు. లేదా, భారీ క్రేన్ తీసువచ్చి, దాని సహాయంతో ఈ మానుని మంటపంపై నుంచి క్రిందకు - కప్పు రంధ్రంలోంచి (పూర్వపు ధ్వజస్తంభం స్థితిలో) దించడం చేయాలన్నారు. కాని మంటపం పగలగొట్టడానికి నాకు మనస్కరించలేదు. భారీక్రేన్ తెచ్చి అక్కడ పెట్టాలంటే, మహద్వారాన్నీ దానిపై గల గోపురాన్ని కూడా పెకలించాలి - అంటే యాత్రికుల రాకను ఆపేయాలి. ఈ రెండు మార్గాలు కాకపోతే, మరి ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠించడం ఎలా? ఎలా? - అలా రోజంతా నేనూ, మా ఇంజనీర్లు, అధికారులూ తలలు బద్దలయ్యేలా అర్ధరాత్రిదాకా చర్చలు జరిపి, ఇక జరిపే శక్తిలేక మర్నాటికి వాయిదా వేసుకుని వెళ్లిపోయాం. నాకు ఒక పట్టాన నిద్ర రాలేదు. మూడు వారాల పాటు అష్టకష్టాలు పడి టేకు మానులు తీసువచ్చాక, వాటి ప్రతిష్ఠ ఎలా చేయాలీ అన్నదానిమీద ఇంత తర్జనభర్జన ఎందుకు జరుగుతోంది? ఇంతమంది ఇంజనీర్లు, మేధావులం కలిసి కూడా ఈ చిన్నపని చేయలేకపోతున్నామా? ఎందుకు చేయలేకపోతున్నాం... ?


నూతన ధ్వజస్తంభం ప్రతిష్ఠించాక

అలా ఆలోచిస్తుంటే, అప్పుడే మళ్లీ స్ఫురించింది - " ఏ శక్తి ఇంతపని చేయించిందో, ఆ శక్తి మిగతా పనికూడా చేయించదా? ... ఈ ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠింపజేసే ప్రాప్తం నాకుంటే నా చేతుల మీదుగా జరుగుతుంది. లేకపోతే లేదు.." ఈ ఆలోచన రాగానే మనసు కుదుటపడింది. ప్రశాంతంగా నిద్రపోయాను.

* * *

**అం**దుకు భిన్నంగా జరగలేదు. ఉదయం చర్చల్లో కూర్చున్న కొద్దిసేపట్లోనే ఎవరో అన్నారు - "ఎందుకండీ ఇదంతా, మానుని మహద్వారంలోంచి మోసుకువచ్చేటప్పుడే దాని తలభాగం వీలైనంత ఎత్తుకి లేపి వుంచుతూ, మొదలు భాగం నేలమీదకే వుంచుతూ, ఏతాం ఆకారంలో తీసుకువద్దాం. అది సరిగ్గా మంటపం క్రిందకు వచ్చేసరికి, దాన్ని ఆ రంధ్రంలోంచి పైకి దోపుదాం. మన పాపనాశనం డామ్ కడుతున్న ఇంజనీరింగ్ సిబ్బంది, అక్కడి కళాసీల సహాయం తీసుకుందాం.."- బ్రహ్మాండమైన ఆలోచన. (ఎక్కడిదీ ప్రేరణ?) ఆఘమేఘాల మీద ఇంజనీర్లు కొలతలు వేసి, మహద్వారంలోపల్నుంచి బలిపీఠం వరకు నేలని లోతుగా తవ్వుకుంటూ వెళితే, ఈ ప్లానుని అమలు చేయటం సాధ్యమవుతుందని తేల్చారు. పైగా మహద్వారానికీ, బలిపీఠంకీ మధ్య ఎంత తవ్వినా, ఏం చేసినా యాత్రికుల వరుసలకి ఏమాత్రం అవరోధం వుండదనికూడా స్పష్టం చేశారు.

ఇంక ఆలస్యం చేయలేదు. ముహూర్తం చూసి, హెచ్‌సిఎల్ ఇంజనీరింగ్ సిబ్బంది, కళాసీల సాయంతో ధ్వజస్తంభానికి ఎంచుకున్న టేకు మానుని సన్నిధి వీధిలోంచి, గొల్లమండపంలోంచి, మహద్వారంలోంచి ఆలయంలోకి ప్రవేశపెట్టాం. అక్కడ్నుంచి మానుశిఖర భాగం మంటపం పై కప్పును చూస్తూ లేచేలా ఎక్కడికక్కడ సర్వే బాదులతో స్టాండ్‌లు ఏర్పాటు చేశారు. మెల్లగా కళాసీలు మానుని ముందుకు తోస్తుంటే, అది అలా అలా లేచి సరిగ్గా మంటపం పై కప్పులో రంధ్రాన్ని క్రిందనుంచి చేరుకుంది. మహద్వారం దగ్గర్నుంచి బలిపీఠం దాకా నేలమీద గోతిలో మాను మొదలుని ముందుకు తోసుకు వెళ్తుంటే, ఇంజనీర్ల నైపుణ్యం ఫలించి, ఆ మాను శిఖరం మంటపంపైన రంధ్రంలోంచి పైకి, ఆకాశాన్ని చూస్తూ లేచి నిటారుగా నిలబడింది.



నూతన ధ్వజస్తంభం ప్రతిష్ఠ సందర్భంగా బలిపీఠం దగ్గర గోపూజ





మంటపం ఏ మాత్రం దెబ్బతినకుండా ఆ సాయంత్రానికల్లా దండేలీ అడవుల్లోని టేకుచెట్టు తిరుమలేశుని ఆలయంలో ధ్వజస్తంభంగా ప్రతిష్ఠకు సిద్ధంగా నిలబడింది.



నూతన ధ్వజస్తంభ ప్రతిష్ఠ సందర్భంగా
ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రామ్ దంపతుల ఆలయ సందర్శన

కథ అప్పుడే ఓ చిన్న కొసమెరుపుని సంతరించుకుంది... ధ్వజ స్తంభం క్రింద శాస్త్రానుసారంగా నవ రత్నాలు, నవధాన్యాలు వగైరా వుంచాలన్నారు. అవిరెండు పెట్టెల్లో పెట్టి ధ్వజస్తంభం క్రింద పునాది భాగంలో పెట్టాం. అకస్మాత్తుగా నాకు ఏదో తోచింది. వెంటనే నా మెడలో శ్రీనివాసుని డాలర్‌తో వున్న గోల్డ్ చైన్ తీసి ఒక పెట్టెలో వేశాను. క్షణాల్లో చుట్టూ చేరివున్న అర్చకులు, మిరాసీదార్లు, విఐపిలు, ఇతర భక్తులు కూడా ముందుకు వచ్చారు - శ్రీవారి ధ్వజస్తంభానికి తమ భక్తి పూర్వక బహుమానం ఇవ్వటానికి. అంతే! ఉంగరాలు, చైన్‌లు వగయిరా ఆభరణాలతో మరో పెట్టె నిండిపోయింది. అలా ఆ పెట్టెల్ని నిక్షిప్తం చేసి, వాటిపై కాంక్రీట్ పోశాక, దానిపైన ధ్వజస్తంభాన్ని సరిగ్గా 90 డిగ్రీల కోణంలో శాస్త్రోక్తంగా ప్రతిష్ఠింపజేశాం. (పాత ధ్వజస్తంభం మానుని పాపనాశనం డామ్‌లో వేదోక్తంగా విశ్రమింపజేశాం) ఒక నెల రోజులకి నూతన ధ్వజస్తంభానికి ప్లాట్‌ఫారమ్ నిర్మాణం, పైన బంగారు ప్లేట్లు తొడగటం, శిఖర భాగాన పతాకాన్ని నిలబెట్టడం, ధ్వజస్తంభానికిముందు బలిపీఠం నిర్మించడం పూర్తయ్యాయి. ఒక మినీ బ్రహ్మోత్సవం తలపెట్టి (మిగతా అన్ని మరమ్మతులు, బంగారు ప్లేట్లకు మెరుగు పెట్టడాలు వగయిరా అన్నీ పూర్తిచేశాక), ఆ బ్రహ్మోత్సవంలో భాగంగా ఆస్థాన పండితుల ఆశీర్వచనాల మధ్య, వేద మంత్రోచ్చారణలతో తిరుమల గిరులు ప్రతిధ్వనిస్తుండగా 1982 జూన్ 10న ధ్వజస్తంభాన్ని, బలిపీఠాన్ని పవిత్రం చేశారు.

ఇది జరిగిన ఆరో రోజున (జూన్ 16న) నేను మరొకరికి పదవీబాధ్యతలు అప్పగించి, బదిలీ అయి వెళ్లిపోయాను.

ఆ ఉదయం అలా బదిలీ అయి వెళ్లిపోతూ, దండకారణ్యం నుంచి వచ్చి ఆలయంలో స్థిరపడిన టేకు చెట్టు (ఇప్పుడది ధ్వజస్తంభం) కేసి చూశాను. పతాక భాగంలో గంటలు నన్ను చూసి పలకరిస్తున్నట్లుగా చిరుసవ్వడులు చేస్తూ వూగుతున్నాయి. ఏదో వింత అనుభూతికి లోనయ్యాను.

పక్కనున్న ఒక అధికారి అన్నాడు - "సార్, మీరు పూనుకొని, అసాధ్యం అనుకున్నదాన్ని సుసాధ్యం చేశారు కాబట్టి రెండు నెలల్లో కొత్త ధ్వజస్తంభం ఏర్పాటయ్యే అద్భుతం జరిగింది కాని, లేకపోతేనా... !"

ఇది వింటూ అక్కడే వున్న ఒక వృద్ధ పండితుడు చిరునవ్వు నవ్వి, బదులుగా ఒక శ్లోకం చదివారు.

"నాహం కర్తా హరిః కర్తా
తత్పూజా కర్మ చాఖిలం
తదాపి మత్కృతా పూజా
తత్ప్రసాదేన నా అన్యథా"

(నేను కాదు కర్తని. చేసేది చేయించేది అంతా ఆ శ్రీహరే. నా ద్వారా ఏ సత్కార్యం జరిగినా అది భగవంతుడి ప్రసాదమే తప్ప వేరేమీ కాదు.)

కాదా???

★ ★ ★




తిరుమల మూర్తులు-11

## యోగ నరసింహస్వామి

రామానుజాచార్య తిరుమలకొండమీద పడివున్న యోగ నరసింహస్వామి విగ్రహాన్ని తిరుమలలో గర్భగుడికి ఈశాన్యంగా ప్రతిష్ఠింపచేశారని ఒక కథనం. అహోబిలమఠంలోని ఉత్సవ విగ్రహాన్ని మ్లేచ్ఛుల దండయాత్రలకాలంలో తెచ్చి ఇక్కడ వుంచారని మరో కథనం. పడమటి ముఖంగా వుండే ఈ స్వామికి ప్రతి శనివారం అభిషేకం, వైశాఖ శుద్ధ చతుర్దశి (నృసింహ జయంతి) నాడు ప్రత్యేక పూజలు జరుగుతుంటాయి. ఆరోజు తమిళ ప్రబంధాలతో ఈ స్వామిని కీర్తిస్తారు.






# 25

# నేరస్థుడెవరు?

మొట్టమొదటిసారిగా, తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామి వారికి శుక్రవారం ఉదయం జరగాల్సిన అభిషేక సేవలో - సరిగ్గా సేవ జరిగే సమయానికి-పాలాభిషేకం స్థంభించిపోయింది. గంగాళాలతో పాలు వస్తున్నాయి. కాని పాలాభిషేకం జరగటంలేదు. పాలాభిషేకం ఎందుకు స్థంభించిందో తెలిసిన మరుక్షణం, డెయిరీఫారమ్ సూపరింటెండెంట్‌ను సస్పెండ్ చేసి పారేశాను. అయితే అసలీ గందరగోళానికంతటికీ కారకుడెవరు?

★ ★ ★

శ్రీవారి ఆలయంలో శ్రీనివాసునికి జరిగే సేవలన్నింటిలోకి విశిష్టమైంది-ప్రతి శుక్రవారం ఉదయం జరిగే అభిషేక సేవ.

ఈ సేవలో పాల్గొనటమనేది భక్తులకు ఒక మరుపురాని దివ్యానుభూతిని కలిగిస్తుంది. గంట-గంటన్నరసేపు జరిగే అభిషేక కాలంలో స్వామివారిని దర్శించుకునే అవకాశం ప్రతిశుక్రవారం 130-140 మంది వరకే లభిస్తుంది. (అక్కడ్నుంచి స్థలాన్నిబట్టి)

ఈ అభిషేక సేవ ప్రాశస్త్యం ఏమిటంటే - అభిషేకం జరిగే సమయంలో నిత్య కళ్యాణ శోభితుడైన స్వామివారి నిజరూప దర్శనం లభిస్తుంది. విగ్రహంపైన పుష్పాలు, నగలు, పట్టువస్త్రాలు వగైరా ఎలాంటి అలంకారాలు లేకుండా, వివిధ ద్రవ్యాలతో స్వామివారిని అభిషేకిస్తారు.

అదొక అద్భుతమైన, అనిర్వచనీయమైన దృశ్యం. ఎందుకంటే ఆ సమయంలో స్వామి వారిలో దేదీప్యమానంగా ప్రకాశించే వర్చస్సు తొంగిచూస్తూ, భక్తుల్ని మరింత భక్తి పారవశ్యంలో ముంచెత్తుతూంటుంది. శ్రీవారి పాదాల దగ్గర్నుంచి నేత్రాలదాకా ఉట్టిపడే ఆ శోభను తిలకించే అవకాశం ఒక్క అభిషేక సమయంలో మాత్రమే లభిస్తుంది. వారంలో మిగతా కాలమంతా స్వామి ముఖారవిందాన్ని కర్పూరనామం, కస్తూరితిలకం కప్పివేస్తుండగా, మిగతా శరీరమంతా అలంకారమయమై వుంటుంది.

అందుకే అభిషేకంలో పాల్గొనగోరే భక్తులు స్వయంగా పునుగు, జవ్వాది, కేసరిగంధం వగైరా సుగంధ ద్రవ్యాలను వారివారి పాత్రలలో తీసుకువచ్చి అభిషేకంలో సమర్పించుకుంటారు. ఇందుకు అదనంగా శ్రీవారికి ప్రతి శుక్రవారం అభిషేకానంతరం ఒక పట్టు వస్త్రాన్ని కూడా భక్తులు సమర్పించుకునే అవకాశం కల్పించాలని నాకు సంకల్పం కలిగింది. ఎందుకంటే అంతకుముందు వరకు ఏడాదికి నాలుగు సందర్భాలలో మాత్రమే స్వామి వారికి దేవస్థానం పట్టువస్త్రాలను సమర్పించటం, వాటినే మళ్లీ మళ్లీ ఉతికి, శుద్ధిచేసి శ్రీవారికి అలంకరింపజేస్తూండటం జరుగుతూ వస్తోంది. నేను సంకల్పించినట్లుగా ప్రతి శుక్రవారం ఒక నూతన వస్త్రం సమర్పించడమంటే కనీసంగా (అప్పట్లో) రూ.8000 ఖర్చు పెట్టాలి. ఎనభయ్యవదశకం ప్రారంభంలో అంత ఖర్చుపెట్టి స్వామివారికి వస్త్రం సమర్పించుకోవాలంటే అది భక్తుల సంకల్పం మీద, స్తోమతు మీదే ఆధారపడి వుంది.

అయినప్పటికీ మేం ప్రవేశపెట్టిన ఈ 'మేల్చాత్' వస్త్రసేవ కార్యక్రమానికి గణనీయమైన స్పందన లభించింది. ఈ సేవలో పాల్గొనే భక్తుడు అభిషేక సమయంలో టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి తరువాత స్థానంలో నుండి శ్రీవారి అభిషేకాన్ని వీక్షించగలుగుతారు. అభిషేకం అనంతరం ఆ భక్తుడు సమర్పించే పట్టు వస్త్రంతో స్వామి వారిని అలంకరిస్తారు... సేవ ప్రవేశపెట్టిన తొలి సంవత్సరంలోనే ప్రతి శుక్రవారం ఎవరో ఒక భక్తుడు ముందుకు వచ్చి 'మేల్చాత్' వస్త్ర సేవలో పాల్గొనటం రివాజయిపోయింది. (ఇప్పటి పరిస్థితి ఏమిటంటే - ఆ సేవలో పాల్గొనగోరే భక్తులు కనీసం కొన్ని సంవత్సరాలు ముందుగా రిజర్వేషన్ కోరాల్సి వస్తోంది. ఇప్పటి రద్దీ ప్రకారం, ఇవ్వాళ రిజర్వ్ చేస్తే 2020 నాటికి ఆ సేవలో పాల్గొనే అవకాశం లభిస్తోంది. ప్రతి శుక్రవారం కనీసం 10-20 మంది భక్తులు వస్త్రాల్ని సమర్పించుకుంటున్నారు. అయితే ఇది తగినంత స్తోమతు కల భక్తులు మాత్రమే పాల్గొనగలిగే సేవ. ఇప్పుడీ సేవకి రుసుము రూ. 12, 250 దాకా పెరిగింది.)

అభిషేకంలో పాలు సమర్పించుకోవడం ఒక్కటే అధికశాతం భక్తులకు అందుబాటులో వుండే సేవ. అందుకే చాలామంది భక్తులు, అభిషేక కాలంలో జరిగే క్షీరాభిషేకంలో పాల్గొనాలని ఉవ్విళ్లూరుతుంటారు. అందువల్ల భక్తులు తెచ్చే పాలు ఎక్కువ పరిమాణంలో వస్తుంటాయి. ఈ కారణంగా ఈ అభిషేకం మొదలయ్యే ముందు అక్కడ ఒక పెద్ద పాత్రను ఆలయ అధికారులు





ఏర్పాటు చేస్తారు. భక్తులు తాము తెచ్చిన పాలన్నీ అందులో పోస్తే, ఆ పాలతో శ్రీవారికి అభిషేకం చేస్తారు. ఈ క్షీరాభిషేకం ఓ పదినిమిషాలపాటు జరుగుతుంది.

అప్పటికే నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వెళ్లి మూడు సంవత్సరాలు కావస్తున్నా, ఒక్కసారి కూడా మా కుటుంబం తరఫున మేం ఈ అభిషేకానికి పాలు సమర్పించుకోలేకపోయాం. అంటే, శక్తిలేకా కాదు, ఇచ్ఛ లేకా కాదు. విచిత్రంగా ప్రతి శుక్రవారం నేనూ, నా భార్య గోపిక అభిషేకంలో కూర్చున్నప్పుడు అనుకొనేవాళ్లం - పై శుక్రవారం అభిషేకంలోనయినా మనం పాలు సమర్పించాలి అని. - అంతే, ఆ తరువాత మర్చిపోయేవాళ్లం. అలా ఒక శుక్రవారంకాదు - అనేక శుక్రవారాలు గడిచిపోయాయి. ప్రతీసారి అభిషేకంలో కూర్చున్నప్పుడు గుర్తుకురావడం, ఆ సేవ పూర్తికాగానే మరుపురావడం మామూలైపోయింది.

* * *

**1981**లో బ్రహ్మోత్సవాలు జరుగుతున్నాయి. ఆ బ్రహ్మోత్సవాల మధ్యలో ఒక శుక్రవారం కూడా వుంది. ఈసారి ఎట్టి పరిస్థితుల్లోనూ మర్చిపోకుండా, శ్రీవారికి పాలు సమర్పించి తీరాలని గోపిక దృఢంగా సంకల్పించింది. అయిదు లీటర్ల పాలు మా కానుకగా స్వామివారికి ఇవ్వాలని (నాలుగు రోజుల ముందు నుంచీ) ప్రతిరోజూ ఆమె కోరుకుంటోంది. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ లేదా ఆయన భార్య శ్రీనివాసుడికి అయిదు లీటర్ల పాలు బహూకరించాలని కోరుకోవడం ఏమంత పెద్ద విషయం! అనుకున్నాక, అది నెరవేరడం మాత్రం ఏమంత కష్టం!

సాధారణంగా బ్రహ్మోత్సవాల సమయంలో - ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ కుటుంబం మొత్తం తిరుమల కొండమీదే వుంటారు. అలాగే వారితోపాటు వారి బంధువులెవరైనా వచ్చివుంటే వారుకూడా అక్కడే వుంటారు. బంధువుల్ని చూసుకోవడం అలావుంచి బ్రహ్మోత్సవాలలో రోజూ తిరుమలేశుడి ప్రతి ఊరేగింపు సేవలోనూ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌తోపాటు, ఆయన భార్య కూడా పాల్గొనడం ఆనవాయితీ. ఈ ఊరేగింపు ఆలయం చుట్టూ నాలుగు వీధుల్లోనూ తిరిగి వచ్చాక శ్రీవారి తిరుమంజనం జరుగుతుంది. అందులో కూడా ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ దంపతులు పాల్గొనాలి. ఉదయం నుండి సాయంత్రం దాకా కాటేజి నుండి ఆలయానికీ, శ్రీవారి ఊరేగింపులకీ ఇటూ అటూ తిరగటమే సరిపోయే పరిస్థితులలో, ఎంత ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ సతీమణి అయినా మరి బంధువుల్ని కూడా పట్టించుకుంటూ వుండాలి.... ఇలాంటి వూపిరి సలపని పనిలో తలమునకలైపోయి, స్వామి వారికి పాలు సమర్పించుకోవటాన్ని ఎక్కడ మర్చిపోతానో అని గోపిక మరీమరీ భయపడుతూ వుంది. అందుకని పదే పదే స్వామివారిని తల్చుకుని, "ఈ శుక్రవారం అయినా మా పాలతో నిన్ను అభిషేకించుకునే భాగ్యాన్ని కల్పించు స్వామీ" అంటూ ప్రార్థనలు చేసింది.

చివరికి ఆ శుక్రవారం రానే వచ్చింది. యథాప్రకారంగా నేను, నా భార్య మళ్లీ మా పాల విషయం పూర్తిగా విస్మరించాం. ఉదయాన్నే ఆలయప్రాకారంలో స్వామివారి ఊరేగింపులో పాల్గొని,

అంతా అయ్యాక ఆలయం లోపలకు ప్రవేశించాం. గర్భగుడి ముందు కూర్చున్నాం. మా ముందు ద్వారబంధానికున్న తెర తొలగింది. ఇక జరగబోయే కార్యక్రమం - నిత్యకళ్యాణం పచ్చతోరణంగా భాసిల్లుతూ, కోట్లాది ప్రజల విశ్వాసాల ప్రాతిపదికమీద కలియుగదైవంగా పూజలందుకుంటున్న శ్రీనివాసునికి అభిషేకసేవ. తెరతీయగానే గర్భగుడిలో శ్రీవారి సన్నిధిలో జియ్యంగార్, ప్రధాన అర్చకులు ఏదో గుసగుసలాడుకుంటున్నట్లు అనిపించింది. కానీ, వాళ్లింకా అభిషేకం ప్రారంభించలేదు. అంతలో మళ్లీ ద్వారబంధానికున్న తెర మూసేశారు. బహుశా ఏదన్నా స్వల్ప ఏర్పాటు ఇంకా జరగాల్సి వుండచ్చు అనుకున్నాను.

ఈ లోపల గర్భగుడిలోంచి రెండు పాత్రల్ని బయటకు మోసుకెళ్లారు సహాయ అర్చకులు. మరి కాస్సేపటికి మళ్లీ రెండు పెద్ద పాత్రల్ని బయటనుంచి లోపలికి తీసుకు వచ్చారు. పేష్కార్, అర్చకులు, ఆలయ సిబ్బంది ఆదుర్దాగా అటూ ఇటూ తిరుగుతున్నారు. ఇదంతా గమనించి నేను ఆలయ సిబ్బందిని పిలిచి అడిగాను. "ఏమిటి, ఎందుకు అభిషేకానికి ఆలస్యం చేస్తున్నారు" అంటూ. వాళ్లు "ఏం లేదు సార్, రెండు నిమిషాల్లో మొదలయిపోతుంది" అన్నారు. కానీ నాకు విచిత్రంగా అనిపించింది. ఎందుకంటే ఇలా శ్రీవారి సేవల విషయంలో జాప్యం జరగటం అన్నది చాలా అరుదైన విషయం. ప్రతి సేవకి సంబంధించీ, కావలసిన సరంజామా అంతా ముందుగానే సేకరించి పెట్టుకోవడం, ఒకటికి నాలుగు సార్లు చెక్ చేసుకోవడం అక్కడి అర్చకులకూ, సిబ్బందికీ సర్వసాధారణమైన విషయం. దేవస్థానాల తరఫున ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ కార్యాలయ సిబ్బంది, విధి విధానాలను పర్యవేక్షించే జియ్యంగార్ - వారి సహాయకులు, ఆలయ మిరాసీదారు-అర్చకులు, వారి సహాయకులు కూడా సంతృప్తి చెందితే కాని ఆలయ సేవలకు కావలసిన సరంజామా ఆలయానికి చేరటం, సేవలు ఆరంభించటం జరగదు. వస్తు సామగ్రిని సేకరించటం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ కార్యాలయం చేస్తుంది. వాటి నాణ్యత, పరిమాణాలను జియ్యంగారి సహాయకులు-అక్కడి ఆనవాయితీ ప్రకారం పరిశీలిస్తారు. వాటిని వినియోగించాల్సింది అర్చకులు.

వ్యవస్థ ఇంత దృఢంగా పనిచేసే ఛోట, ఇలా ఎప్పుడూ లేనివిధంగా అభిషేకానికి ఇంత జాప్యం ఎందుకు జరుగుతోంది? నేను మరోసారి అర్చకుల్ని పిలిచి అడిగాను. వారు, "అబ్బెబ్బె, ఏం లేదండీ, క్షణాల్లో ప్రారంభించేస్తున్నాం" అన్నారు. చివరికి మరికొంత సేపు పాత్రలు రావటాలూ పోవటాలు జరిగాక, అభిషేకం ఆరంభమైంది. అంతా సాంప్రదాయబద్ధంగా ప్రారంభమై క్షీరాభిషేకం జరిగింది. క్షీరాన్ని కూడా శంఖాలతో స్వామివారికి అభిషేకించడం ఆచారం. అలాగే క్షీరాభిషేకం జరిగింది. కానీ అంతకుముందు వచ్చిన వెళ్లిన, లేదా వెళ్లి వచ్చిన పాత్రల్లో 250 లీటర్ల దాకా పాలు వుండాల్సి వుండగా, అభిషేకంలో వాడిన పాలు మహాఅయితే మూడు శంఖాల పరిమాణం వుంటాయేమో. విడ్డూరం కాకపోతే ఏమిటి! అప్పటిక్కూడా నాకుగానీ, నా భార్యకిగానీ మా పాలముడుపు విషయం జ్ఞప్తికి రాలేదు.





సరే, మిగతా అభిషేక ఘట్టం అంతా ముగిసి బయటకు వచ్చాక, ఆలయ ప్రాకారంలో జియ్యంగార్, అర్చకులు, పేష్కార్‌ల ముందు నా ఉత్సుకత ఆపుకోలేక అడిగాను -"అసలు ఎందుకు అభిషేకం ఇలా ఆలస్యమయింది?" అని. నిదానంగా వారు విషయాన్ని బయటపెట్టారు-

... అభిషేకం కోసం టిటిడి డెయిరీ ఫారమ్ నుంచి వచ్చిన పాలు విరిగిపోయాయి. ఆ విషయం గర్భగుడిలోకి వెళ్లాక అర్చక స్వాములు గమనించారు. వెంటనే కొండమీద టిటిడి క్యాంటీన్ నుండి పాలు తెప్పించారు. ఆ పాలు కూడా అక్కడ బాగానే వున్నాయి కానీ, గర్భగుడిలోకి వచ్చేసరికి విరిగిపోయాయి. గంగాళంలో భక్తులు తెచ్చి కుమ్మరించిన పాలు సయితం గుడిలోకి తీసుకు వెళ్లేసరికి విరిగిపోయాయి. ఇక అభిషేకంలో వినియోగించటానికి పాలేలేని పరిస్థితి ఏర్పడింది...

ఇదంతా వింటూనే నాకు కోపం ఆగలేదు. వెంటనే డెయిరీ సూపరింటెండెంట్‌ని సస్పెండ్ చేస్తున్నట్లు ప్రకటించాను. మంచిపాలు సరఫరా చేయటం అతని బాధ్యత. అంత బాధ్యతా రహితంగా ఎలావుంటాడు?

ఈ తతంగం ఇలా నడుస్తుండగా ఆలయంలోంచి నా భార్య గోపిక బయటకు వచ్చింది. ఆమె ఈ పాల గొడవ వింటూనే ఒక్కసారిగా ప్రాన్పడిపోయింది. "ఏమైంది" అన్నాను. -"చూశారా, ఎంత పొరబాటు చేశామో, ఈ శుక్రవారం కూడా మనం మన పాలతో శ్రీనివాసునికి అభిషేకం చేయించలేకపోయాం. మన ఖర్చుతో చేయాలనుకున్నాంగదా అని, అదనంగా చెల్లించి అయిదు లీటర్ల పాలు ప్రత్యేకంగా ఈ అభిషేకం కోసం డైరీ నుండి తెప్పించి, కాటేజీలో పెట్టి మర్చిపోయి మరీ వచ్చేశాను. ఎంత పాపం చేశాను..." అనుకుంటూ ఆమె వలవలా ఏడ్చేసింది.

జరిగిందేమిటో నాకు అప్పుడే అర్థమవుతోంది. అంతలో పేష్కార్ అందుకున్నాడు. "అమ్మా, అన్ని పాలు చెడిపోగా, చివరికి మీ కాటేజికి డైరీఫారమ్ వారు పంపించిన అయిదు లీటర్ల పాలనే తెప్పించి ఈరోజు అభిషేకం జరిపించాల్సి వచ్చింది. ఆ పాలు మీరు అభిషేకం కోసమే తెప్పించుకున్నారని మాకు తెలీదు. అందుకే అక్కడ భక్తులందరిముందూ చెప్పలేకపోయాం".... అతనింకా ఎలాఎలా ఏం జరిగిందో వివరిస్తున్నాడు... నా శ్రీమతి ఆనందానికి అవధుల్లేవు. కన్నీటి బాష్పాలు ఆనందబాష్పాలుగా మారిపోయాయి. పట్టలేనంత సంభ్రమం, సంతోషం ఆమెని ఉక్కిరిబిక్కిరి చేశాయి. ఒక్క ఉదుటున ఆమె మరోసారి శ్రీనివాసుని దర్శనానికి గుడిలోపలకి పరుగెత్తింది.

(ఆ తరువాత డెయిరీఫారమ్ సూపరింటెండెంట్ నన్ను కలిసి, డైరీఫారమ్ నుంచి సరఫరా అయిన పాలన్నీ అక్కడ బయల్దేరే ముందు బాగానే వున్నాయనీ, వాటిలోంచి అయిదు లీటర్లపాలే మా కాటేజికి విడిగా పంపించాననీ, వాటి నాణ్యత విషయంలో తన లోపం లేదనీ ప్రాధేయపూర్వకంగా వివరించాడు.)

నాకు ఎవరో చెప్పినట్లు అనిపించింది - జరిగినదాంట్లో సూపరింటెండెంట్ లోపం లేదని. సస్పెన్షన్ ఉత్తర్వు రద్దు చేశాను. కాని, అదే డైరీ ఫారమ్ నుండి సరఫరా అయిన అన్నిపాలూ చెడిపోయి, గోపిక తెప్పించుకున్న అయిదు లీటర్లు పాలు మాత్రమే ఎందుకు చెడిపోకుండా వున్నాయి? - ఈ ప్రశ్నకి జవాబు వుందా? వుంటే అది హేతువాదానికి అందుతుందా?

ఇంతకీ ఎవరు నేరస్థుడు?

★ ★ ★




తిరుమల మూర్తులు-12

## గరుడాళ్వార్

బంగారు వాకిలిగా పిలవబడే హుండీ వుండే మంటపం (తిరుమామణి మంటపం)లో తూర్పు గోడలో పడమటి ముఖంగా అంటే మూలవిరాట్ ధృవబేర విగ్రహానికి అభిముఖంగా వుండే స్వామి గరుడాళ్వార్. పంచభూతాల రూపంగా చెప్పబడే ఈ గరుత్మంతుడే శ్రీ మహావిష్ణువు వాహనం. ఈ ఆలయంలో శ్రీనివాసుడు (విష్ణువు) వాహనం లేదన్న చింతతో ఎవరో భక్తులు ఈ విగ్రహాన్ని ప్రతిష్ఠింప జేసినట్లు 1512 నాటి శాసనంలో తెలుస్తోంది.






# 26

# నవరత్నాలు - సుబ్బారావు

**సినిమా** డిస్ట్రిబ్యూటర్ సుబ్బారావు దంపతులు నాలుగైదు గంటలు కాపలాకాసి, ఒక అర్ధరాత్రివేళ తిరుమలకొండ మీద గెస్ట్‌హవుస్‌లో నన్ను పట్టుకున్నారు. అప్పటికే శక్తి, సహనం చచ్చిపోయి, మెదడు వేడెక్కిపోగా, దారీతెన్నూ తెలీని సంక్లిష్ట పరిస్థితిలో తల బాదుకుంటున్న నన్ను వాళ్లు వదల్లేదు.

"రేపు ఆఫీసులో కలుద్దాం లెండి" - అంటున్నా వినకుండా వాళ్లిద్దరూ నన్నూ, నా భార్య గోపికనీ గెస్ట్‌హవుస్ వరండాలో నిలబెట్టి ఒక కథ వినిపించారు... ఆ కథ వింటూనే నాకూ, నా భార్యకీ కళ్లవెంట ఆనందబాష్పాలు రాలాయి!!

★ ★ ★

**నేను** తిరుమల - తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా, 1982లో తిరుమల కొండమీద శ్రీవారి ఆలయంలో కొత్త ధ్వజస్తంభాన్ని ఏర్పాటు చేయాల్సి వచ్చింది. - అదే సమయంలో ఆంజనేయస్వామి ఆలయ పునర్నిర్మాణం, సన్నిధివీధి మాడావీధుల విస్తరణ, ఆనంద నిలయం విమానంపై స్వర్ణకవచానికి మెరుగు పెట్టడం, పుష్కరిణి క్షాళన, పోటు (వంటశాల) పునర్నిర్మాణం, బలిపీఠం పునరుద్ధరణ వంటి చాలా కార్యక్రమాలను కూడా చేపట్టడం జరిగింది. 1982 ఫిబ్రవరిలో ఈ కార్యక్రమాలన్నింటినీ మొదలుపెట్టి త్వరలో పూర్తిచేయాలనీ, అదే సమయంలో ఆలయంలో మూలవిరాట్‌కి అష్టబంధనం (విగ్రహాన్ని పద్మపీఠంపై పటిష్ఠంగా వుంచేలా చేసే కార్యక్రమం) చేయాలనీ, ఈ మొత్తం కార్యక్రమం ఒకేసారి పూర్తికావాలనీ నిర్ణయించాం. అలాచేశాక, సంప్రోక్షణ

చేస్తేనే పూర్వపు పవిత్రత పునరుద్ధరించబడుతుందని ఆగమశాస్త్రం పేర్కొంటోంది. ఇది చాలా అరుదైన సంఘటన కావటం వల్ల, వీటి ఉత్సవాలను భారీగా జరపటానికి ప్లాన్ చేశాం. అందులో భాగంగా ఒక మినీ బ్రహ్మోత్సవం ఏర్పాటు చేశాం. సంప్రోక్షణ సహా వివిధ కార్యక్రమాలను శాస్త్రోక్తంగా నిర్వర్తించడం కోసం సుమారుగా 300 మంది ఋత్విక్కులను, వేదపండితులను ఎక్కడెక్కడ్నుంచో పిలిపించడం జరిగింది. ఒకేసారి చాలా కార్యక్రమాల్ని నిర్వహించాల్సి వుండటంవల్ల, ఆలయ సిబ్బంది కూడా చాలా వివరంగా ప్రతి అంశాన్ని ప్లాన్‌చేయడం, అందుకు కావల్సిన పరికరాల్ని, వస్తు సామగ్రిని ముందుగా సమకూర్చుకోవడం జరిగింది.

గర్భగుడిలో ఎలాంటి మరమ్మత్తులు చేయాలన్నా, ముందుగా ఆ విగ్రహంలోని ప్రాణశక్తిని ఒక కలశంలోకి ఆవాహన చేసి, ఆ కలశాన్ని పవిత్రంగా వేరేవుంచి, మరమ్మత్తులు చేస్తారు. అవి అయ్యాక విగ్రహంలోకి మళ్లీ ప్రాణశక్తిని పునరావాహన చేశాక వివిధ రకాల పదార్థాల మిశ్రమంతో విగ్రహ పీఠంచుట్టూ అష్టబంధనం చేస్తారు. అలా చేయటంతో పునఃప్రతిష్ఠ ముగుస్తుంది. ఇలా అష్టబంధనం చేసేటప్పుడు ముందుగా అష్టబంధనం జరిగే స్థలాల్లో నవరత్నాలను వుంచాలన్నది ఆగమశాస్త్ర విధానం. ఇలాంటి సంప్రోక్షణ కార్యక్రమమే ఇంకా బేడి ఆంజనేయస్వామి, యోగనరసింహస్వామి తరహా ఆలయాల్లో కూడా చేపట్టడం వల్ల సంప్రోక్షణకు ముందు మొత్తం తొమ్మిది నవరత్నాల సెట్‌లు కావాలని నిర్ణయించటం, ఆ రకంగా సేకరించి పెట్టుకోవటం జరిగిపోయింది.

సరిగ్గా ఆ అష్టబంధనానికి ముందురోజు నేను టిటిడి బోర్డు మీటింగ్‌కి వెళ్లబోతూ, ఏర్పాట్లన్నీ సవ్యంగా జరుగుతున్నాయా అని విచారించినప్పుడు, ఒక సీనియర్ మిరాసీదార్ నాతో మరొక నవరత్నాల సెట్ కావాల్సి వస్తుందని చెప్పారు. నేను యథాలాపంగా "అదేదో పేష్కార్ (ఆలయ అధికారి)తో చర్చించండి" అని చెప్పేసి మీటింగ్‌కి వెళ్లిపోయాను. మా మీటింగ్ పూర్తయ్యేసరికి రాత్రి 8 గంటలు దాటింది. అక్కడ్నుంచి నేను, నా భార్య గోపికతో కలిసి స్వామివారి దర్శనం కోసం ఆలయానికి వెళ్లాం. సరిగ్గా మేం బయటకు వచ్చే సమయంలో, అర్చకులు వచ్చి నవరత్నాల సెట్స్ అన్నింటినీ అన్ని ఆలయాల్లో వాడేశామనీ, ఆ మర్నాడు జరిగే మూలవిరాట్ అష్టబంధనానికి ఒక నవరత్నాల సెట్ కావాలనీ చెప్పడంతో నేను నివ్వెరపోయాను - ఎందుకంటే పేష్కార్, డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ చెప్పిన లెఖ్ఖల ప్రకారం, ముందుగానే కావల్సిన నవరత్నాల సెట్స్‌ని సేకరించి, అర్చకులకు ఇచ్చేయడం జరిగింది. మరి ఇంకో సెట్ అవసరం ఎలా వచ్చింది? పైగా అదికూడా మూలవిరాట్ కే. ఇది తెల్లవారితే అష్టబంధనం అనగా ఏర్పడిన పరిస్థితి. అప్పుడిక లెఖ్ఖల్లోకి వెళ్లాక అర్థమైంది - మధ్యలో వరాహస్వామి ఆలయంలో పునరుద్ధరణ కార్యక్రమాన్ని కొత్తగా చేర్చడంతో ఈ పరిస్థితి ఉత్పన్నమైందని. అప్పటికి రాత్రి తొమ్మిదయింది. తెల్లవారి అయిదు గంటలకే అష్టబంధనం, మూలవిరాట్ కి ప్రాణశక్తి పునరావాహన జరగాలి.





ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి వుండే విస్తృతమైన అధికారాల కారణంగా మరో సెట్‌ని సేకరించడం కష్టం కాదనుకొన్నాను. అందుకని ఆలయంలోనే కూర్చుని, తిరుపతిలో డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి ఫోన్ చేసి, రాత్రికి రాత్రి ట్రెజరీ తెరిపించి మరో నవరత్నాల సెట్ పంపించమని చెప్పాను. అయితే ట్రెజరీది డబుల్‌లాక్ సిస్టమ్. అందులో ఒక కీ కలిగి వుండే అధికారి మద్రాసు వెళ్లాడు. ఫలితంగా, ట్రెజరీని తెరిపించలేకపోయాం.

టైమ్ పరుగెడుతోంది. రాత్రి పది కావస్తోంది. ట్రెజరీ ప్రయత్నాలు విఫలం కావడంతో, తిరుపతి పట్టణంలో వుండే జ్యుయలరీ షాపుల్లో ఏమైనా నవరత్నాల సెట్ దొరుకుతుందేమోనని గాలించమన్నాను. సిబ్బంది ఆఘమేఘాల మీద పట్టణంలో గాలింపు ప్రారంభించారు. కొన్ని జ్యుయలరీషాపులు మూసేసి వున్నాయి. తెరిచి వున్న వాటిల్లో నవరత్నాలు లేవు. రాత్రి 11. 30 కావస్తోంది. నేను నా భార్య ఆలయంలోనే కూర్చున్నాం. నవరత్నాల వ్యవహారం ఒక కొలిక్కి రాలేదు. నేను చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమైపోయాయి. మరో ఆరుగంటల్లో అష్టబంధనం ముహూర్తం. ఋత్విక్కులు, ఎందరో పండితులు, మిరాసీదార్లు, అధ్యక్షులు, సిబ్బంది... అంతా ఆ అమూల్యక్షణాల కోసం ఎదురుచూస్తున్న తరుణంలో అష్టబంధనానికి అతి ముఖ్యమైన నవరత్నాల సెట్ లేకుండాపోతోంది. మొత్తం కార్యక్రమం అభాసుపాలయ్యే పరిస్థితి.. !!

నాలో ఆత్మావలోకనం మొదలైంది - ఎందుకిలా జరిగింది? నేనేం పాపం చేశానని ఇలాంటి సంకట స్థితి ఎదురయింది? ఈ లోపం ఎక్కడ జరిగింది?... నా పనిపట్ల నేను సీరియస్‌గా లేకపోవటమా! బోర్డు మీటింగ్‌కి వెళ్లక ముందే అధికార్లు చెప్పినా నేను పట్టించుకోకపోవడమా!.. ఆలోచించినకొద్దీ వేదన పెరుగుతోంది తప్ప పరిష్కారం కనబడడంలేదు. "ఏమిటీ విచిత్రం! అపారమైన అధికారాలుండి కూడా ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నేను ఈ చిన్న కార్యక్రమాన్ని సజావుగా నిర్వర్తించలేక పోతున్నానే. ఎన్నో దశాబ్దాలకొకసారి వచ్చే ఈ పవిత్రమైన ఉత్సవం అభాసుపాలు కావటానికి కారకుణ్ణవుతున్నానే"- అన్న ఆందోళన నన్ను వెంటాడేస్తోంది.

అప్పటికే విడివిడిగానయినా నవరత్నాలు సేకరించాలని అర్చకులు, మిరాసీదార్లు ఇతరత్రా చేసిన ప్రయత్నాలు సయితం విఫలమయ్యాయి. "ఇంక ఈ రాత్రికి నవరత్నాలు దొరకనట్లే. తెల్లవారుఝామున 5 గంటలలోపు నవరత్నాలు సేకరించడం అసాధ్యం" - అని వాళ్లు తేల్చిపారేశారు. అర్ధరాత్రయింది. స్వామి వారి ఏకాంతసేవ కూడా పూర్తయింది. నిస్పృహ, నైరాశ్యం నన్ను చుట్టుముట్టాయి. నా దీనావస్థ చూసిన అర్చకులు నా దగ్గరకువచ్చి, "ఫరవాలేదులెండి, ఏదో రకంగా సర్దుకుపోదాం. మీరు ఆందోళన చెందకండి" అని ఓదార్పు మాటలు పలికారు. చేసేదేమీలేక నేను, నాభార్య గెస్ట్‌హవుస్‌కి తిరిగి వచ్చేశాం. నా పొరబాటుకి క్షమించవలసిందిగా దేవుణ్ణి ప్రార్థించటం మినహా నేను చేయగలిగింది లేదు. అలానే స్వామి వారిని ప్రార్థించాను. నా పొరబాటుకి లెంపలు వేసుకున్నాను. "ఇంక మిగతా కార్యక్రమం ఎలా జరుగుతుందో ఏమో, అంతా నీదే భారం స్వామీ" అనుకుంటూ, ఆవేదన, ఆందోళన నిండిన హృదయంతో గెస్ట్‌హవుస్‌లోకి అడుగుపెట్టాను.

ఆ అర్ధరాత్రి వేళ అక్కడ నాకోసం నడివయస్సు దంపతులు ఎదురుచూస్తున్నారు. వాళ్లు నన్ను కలుసుకోవాలని వచ్చారనీ, చాలా సేపట్నుంచి నిరీక్షిస్తున్నారని సిబ్బంది చెప్పారు. అయినా ఆ టైమ్‌లో వాళ్లని పలకరించే మూడ్‌లేదు. "ఈ గందరగోళ పరిస్థితిలో వీళ్లెవరు ఇక్కడికి వచ్చారు" అని విసుక్కున్నాను. అయినా చాలాసేపట్నుంచి నిరీక్షిస్తున్నారని విన్నాక, సరేనని పలకరించాను. ఆయన పేరు సుబ్బారావు. మద్రాసులో ఫిల్మ్ డిస్ట్రిబ్యూటరుట. అప్పటికి నాలుగున్నర గంటల నుంచి నిరీక్షిస్తున్నారట. నేను చాలా అసహనంగా వున్నాను. "అంత అర్జంటేమిటండి, ఇలా అర్ధరాత్రివేళ వచ్చారు? రేపు ఆఫీసులో కలుసుకోవచ్చు గదా" అన్నాను. కాని వాళ్లు నా అసహనాన్ని, నా మూడ్‌ని పట్టించుకునే స్థితిలో లేరు. సుబ్బారావు, ఆయన భార్య వాళ్లు వచ్చిన పని ఏమిటో వివరించడం ప్రారంభించారు.

"... మీరు ఆలయంలో మూలవిరాట్‌కి అష్టబంధనం చేయిస్తున్నారని పత్రికలలో చదివాం. శ్రీవారి విగ్రహం అష్టబంధనంకోసం ముందుగా నవరత్నాలు వుపయోగిస్తారట గదా! అందుకోసం నవరత్నాలు బహూకరించాలని కోరుకున్నాం. ఆ రకంగా మేం స్వయంగా మద్రాసు మార్కెట్‌లో గాలించి రకానికొకటి చొప్పున చాలా ఖరీదు చేసే తొమ్మిది రత్నాలను ప్రత్యేకంగా ఎంపిక చేసి కొన్నాం. వీటిని ఇలా బంగారు ప్లేట్ మీద అతికింపజేసాం. మీరు ఎలాంటి అభ్యంతరాలు చెప్పకుండా, మా సెంటిమెంట్స్‌ని అర్ధంచేసుకుని, వీటిని అష్టబంధనంలో వినియోగించాలి.... దయచేసి మమ్మల్ని నిరాశ పరచకండి...."ఇలా ప్రాధేయపడుతూ వాళ్లు చెప్పుకుపోతున్నారు.

అంతే!... ఎక్కడో అగాథంలోకి త్రోసివేయబడినట్లున్న నా మనస్సుకి ఒక్కసారి రెక్కలొచ్చినట్లనిపించింది. అర్ధరాత్రిలో సూర్యోదయం అయిందా - అన్నంత గగుర్పాటు కలిగింది. నా చెవుల్ని, కళ్లని నమ్మలేనంత ఉద్వేగం, సంభ్రమాశ్చర్యాల మధ్య నాలో అణువణువూ ఆనందంతో పులకించిపోయింది. నా కళ్లలోంచి ఆనంద బాష్పాలు...!

దంపతుల రూపంలో వచ్చిన 'చేయూత'తో గండం గట్టెక్కింది. మర్నాడు ప్రభాత సేవ సమయానికల్లా శ్రీవారి విగ్రహానికి అష్టబంధనం, ఆ తరువాత ప్రాణశక్తి పునరావాహన.... అన్నీ అనుకున్న ప్రకారం నిర్విఘ్నంగా జరిగిపోయాయి.

ఏమిటీలీల?



స్వామివారి అష్ట బంధన ఉత్సవంలో
ప్రసాద్, శ్రీమతి గోపిక

★ ★ ★



# 27

## ఆనందం అర్ణవమైతే...

నా భార్య గోపిక హతాశురాలైంది ఆ విషయం వింటూనే.......

"ఇదేమిటండీ ఇలా జరిగింది? శ్రీనివాసుడి సమక్షంలోనే మీకు ఛార్జి అప్పగిస్తామని కదా కుమారస్వామి రెడ్డిగారు చెప్పారు! ఇంతలోనే మళ్లీ హైద్రాబాద్‌కి ఎందుకు మార్చారు?... ఇంక స్వామివారి సమక్షంలో మీరు ఛార్జితీసుకోవటం జరగదా?...." ఒక్కసారిగా నైరాశ్యం, నిస్పృహ ఆమెని ఆవరించాయి.

ఆంధ్రప్రదేశ్ స్టేట్ కోపరేటివ్ బ్యాంకు మేనేజింగ్ డైరెక్టరుగా నాకు బదిలీ వచ్చినప్పుడు, తిరుమల తిరుపతి దేవస్థానాన్ని వదిలి వెళ్లాల్సిన పరిస్థితుల్లో - శ్రీనివాసుడి సమక్షంలో ఛార్జి తీసుకునే ఆనందం మాకు లేకుండా పోయినందుకు ఆ రోజు గోపిక పడిన ఆవేదన వర్ణనాతీతం.

సహజమేగదా! నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్న నాలుగ్గేళ్ల (1978-82)కాలంలో, తనకు అవకాశమున్న ప్రతిసారీ, శ్రీవారి ప్రతిసేవలోనూ, ప్రగాఢమైన భక్తి విశ్వాసాలతో గోపిక పాల్గొంది. శ్రీనివాసుడి దివ్యమంగళరూపాన్ని ఎన్నిసార్లు వీక్షించినా, దర్శించిన ప్రతిసారీ ఆనందంతో పరవశించిపోయేది. స్వామి వారి సేవ - అంటే చాలు, ఉత్సాహంగా వచ్చి, ఎనలేని భక్తి ప్రపత్తులతో, నిశ్చలచిత్తంతో పాల్గొంటుండేది.

అలాంటి నా సహధర్మచారిణి - ఈ సారి నేను కోపరేటివ్ బ్యాంక్ (ఆప్కాబ్) మేనేజింగ్ డైరక్టర్‌గా ఛార్జి తీసుకోవటం - స్వామివారి సన్నిధిలో జరగటంలేదని తెలిసేసరికి - నీరుగారిపోయింది. నిజం చెప్పాలంటే, నాక్కూడా నీరసం వచ్చేసింది.

★ ★ ★

ఆ మాటకొస్తే ప్రభుత్వ సర్వీసుల్లో ఒక పోస్టునుంచి మరో పోస్టుకి బదిలీ అనేది సర్వసాధారణమైన విషయం. అందులోనూ ఐఏఎస్‌కి చెందిన ఉద్యోగులకి బదిలీలు చాలా తరచుగా జరుగుతుంటాయి. ఏడాదికి, ఏణ్ణర్ధానికే బదిలీలు వచ్చేసే రోజుల్లో, ఒకే పోస్టులో మూడేళ్లు పనిచేయటమే గొప్ప విషయం. అలాంటిది నన్ను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ పోస్టులో రాష్ట్ర ప్రభుత్వం నాలుగేళ్లు వుంచింది. ఇందుకు రెండు కారణాలున్నాయి - ఒకటి, 1981లో టిటిడి కొత్త చట్టం అమలులోకి రావటంతో, పాత చట్టంనాటి పరిస్థితులకీ, క్రొత్త చట్టం తీసుకురావలసిన మార్పులకీ మధ్య తగిన అనుసంధానం వుండాలని ప్రభుత్వం భావించటం. రెండోది, తిరుమలలో మాస్టర్ ప్లాను అమలు చేసే విషయంలో కొన్ని కీలకమైన కార్యక్రమాలు పూర్తికావలసి వున్నందున, అందాకా నన్ను బదిలీ చేయొద్దని దేవాదాయశాఖ మంత్రి శ్రీ పి.వి. చౌదరి, టిటిడి బోర్డు అధ్యక్షుడు శ్రీ బి. నాగిరెడ్డి తమ తమ స్థాయిలలో ముఖ్యమంత్రిని అభ్యర్థించడం. ముఖ్యంగా కొత్త ధ్వజస్తంభం ప్రతిష్ఠ కారణంగా కూడా నా బదిలీ కొంత వెనుకబడింది. కాని బదిలీ జరగక తప్పదు కనుక జరిగింది.

తిరుమల శ్రీనివాసుని ఆలయంలో ధ్వజస్తంభం ప్రతిష్ఠ పూర్తయిన వెంటనే నాకు బదిలీ ఉత్తర్వులు వచ్చేశాయి - 1982 జూన్‌లో. నన్ను ఆప్కాబ్ మేనేజింగ్ డైరెక్టర్‌గా నియమిస్తూ, ఆపోస్టులో వున్న శ్రీ జి. కుమారస్వామి రెడ్డిని టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నియమిస్తూ రాష్ట్రప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. అయితే అప్పటికే, బ్రిటిషు ప్రభుత్వపు ఫెలోషిప్ మీద కేంబ్రిడ్జియూనివర్శిటీలో 'డెవలప్‌మెంట్ స్టడీస్' అంశంలో పోస్టు గ్రాడ్యుయేట్ ప్రోగ్రామ్ చేయటానికి నేను సెలక్ట్ అయివున్నాను. ఆగష్టు నెలాఖరుకల్లా కేంబ్రిడ్జిలో జాయినవ్వాల్సివుంది. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ పోస్టు కూడా ప్రభుత్వోద్యోగమే అయినప్పటికీ, ఆ పోస్టుకి పదవీ బాధ్యతల స్వీకరణ అనేది - టిటిడి చట్టం (1981) ప్రకారం - ఆలయంలోని శ్రీవారి సన్నిధిలో (పడి కావలిలో - అంటే అదివరకు హుండీ కానుకలు లెక్కించే చోట) జరగాల్సివుంది. 1978లో నేను ఛార్జి తీసుకున్నప్పుడు ఈ నిబంధన అమలులో లేదు - అప్పుడు హైదరాబాద్‌లోనే దేవాదాయశాఖ కమీషనర్ ఆనందరావు మొదలియార్ దగ్గర ఛార్జి తీసుకున్నాను.

అందుకే ఇప్పుడు నా భార్య ఆనందపడుతున్నది. నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వచ్చినప్పుడు శ్రీవారి సన్నిధిలో ఛార్జి తీసుకోలేకపోయినా, టిటిడినుంచి వెళ్లిపోయేటప్పుడయినా శ్రీవారి సన్నిధిలో ఆప్కాబ్ ఎం.డి. గా ఛార్జి తీసుకోవచ్చని ఆమె ఉబలాటం. ఆ ఆశ నాకూ వుంది. దానికి కారణం లేకపోలేదు.

నా 33 సంవత్సరాల సర్వీసులో నేను - ప్రధానమంత్రికి ఇన్‌ఫర్మేషన్ అడ్వయిజర్‌తో సహా - అనేక కీలకమైన పోస్టుల్లో పనిచేసినప్పటికీ, నాకు అత్యంత సంతృప్తిని, ఆనందాన్ని మిగిల్చింది టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ పోస్టు మాత్రమే. టిటిడిలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా అతి పిన్న వయసులో





(37) పనిచేసే అదృష్టం లభించింది. అది కూడా నాలుగేళ్లు. దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా కారు, బంగళా, బంట్రోతులు వగైరా సౌకర్యాలతోపాటు, వాటన్నింటినీ మించి - ఎప్పుడంటే అప్పుడు శ్రీనివాసుడ్ని దర్శించుకునే మహద్భాగ్యం నాకు లభించింది. భౌతికమైన సౌకర్యాలపరంగా, పరపతి పరంగా చూసినా, ఆధ్యాత్మిక ధోరణిలో చూసినా - టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ పోస్టులో పని చేయటం ఒక వరం. నిజానికి నా విధి నిర్వహణలో - ముఖ్యంగా అచంచలమైన భక్తి విశ్వాసాలతో శ్రీనివాసుడ్ని దర్శించుకోటం కోసం ఎన్నో మొక్కులు మొక్కి, ఎన్నో అవస్థలు పడి, ఆర్తితో తిరుమల కొండకి వచ్చే యాత్రికుల ప్రయోజనాలు కాపాడటమే శ్రీనివాసుడికి నిజమైన సేవ అని విశ్వసిస్తూ, అనేక "మంచి" నిర్ణయాలని అమలు చేయాల్సి వచ్చినప్పుడు - ఎన్నో అవరోధాలను నేను ఎదుర్కోవాల్సివచ్చింది. ఇన్ని ఆటంకాలూ, అవమానాలూ నాకు ఇంకే పోస్టులోనూ ఎదురవలేదు. అయినా టిటిడి సర్వీసులో లభించిన సంతృప్తి అసాధారణమైంది. అపురూపమైంది.

ఆ నాలుగేళ్లకాలంలో లెక్కలేనన్నిసార్లు స్వామివారి దర్శనంతో పాటు, స్వామి వారి సేవలలో ప్రత్యక్షంగా పాల్గొనే అవకాశం - (ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ భార్యగా) గోపికకికూడా లభించటంతో, స్వామివారి ఆరాధనలో ఆమె మమేకమైపోయింది. ఈ అవకాశం, ఈ ఆనందం శాశ్వతం కావని తెలుసు కానీ, నాలుగేళ్లపాటు స్వామి వారి సేవల్లో లీనమైపోవటంవల్ల కలిగిన (ఇదే సత్యం అన్న) భ్రమ వల్ల కావచ్చు, లేదా తిరుమలతో పెనవేసుకుపోయిన అనుబంధం వల్ల కావచ్చు - నా బదిలీ వార్త వినగానే ఆమె విలవిల్లాడిపోయింది. నిజం చెప్పాలంటే - అప్రియమైన ఆ వార్త విన్నప్పుడు, సర్దుకోటానికి నాక్కూడా టైమ్ పట్టింది....

"గోపీ! ఇందులో విచారించాల్సిందేముంది? ప్రభుత్వ సర్వీసులో బదిలీలు తప్పవు. ఇక్కడ నాలుగేళ్లున్నామంటేనే చాలా ఎక్కువ. బహుశ, మన పుణ్యకర్మఫలం ఇంతవరకే వుండి వుంటుంది. కాబట్టి మనం ఇక్కడితో ఇక్కడి అదృష్టానికి సరిపెట్టుకోక తప్పదు..." అంటూ స్థైర్యం కూడ గట్టుకొని, నేనే గోపికకి ఓదార్పు మాటలు పలికాను. అంత విచారంలోనూ ఆమెకి ఊరట కలిగించిన ఒకే ఒక విషయం ఏమిటంటే - నా స్థానంలో వస్తున్న ఆప్కాబ్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీకుమారస్వామి రెడ్డి స్థానంలోనే ప్రభుత్వం నన్ను నియమించటంవల్లా, టిటిడి కొత్త చట్ట (1981) ప్రకారం స్వామివారి సన్నిధిలోనే శ్రీ కుమారస్వామి రెడ్డి ఛార్జి తీసుకోవాల్సి వుండటం వల్లా - నేను కూడా నా కొత్త పోస్టుకి ఛార్జిని ఆయన దగ్గర్నుంచే, స్వామి వారి సన్నిధిలోనే తీసుకోవచ్చు.

గోపిక క్రమంగా తేరుకుంది. నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా ఛార్జి తీసుకున్నప్పుడు రాని అవకాశం, ఇప్పుడు ఆప్కాబ్ ఎం.డి గా ఛార్జి తీసుకొనేటప్పుడు వస్తోంది అన్నదే ఆమె త్వరగా స్థిమితపడటానికి దోహదపడింది. ప్రభుత్వం నన్ను వేరే ఏ పోస్టులో నియమించివున్నా, ఈ అవకాశం నాకు రాదు.

"ఆప్కాబ్ ఎండిగా ప్రభుత్వం మిమ్మల్ని నియమించటంకూడా బహుశా స్వామివారి అనుగ్రహంవల్లనే అయుంటుంది. లేకపోతే మరో రెండు నెలల్లో కేంబ్రిడ్జికి వెళ్లిపోయే మిమ్మల్ని ఆ పోస్టులోనే ఎందుకు వేస్తారు?.." ఇలా అనుకుంటూ గోపిక తనని తాను సమాధానపరుచుకుంది. ఆ క్షణంనుంచీ ఆమె మనస్సులో ఆ 'అనుగ్రహ' భావనే ముద్రపడిపోయింది. స్వామి వారి సన్నిధిలోనే నేను ఛార్జి తీసుకోవటాన్ని తాను వీక్షించబోతున్నానని ఆశపడింది, ఆరాటపడింది. అలా జరగటం నాకూ ఆనందమే. కానీ.... !!

ఆలయంలో శ్రీవారి సన్నిధిలో శ్రీకుమారస్వామి రెడ్డిగారికీ, నాకూ మధ్య పరస్పర పదవీబాధ్యతల అప్పగింత కార్యక్రమం జరగటానికి ముహూర్తం నిర్ణయమైంది. వాస్తవానికి, నాకు కొత్త పోస్టులో జాయినింగ్ టైమ్ ఇంకా ఓ వారం రోజులుంది. కాని కుమారస్వామిరెడ్డిగారికి అంత వ్యవధిలేదు.

అలాంటి స్థితిలో ఛార్జిల అప్పగింత రోజుకి ముందు రోజు, రెడ్డిగారు నాకు హైద్రాబాద్ నుంచి ఫోన్ చేశారు.

"ప్రసాద్, ఇక్కడ ఆప్కాబ్‌లో అత్యంత ముఖ్యమైన సబ్జక్టు గురించి చర్చించటానికి ఈ వారాంతంలో బోర్డు మీటింగ్ పడింది. ఆ బోర్డు మీటింగ్‌కి నేనే హాజరుకావాలని ఛైర్మన్ అడుగుతున్నారు. అంచేత ఓ పని చేద్దాం. నేను రేపు ఉదయం తిరుమలకి వచ్చి, మీ దగ్గర టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా ఛార్జి తీసుకుని, మళ్లీ హైద్రాబాద్ వచ్చేస్తాను. మీకెలాగూ జాయినింగ్ టైమ్ వుంది కాబట్టి ఈ వారాంతంలో ఆప్కాబ్ బోర్డు మీటింగ్ కాగానే, ఇక్కడే మీకు నేను ఛార్జి అప్పగిస్తాను. ఇక్కడే కాకపోతే తిరుపతిలో. ఎలా వీలైతే అలా చేద్దాం. సరేనా?..."

ఒక్కసారిగా జావగారిపోయాను. ఏమంటాను? ఏమీ అనలేకపోయాను-"మీ యిష్టం" అని తప్ప.

★ ★ ★

అయితే ఇదే విషయం నా ద్వారా విన్నప్పుడు, గోపిక మాత్రం తీవ్రంగా ఆశాభంగం చెందింది... "స్వామివారి అనుగ్రహం ఇంకలేదేమో మనకి. అందుకే ఈ చిన్న ఆనందం మనకి లేకుండాపోతోంది"అంటూ దుఃఖించింది. చివరికి, "మనకి ప్రాప్తం ఇంతే" అనుకుంటూ ఇద్దరం సమాధానపడిపోయాం. "సమాధానపడ్డాం" అనుకుంటున్నామే కాని ఆ అసంతృప్తి మమ్మల్నిద్దర్నీ వెంటాడుతూనే వుంది.

అనుకున్నవిధంగా, ఆ మర్నాడు కుమారస్వామి రెడ్డిగారు వచ్చారు. తిరుమల శ్రీవేంకటేశ్వరుని ఆలయంలోని పడికావలిలో రెడ్డిగారికినేను పదవీబాధ్యతలు అప్పగించాను. శ్రీనివాసుడు చూస్తుండగా






శ్రీ కుమారస్వామి రెడ్డికి ఛార్జి యిస్తున్నప్పటి దృశ్యం

(నిజంగా చూస్తున్నాడా?) దేవస్థానాల బోర్డు ఛైర్మన్ శ్రీనాగిరెడ్డి, దేవాదాయశాఖ కమీషనర్ శ్రీ రాజగోపాలరాజు, బోర్డు మెంబర్లందరి సమక్షంలో - అత్యంత నియమబద్ధంగా ఈ కార్యక్రమం జరిగింది. నా భార్య, పిల్లలు కూడా ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. కొత్త ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా రెడ్డిగారి ప్రమాణ స్వీకారం పూర్తయిన మరుక్షణం - నా కళ్లల్లో నీళ్లు తిరిగాయి. శ్రీనివాసుడి 'ప్రథమ సేవకుడు' అనిపించుకుంటూ స్వామివారిని ప్రత్యక్షంగా అనునిత్యం సేవించుకునే నా ఈ భాగ్యానికి ఈరోజుతో తెరపడింది కదా!...అందరూ నావంకే చూస్తున్నట్లనిపించింది. ప్రక్కకి తిరిగి కండువాతో నా కన్నీటిని తుడుచుకున్నాను. కానీ... ఓ అరగంట తర్వాత నా కంటివెంట ధారాపాతంగా కారిన బాష్పాల్ని మాత్రం తుడుచుకోవటానికి ప్రయత్నం చేయలేదు. చేయాలనిపించలేదు.......

అక్కడ కుమారస్వామి రెడ్డిగారికి ఛార్జి అప్పగించాక, దేవస్థానాల బోర్డు ఛైర్మన్ నాగిరెడ్డిగారు, కమీషనర్ రాజగోపాలరాజుగారు స్వామివారి ముందు నాకు అర్చకులచేత మేల్చాట్ వస్త్రం కప్పించి, నన్ను అప్రతిభుడ్ని చేశారు. 'మేల్చాట్ వస్త్రం' అంటే శ్రీవారి అలంకరణకి వినియోగించి వున్న వస్త్రం. రాష్ట్రపతి, ప్రధానమంత్రి వంటి అత్యంత ప్రముఖుల్ని మాత్రమే వేదపండితుల ఆశీర్వచనాల మధ్య ఇలా మేల్చాట్ వస్త్రంతో సత్కరించటం ఆలయ సాంప్రదాయం. అదికూడా- బోర్డు తీర్మానం వుంటేనే జరగాలి. మరి, పదవీబాధ్యతలు వదిలేసి వెళ్లిపోతున్న నాకేమిటిఈ సత్కారం? ఎక్కడ్నుంచి వచ్చింది నాకీ అర్హత? ఎవరు కల్పించారీ అదృష్టం? (నాకు తెలియకుండానే ఛైర్మనూ, కమీషనరూ, బోర్డు సభ్యులూ కలిసి, నాకీ గౌరవాన్ని అందించాలని రహస్యంగా తీర్మానించారుట.) అక్కడితో ఆగలేదు.



టి.టి.డి. ఇ.ఓ.గా పదవీ విరమణ అనంతరం
శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాదుకు మేళతాళాలతో వీడ్కోలు యిచ్చిన సందర్భం

ఆలయం నుంచి బయటకు రాగానే, మహద్వారం దగ్గర నేత్రపర్వంగా అలంకరించ బడిన శ్రీవారి గజాలు ఘోష్ నం ఎదురు చూస్తున్నాయి - మమ్మల్ని సాదరంగా సాగనంపటానికి.. ఆలయం దగ్గర్నుంచి గెస్ట్‌హవుస్ దాకా, ముందు స్వామివారి ఏనుగులు హంసనడకలు నడుస్తుంటే, ఆ వెనకాల సన్నాయిమేళంతో, ఆలయ మర్యాదలతో టిటిడి అధికారులు, వందలాది స్థానిక అభిమానులు, శ్రేయోభిలాషులు ప్రేమపూర్వక శుభాకాంక్షలు తెలుపుతూవస్తుంటే - అదో ఊరేగింపులా సాగింది మా వీడ్కోలు యాత్ర. అదిగో, ఆ ప్రేమ, వాత్సల్యం, అభిమానం, ఆదరం.... నన్ను కదిలించివేశాయి. అందుకే అప్పుడు కారిన ఆనందాశ్రువుల్ని తుడుచుకోవాలనిపించలేదు.

కాని ఇవేవీ నా జీవిత భాగస్వామికి ఊరడింపు కలిగించలేకపోయాయి. గెస్ట్‌హవుస్‌కి చేరగానే, అప్పటిదాకా ఆమె నిగ్రహంతో ఆపుకున్న కన్నీటి జలపాతం ఒక్కసారిగా కట్టలు త్రెంచుకుంది... "ఇంతకాలం మీరు త్రికరణశుద్ధిగా సేవించిన స్వామి మన పట్ల ఎందుకింత నిర్దయుడయ్యాడు? కనీసం ఆయన సన్నిధిలో ఛార్జి తీసుకునే అదృష్టంకూడా లేకుండా చేశాడు? ఏం నేరం చేశామని ఇప్పుడు మిమ్మల్ని ఏ పోస్టులోనూ లేకుండా చేసి, టిటిడి నుంచి బయటకు గెంటేశాడు?..."అంటూ ఆమె వెక్కి వెక్కి ఏడుస్తుంటే, ఏమనాలి?

నాకు తెలుసు - ఆమె బాధ, వ్యధ నా పోస్టు గురించి కాదు. గవర్నమెంటు సర్వీసులో ఏ పోస్టూ ఎవరికీ శాశ్వతం కాదు. ఇదీ ఆమెకి తెలుసు. కాకపోతే, నాలుగేళ్లపాటు సర్వం ఆ సర్వాంతర్యామే అని పరిపూర్ణంగా విశ్వసించి, అవకాశమున్న ప్రతీసారీ ప్రతి సేవలోనూ పాల్గొంటూ - ఆ స్వామి ఆరాధనలో తాదాత్మ్యం చెందిన కారణంగా, ఈ అనుబంధాన్ని ఒక్కసారిగా వదులుకోవాల్సి రావటంతో కలిగిన మానవ సహజమైన ఆవేదనకి ఆమె గురయింది. ఆ ఆవేదనకి ఊరటగా - స్వామివారి సన్నిధిలోనే నేను కూడా ఛార్జి తీసుకుంటానన్నప్పుడు, ఆమె సర్దుకుంది. ఇప్పుడు ఆ అవకాశంకూడా లేకపోవటంతో తట్టుకోలేకపోతోంది. నేనేం చేయగల్ను?





అక్కడికీ నన్ను నేను కంట్రోల్ చేసుకుంటూ, అనేక రకాలుగా సాంత్వన వచనాలు పలుకుతున్నాను. "... చూడు గోపీ! స్వామివారి అనుగ్రహం వుండబట్టే, గతంలో ఏ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి జరగని విధంగా ఇప్పుడు మనకి మేల్చాట్ వస్త్రంతో సత్కారం - ఆయన సన్నిధిలో - జరిగింది.... ఆయన ఆశీస్సులే లేకపోతే, ఇన్ని వందలమంది మనకింత ఘనంగా వీడ్కోలు చెప్పేవాళ్లా?... ఇలా ఆలయ మర్యాదలతో, మేళతాళాలతో సాగనంపేవాళ్లా?.... ఇదంతా ఆయన చలవ వల్లే జరిగిందనుకుందాం.. ఆప్కాబ్ ఎం. డి పోస్టు సంగతంటావా - ఆ పోస్టుకి ఛార్జి ఇక్కడ తీసుకోవాల్సిన అవసరమే లేదు. ఒకవేళ అది ఇక్కడ జరిగితే, అది బోనస్‌లాంటిదన్నమాట......." ఇలా వేదాంత ధోరణిలో నేను చెప్పగలిగిందంతా చెప్పాను.

ఎంత చెప్పినా నేను గోపికని సముదాయించలేకపోయాను. ఆమె దృష్టిలో - మా వల్ల ఎక్కడో ఏదో అపరాధం జరిగింది. అందుకే స్వామి మాకు ఇక్కడ లభించాల్సిన అవకాశాన్ని (ఆయన సన్నిధిలో ఛార్జితీసుకోవటం) లేకుండా చేశారు. "గోపీ.. అనవసరంగా ఎక్కువ ఆలోచిస్తున్నావ్. ఆప్కాబ్ ఎం. డి పోస్టులో చేరేవాళ్లెవరూ తిరుమల కొండమీద ఆలయంలో ఛార్జితీసుకోరు. అలా కోరుకున్నా, జరగదు! ఇప్పుడు మనకేదో అవకాశం వచ్చి చేజారిపోయిందికదా అని మనం స్వామిని నిందించటం సరికాదు. మనకా అర్హత, ప్రాప్తం వుంటే జరిగేదే కదా! జరగనిదాని గురించి విచారించటం ఎందుకు?.."

నాకు తెలిసిన వేదాంతం చెప్పాను... ఫలానా రకంగా జరగాలన్న తాపత్రయం వున్నప్పుడే, అది జరగదేమోనన్న బెంగ కూడా పెరిగిపోతూంటుంది. ఈ పెరుగుతున్న బెంగ అవ్యక్తమైన ఆందోళనని పెంచేస్తూంటుంది.

కోరిక - తాపత్రయం - బెంగ - నిస్పృహ - క్రోధం - సమ్మోహం - బుద్ధినాశం.... ఇవన్నీ ఒకదానికొకటిగా ఎలా అల్లుకుపోతాయో భగవద్గీతలో చదివినవే.......

**ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే**
**సఙ్గాత్సఞ్జాయతేకామః కామాత్ క్రోధోభి జాయతే**
**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః**
**స్మృతి భ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి**

(భగవద్గీత)

అయినా అప్పటి ఆమె మానసిక పరిస్థితి అలాంటిది. అప్పట్లో ఆమెకున్న ఒకే ఒక్క కోరిక - శ్రీనివాసుడి సన్నిధిలో నేను ఛార్జి తీసుకోవాలి. చివరగా ఒకమాట చెప్పాను... "గోపీ, మనకి జాయినింగ్ టైమ్ ఇంకో వారం రోజులుంది. స్వామిని ప్రార్థించు. ప్రాప్తం వుంటే జరుగుతుంది.

లేదంటే లేదు. అలా జరగకపోవటానికి మానసికంగా సిద్ధపడు. ఇంతకన్నా మనం చేసేది ఏమీలేదు..." నేను కూడా ఆ "జరగనిదానికే" సిద్ధపడిపోయాను.

ఆ మిగిలిన వారంరోజులలో తిరుమల - తిరుపతిలలో నాకోసం గుర్తు లేనన్ని వీడ్కోలు సభలు జరిగాయి.

★ ★ ★

**మరో** ఆరు రోజుల్లో తిరుమల ఆలయంలో ఆనివారి ఆస్థానం జరగబోతోంది. ఇది ఒక విశిష్టమైన సేవ. ఆ సంవత్సరమే బెంగుళూరు భక్తులతో మాట్లాడి పెద్ద మల్లె పూల పందిరి వాహనం ప్రత్యేకంగా తయారుచేయించి, స్వామి వారి ఊరేగింపుకు ఏర్పాట్లు చేయడం జరిగింది. అందుకని నేను గోపికతో చెప్పాను - ఈ ఆనివారి ఆస్థాన సేవకూడా చూసుకుని, ఆ మర్నాడే హైద్రాబాద్ వెళ్లిపోదాం - అని. ఆమె అయిష్టంగానే తలూపింది.

తిరుమల ఆలయంలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా ఛార్జి తీసుకున్న కుమారస్వామి రెడ్డిగారు రెండురోజులపాటు తిరుపతిలో వున్నాక, ఆప్కాబ్ బోర్డు మీటింగ్ కోసం హైద్రాబాద్ వెళ్ళారు. మా అవగాహన ప్రకారం - ఆ బోర్డు మీటింగ్ అయ్యాక ఆయన హైద్రాబాద్‌లో వుండగానే నేను వెళ్ళి, ఆయన దగ్గర్నుంచి ఆప్కాబ్ ఎం. డిగా ఛార్జి తీసుకోవాలి.

అకస్మాత్తుగా, ఆనివారి ఆస్థానం ముందు రోజు ఉదయం శ్రీరెడ్డి నాకు ఫోన్ చేసి, ఆమర్నాడు జరిగే ఆనివారి ఆస్థానం కార్యక్రమానికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ వుండి తీరాలని అర్చకులు చెప్పారనీ, కాబట్టి తానే తిరుపతి వస్తున్నానని చెప్పారు.

"రేపు ఉదయం ఏడుగంటల 15 నిమిషాలకి తిరుపతిలోని ఇ. ఓ. బంగళాలోనే మిమ్మల్ని కలిసి, మీకు ఛార్జి అప్పగించాక, నేను తిరుమలలో ఆనివారి ఆస్థానానికి బయల్దేరి వెళ్దామనుకుంటున్నాను ప్రసాద్. ఏమంటారు?"

నేను అనేదేముంది? ఏడు గంటల 15 నిమిషాలకు టైమ్ బాగుందనుకొన్నాను, "మీ ఇష్టం" అని ఒప్పేసుకున్నాను.

ఇది వింటూనే గోపిక మళ్ళీ మధన పడసాగింది. "అయ్యో! ఎందుకండీ స్వామి మనకింత అన్యాయం చేస్తున్నారు? ఆయనే (రెడ్డిగారు) తిరుపతి వస్తుంటే, స్వామివారి సన్నిధిలోనే ఛార్జి ఇవ్వచ్చుగదా!"

నేను వేదాంతధోరణిలో పెదిమ విరిచి, ఒక నవ్వు నవ్వేశాను.

ఆ రాత్రికే కుమారస్వామి రెడ్డిగారు తిరుమల చేరిపోయారు. ఆయన అక్కడ్నుంచే నాకు (తిరుపతికి) ఫోన్ చేసి, "సారీ ప్రసాద్, మన కార్యక్రమంలో చిన్నమార్పు చేయాల్సివస్తోంది. నేను





నేరుగా కొండకి వచ్చేశాను కనుక, ప్రొద్దుటే తిరుపతికి వచ్చి, 7. 15కి మీకు ఛార్జి ఇచ్చి, మళ్ళీ కొండమీద ఆనివారి ఆస్థానం కార్యక్రమానికి రావటానికి టైమ్ సరిపోదని అర్చకులు చెబుతున్నారు. అంచేత ఒక పని చేద్దాం. ప్రొద్దున్నే మీరు నేరుగా కొండమీద నా గెస్ట్‌హవుస్‌కి వచ్చేయండి. అనుకున్న ముహూర్తానికే నేను మీకు ఛార్జి అప్పగించేస్తాను. ఇక్కడ్నుంచి అందరం కలిసి వెళ్ళి, ఆనివారి ఆస్థానంలో పాల్గొనవచ్చు. ఏమంటారు?"..... అప్పటికే అలవాటుపడి పోయాను "మీ ఇష్టం" అనటానికి. నా సమాధానంలో మార్పులేదు.

దీంతో ఆ రాత్రి గోపిక ఆవేదన వర్ణనాతీతం. రేపు కొండమీదకి వెళ్తున్నాం కానీ, ఛార్జి తీసుకునే సన్నివేశం - శ్రీవారి సన్నిధిలో జరగదు... !! ఆమెకు చెప్పగలిగింది మరోసారి చెప్పి, ఆమెను ఊరడించటానికి నా దగ్గర ఇంకేమీ అక్షరౌషధాలు లేవనుకున్నప్పుడు, నాకు గుర్తొచ్చింది ఒక్కరే - లీలా వినోదుడైన శ్రీనివాసుడు. "నా కోసం కాకపోయినా, ఆమె కోసమయినా ఈ ఒక్కసారికి అలా జరగనివ్వచ్చుగదా స్వామీ" అనుకుంటూ ధ్యానం చేస్తూ, చేస్తూ నిద్రలోకి జారిపోయాను.

సరిగ్గా ఉదయం ఏడు గంటలకి అయిదు పదినిమిషాల ముందుగానే ఇద్దరం, పిల్లలతో సహా తిరుమల గెస్ట్‌హవుస్‌కి చేరాం. సరిగ్గా ఏడుగంటలకి కుమార స్వామిరెడ్డిగారు ఫోన్ చేశారు. "సారీ ప్రసాద్, తెల్లవారుఝామునే గుడికి వచ్చి, ఆనివారి ఆస్థానం ఏర్పాట్లలో చిక్కుకుపోయాను. మీరేమీ అనుకోకపోతే, నేరుగా ఆలయానికి వచ్చేయండి. ఇక్కడే మీకు ఆప్కాబ్ మేనేజింగ్ డైరక్టర్ పదవీ బాధ్యతలు అప్పగించేస్తాను. ఏమంటారు?"

ఎగిరిగంతేశాను!! ఈసారి "మీ ఇష్టం" అనలేదు. "ఇదుగో వచ్చేస్తున్నాం"... అంటూ ఒక్క వూపులో గోపిక చేయిపట్టుకుని లాగి, పరుగు పరుగున తీసుకెళ్ళి కారులో కూర్చోబెట్టాను. పిల్లలూ మా వెనకాలే .....

ఆమెకి అర్థమైపోయింది. అంతకు ముందు నిందించిన స్వామి పాదాల్ని కడిగెయ్యటం కోసమా అన్నంత ఉధృతంగా ఆనందాశ్రువులు రాలుస్తూ, "నిజంగా స్వామిపిలిచారా? నిజంగా పిలిచారా?..." అంటూ పులకించిపోతూ నా భుజం మీద వాలిపోయింది.

అయిదు నిమిషాల్లో ఆలయం చేరుకున్నాం. ఏడుగంటల 15నిమిషాలకి ఆనివారి ఆస్థాన కార్యక్రమం మధ్యలో వుండగానే, ఎక్కడైతే నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ ఛార్జిని, కుమారస్వామి రెడ్డి గారికి అప్పగించానో, అదే పడికావలిలో, ముక్కోటి దేవతలకు ఆరాధ్యుడై, కలియుగదైవంగా శ్రీనివాసుడి రూపంలో భాసిస్తున్న శ్రీమన్నారాయణుడి దివ్య కటాక్ష వీక్షణాలు మా మీద ప్రసరిస్తున్నాయేమో అనిపించేటంత ప్రత్యక్షంగా ఆ స్వామి వీక్షిస్తుండగా రెడ్డిగారు నాకు ఆప్కాబ్ ఛార్జి అప్పగించారు.

ఈ వార్త మిత్రులద్వారా విన్నప్పుడు నేను నిర్ఘాంతపోయాను. ఇది నిజం కాదనీ, వట్టి వదంతి మాత్రమేనని అనుకున్నాను. కాని క్రమంగా - అవినీతి అధికారుల జాబితాలో నన్ను కూడా చేర్చారని ధర్మమహామాత్ర (ఎన్ టి ఆర్ కొత్తగా ఏర్పాటు చేసిన అవినీతి నిరోధక వ్యవస్థ) ముందు పంచాయితీ తప్పదనీ, ముఖ్యమంత్రి సన్నిహితులైన మిత్రులు చెప్పటంతో నేను అయోమయంలో పడిపోయాను. "ఏమిటిది? ఎందుకిలా జరుగుతోంది? టిటిడిలో వుండగా భక్తులు హుండీలో వేసే ప్రతి నయాపైసా శ్రీనివాసుడిదేననీ, ఆ సొమ్ముకి అర్థవంతమైన ప్రయోజనం కల్పించటమే నా బాధ్యత అనీ నమ్మి పనిచేశానే, ఇప్పుడు నాకు అవినీతి ముద్ర వేస్తున్నారేమిటి?...." ఇలా మథనపడసాగాను.

నేను ఎప్పుడయినా, ఎక్కడయినా నా అధికార పరిధికి మించి నిర్ణయాలు తీసుకొనుంటే వుండొచ్చు. నామీద కొందరు టిటిడి బోర్డు సభ్యులలో ఈ అసంతృప్తి వున్నమాట కూడ నిజమే. (అప్పైనా, ఆయా సందర్భాలలో నాకు తెలీని అనిర్వచనీయమైన శక్తి ఏదో నా చేత అలా చేయించిందే తప్ప నా సొంత సృజనాత్మకతకాదని నమ్ముతూ వచ్చాను.) ఇంతకు మించి తెలిసి తెలిసీ, ఉద్దేశ్య పూర్వకంగా నేను ఎలాంటి అవినీతి చర్యలకూ అవకాశమివ్వలేదు కదా, మరెందుకు ఇప్పుడిలా అవినీతి ఆరోపణల చట్రంలో నన్ను ప్రభుత్వం ఇరికిస్తోంది?.... తెలీదు.

తెలీకపోగా ఈ వదంతులు నన్ను మానసికంగా బాగా క్రుంగదీశాయి. మంత్రుల్లో చాలామంది క్రొత్త వాళ్ళే (ముఖ్యమంత్రితో సహా). వారికి పరిపాలనలో అనుభవం తక్కువ. తాము రాక ముందు అడ్మినిస్ట్రేషన్‌లో అంతటా బురద, కుళ్ళుమాత్రమే పేరుకుపోయి వుందనీ, దాన్ని ప్రక్షాళన చేయటమే తమ ప్రథమ కర్తవ్యమనీ ముఖ్యమంత్రి నుంచి అతి జూనియర్ మంత్రిదాకా అందరూ నమ్మేస్తున్నారు. నిజానికి, అధికారుల్లో ఎవరు ఎలాంటి వాళ్ళూ అని చాలామంది మంత్రులు ఇంకా అర్థం చేసుకోవాల్సివుంది.

ఈ స్థితిలో మన మాట వినేవాడూ లేడు. విన్నా నమ్మేవాడు - అర్థం చేసుకునేవాడు కూడా అక్కడలేరు.

దీంతో నా పరిస్థితి మరింత అగమ్యగోచరంగా తయారైంది. నాగురించి, నా పనివిధానం గురించి క్షుణ్ణంగా తెలిసున్న నాయకులు పదవుల్లో లేరు. వున్నవాళ్ళకి తెలీదు. తెలీక పోగా, ఆ ముందు ప్రభుత్వంలో పనిచేసిన వాళ్ళంతా అప్పటి కశ్మలాన్ని ఒంటినిండా పులుముకొన్న వాళ్ళేనని అపారమైన నమ్మకం లేదా అనుమానాన్ని వెళ్ళగక్కుతున్నవాళ్ళు. పోనీ నన్నెరిగిన సీనియర్ అధికారులెవరన్నా ముఖ్యమంత్రికి చెప్పగలరా అంటే, ఎవరు ధైర్యం చేసి, నాతరుపున వకాల్తా తీసుకుని ముఖ్యమంత్రితో మాట్లాడతారు?...





అవినీతిపరుల జాబితాలో నాపేరు వుందన్న ప్రచారం నాలో విపరీతమైన నైరాశ్యాన్ని పెంచేస్తోంది. "నేను అవినీతిపరుడ్ని కాదు - కాదు....." అని ఎలుగెత్తి అరవాలనిపిస్తోంది. నా గురించి తెలిసున్నవాళ్ళెవరూ ముఖ్యమంత్రికి చెప్పగలవాళ్ళు కారు. పోనీ నాకుగా నేను వెళ్ళి చెప్పుకుందామా అంటే, అసలు ప్రభుత్వం అంతవరకూ నా మీద "అవినీతి ఆరోపణలు" ఏమిటో నాకు చెప్పనేలేదు. విషయం ఏమిటో తెలీకుండా నాకుగా నేను వెళ్లినా, ముఖ్యమంత్రి ఇంటర్వ్యూ ఇస్తారన్న గ్యారంటీ లేదు. పైగా 'అవినీతిపరుడు' అని ప్రచారం చేయబడుతున్నవాడికి ఇంటర్వ్యూ ఇచ్చే స్థితిలో ఆ రోజుల్లో శ్రీ ఎన్ టి రామారావు వున్నారా? ప్చ్! ఒక్కసారిగా నా స్థితి అంధకారబంధురమై పోయినట్లుంది. నాకు సన్నిహితులైన మిత్రులు రకరకాల సలహాలిచ్చారు.

"నువ్వెందుకు ముఖ్యమంత్రిని కలవాలనుకుంటున్నావ్! నీలాగే వివరణ ఇద్దామని మొన్న ఫలానా మన సీనియర్ వెళితే, సి. ఎం అతని మొహం కూడా చూడలేదు.... వదిలేయ్, ఏమవుతుందో చూద్దాం? ఛార్జిషీటు ఫైల్ చేయాలి గదా ఆ మహామాత్రో, గీత్రో. అప్పుడే చూసుకోవచ్చు... అందాకా నీకు పోస్టింగ్ ఇవ్వడా? అదీ చూద్దాం? ఎన్ని కోర్టుల్లేవు, ఎంతమంది గొప్ప అడ్వకేట్లు లేరు మనకి!..." ఇలాంటి సలహాలు చాలా వచ్చాయి. నా బాధ, వ్యథ వాళ్ళకి అర్థం కావటం లేదు. కోర్టులు, కేసులు- వీటి గురించి నేను బెంగపడటంలేదు. నేను ఏం నేరం చేశానో నాకు తెలీదు. కాని, నా మీద ఒక దుష్టప్రచారం మాత్రం జరిగిపోతోంది. ఈ ప్రచారం నన్ను మానసికంగా దహించేస్తోంది.

**అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేవ్యయామ్**
**సంభావితస్యచా కీర్తి ర్మరణా దతిరిచ్యతే**

(భగవద్గీత)

"ప్రజలెప్పుడు నీ అపకీర్తి గురించే చెప్పుకుంటారు. ఆత్మగౌరవం కల వ్యక్తికి అపకీర్తి అనేది మరణం కంటే దుర్భరమైంది."

మామూలుగా తిరుపతిలో పనిచేసినంత కాలం ఇలాంటి స్థితి ఏదివచ్చినా గుడిలోకి వెళ్ళి శ్రీనివాసుడికి మొరపెట్టుకునేవాడ్ని. అందుకే ఇప్పుడు కూడా ఇక్కడ్నుంచే శ్రీనివాసుడికి ఓ నమస్కారం పెట్టి, ధైర్యంచేసి, నా జాయినింగ్ రిపోర్టు ప్రభుత్వానికి పంపించాను. పోస్టింగ్ ఇచ్చేదీ లేందీ దీంతో తేలిపోతుంది. ఆ జాయినింగ్ రిపోర్టు ఛీఫ్ సెక్రటరీ దగ్గర్నుంచి ఛీఫ్ మినిస్టర్‌కి చేరుకుంది.

"ఏం జరగబోతోంది" అన్న ఉత్కంఠ వెంటాడుతుండగా, ఆ మర్నాడు ముఖ్యమంత్రి కార్యదర్శి శ్రీ మోహన్ కందా (ఇప్పటి ఛీఫ్ సెక్రటరీ) నుంచి ఫోన్ కాల్ వచ్చింది. దాని సారాంశం - "ముఖ్యమంత్రి మీతో మాట్లాడాలనుకుంటున్నారు." సంభ్రమాశ్చర్యాల మధ్య ఆ మర్నాడు నేను ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుని కలవటానికి మొట్ట మొదటిసారిగా వెళ్ళాను.

★ ★ ★

హైద్రాబాద్‌లో సెక్రటేరియట్ మధ్యలో వుండే ఛీఫ్ మినిష్టర్ కార్యాలయంలోకి వెళ్ళగానే అక్కడి సిబ్బంది నన్ను రామారావు గారి ప్రయివేటు రూమ్‌లోకి తీసుకువెళ్ళారు. "ముఖ్యమంత్రి ఏం మాట్లాడబోతున్నారు? ఎలాగూ నామీద ఆరోపణలు వచ్చేశాక ఆయనింక అడిగేదేమిటి?.... ఒకవేళ ఆయనేమీ అడక్కపోతే, నేనేం చేయాలి? నాకుగా నేను ఏమన్నా చెప్పాలా - వద్దా? ..." ఇలా నాలో నేను తర్కించుకుంటూండగా, కొంతసేపటి తరువాత ముఖ్యమంత్రి ఆ గదిలోకి ప్రవేశించారు. నేను లేచి "నమస్కారం సర్" అనే లోపల ఆయన పలకరించి, "కూర్చోండి" అంటూ తనూ ఓ సోఫాలో కూర్చున్నారు.

ఆయనే సీరియస్‌గా సంభాషణ ప్రారంభించారు - "ప్రసాద్‌గారు, మీ గురించి చాలా విన్నాం"

"ఏమని సర్? మంచిగానా, చెడుగానా?"

"రెండు రకాలుగానూ విన్నాం"

"సర్, మంచిగా ఏం విన్నారని తెలుసుకోవాలన్న ఆసక్తి నాకు లేదు. మీకు అభ్యంతరం లేకపోతే, నాగురించి చెడు ఏం విన్నారో చెబితే..." అన్నాను కానీ ఏం వినాల్సివస్తుందోనన్న గుబులు మాత్రం పోలేదు. క్షణకాలం కళ్ళుమూసుకుని తిరుమల శ్రీనివాసుడ్ని తల్చుకున్నాను.... అక్కడ్నుంచి ముఖ్యమంత్రి రామారావుగారి సంభాషణ ధోరణిలో మార్పువచ్చింది. ఆయన భాష మర్యాద పూర్వకంగానే వున్నా ప్రశ్నలు పదునుగా, సూటిగా, నిష్కర్షగా వున్నాయి.

"మీరు మూడు పెద్ద నేరాలు చేశారని మా దృష్టికి వచ్చింది. మీ మీద మాకు వచ్చిన ఫిర్యాదులలో మొదటిది - మీరు టిటిడి నిధుల్లోంచి లక్షలరూపాయల్ని వేలాది బ్రాహ్మణులకు ధారాదత్తం చేశారటగదా?"

ఈ ప్రశ్న వింటూనే నాకు నవ్వొచ్చింది. నవ్వు ఆపుకుని, "నేను వివరణ ఇవ్వచ్చా సర్" అడిగాను.

"తప్పకుండా"

"ఈ ఆరోపణ కొంతమేరకు నిజం. నా హయాంలో టి.టి.డి అమలు చేసిన కొన్ని పథకాల వల్ల బ్రాహ్మణులు లబ్ధి పొందారు...." శ్రీరామారావు ఛివాల్న తలెత్తి నా వంక నిశితంగా చూస్తున్నారు...

"... వేద రక్షణ, శాస్త్రరక్షణ అనే రెండు పథకాలు నేను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా ప్రవేశపెట్టాం. ఎవరైతే 12-16 సంవత్సరాలపాటు నిర్విరామంగా వేదాధ్యయనం చేసి, ఘనాపాఠీలుగా, క్రమాపాఠీలుగా గుర్తింపు పొందివున్నారో, అలాంటి వేదపండితులు తమకు సమీపంలోని ఆలయంలో





- సమాజ సంక్షేమం కోసం - రోజుకి ఎనిమిది గంటలవంతున వేదపారాయణ చేసిన పక్షంలో వాళ్ళకి నెలకి 600 నుండి 800 రూపాయల వరకు గౌరవ వేతనాన్ని టిటిడి చెల్లిస్తుంది. అయితే ఈ పథకాన్ని కంచిపీఠాధిపతులైన శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారి సలహా మేరకు, రాష్ట్ర ప్రభుత్వ ఆమోదంతో టిటిడి అమలు చేసింది. ఇలాంటి పథకాన్ని రాష్ట్రంలో అమలు చేయటం అదే మొదటిసారి.... నేను టిటిడిలో చేరటానికి రెండు మూడేళ్ళ క్రితమే ఇలాంటి పథకానికి శ్రీకారం చుట్టాలని ప్రయత్నం జరిగింది. అప్పటి రాష్ట్ర ప్రభుత్వం కూడా ఆ పథకాన్ని ఆమోదించింది. అయితే ఆ పథకం దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనరేట్ ఆధ్వర్యంలో అమలు జరగాల్సివుంది. ఏ కారణంవల్లనో వాళ్ళు అమలు చేయలేక దాన్ని టిటిడికి అప్పగించారు. ఇందులో నేను చేసిన నేరం ఏమన్నా వుందంటే - అది ప్రభుత్వ ఆదేశాలను తు.చ తప్పకుండా అమలు చేయాలని యత్నించటమే..." అంటూ ఆగాను. రామారావుగారు సాలోచనగా "ఓహో..." అన్నారు.

"అన్నట్లు అసలు విషయం చెప్పడం మర్చిపోయాను సర్. అలా ఈ వేదరక్షణ, శాస్త్ర రక్షణ పథకాల క్రింద నెలకి 600-800 రూపాయల గౌరవవేతనాలు పొందటానికి అర్హులైన ఘనాపాఠీలు, క్రమాపాఠీల సంఖ్య వేలల్లో లేదు సర్, వాళ్ళంతా కలిపి 370 మంది వుంటారు.... ప్రభుత్వోద్యోగాలలో పదోక్లాసు కూడా చదవని ప్యూను నెలకి రెండువేలు సంపాదించుకుంటుంటే, పదహారేళ్ళపాటు నిరంతర సాధన ద్వారా వేదాలను అభ్యసించడం అంటే ఇంచుమించు ఒక స్పెషలైజ్‌డ్ సబ్జక్టులో పోస్టుగ్రాడ్యుయేషన్ చేయటంలాంటిది. అలాంటి పండితులు ప్రతి ఒక్కరు రోజుకి ఎనిమిది గంటల చొప్పున సమాజ శ్రేయస్సు కోసం తమ కంఠనరాలు తెగిపోయేలా ఉచ్ఛ స్వరంలో వేద పఠనం చేస్తే, వాళ్ళకి మేమిచ్చింది 600 లేదా 800 రూపాయలు - అదీ నెలసరి గౌరవ వేతనమే. ఇదంతా రికార్డ్సులో వుంది సర్, మీరు తెప్పించి చూడవచ్చు... మీ దృష్టికి వచ్చిన నేరం ఇదే అయినట్లయితే ఆ పథకం అమలు చేసిన నేరస్థుణ్ని నేనే!!"

ముఖ్యమంత్రిలో ఏ మార్పూ లేదు. "ఊహుఁ" అంటూ తలపంకించి, నేను చేసిన రెండో "నేరం" గురించి అడిగారు.

"మీరు తిరుమల కొండమీద పాపనాశనం డామ్ నిర్మాణం విషయంలో కంట్రాక్టు నిబంధనల్ని కంట్రాక్టర్లకు అనుకూలంగా సవరించేసి, లక్షలాది రూపాయలు లంచం తీసుకున్నారని విన్నాం..?"

ఈ ప్రశ్నతో నాకు కొంచెం కొంచెం అర్థమవుతోంది. నా మీద అసూయతోనో, అక్కసుతోనో ఎవరో మహానుభావుడు ఒక పథకం ప్రకారం అవినీతి ఆరోపణల చిట్టా తయారుచేసి ముఖ్యమంత్రికి అందించాడు - అదీ నేను ఇండియాలో లేని సమయంలో. ముఖ్యమంత్రి లేవనెత్తుతున్న అంశాలలో ప్రతి దానికీ వాస్తవాన్ని వక్రీకరించడానికి కావలసినంత మసాలా వుంది.



నిర్మాణదశలో పాపనాశనం డామ్

ఈ పాపనాశనం డామ్ కథా ఇంతే! 1978లో నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా చేరేనాటికే పాపనాశనం డామ్ కట్టడానికి ప్రాజెక్టు ఖరారైపోయింది. ఇంజనీర్ల కమిటీ తయారు చేసిన ఎస్టిమేట్ల ప్రకారం టెండర్లు పిలిచారు.... బొంబాయికి చెందిన హిందూస్థాన్ కనస్ట్రక్షన్ కార్పొరేషన్ (హెచ్‌సిసి) వారి టెండరు ఎంపికయింది. ఆ ప్రకారం పాపనాశనం డామ్ నిర్మాణం బాధ్యతను హెచ్‌సిసికి అప్పగించారు. ఆ కంపెనీవాళ్ళు డామ్ నిర్మాణానికి అవసరమైన యంత్రసామగ్రిని, లేబర్‌ని ప్రాజెక్టు స్థలంలోకి చేర్చి, పని ఆరంభించబోయే సమయంలో మరో ఆలోచన వచ్చి, ఈ డామ్ నిర్మాణం మరో 100-150 మీటర్లు దిగువలో చేసినట్లయితే, డామ్‌లో నీటి స్టోరేజి కెపాసిటీ మూడు రెట్లు పెరుగుతుందనీ, ఒక్కసారి డామ్ నిండితే మరో రెండు మూడేళ్ళ వరకూ తిరుమల అవసరాలకు సరిపోతుందనీ సూచించారు. దాంతో హెచ్‌సిసి వాళ్ళని "పని ఆపవలసిందిగా" టిటిడి ఆదేశించింది. పని ఆగిపోయింది. ఈలోగా ఇంజనీర్ల కమిటీ మళ్ళీ ఈ కొత్త ప్రతిపాదన కూడా అధ్యయనం చేసి, ఇది సాధ్యపడే విషయమేననీ, ఇలా ప్రాజెక్టుకి స్థల మార్పిడి జరగటమే తిరుమలకు శ్రేయోదాయకమనీ తేల్చారు. ఇదితేలేసరికి, హెచ్‌సిసి వాళ్ళు డామ్ నిర్మాణం పని ఆపేసుక్కూర్చొని మూడున్నర మాసాలవుతోంది....

సరే, డామ్‌ని క్రిందకి జరిపికట్టిస్తాం. అందువల్ల కొంత ఖర్చు పెరుగుతుంది. అంటే, ఎస్టిమేట్లు మారతాయి. అలా ఎస్టిమేట్లు మారితే, నిబంధనల ప్రకారం కొత్తగా టెండర్లు పిలవాలి. మరి అప్పటికి మూడునెలలుగా యంత్రాల్నీ, కార్మికుల్నీ తెచ్చి పెట్టుకుని కూర్చున్న హెచ్‌సిసి ఏం చేయాలి? వాళ్ళతో కుదుర్చుకున్న అగ్రిమెంట్ రద్దుచేస్తే, వాళ్ళు వూరుకుంటారా? వాళ్ళు కోర్టుకి వెళ్ళి, తమకు టిటిడి ఎలా నష్టం కలిగించిందో వివరిస్తూ ఒక పిటీషన్ వేసి, మొత్తం డామ్ నిర్మాణం మీద 'స్టే' తీసుకువస్తే? అప్పుడు టిటిడికెంత నష్టం? రావలసిన డామ్ సకాలంలో రాకపోవడం వల్ల, యాత్రికులకు కలగబోయే అసౌకర్యం ఎలాంటిది? ఈ లిటిగేషన్ మూలంగా టిటిడి అడ్మినిస్ట్రేషన్‌కి ఎంత కాలవ్యయం?





... ఈ మీమాంస జరుగుతున్న సమయంలో (1978లో) నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వెళ్ళాను. వెళ్ళిన రెండు మూడు నెలల్లోనే ఈ పాపనాశనం డామ్ వ్యవహారం క్షుణ్ణంగా సమీక్షించాను. తరచూ తిరుమల తీవ్రమైన నీటి కొరతకు గురవుతున్న నేపథ్యంలో ఈ డామ్ నిర్మాణం సత్వరం పూర్తిచేయాలంటూ ఇంజనీర్ల కమిటీ చేసిన సూచన కూడా పరిశీలించాను. ఈ వాస్తవ పరిస్థితిని పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీ ముందు పెట్టాను. వాళ్ళు తిరుపతి కొండమీద నీటికొరత - యాత్రికుల సమస్య బాగా అర్థం చేసుకున్న వాళ్ళు కావడంతో, ఏ మాత్రం జాప్యం జరక్కుండా పాత కంట్రాక్టర్ చేతనే కొత్త స్థలంలో డామ్ నిర్మాణం చేయించాలని నిర్ణయించారు. ఆ మేరకు కంట్రాక్టరుకి ఆదేశాలిమ్మన్నారు. నేను ఇచ్చేశాను.

ఒక ప్రక్క డామ్ నిర్మాణం జరుగుతుండగా డామ్ ప్రాజెక్టు స్థలాన్ని మార్చడం వల్ల పెరిగే రేట్ల గురించి చర్చించటానికి అయిదుగురు రాష్ట్ర ప్రభుత్వ ఛీఫ్ ఇంజనీర్లతో ఒక కమిటీ వేశాం. ఈ కమిటీ తన రిపోర్టును టిటిడి పర్సన్స్ ఇన్‌ఛార్జి కమిటీ ముందు పెట్టాలనీ, ఈ రిపోర్టుని రాష్ట్ర ప్రభుత్వ ఆమోదానికి పంపాలనీ అనుకున్నాం. ప్రభుత్వ ఆమోదం వచ్చాకనే కొత్త రేట్లు అమలులోకి వస్తాయనీ, అంతవరకూ పాతరేట్ల ప్రకారమే డామ్ నిర్మాణపు బిల్లులు చెల్లించటం జరుగుతుందనీ నేను హెచ్‌సిసి వాళ్ళకి స్పష్టం చేశాను. వాళ్ళు కూడా ఈ డామ్ నిర్మాణం ఒక దైవ కార్యంగా భావిస్తూ ఆ షరతుకి అంగీకరించే పని మొదలు పెట్టారు... ఫలితంగా రెండు సంవత్సరాల కాలంలో పూర్తికావలసిన డామ్ నిర్మాణం కేవలం ఏణ్ణర్థం కాలంలోనే పూర్తయింది. అంతేకాదు, 1980లో ప్రారంభోత్సవం కూడా జరిగిపోయింది.....

ఈ కథంతా ముఖ్యమంత్రి రామారావుగారికి పూసగుచ్చినట్లు వివరించాను.

"సర్, నా చొరవ కారణంగా - పని నిల్చిపోకుండా, లిటిగేషన్‌లలో పడకుండా అతి వేగంగా, రికార్డు టైంలో పూర్తయింది. అయినా డామ్‌కి సంబంధించిన రేటు కంట్రాక్టు ఇంకా రాష్ట్ర ప్రభుత్వం దగ్గరే పెండింగ్‌లో వుంది. ప్రభుత్వం ఆమోదిస్తేనే ఆ సవరించిన రేట్ల ప్రకారం అదనంగా కంట్రాక్టరుకి చెల్లించడం జరుగుతుంది.... ఇంతకుమించి ఇప్పటివరకూ ఒక్క నయాపైసా కూడా ఆ కంట్రాక్టరుకి అదనంగా చెల్లించలేదు... సర్, పని నిల్చిపోకుండా చూసి, రికార్డు టైంలో డామ్ నిర్మాణం పూర్తిచేయించటమే పాపనాశనం ప్రాజెక్టు విషయంలో జరిగిన పాపం అని మీరు భావించే పక్షంలో - ఆ నేరం నేను చేశాను..."

ఈ జవాబు తరువాత కొన్ని క్షణాల పాటు మా ఇద్దరి మధ్య నిశ్శబ్దం తాండవించింది. .... రామారావుగారు అక్కడితో ఆపలేదు.

"మరి శ్రీనివాసుడికి వజ్ర కిరీటం చేయించే సాకుతో మీరు వజ్రాలు స్వాహా చేసిన విషయం ఏమిటి? కష్టమ్స్ వజ్రాలు వద్దని, ప్రైవేటుగా వజ్రాలు కొన్నారుటగదా? మీ ఇంటి మీద దాడిచేస్తే, మీ పరుపుల్లోనూ, తలగడల్లోనూ వజ్రాలు కుప్పలు తెప్పలుగా దొరుకుతాయంటున్నారు... ?"

ఈ సారి నేను నవ్వాపుకోలేకపోయాను. నేను నవ్వటం చూసి, ముఖ్యమంత్రి దిగ్భ్రాంతి చెందారు కానీ, నేను నవ్వకుండా వుండలేకపోయాను. ఎందుకంటే ఆ వజ్ర కిరీటం విషయంలో - వజ్రాల కొనుగోలుకి హాలండ్ వెళ్ళి వజ్రాల మొహం చూసే అవకాశం రాకుండానే నాకు టిటిడి నుంచి బదిలీ అయిపోయింది. వజ్రాలు కొనుగోలులో పాల్గొనే అవకాశం నా తరువాత ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ కుమారస్వామి రెడ్డికి దక్కింది. ఇప్పుడు సంజాయిషీ ఇచ్చుకునే 'మహద్భాగ్యం' నాకు దక్కింది.

ఏ స్వామి వారి విగ్రహానికి అలంకరింపజేయడం కోసం ఈ వజ్ర కిరీటాన్ని డిజైన్ చేయించానో ఆ స్వామిని ఒక్కసారిగా తల్చుకుని జరిగిందంతా యధాతథంగా వివరించాను.

తిరుమల వేంకటేశ్వరుడికి వజ్ర కిరీటం చేయించే కార్యక్రమం నేను రూపొందించిన మాట నిజమే. ఆ వజ్ర కిరీటానికి కొన్ని వేల వజ్రాలు కావాలి. కిరీటానికి డమ్మీ మోడల్స్ తయారు చేయించాం. నిజమైన వజ్ర కిరీటం తయారీకి ఎస్టిమేట్లు తయారుచేయించటమే కాక కిరీటంలోకి వజ్రాల్ని బహు చాకచక్యంగా పొదిగే నిపుణుల్ని కూడా ఎంపికచేశాం. ఆలయంలోపలే కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్ల మధ్య కిరీటంలోకి వజ్రాలు పొదిగే పనిని పర్యవేక్షించటానికి జ్యూయలరీ నిపుణులతో ఒక కమిటీ వేశాం. ఇక మిగిలిందల్లా, వజ్రాలు సేకరించటమే!

ఆ సమయంలో ప్రధానమంత్రి ఇందిరాగాంధీ తిరుమల వస్తే, ఆవిడక్కూడా ఈ మోడల్ని చూపించి, వజ్రాలను దొంగ రవాణా చేస్తుంటే పట్టుకున్నప్పుడల్లా కస్టమ్స్ శాఖ వాళ్ళు స్వాధీనం చేసుకునే వజ్రాలు చాలా వుంటాయనీ, వాటిల్లోంచి కొన్ని వజ్రాలు స్వామి కిరీటానికి ఇప్పించవలసిందనీ ఆమెను అభ్యర్థించాను.

ఈ వజ్రాల వ్యయం మొత్తాన్ని టిటిడి భరిస్తుంది. ప్రధానమంత్రి ఇందిరాగాంధీ, నాకోరిక వింటూ అక్కడికక్కడే తన ప్రైవేటు సెక్రటరీకి ఆదేశాలు కూడా జారీ చేశారు. రోజులు కూడా గడవక మునుపే ఉత్తర్వులు కూడా జారీ అయ్యాయి....


స్వామివారి వజ్ర కిరీటం డమ్మీ మోడలు పరిశీలనలో
శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ మర్రి చెన్నారెడ్డి, పి.వి.ఆర్.కె.ప్రసాద్





అలా ఉత్తర్వులు జారీ అయిన వారంరోజుల్లోనే ప్రధానమంత్రి ప్రిన్సిపల్ సెక్రటరీ శ్రీ కృష్ణస్వామి రావుసాహెబ్ నాకు టెలిఫోన్ చేసి, "కస్టమ్స్ శాఖ స్వాధీనం చేసుకున్న స్మగుల్డ్ వజ్రాలను స్వామి వారి కిరీటానికి వాడకండి ప్రసాద్" అంటూ హెచ్చరించారు. అదేమిటి? మొన్న మొన్న ఉత్తర్వులు జారీ చేసి, ఇప్పుడు ఆ కస్టమ్స్ స్వాధీనం చేసుకున్న వజ్రాలు వాడద్దంటున్నారు - అని ఆశ్చర్యపోయాను....

ఇలా జరిగిందంతా చెబుతుండగా, ఇక్కడికి వచ్చేసరికి నా గొంతు తడారిపోయింది.

"ఎక్స్‌క్యూజ్ మి సర్" అంటూ మంచినీళ్ళు తాగాను.

రామారావు గారు వుండ బట్టలేక "ఎందుకు కస్టమ్స్ వారి వజ్రాలు వాడద్దన్నారు?" అంటూ ఉత్కంఠతో అడిగారు.

"రావుసాహెబ్ గారు చెప్పిందేమిటంటే సర్, స్మగ్లర్లు వజ్రాల్ని చాలావరకు మర్మాంగాల్లో దాచి స్మగుల్ చేస్తుంటారు. అంచేత అలా అపవిత్రమైన వజ్రాల్ని అత్యంత పవిత్రమైన తిరుమల శ్రీనివాసుడి శిరస్సుపై కిరీటంలో అలంకరింపజేయడం మంచిది కాదేమో, ఆలోచించండి - అన్నారు. ఇది ప్రధాన మంత్రిగారి దృష్టికి కూడా వెళ్ళిందనీ, వారు కూడా వద్దన్నారనీ అన్నారండి."

"ఓహ్, అలాగా" అంటూ ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు గారు కొద్ది క్షణాలు కళ్ళు మూసుకున్నారు. ధ్యానం చేసినట్లనిపించింది. (ఎవరిని ?) నేను ఆగిపోయాను. ఆయన కళ్ళు తెరవగానే మిగతా కథ వివరించాను.

అలా స్మగుల్డ్ వజ్రాలు వాడద్దని రావు సాహెబ్‌గారు చెప్పాక, నేను దిగులుపడ్డాను. ఏం చేయాలో తెలీక, "మీరే ఏదో పరిష్కారం సూచించండి" అని అడిగాను. ఎందుకంటే వజ్రాలు ఎంపిక చేసి, బేరమాడి కొనుగోలుచేసే అనుభవం, నైపుణ్యం టిటిడికి లేవు. నా వాదన విన్నాక, రావుసాహెబ్‌గారు నన్ను ఢిల్లీకి రమ్మన్నారు.

ఢిల్లీలో ప్రధానమంత్రి సెక్రటరీ చొరవ తీసుకుని భారత ప్రభుత్వ సంస్థ అయిన హిందూస్థాన్ డైమండ్ కార్పొరేషన్ (హెచ్‌డిసి) మేనేజింగ్ డైరక్టర్‌తో సమావేశం ఏర్పాటు చేశారు. ఆ చర్చల్లో - శ్రీనివాసుడి కిరీటానికి టిటిడి తరఫున వజ్రాలు కొని ఇచ్చేందుకు హిందుస్థాన్ డైమండ్ కార్పొరేషన్ అంగీకరించింది. ఆ అంగీకారం ప్రకారం పూర్తి పారదర్శకత పాటిస్తూ వజ్రాల ఎంపిక ఎలా చేయాలీ, ఎంత సమగ్రంగా ప్రతి వజ్రానికీ నాణ్యత పరీక్ష జరగాలీ, వాటి నాణ్యతనీ, విలువనీ, థర్డ్‌పార్టీచేత ఎలా మదింపు చేయించాలీ, ఇన్స్యూరెన్స్ ఎక్కడ్నుంచి ఆరంభించి ఎక్కడిదాకా చేయించాలీ, రవాణాలో భద్రతా చర్యలు ఎలా వుండాలీ... వగైరా అన్ని అంశాల్ని క్షుణ్ణంగా చర్చించి, ఖరారు చేయడం జరిగింది....

"సర్, ఈ ఏర్పాట్లు ఎంత సమగ్రంగా పకడ్బందీగా జరిగాయంటే ఎవరన్నా ఒక్క వజ్రం సొంతం చేసుకోవాలన్నా, రేటు మార్చాలన్నా - ఎట్టి పరిస్థితుల్లోనూ సాధ్యపడదు. .. అదృష్టమో దురదృష్టమో తెలీదు కాని సర్, నిపుణుల కమిటీలో మెంబరుగా వచ్చేసరికి నాకు టిటిడి నుంచి బదిలీ అయిపోయింది. ఆరకంగా వజ్రాలను నేను కళ్లతో చూసే అవకాశమే లేదు. ఒకవేళ నాకు అలాంటి అవకాశం వచ్చినా, దేవుడి సొమ్ములో వజ్రాలు అపహరించి, వాటితో తలగడులు, పరుపులు, నింపుకోవాలన్నంత తుచ్ఛమైన ఆలోచనలు నాకు లేవు. అలాంటి ఆలోచనలు నాకెప్పుడూ రాకూడదని శ్రీనివాసుణ్ణి ప్రార్థిస్తున్నాను..."

ఇలా అంటున్నప్పుడు, అంతవరకూ నాలో అణగదొక్కబడిన ఆవేశం ఉప్పొంగుతోంది.

నా నిజాయితీ ప్రశ్నించబడింది. నా చిత్తశుద్ధి శంకించబడింది. ఏ స్వామిని నమ్ముకుని నాలుగేళ్లు టిటిడిలో సేవలు చేశానో, ఆ స్వామి పేరుతో నేను వజ్రాలు దోచుకున్నాననీ, ఆ స్వామి సొమ్ముని నేను వేదపండితులకి విరజిమ్మాననీ నేరాలు మోపారు. అవినీతిపరుల చిట్టాలో కెక్కించారు..

అప్పటికే రామారావుగారు ప్రశ్నలు వేయటం ఆపి, ఆలోచనలో పడిపోయారు. కానీ నాలో రక్తం సల సలా మరిగిపోతోంది. అసలు జరగని, నేను చేయని నేరానికి నన్ను నేరస్థుడిలా చిత్రీకరిస్తున్నారు. ఒక్కసారిగా తిరుమల ఆలయంలో శ్రీనివాసుడి ముందుమోకరిల్లి "స్వామీ నాకెందుకీ శిక్ష" అంటూ మొరపెట్టుకున్న భావనతో కళ్లు మూసుకున్నాను. ఆ దివ్య మంగళరూపం నుంచి ప్రసరిస్తున్న కాంతి కిరణాలు నాకు సోకినట్లనిపించింది... అంతే! భళ్లున నాలో ఆవేశం కట్టలు తెంచుకుంది. ఒక్కసారిగా లేచి నిలబడ్డాను... "సర్ మీకు నాగురించి ఎవరెవరో ఏం చెప్పారో నాకు తెలీదు. తెలుసుకోవాలన్న తాపత్రయం నాకు లేదు.. టిటిడిలో పనిచేసినంతకాలం, ప్రతిక్షణం నాలో ప్రతి అణువు ఆ స్వామి సేవకే అంకితమయ్యాయి. నేను ఏం చేసినా స్వామి ప్రేరణతోనే చేశాననీ, చేసిన ప్రతి పనీ ఒక సదాశయంతోనే చేశాననీ, స్వార్థరహితంగా పనిచేశాననీ నా మనస్సాక్షికి తెలుసు. ఆ స్వామికి తెలుసు. నేను ఉద్దేశ్యపూర్వకంగా ఎలాంటి తప్పు చేయలేదు... మంచి పనులు చేయాలీ అన్న ప్రేరణ (స్వామినుంచి) నాకు కలిగినప్పుడల్లా అది నా విధ్యుక్త ధర్మంగా భావించి చేశానే తప్ప గవర్నమెంటు రూల్సు, రెగ్యులేషన్స్ గురించి ఆలోచించలేదు... మీకు ఎవరెన్నెన్ని ఆరోపణలు చేసినా, మీరు నా మీద ఎన్ని వందల విచారణలు జరిపించినా, నా చిత్తశుద్ధిని, నిజాయితీని ఆ శ్రీనివాసుడు ఆమోదించినంతకాలం, ఈ గవర్నమెంటు నాలో ఒక్క వెంట్రుక్కూడా కదలించలేదు. ప్రతి పనిలో, ప్రతి ఆలోచనలో, ప్రతి కదలికలో ఆ స్వామినే చూశాను. ఏం చేసినా, ఏం చేయగలిగినా ఆయనే చేయిస్తున్నాడనీ నమ్మాను. నేను నేరస్థుణ్ణని నమ్ముతుంటే...." (నా కంఠం గాద్గదికమైపోయింది. ఆ ఉద్వేగంలో నాకు తెలీకుండా నా కళ్ల వెంబడి కన్నీళ్లు





కారిపోతున్నాయి.)... "శిక్ష అనుభవించటానికి నేను సిద్ధంగా వున్నాను. అది కూడా స్వామి ప్రసాదమే అనుకుంటాను... దాన్ని తప్పించడం ఎవ్వరివల్లా కాదు... !"

రామారావుగారు నన్ను అలా చూస్తూనే ఒక్కసారిగా నిర్ఘాంతపోయారు. క్షణాల్లో తెప్పరిల్లి, లేచి నా దగ్గరకు వచ్చి, నా రెండు చేతులు పట్టుకుని అనునయంగా మాట్లాడుతూ, "ప్రసాద్ గారూ, ఏమిటిది? స్థిమితపడండి." అన్నారు.

నా భుజాల మీద చేయివేసి, ప్రసన్నత ఉట్టిపడే వదనంతో నా మొహంలోకి చూస్తూ, "మేం అడిగినవన్నీ మీ మీద మాకున్న అభిప్రాయాలు అని చెప్పలేదే. మా దృష్టికి ఎవరో తీసుకువచ్చిన ఆరోపణలు.. పరిపాలనకి మేం కొత్త. ఎవరినో ఒకరిని నమ్మాలికదా! మీ గురించి చాలామంది చాలా గొప్పగా చెప్పారు. నేను రాజకీయాల్లోకి రాకమునుపు టిటిడిలో మీ పనితీరుని చూసి ముగ్ధులయిన వాళ్లలో నేనూ ఒకణ్ణి. అయినా, ఇప్పుడు అడ్మినిస్ట్రేషన్‌లోకి వచ్చేసరికి ఆరోపణలు వినకుండా ఉండలేం.."

ఇలా అంటూ ఆయన కందిమల్లాయ పల్లెలో వారి చిత్రం 'వీరబ్రహ్మేంద్రస్వామి' షూటింగ్ సమయంలో తగిన గెస్ట్‌హవుస్ ఏమీ లేక ఇబ్బందులు పడుతుంటే, వారి తరఫున బి. వి. మోహనరెడ్డి (ఇప్పటి మంత్రి) వచ్చి నన్ను రిక్వెస్టు చేయటం, నేను వెంటనే చొరవతీసుకుని కందిమల్లాయపల్లెలో నిర్మాణంలో వున్న టిటిడి సత్రవు నిర్మాణాన్ని ఆఘమేఘాల మీద జరిపించి (ఏడాది కాలంలో పూర్తికావలసిన దాన్ని రెండు నెలల్లో పూర్తిచేయించి) షూటింగ్ అవసరాలకి అద్దెకివ్వడం.. విషయాన్ని ఆయన గుర్తు చేసుకున్నారు.

ఇంకా నా ఉద్వేగం తగ్గలేదు. అది గమనించి రామారావుగారు మరోసారి నా చేయి తన చేతుల్లోకి తీసుకుంటూ, "ఈ ఆరోపణలన్నీ మేం నమ్ముతున్నామనుకోవద్దు. అయితే మీకు పోస్టింగ్ ఇవ్వకుండా వుంచి విచారణకు ఆర్డరు చేయటం కన్నా, ముందుగా ఒకసారి మీతో నేను మాట్లాడి మీ వాదన వినాలని, మా సెక్రటరీలు మోహన్ కందా, బెనర్జీ పదే పదే నాకు సలహా ఇచ్చారు. అందుకే మిమ్మల్ని కలిసి మాట్లాడాలనుకున్నాం. మా సందేహ నివృత్తి చేసుకోవాలనుకున్నాం...." మరోసారి నా కళ్లు చెమ్మగిల్లాయి. - ఈసారి రామారావుగారి నిష్కల్మషమైన మాటలు విన్నందుకు.

అయినా సరే నేను వూరుకోక, "సర్, మీరు నా మీద విచారణ జరిపించి, మీరు సంతృప్తి చెందాకే నాకు పోస్టింగ్ ఇవ్వండి. పోస్టింగ్‌కన్నా అపవాదులనుంచి బయటపడటమే నాకు ముఖ్యం.."

రామారావుగారు చిరునవ్వు నవ్వారు. మరోసారి భుజం తట్టి పంపించారు.

విచిత్రం!

మరో గంటలోనే నాకు పోస్టింగ్ ఆర్డర్సు వచ్చాయి. నేను ఇంగ్లండు వెళ్లకముందున్న ఆంధ్రప్రదేశ్ స్టేట్ కోపరేటివ్ బ్యాంకు మేనేజింగ్ డైరక్టర్ పోస్టులోనే మళ్లీ వేశారు. ఇంకా విచిత్రం

ఏమంటే - మరో రెండుమాసాలకే ముఖ్యమంత్రి నన్ను పిలిపించి, 'రాజధాని'లో వెలువడే మ్యాగజైన్‌లో నామీద ప్రచురితమైన ఆరోపణల వ్యాసం ఆధారంగా విచారణ జరిపించాల్సివచ్చిందనీ, అయితే ఆ విచారణలో ఆ ఆరోపణలన్నీ సత్యదూరాలని తేటతెల్లమయిందనీ చెప్పి, అభినందించారు. - అప్పుడే ఆయన నన్ను సమాచార, పౌర సంబంధాల, చలనచిత్ర అభివృద్ధి, సాంస్కృతిక శాఖల కమీషనర్‌గా - అంటే రాష్ట్రప్రభుత్వానికి ఆయాశాఖలలో ఎక్స్ అఫీషియో సెక్రటరీగా కూడా - నియమించారు.

ఆ నియామకం రోజు చీఫ్ మినిష్టర్ నాతో అన్నమాటలు : "ప్రసాద్‌గారు, మేం మిమ్మల్ని పరిపూర్ణంగా విశ్వసిస్తున్నాం. మా వ్యక్తిగత ప్రతిష్ఠకారణంగా అధికారంలోకి వచ్చాం. మా 'ఇమేజ్' బాగున్నంతకాలమే అధికారంలో కొనసాగుతాం. అందుకే మా 'ఇమేజి'ని కాపాడే బాధ్యత మీ చేతుల్లో పెడుతున్నాను..."

మూడు మాసాల క్రితం ఆరోపణల పర్వంలో అధఃపాతాళానికి క్రుంగిపోయాను. ఇప్పుడు ఎన్. టి. ఆర్ ఆత్మీయతా భావాలతో అందలం అధిరోహిస్తున్నాను! ఎంతలో ఎంతమార్పు? - మరి మూడు మాసాలక్రితం జీవితం మీద విరక్తి పుట్టేటంత దైన్యానికి ఎందుకు గురయ్యాను?

ఆ స్వామి సేవలో నావల్ల ఎక్కడన్నా ఏదన్నా లోపం జరిగి వుంటుందేమో! దానికి అది శిక్షేమో!!

★ ★ ★




తిరుమల మూర్తులు-14

## వరదరాజస్వామి

ధ్వజస్తంభం దగ్గరున్న ద్వారం దాటగానే ఎడమప్రక్కన ప్రాకారానికి దగ్గరగా ఆగ్నేయమూలలో వుండేది వరదరాజస్వామి మందిరం. కంచిలో అధిష్ఠాన దేవతగా కొలవబడే ఈ వరదరాజస్వామిని మ్లేచ్ఛుల దండయాత్రల కాలంలో కాంచీపురం నుంచి ఇక్కడికి తీసుకువచ్చి (శ్రీరంగం రంగనాథుడి విగ్రహంలాగ) వుంచారని కొందరు అంటారు. కాని ఇందుకు చారిత్రక ఆధారాల్లేవు. అయితే ఈ మందిరం మాత్రం 1354కి ముందునుంచీ ఇక్కడ వున్నదని శాసనాల్ని బట్టి తెలుస్తోంది.






# 29

## మధూ పెళ్ళి ఎవరు జరిపించారు?

పెళ్లి కొడుకు నరేంద్రని నేను మొట్టమొదటిసారిగా 1990 ఆగష్టులో పెళ్లిపీటల మీదనే చూశాను!

అదే విచిత్రం! పెళ్లి సంబంధం పెద్దలు కుదిర్చిందే. సాంప్రదాయబద్ధంగా పెళ్లిచూపులు, జాతకాలు, వగైరా ప్రక్రియల తరువాత జరిగిందే. అయినా అతన్ని నేను పెళ్లిపీటల మీదే చూడాల్సివచ్చింది.

అమెరికాలో అసోసియేట్ ప్రొఫెసర్ (ఫైనాన్స్ మేనేజిమెంట్)గా పనిచేస్తున్న నరేంద్రకి ఎట్టి పరిస్థితుల్లోనూ డాక్టర్‌నిగానీ, ఇంజనీర్‌నిగానీ చేసుకోవటం ససేమిరా ఇష్టంలేదు. అమ్మాయి పోస్టుగ్రాడ్యుయేషన్ చదివుంటే చాలనీ, సంసారపక్షంగా ఇంటిపట్టున వుండే అమ్మాయి కావాలనీ కోరుకున్నాడు. కానీ, అతను చేసుకొన్నది ఒక డాక్టర్‌ని!

దీనికితోడైన మరో విచిత్రం - మాధవిగానీ, ఆమె తల్లిదండ్రులుగానీ మరో రెండు మూడు సంవత్సరాలదాకా - అంటే మాధవి మెడిసిన్ చదువు పూర్తయ్యేదాకా - పెళ్లిగురించి ఆలోచించకూడదనుకున్నారు. ఒకవేళ ఎప్పుడన్నా అలాంటి ఆలోచనలు వచ్చినా, వరుడు ఇండియాలో డాక్టర్ అయ్యుండాలి తప్ప పొరబాటునకూడా ప్రవాస భారతీయుడు కాకూడదనుకునేవాళ్లు. కాని, మాధవి తన మెడిసిన్ పూర్తి కాకుండానే, వృత్తిరీత్యా డాక్టర్‌కాని, ఓ ప్రవాస భారతీయుడ్ని (నరేంద్రని) పెళ్లిచేసుకోవాల్సివచ్చింది!

మాధవి మా అమ్మాయి... !

★ ★ ★

**నేను** విశాఖపట్నం పోర్టుట్రస్టు ఛైర్మన్‌గా పనిచేస్తున్నకాలంలో - 1990లో - ఒక రోజు ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ జనరల్ మేనేజర్ శ్రీ అప్పారావు నా దగ్గరకు వచ్చారు. అప్పటికే అనేకసార్లు ఐఓసి టెర్మినల్ ఏర్పాటు వగైరా అంశాలమీద ఆయన కలవటం, మాట్లాడటం జరిగింది. కాని ఆరోజు ఆయన వచ్చిన పని వేరు.

"మీ అమ్మాయికి మీరు పెళ్లిచేయాలనుకుంటున్నట్లయితే ఓ మంచి సంబంధం వుంది సర్" అంటూ శ్రీ అప్పారావు మొదలు పెట్టారు. నేను నవ్వేశాను.

"మా అమ్మాయి కేమిటి? ఇప్పుడు పెళ్లేమిటి అప్పారావుగారూ! అమ్మాయి మద్రాసులో మెడిసిన్ చదవడం మొదలుపెట్టి రెండేళ్లు కాలేదు. మెడిసిన్, హవుస్ సర్జన్ షిప్ పూర్తయ్యేవరకూ పెళ్లి చేసే ఆలోచనే మాకు లేదు.... వదిలేయండి. ఇంకేంటి విశేషాలు?" అంటూ నా ధోరణిలో తేల్చేశాను.

అప్పారావుగారు పెద్దగా వత్తిడి చేయలేదు. కాని చెప్పదల్చుకున్నది మాత్రం చెప్పకుండా వదల్లేదు.

"మా ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ వెంకోబారావుగారు మద్రాసునుంచి టెలిఫోన్ చేశారు. వాళ్లదికూడా చాలా సాంప్రదాయికమైన మధ్వ కుటుంబం. ఆయన మేనల్లుడు ఫైనాన్స్‌లో పిహెచ్. డి చేసి, అమెరికాలో అసోసియేట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారుట. వాళ్లకి 'ఎవరో' మీ కుటుంబం గురించి చెప్పారట. ఒకవేళ మీకేమైనా మీ అమ్మాయికి పెళ్లిచేసే ఆలోచన వున్నట్లయితే, ఆ మేనల్లుడికి మాట్లాడదామని వెంకోబారావుగారి వుద్దేశ్యం...."

"అబ్బెబ్బె... మాకిప్పుడు అలాంటి ఆలోచనే లేదు. ఈ విషయం మీరా అబ్బాయి తండ్రికి చెప్పేయండి..." అంటూ నేను ఆయన మాటలు త్రుంచేశాను. జరగని విషయం గురించి చర్చించడం నాకిష్టంలేదు.

"నాతో మాట్లాడింది అబ్బాయి మేనమామండి. అబ్బాయి తండ్రి ఛార్టర్డ్ అక్కవుంటెంట్. ఎన్నూర్ ఫౌండ్రీస్‌కి మేనేజింగ్ డైరక్టర్‌గా పనిచేస్తున్నారట. ఆ కుర్రాడు అమెరికా నుంచి వచ్చాడు. 20 రోజులు ఇండియాలో వుంటాడు. ఈలోగా మంచి పెళ్లి సంబంధం ఖాయం చేయాలన్నది వాళ్ల తాపత్రయం.. సరే, మీరు చెప్పిందే నేను వెంకోబారావుగారికి చెబుతాను..."అంటూ శ్రీ అప్పారావు ముగించారు. మరోసారి వెంకోబారావుగారి గురించీ, వాళ్ల ఆచారవ్యవహారాలగురించి అప్పారావు వివరించి లేచారు. వెళ్లిపోతూ, వెళ్లిపోతూ కూడా శ్రీ అప్పారావు, "మీరు ఒకవేళ అమ్మాయి పెళ్లి గురించి ఆలోచన చేసేట్లయితే ఇది మంచి సంబంధం సర్" అంటూ మరోమాట వేసి మరీ వెళ్లారు. "సరే" అంటూనే నేను మళ్లీ నవ్వేశాను. ఎందుకంటే, నాకు తెలుసు - ఇది జరిగే అవకాశమే లేదు.





మా అమ్మాయి మాధవికి అప్పటికి 19 ఏళ్లు. ఎమ్. బి. బి. ఎస్ పూర్తయి, హవుస్ సర్జన్‌షిప్ పూర్తయ్యేసరికి మరో మూడు - నాలుగేళ్లుపడుతుంది. అప్పుడైనా, ఇండియాలో వుండే మరో డాక్టర్ వరుడ్నే చూసి చెయ్యాలని నేనూ, నా భార్య గోపిక దృఢంగా అనుకున్నాం. భార్య, భర్తలిద్దరూ ఒకే వృత్తిలో వుండేవాళ్లయితేనే, వాళ్లిద్దరి మధ్య పొంతన బాగా వుంటుందని మేం అనుకొంటూ వచ్చాం. అలాంటి నేపథ్యంలో ఇప్పుడు వచ్చింది అమెరికా సంబంధం. పైగా అమ్మాయి వృత్తికి సంబంధంలేని ఉద్యోగంలో అబ్బాయి.. అసలు ఇది జరిగే ప్రశ్నేలేదు!

ఆ రాత్రి ఇంటికి వెళ్లగానే నేను నా భార్య గోపికతో ఈ విషయం చెప్పాను. "సంబంధం మంచిదేనేమోకానీ మనం ఇప్పుడు చేద్దాం అనుకోవటం లేదు గదా! పైగా, మనం ఎలాంటి వరుడు కావాలనుకున్నాం? మీరెలాంటి వివరాలు చెబుతున్నారు?" నా భార్య విస్మయంతో ప్రశ్నించింది.

"నేనూ అదే చెప్పాను. ఇది జరిగేది కాదని" - అన్నాను. ఇద్దరం నవ్వుకున్నాం. ఎందుకైనా మంచిదని, ఆ రోజే మద్రాసు నుంచి - రెండు రోజులు వుండి వెళదామని - వచ్చిన మా అమ్మాయి మాధవి దగ్గర కూడా ఈ సంబంధం గురించి ప్రస్తావించాం. మాధవి అసలేమాత్రం ఆసక్తి చూపించలేదు. "ఇప్పుడే పెళ్లేంటి డాడీ?" అంటూ ఆ సంభాషణ త్రుంచేసింది.

ఆ రాత్రే మద్రాసు నుంచి గోపిక అంకుల్ టెలిఫోన్ చేశారు. మాటల్లో - గోపిక ఈ సంబంధం ప్రస్తావన ఎత్తింది. వెంకోబారావుగారి మేనల్లుడు అనగానే, ఆయన "ఇది చాలా మంచి సంబంధం" అంటూ ఓ సర్టిఫికెట్ ఇచ్చేశారు.

"మనం కావాలనుకున్న వరుడి లక్షణాలు, చేద్దామనుకున్న టైమూ కుదరకపోతే వదిలేద్దాం. ఒకవేళ చేయాలనుకుంటే మాత్రం, ఇది మంచి సాంప్రదాయంగల కుటుంబం అమ్మా" అంటూ ఆయన తన అభిప్రాయం క్లుప్తంగా చెప్పారు.

"ఇక ఈ విషయం ఇక్కడితో వదిలేద్దాం. అమ్మాయి చదువయ్యాక ఆలోచిద్దాం.." అని మేం ఇద్దరం ఒక నిర్ణయానికొచ్చేశాం.

* * *

**ఆ** మర్నాడు ఆదివారం - ఏకాదశి. అప్పటికి కొన్నేళ్లుగా నేనూ, గోపికా ప్రతి ఏకాదశినాడు నిర్జల ఉపవాసంతో గడపటానికి అలవాటుపడున్నాం. ఆ ఉదయం నేను పూజలో వుండగా మద్రాసునుంచి నాకో టెలిఫోన్ కాల్ వచ్చింది.

అంత ప్రొద్దుటే నన్ను డిస్టర్బ్ చేసినందుకు నొచ్చుకుంటూనే ఫోన్‌లో ఆయన చెప్పిన విషయం ఏమిటంటే-

ఆయన పేరు వాసుదేవరావు. ఎన్నూరు ఫౌండ్రీస్‌కి మేనేజింగ్ డైరక్టర్. ఇప్పుడు పెళ్లి సంబంధాలు వెతుకుతున్నది ఆయన కొడుక్కే. నిన్న అప్పారావుగారు చెప్పిందంతా ఈ అబ్బాయి గురించే.

"... చిన్న కమ్యూనికేషన్ గ్యాప్ వచ్చిందండీ. నిన్న మీకు అప్పారావు గారు చెప్పినప్పుడు, మా అబ్బాయి నరేంద్ర ఇండియాలో ఇరవై రోజులు వుంటాడని చెప్పారట. కాని అది కరెక్ట్ కాదు. 20 రోజులయిపోయింది. అబ్బాయి రేపే అమెరికాకి తిరిగి వెళ్లిపోవాలి. మీ అమ్మాయి ఎలాగూ మద్రాసులోనే చదువుతోంది కాబట్టి, మీకు అభ్యంతరం లేకపోతే, ఒకసారి మేం మీ అమ్మాయిని ఇవ్వాళ ఇక్కడే చూద్దామనుకుంటున్నాం... ఆహా, మీకు ఆసక్తి వుంటేనే సుమా..." అంటూ వాసుదేవరావుగారు తమ ఆసక్తి బయటపెట్టారు.

నేను ఎలాంటి సంకోచం లేకుండా ఆ ముందు రోజు రాత్రి నేనూ, గోపిక ఏం నిర్ధారించుకున్నామో అదే స్పష్టంగా చెప్పాను. మా నిర్ణయం చెబుతూనే, దానితో పాటు, "మా అమ్మాయికి ఎప్పటికైనా మరో డాక్టర్ వరుడ్నే చూడాలనుకుంటున్నాం. మీరేమో మీ అబ్బాయి ఫైనాన్స్ మేనేజిమెంట్ చేశాడంటున్నారు.." అంటూ మరో రెండు మాటలు ఎక్కువ చెప్పేశాను. ఇక్కడితో ఆయన ఈ ఫైలు మూసేస్తాడని నా నమ్మకం.

"సరే మీ ఇష్టం" అంటూనే వాసుదేవరావుగారు కూడా మరో రెండు వాక్యాలు పొడిగించారు. "మా అబ్బాయిక్కూడా డాక్టర్‌నీ, ఇంజనీర్‌నీ చేసుకోవటం సుతరామూ ఇష్టం లేదు. మొన్న తిరుపతి, వెళ్లొచ్చాక, మీ సంబంధం విషయంలో మాత్రం తన నిర్ణయం మార్చుకోటానికి మావాడు ఒప్పుకున్నాడు. అదికూడా - మిగతా విషయాలన్నీ కుదిరితేనే"!! అంటూ వాసుదేవరావుగారు ముగించారు. వాళ్లు తిరుపతి వెళ్లిరావటానికీ, వాళ్లబ్బాయి మా అమ్మాయి వృత్తి విషయంలో రాజీపడటానికి సంబంధం ఏమిటో నాకర్థంకాలేదు.

ఏమైనా, వాసుదేవరావుగారు అడిగింది సాధ్యపడే విషయం కాదని మరోసారి తేలిపోయింది. ఎందుకంటే - మాధవి ఆ సమయంలో మాతో వుంది కానీ మద్రాసులో కాదు. నిర్ణీత కార్యక్రమం ప్రకారం, ఆ మధ్యాహ్నం మాధవి ట్రెయిన్‌లో బయల్దేరితే, మర్నాడు ఉదయం ఆరుగంటలకి మద్రాసు చేరుతుంది. ఆ సమయానికి వాసుదేవరావుగారబ్బాయి మద్రాసులో ఢిల్లీ విమానం ఎక్కాలి - అమెరికా వెళ్లటానికి. ఒకవేళ వైజాగ్ నుంచి మద్రాసుకి విమానంలో వెళ్లాలనుకున్నా, కలకత్తా - మద్రాసు ఫ్లయిట్ రోజూ ఉదయం ఎనిమిదింటికి మాత్రమే వుంది. అంటే, నేను ఈ ఫోన్‌కాల్ మాట్లాడే సమయానికి ఆరోజు ఫ్లయిట్ వైజాగ్ ఎయిర్ పోర్టులో బయల్దేరిపోయివుండాలి. లేదా మరో 15-20 నిమిషాల్లో బయల్దేరాలి.





ఇదంతా వాసుదేవరావుగారికి క్లుప్తంగా చెప్పి, మరో మాట మరింత నొక్కి చెప్పాను. "ఏమైనా వాసుదేవరావుగారూ, మేం మరో మూడేళ్లదాకా మా అమ్మాయికి పెళ్లిచేయాలనుకోవటం లేదు. ఒకవేళ చేసినా, డాక్టర్ వరుడే కావాలి. అంచేత మనం ఈ విషయం ఇక్కడితో వదిలేద్దాం... ఈ సంబంధం విషయం ఎలా వున్నా మీతో పరిచయం అయినందుకు చాలా సంతోషంగా వుంది. నేను ఎప్పుడన్నా మద్రాసు వచ్చినప్పుడు కలుద్దాం. మీ ఫోన్ నంబరివ్వండి... బై బై."

ఆయన చాలా నిరాశపడ్డారని ఆయన మాటల్లో నాకర్థమైంది. ఏమైనా ఎవరు చేయగలిగిందీ ఏమీ లేదు. "సరే మీ ఇష్టం" అంటూ ఆయన కూడా ఫోన్ నెంబరిచ్చేసి ఫోన్ పెట్టేశారు.

నా సంభాషణ అంతా గమనిస్తున్న గోపిక, మాధవి, మా అబ్బాయి సంజీవ్ (15) ఈ ఫోన్‌కాల్ పూర్తికాగానే - నాతో చర్చకు దిగారు. నేను సరిగ్గా చెప్పానా లేదా, లేక ఇంకా ఎలా చెప్పివుంటే బాగుండేది - ఇలా తర్కించుకుంటున్నాం. టైం ఎనిమిదయింది. "మీకంటే ఏకాదశి. అలాగని మా బ్రేక్‌ఫాస్ట్ కూడా బంద్ చేసేశావా" అంటూ సంజీవ్ వాళ్లమ్మని లేపటంతో ఆ చర్చకి తెర పడింది. "ఇది జరిగేది కాదు కాబట్టే, ఆయన ఫోన్‌కాల్ కూడా మనం మద్రాసు వెళ్లటానికి అవకాశం లేని విధంగా వచ్చింది." అంటూ నేనూ లేచాను. నా పూజ మధ్యలో బ్రేక్ పడిందని అనుకుంటూ ఆదుర్దాగా వెళ్లబోతుండగా, మళ్లీ ఫోన్ మ్రోగింది.

★ ★ ★

"**సర్,** నేను ఫలానా కంపెనీ పనిమీద మద్రాసు నుంచి వచ్చాను. మీతో మాట్లాడదామని మొన్న నిన్న ట్రై చేశాను. మీరు బిజీగా వున్నారు. నేనిప్పుడు మద్రాసు ఫ్లయిట్‌లో తిరిగి వెళ్లిపోవటానికి ఎయిర్ పోర్టుకి వచ్చాను. కానీ నా ఫ్లయిట్ మూడు గంటలు లేటుందిట. మీరు అనుమతిస్తే, నేను మీ ఇంటికి వచ్చి ఒక్క అయిదు నిమిషాలు మీతో మాట్లాడి వెళ్లిపోతాను. విల్ యు ప్లీజ్ పర్మిట్ మి?" - ఇదీ అతని ఫోన్‌కాల్. అతను వైజాగ్ ఎయిర్‌పోర్టునుంచి మాట్లాడుతున్నాడు. అక్కడ్నుంచి హార్బరు పార్కులో మా బంగళాకి రావటానికి ఓ అరగంట పడుతుంది. ఈ లోపల నా పూజ ముగించుకోవచ్చు. "సరే రండి" అని అయిష్టంగానే అంటూ పెట్టేశాను.

ఇలా ఫోన్ పెట్టానో లేదో మా అందరిలో ఒక్కసారిగా ఆలోచనలు సుళ్లు తిరిగాయి. ఈ వ్యక్తి ఎవరో నాకు అంతకుముందు తెలీదు. సాధారణంగా వైజాగ్ పోర్టు చైర్మన్‌తో పనివున్నవారెవరయినా, నా సంగతి తెలిసున్న వాళ్లయినా - నన్ను బంగళాలో కలవటానికి ప్రయత్నించరు. దానిక్కారణం - 1987 నవంబర్‌లో నాకెదురైన ఓ చేదు అనుభవం.

★ ★ ★

**నేను** ఎక్సైజు కమీషనరుగా వున్న రోజుల్లో - ఒక సాయంత్రం ప్రముఖ లిక్కర్ వ్యాపారవేత్త మాగుంట సుబ్బరామిరెడ్డి మా ఇంటికి వచ్చారు.

సుబ్బరామిరెడ్డి అంతకు ముందు కూడా రెండు మూడుసార్లు నన్ను ఆఫీసులో కలిశారు. అయితే ఆయనక్కావలసిన పనులేవీ నా స్థాయిలోజరగాల్సినవి లేవు. చాలా వరకు క్రింది స్థాయి అధికారులే చూస్తారు.

అలాంటి సుబ్బరామిరెడ్డి ఓ సాయంత్రం బంజారాహిల్స్‌లోని మా ఇంటికి వచ్చి, మర్యాద పూర్వకంగా కలవటానికి మాత్రమే వచ్చానని చెబుతూ, నాకు పుల్లారెడ్డి స్వీట్స్ ప్యాకెట్ బహూకరించారు. కొన్ని నిమిషాలు ఏవో పిచ్చాపాటీ మాట్లాడి, ఫ్లయిట్ కి టైమైందంటూ వెళ్లిపోయారు.

ఆయన వెళ్లిపోయిన సుమారు ఓ 20-30 నిమిషాల తరువాత మా అబ్బాయి సంజీవ్ స్కూలు నుంచి వచ్చి, ఆకలిగావుందంటూ ఎదురుగావున్న స్వీట్ ప్యాకెట్ తెరవటంతో నేను షాక్ తిన్నాను. ఆ ప్యాకెట్ లో వున్నవి స్వీట్లు కావు - నోట్లు.

నా తత్త్వం తెలిసున్న మా నాన్నగారు, నా భార్య గోపిక, పిల్లలు మాధవి, సంజీవ్ కూడా బ్రాన్పడిపోయారు ఆ కరెన్సీ ప్యాకెట్ చూస్తూ. కొన్ని నిమిషాలపాటు, మా అందరికీ మెదడు మొద్దు బారిపోయినట్లయింది.

నా సంగతి ఎరిగున్న వాళ్లెవరూ ఇలాంటి ప్రయోగం నామీద చేయరు. కాని ఇప్పుడు సుబ్బరామిరెడ్డి ఇలా ఎందుకు చేశాడు? నాతో "స్వీట్స్" అని చెప్పి వుండకపోతే, నేను తీసుకోనని తెలుసుకనుక అబద్ధం చెప్పాడు? ఇది అతనికే పుట్టిన సొంత ఆలోచనా? ఇంకెవడన్నా చేయించాడా?....

"ఇంకా మీనమేషాలు లెక్క పెడుతున్నారా? ముందు వాటి సంగతి తేల్చండి" అంటూ నా భార్య హెచ్చరించటంతో స్పృహలోకి వచ్చాను... క్షణాల్లో అవినీతి నిరోధక శాఖ అధికారికి ఫోన్ చేశాను. ఆఘమేఘాల మీద ఒక బృందం వచ్చి కరెన్సీ లెక్క పెట్టి (ఒక లక్ష) స్వాధీనం చేసుకుంది. అదే సమయంలో మరో బృందం ఎయిర్‌పోర్టుకి పరుగెత్తి, విమానం ఎక్కబోతున్న సుబ్బరామిరెడ్డిని అరెస్టుచేసింది. (తరువాతెప్పుడో తెలిసింది - క్రమశిక్షణా రాహిత్యానికి పాల్పడటం వల్ల నాచేత సస్పెండు చేయబడిన ఓ ఎక్సైజు అధికారి, సుబ్బరామిరెడ్డిని పురిగొల్పి, నామీద ఈ ప్రయోగం చేయించాడు.)

అప్పట్నుంచీ ప్రైవేటు పార్టీల్ని బంగళాకి రానివ్వటం మానేశాను.

★ ★ ★





ఇప్పుడీ ఆదివారం నాడు ఇతనెందుకు అర్జంటుగా ఫోన్‌చేసి ఎయిర్ పోర్టు నుంచి వచ్చి వెళ్తానంటున్నాడు? ముందు కొంచెం అనుమానించాను. కానీ, అతను నాతో మాట్లాడాలనుకున్న విషయం చాలా సాధారణమైన పోర్టు వ్యాపార విషయం. పైగా అతను చాలా దూరాన్నుంచి వచ్చాడు. కాబట్టి అభ్యంతర పెట్టఖ్ఖర్లేదు. అయితే అంత చిన్న పనికి అతను ఎయిర్‌పోర్టు నుంచి 20 కిలోమీటర్లు వచ్చి వెళ్లటం శుద్ధదండగ. అయినా ఫోన్ చేసి, "మద్రాసు ఫ్లయిట్ మూడు గంటలు లేటుం"దంటూ మొదలు పెట్టాడు. మరిందాక వాసుదేవరావుగారితో మాట్లాడినప్పుడు ఫ్లయిట్ వెళ్లిపోయిందనుకున్నామే. ఇంతలోనే ఈ సమాచారం ఏమిటి? యాదృచ్ఛికమా? దైవేచ్ఛా?

"బహుశా ఇది కూడా గాడ్స్ విష్ అయివుంటుందేమో డాడీ" అంటూ సంజీవ్ జోక్ చేశాడు. అందరం అక్కడేవున్న - తిరుపతిలో మాకు మిత్రులు బహూకరించిన - శ్రీనివాసుడి విగ్రహం వైపు చూశాం. నేను గోపిక వంక, మాధవి వంక, వాళ్లు నావంక, అందరం మళ్లీ శ్రీనివాసుడి వంక .... కొన్ని సెకన్లపాటు అందరం అలా మార్చి మార్చి చూశాం - చూసుకున్నాం!!

"ఏమ్మా మధూ, ఏం చేద్దాం? ఫ్లయిట్ కి టైముంది. వాళ్లు నిన్ను చూడాలనుకుంటున్నారు. ఏం చేద్దాం చెప్పు?" నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ నేను చివరిసారిగా అడిగాను. మాధవి కొంచెం తటపటాయిస్తూ, "చూడటం వరకు నాకభ్యంతరంలేదు. కానీ నా చదువుకి ఇబ్బంది లేకుండా వుంటే.." మధూ వాక్యం పూర్తిచేయలేకపోయినా, తన మనసులో భావం నాకర్థమైంది.

"పోనీలెండి, అబ్బాయి తరుపువాళ్లు వాళ్లంతట వాళ్లే అంతగా అడుగుతుంటే, వెళ్లి చూసొస్తే ఏమయింది? చూసినంత మాత్రాన సెటిల్ అయిపోవాలని లేదు గదా"- ఇది గోపిక సలహా... విచిత్రంగా క్షణాల్లో మా అందరి మూడ్స్ మారిపోయాయి!!!

ఇంక నేను తాత్సారం చేయలేదు. వెంటనే ఎయిర్‌లైన్స్‌కి ఫోన్ చేసి, కలకత్తా-మద్రాసు ఫ్లయిట్ సంగతి, మద్రాసుకి టిక్కెట్స్ సంగతి వాకబు చేశాను. ఫ్లయిట్ మూడుగంటలు లేటున్న విషయం వాళ్ళు నిర్ధారించారు. కాని టిక్కెట్లు ఖాళీ లేవనేశారు. ఎగిరిన ఉత్సాహపు కెరటం విరిగి క్రింద పడినట్లయింది.

"ఏరా సంజీవ్! ఇందాక గాడ్స్ విష్ అన్నావ్. ఇప్పుడు టిక్కెట్లేవీ?" అంటూ మా వాడికి చిన్న జెలక్ ఇచ్చాను. వాడు బుంగమూతి పెట్టేసి, "మీరే అంటారు గదా, జరిగేలా వుంటే, అన్నీ ఆయనే (శ్రీనివాసుడే) చూసుకుంటాడనీ. టిక్కెట్లు నన్నడుగుతారేంటీ!" అంటూ జారిపోయాడు.

సరిగ్గా అప్పుడే తిరుపతిరాజు వచ్చాడు. ఆయన మా పోర్టులో మేనేజర్ (ఆపరేషన్స్). విశాఖపట్నంలో పోర్టు తిరుపతిరాజు అంటే తెలియని పెద్దమనిషి వుండడు. అతని పబ్లిక్ రిలేషన్స్ అసాధారణమైనవి... అతను ఈ విషయం వింటూనే, "సర్, నన్నొక్కసారి ట్రై చేయనివ్వండి" అంటూ ఫోన్‌ల మీద ఫోన్‌లు చేసేశాడు. పది నిమిషాల తర్వాత ఒక టికెట్టు ఖాయం చేశాడు. కాని మాధవి ఒక్కత్తే ఎలా వెళ్తుంది? నేనూ గోపిక కూడా వెళ్లాలి కదా!"

తిరుపతిరాజు మళ్లీ ఎయిర్ లైన్స్ వాళ్లతో మాట్లాడాడు. వాళ్లతో కలకత్తాకి మాట్లాడించాడు అక్కడ్నుంచేమైనా దొరుకుతాయేమోనని. ఫలించలేదు. "సర్, నేను ఎయిర్‌పోర్టుకెళ్లి ట్రై చేస్తాను. ఈ లోపల మీరు రెడీ అయిపోండి" అంటూ తిరుపతి రాజు ఒక్కవూపులో ఎయిర్ పోర్టుకి పరుగు తీశాడు.

నిజానికి ఆరోజు మద్రాసుకి ముగ్గురం విమానంలో వెళ్లటానికి టిక్కెట్లు కొనేంత క్యాష్ నాదగ్గర లేదు. ఆదివారం కాబట్టి బ్యాంకు లేదు. వున్నా 10 గంటల దాకా బ్యాంకులు తెరవరు. ఇవన్నీ ముందే చెప్పేశాను తిరుపతిరాజుకి. అతను కూడా బయల్దేరే ముందే ఎవరో ట్రావెల్ ఏజంట్‌కి ఫోన్‌చేసి, టిక్కెట్లు దొరికే పక్షంలో, అతని ఎక్కవుంట్లో మాకు క్రెడిట్ ఇచ్చే ఏర్పాటు చేసి, వెళ్లి పోయాడు... మరో గంటకి ఎయిర్‌పోర్టునుంచి తిరుపతిరాజు ఫోన్ చేశాడు. "సర్, అతికష్టం మీద మరొక్క టిక్కెట్ దొరికింది." - అంటే ఎవరో ఇద్దరమే మద్రాసు వెళ్లగలం. గోపిక నన్ను వెళ్లమంది మాధవితో. నేను బాగా ఆలోచించి, "పిల్లతో తల్లివుండటం అన్ని విధాలా మంచిది. నువ్వేవెళ్లు" అన్నాను. ఆమె అయిష్టంగానే అంగీకరించింది...

వెంటనే నేను మద్రాసు పోర్టు ఛైర్మన్ శ్రీబాలరాజ్ (నాకు ఐఏఎస్ బ్యాచ్‌మేట్)కి ఫోన్‌చేయటం, గోపిక, మాధవిల ట్రాన్స్‌పోర్టు, పోర్టు గెస్ట్‌హవుస్‌లో బస వగైరా ఏర్పాటు చేయటం చకచకా జరిగిపోయాయి. ఇవన్నీ అయ్యాక, మద్రాసులో వాసుదేవరావుగారికి ఫోన్ చేసి, ఈ పరిణామాలు చెప్పేసరికి, ఆయన ఆనందాశ్చర్యాలలో మునిగిపోయారు. "ఇదేదో దైవఘటనలా వుంది ప్రసాద్‌గారూ, గాడ్ ఈజ్ గ్రేట్" అంటూ ఉత్సాహపడిపోయారు.. మరో గంటకి గోపిక, మాధవి మద్రాసు ఫ్లయిట్ ఎక్కేశారు.

* * *

"ఏమండీ, అమ్మాయి - అబ్బాయి ఒకర్నొకరు ఇష్టపడుతున్నారు. ఇప్పుడేం చేద్దాం?" - ఇదీ ఆ సాయంత్రం ఏడుగంటలకి నాకు గోపిక ఆదుర్దాగా చేసిన ఫోన్‌కాల్.

నాకు నమ్మశక్యంకాలేదు. పన్నెండు గంటలక్రితం అసలు మొదలేలేదు. ఇంతలో ఇంత మార్పా?

గోపిక ఇంకా చెప్పింది - వాళ్లిద్దరూ ఓ గంట మాట్లాడుకున్నాక, ఇద్దరికీ ఇష్టమే అంటున్నారు. ఐతే, గోపిక, మాధవి ఒకసారి అబ్బాయి తాతగారి దగ్గరకెళ్లి కనబడిరావాలని వాసుదేవరావుగారి కోరికట. అదొక్కటీ అయిపోతే, ఈ సంబంధం ఖాయమైపోయినట్లేనట. "ఏం చేయమంటారు?" గోపిక ప్రశ్న.

"పోనీ వెళ్లొచ్చేయండి" నా జవాబు.





"అదేంటి మీరు లేకుండానా? పైగా అసలు మీరు నరేంద్రని చూడనే లేదు. మీరు చూడకుండా మాట్లాడకుండా నేను 'ఎస్' అనేయటమేంటి? తండ్రిగా అది మీ బాధ్యత కాదా?..." గోపిక మాటల్లో నాకు మద్రాసులో పరిణామాల స్పీడు అర్థమైంది. కాని ఎలా? నరేంద్ర మర్నాడు పొద్దునే ఢిల్లీ మీదుగా అమెరికా ప్రయాణమవుతున్నాడు.

ఒకే ఒక మార్గం - నేను రేపటి సాయంత్రం లోపల ఢిల్లీ వెళ్లగలిగితే - నరేంద్రని కలుసుకోవచ్చు - మాట్లాడవచ్చు. కాని వైజాగ్‌నుండి ఢిల్లీకి రేపు సాయంత్రం లోపల చేరటం అంటే? - రైళ్లు, విమానాలు వగైరా అన్ని మార్గాలు ఓ అరగంటలో శోధించేసి తేల్చిందేమంటే - నేను నరేంద్రని కలుసుకోవటం సాధ్యపడదు. కాని, నేను అబ్బాయిని చూడకుండా, మాట్లాడకుండా, సంబంధం ఖాయమైపోవటమేంటి? - ఇది గోపిక ప్రశ్న. ఇదీ నిజమే మరి ఎలా?

అసలు ఎందుకింత మీమాంస జరుగుతోంది. అబ్బాయికి అమ్మాయి నచ్చింది. అతన్ని చేసుకోవటానికి అమ్మాయి ఇష్టపడుతోంది. వాళ్ల సాంప్రదాయం, కుటుంబం స్థాయి, స్థితిగతులు, అబ్బాయి చదువు, సంపాదనా... అన్నీ మనకు నచ్చాయి. అమ్మాయిని చూసిందగ్గర్నుంచీ వాళ్లకి మన సంబంధం పట్ల ఆసక్తి పెరిగింది. అయినప్పుడు, నేను అబ్బాయిని చూడటం చూడకపోవటం వల్ల కొత్తగా ఒరిగేదేమిటి? పైగా గోపిక కూడా 'ఓకే' అంటోంది కదా.... చివరికి నేను నరేంద్రతో టెలిఫోన్‌లో మాత్రమే మాట్లాడగలిగాను.

ఆ రాత్రి 8.30 గంటల ప్రాంతంలో వాసుదేవరావుగారితో చెప్పేశాను. "మిగతా అన్ని విషయాలు అందరికీ నచ్చాయి కనుక, నేను నరేంద్రని కలుసుకోవటం కోసం మన ప్రయత్నాలు ఆపనక్కర్లేదు... అయితే, వాసుదేవరావుగారూ! నాకు జాతకాల మీద నమ్మకం వుంది. ఒకసారి ఇద్దరి జాతకాలు చూపిస్తాను. జాతకాలు నప్పితే - ఈ పెళ్లి ఖాయం. ఏమంటారు?" వాసుదేవరావుగారు కొంచెం ఇబ్బంది పడ్డారు. ఇంతదూరం వచ్చాక జాతకాల పేరు మీద ఈ సంబంధం చేజారిపోతుందేమోనన్న అనుమానం ఆయన మాటల్లో తొంగిచూసింది. కాని నా అనుభవం నాది.......

* * *

గుంటూరు జిల్లా సిరిపురం గ్రామంలో మా నాన్నగారు పత్రి కృష్ణారావుగారు ఒక స్కూలు టీచరు. ఆ స్కూలు హెడ్మాష్టరు శ్రీబలిజేపల్లి కామశాస్త్రిగారు. ఆ వూళ్లో ఆర్.ఎం.పి. లోకల్ ఫండ్ డాక్టరుగారు చందారం సుబ్బారావుగారు. వాళ్ళు ముగ్గురూ మంచి స్నేహితులు. కామశాస్త్రిగారి అబ్బాయి శివశంకరశాస్త్రి, సుబ్బారావుగారి అబ్బాయి మాధవరావు, నేనూ ఒకే క్లాసులో చదివేవాళ్లం. మంచి మిత్రులం. హెడ్‌మాష్టరు కామశాస్త్రిగారు మంచి జ్యోతిష్కులు. ఒకనాడు మానాన్నగారు యింటికి చాలా ఉత్సాహంగా, హడావుడిగా వచ్చి, నా జాతకం చూసి, నేనేమౌతానని కామశాస్త్రిగారు చెప్పారో ఆ జోస్యం అందరికీ చెప్పారు. శంకరం గురించి, మాధవ గురించి కూడా జోస్యం చెప్పారట.

కామశాస్త్రిగారి అధ్యయనం చేసి తేల్చి చెప్పిందేమిటి? శివశంకర శాస్త్రి ఐపిఎస్ చేస్తాడనీ, నేను ఐఏఎస్‌లో చేరతాననీ, మాధవరావు మంచి రాయసగాడు (జర్నలిస్టు) అవుతాడనీ... మేమందరం నేను అప్పుడే ఐఎఎస్ అయినట్లే సంబరపడ్డాం. క్రమంగా మర్చిపోయాం.

నేను పోస్టుగ్రాడ్యుయేషన్ చేసి, లా చదివి, రాయ్‌పూర్ యూనివర్శిటీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నప్పుడు మా నాన్నగారు నా చిన్నప్పటి జాతకం కథ గుర్తుచేస్తూ, నన్ను సివిల్ సర్వీసెస్‌కి రాయమన్నారు. రాశాను. ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసెస్‌లో చేరాను.

కామశాస్త్రిగారి జోస్యం నావరకే నిజం కాలేదు. ఆయన కొడుకు శివ శంకర శాస్త్రి ఇండియన్ పోలీస్ సర్వీసెస్‌కి సెలెక్ట్ అయ్యాడు. (తరువాత కేరళలో పనిచేసి, డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌గా రిటైరయ్యాడు). మాధవరావు చేయితిరిగిన జర్నలిష్టుగా ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ది హిందూ పత్రికలలో చాలాకాలం విజయవాడలో పనిచేసి, ఉత్తమ జర్నలిస్టు అవార్డు కూడా సాధించాడు. ఆ అనుభవంతో అమెరికన్ కన్సులేట్ (మద్రాసు)లో దక్షిణ భారతానికి పొలిటికల్ అఫైర్స్ పరిశీలకుడిగా కూడా పనిచేశాడు.

నా చిన్నతనం నుంచీ జరిగిన పరిణామాలన్నీ సింహావలోకనం చేసుకున్నప్పుడు, జ్యోతిశ్శాస్త్రం కూడా ఒక ఆధారపడదగిన సైన్సే అనిపించేది. అదే నమ్మకం నా మనసులో స్థిరపడిపోయింది. అనేక అనుభవాల తర్వాత నాకర్థమైందల్లా జ్యోతిష్కుడి సామర్థ్యం తక్కువైతే జోస్యం తప్పు కావచ్చేమోకాని, జ్యోతిశ్శాస్త్రం మాత్రం తప్పుకాదు...

అందుకే వాసుదేవరావుగారితో "జాతకాలు చూపిద్దాం" అని పట్టుబట్టాను. ఆయన "నో" అనలేదు.

★ ★ ★

గోపిక మద్రాసు నుంచి తిరిగి వస్తూ నరేంద్ర జాతకం తీసుకువచ్చింది. జాతకాలు చూపించాం. ఎక్సలెంట్! జాతకాలు కుదిరాయన్నారు. పెళ్లి ఖాయం అని తేలిపోయింది. ఠక్కున గోపికకి ఏదో గుర్తుకొచ్చింది. "ఏమండీ, మీకు జ్ఞాపకం వుందా? చాలాకాలం క్రితం మనం దైవజ్ఞశర్మగారిని హైద్రాబాద్‌లో కలిసినప్పుడు, ఆయన మాధవి మెడిసిన్ చదువుతుందనీ, కాని చదువు పూర్తి కాకుండానే పెళ్లిజరుగుతుందనీ చెప్పారు.. అలాగే జరుగుతోంది కదా ఇప్పుడు?" అవును నాకు జ్ఞాపకమొచ్చింది. ఆరేళ్ల క్రితం బాసర సరస్వతీ ఉపాసకుడు శ్రీ దైవజ్ఞశర్మ మాధవిని చూస్తూనే సంఖ్యాశాస్త్రం ఆధారంగా చెప్పిన జోస్యం అది...

మరో నలభై రోజుల తరువాత - ఆగష్టు 23న వివాహం ఖాయమైంది. పెళ్లి మద్రాసులో జరగాలని వాసుదేవరావుగారి కోరిక. వైజాగ్‌లో చేద్దామని నా ఆలోచన. పరిస్థితులు అలా అలా తోసుకువచ్చి, చివరికి ఆ పెళ్లి తిరుపతిలో జరపాలని నిర్ణయమైంది.





అసలు సమస్య నాకు అప్పుడు ఎదురైంది. సర్కారు వారిచ్చిన అప్పుతో కట్టుకున్న (హైద్రాబాద్‌లో) ఓ ఇల్లు, అలాగే కొన్న కారు, నా భార్యకి మామగారిచ్చిన పొలం మినహా నా చేతిలో కూతురు పెళ్లి చేయటానికి కావలసిన డబ్బు - ఆరోజు లేదు. బ్యాంకు బ్యాలెన్స్ ఓ ఎనిమిదివేలు, జనరల్ ప్రావిడెంట్ ఫండ్ నుంచి తేగలిగింది ఓ పాతికవేలు. ఇంకా రెండు - రెండున్నర లక్షలుంటే గానీ తిరుపతిలో పెళ్లి చేయలేను... అప్పు చేయాలి? ఎక్కడ? ఎలా?

ఆరోజు ఉదయం ఇలా ఆలోచిస్తూ ఢిల్లీ వెళ్లే పనిమీద విమానంలో హైద్రాబాద్ వెళ్లాను. దారంతా ఇదే ఆలోచన. చివరికి "ఎందుకింత ఆందోళన చెందుతున్నాను. ఏ స్వామి ఇంత వరకు తీసుకువచ్చాడో - ఆ స్వామే దీనిక్కూడా పరిష్కారం చూపిస్తాడు. ఆయనకే వదిలేస్తే పోలేదా?" అనుకున్నాను. వదిలేశాను. అలా అనుకుని హైద్రాబాద్ ఎయిర్‌పోర్టులో దిగగానే, పోర్టు హైద్రాబాద్ మేనేజర్ సుబ్బారావు నన్ను కలిసి, "సనత్‌నగర్ ఇండస్ట్రియల్ కోపరేటివ్ సొసైటీలోమీ స్థలాన్ని కొంటానని గులామ్ దస్తగిరి అడుగుతున్నాడు, సర్" అని చెప్పాడు.. !

★ ★ ★

నేను ఖమ్మం కలెక్టరుగా వున్నప్పుడు పరిశ్రమలశాఖ డిప్యూటీ డైరక్టర్‌గా వుండే రాజారెడ్డి, నేను టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండే రోజుల్లో (1980-81లో) ఇండస్ట్రియల్ కోపరేటివ్ సొసైటీ డైరక్టర్లతో కలిసి నా దగ్గరకు వచ్చాడు. అప్పటికతను జాయింట్ డైరెక్టర్‌గా హైద్రాబాద్‌లో చేస్తూనే, సనత్‌నగర్‌లో ఒక పెద్ద ప్రైవేట్ ఇండస్ట్రియల్ ఎస్టేట్‌ని అభివృద్ధి చేయటానికి డెప్యుటేషన్ మీద పనిచేస్తున్నాడు. ఆ సొసైటీ డైరక్టర్లు అందరూ శ్రీనివాసుడి భక్తులే. అందుకే శ్రీవేంకటేశ్వరా సొసైటీ అని పేరు పెట్టుకున్నారు. మొదటి షేర్ 100 రూపాయలు వేంకటేశ్వరుడు తీసుకోవాలన్నది వాళ్ల కోరిక. కాని ఆ పనిచేయటం సాధ్యపడదని చెప్పేసరికి, కనీసం "స్వామివారి ప్రథమ సేవకుడిగా మీరన్నా ఒక షేర్ తీసుకోండి" అంటూ అభ్యర్థించారు. "సరే" అంటూ మొదటి షేర్ కొన్నాను.

రెండేళ్ల తరువాత సొసైటీ వాళ్లు నాకు లెటర్ రాశారు - ఇండస్ట్రియల్ ఎస్టేట్ రెడీ అయిందనీ, షేర్ హోల్డర్‌గా నేను కూడా ఒక ప్లాటు తీసుకోవచ్చనీ, దానికి ఓ లక్షరూపాయలు కట్టాలనీ. నాకు పరిశ్రమ పెట్టే అవకాశమూలేదు, స్తోమతూ, ఆసక్తీ లేవన్నాను. మళ్లీ కొన్నాళ్లకి సొసైటీ వాళ్లు ఆ ఎస్టేట్‌లో మిగిలిపోయిన వంకర ప్లాట్లని లాటరీద్వారా సభ్యులకు పంచాలని నిర్ణయించారు. అలా ఓ 200 చదరపు గజాల పొడవాటి ముక్కని 9000 రూపాయలకి నాకు ఆఫర్ చేశారు. అది కూడా నేను మూడు వాయిదాల్లో కట్టవచ్చన్నారు. ఇంకా పైన రిజిస్ట్రేషన్‌కి ఓ వెయ్యిరూపాయలవుతుంది. చివరి వాయిదా మూడు వేలు కట్టడానికి నోటీసు వచ్చినప్పుడు, నేను సనత్‌నగర్ వెళ్లి చూద్దునుగదా - అదో విచిత్రమైన ప్లాటు.

ఒక ఇండస్ట్రియల్ ప్లాటుకి, మరో సన్నటి రోడ్డుకి మధ్య వంకర టింకరగా వున్న పొడవాటి స్థలం. ఒకే చోట దాని వెడల్పు చాలాఎక్కువగా వుంది - అదీ తొమ్మిది అడుగులు. అనవసరంగా డబ్బులు పెట్టాననిపించింది. మొత్తం 10 వేలు వృథా అయినట్లే అనుకుని, బాధపడి, మూడో వాయిదా కట్టడం మానేశాను... కాని సొసైటీ వాళ్లు వదల్లేదు. సెక్రటరీ వచ్చి, ఆ ఒక్క వాయిదా కట్టేస్తే, రిజిస్ట్రేషన్ చేసేస్తామన్నారు. "ఇప్పటిదాకా పెట్టిందే దండగనుకుంటుంటే, మళ్లీ నాలుగువేలు ఖర్చా! నాకొద్దు" అన్నాను. ఆయన వదల్లేదు. అయిష్టంగా ఆ నాలుగు వేలు కట్టేశాను. రిజిస్ట్రేషన్ అయిపోయింది. ఇది జరిగింది ఎప్పుడో 1985-86లో.

★ ★ ★

ఇప్పుడా ప్లాట్ కొనుక్కుంటానని దస్తగిరి అడుగుతున్నాడని సుబ్బారావు చెబుతున్నాడు.

"ఎంతిస్తానంటున్నారు?"

"యాభైవేలు సర్"

"నాకిప్పుడు రెండు లక్షలకు పైగా కావాలి సుబ్బారావు. నువ్వోసారి సొసైటీకి వెళ్లి రేటు ఎలావుందో కనుక్కుని చెప్పు - అప్పుడే మాట్లాడదాం"అని ఢిల్లీ వెళ్లిపోయాను.

నేను ఢిల్లీనుంచి తిరిగి వచ్చేసరికి సుబ్బారావు కీలకమైన సమాచారం పట్టుకొచ్చాడు.. ఆ ఎస్టేట్‌లో దస్తగిరికి రెండు ప్లాట్‌లున్నాయి. ఒకటి నా వంకర ప్లాట్‌కి ఆనుకుని వున్నది. మరొటి ప్రక్క రోడ్డుకి అవతలవైపు ఆనుకొని వున్నది. నేను నాప్లాట్ ఇచ్చేస్తే, అతను ఆ ఇంటర్నల్ రోడ్డుని (అది ఇంకెవరికీ వుపయోగపడేదికాదు) కూడా కలుపుకుంటాడు. తన రెండు ప్లాట్‌లూ కలిపేసి, ఒకటే పెద్ద ప్లాట్ చేసుకుంటాడు.

నేను ఢిల్లీనుంచి వచ్చి వైజాగ్ ఫ్లయిట్ ఎక్కబోయేముందు, సుబ్బారావు నాకు ఇదంతా వివరిస్తుండగా దస్తగిరి కూడా వచ్చాడు. బేరం మొదలైంది. అప్పటికే దాని విలువ అర్థమైంది కనుక నేను మూడు లక్షలిమ్మని అడిగాను. అతను 75వేల నుంచి మొదలు పెట్టి రెండు లక్షలదాకా వచ్చాడు.

"దస్తగిరిగారూ! స్థలాల విలువ ఎంత పెరిగిందో మీకు తెలుసు. రెండు లక్షలు న్యాయం కాదు. రెండున్నర లక్షలిచ్చేయండి..." (ఏదో అతని అవసరం తెలిసిపోయింది కాబట్టి అలా అంటున్నాను గానీ, నాకుగా నేను అమ్మాల్సివస్తే, ఆ వంకరటింకర పీలిక స్థలాన్ని కొనటానికి వివేకమున్నవాడెవడూ ముందుకురాడు.)

"సర్, సర్ - నేనూ రెలిజియస్ పర్సన్నే. మీకు అన్యాయం జరిగిందన్న భావం మీకూ వుండకూడదు నాకూ వుండకూడదు. అందుకే చివరగా రెండుంపాతిక ఇస్తాను కాదనకండి. ప్లీజ్..."





అంటూ దస్తగిరి రిక్వెస్టు చేశాడు. మనసులో ఆనందపడిపోయాను. నాకు మాధవి పెళ్లి కోసం అప్పు చేయనక్కర్లేకుండా డబ్బు దొరికిపోయింది గదా! (ఎవడు దొరికేలా చేశాడు?)

అప్పటికప్పుడు ఓ యాభైవేలు అడ్వాన్సు కూడా ఇచ్చాడు. నా రిక్వెస్టు కాదనలేక, పెళ్లికి ముందే మూడు నాలుగు వాయిదాల్లో మొత్తం రెండు లక్షల పాతికవేలు దస్తగిరి ఇచ్చేశాడు. నిజానికి ఈ సొసైటీలో ప్లాట్ ఇంకొకరికి అమ్మాలన్నా, అది రిజిస్ట్రేషన్ కావాలన్నా అంత సులభం కాదు. చాలా తతంగం వుంది. అయినా దస్తగిరి రిజిస్ట్రేషన్ కోసం ఎదురు చూడకుండా నాకు డబ్బిచ్చేశాడు. ఆ రిజిస్ట్రేషన్ జరగటానికి - మాధవి పెళ్లి అయిపోయాక ఆరేళ్లు పట్టింది. దస్తగిరి చనిపోతే, ఆయన కొడుకు సామి పేరుమీద రిజిస్ట్రేషన్ జరిగింది!!

★ ★ ★

1990 ఆగస్టు 23న తిరుపతిలో మాధవి పెళ్లి సాంప్రదాయబద్ధంగా జరిగింది. ఆ పెళ్లిలోనే నేను మాఅల్లుడు నరేంద్రని మొదటిసారి చూశాను.

ఇంకా విచిత్రం ఏమంటే - నేను నాకున్న డబ్బు పరిమితం కనుక పెళ్లి నిరాడంబరంగా చేయాలనుకున్నాను. కాని - నేను పిలిచిన వాళ్లందరూ వచ్చారు. పిలవకపోయినా నన్ను ఎరిగినవాళ్లు చాలామంది నా మీద అభిమానంతో వచ్చారు. తిరుమల తిరుపతి దేవస్థానాల వేదపండితులు, అర్చకులు, మిరాసీదార్ల నుంచి నాదస్వర విద్వాంసుల దాకా అంతా స్వచ్ఛందంగా ఈ పెళ్లి తమ స్వంత కార్యంలాగా జరిపించారు. శుభలేఖ మీద స్వచ్ఛందంగా శ్రీనివాసకళ్యాణం డిజైన్ చేయించి తెచ్చిన డాక్టర్ భాస్కరరావు మొదలుకొని ఎంతోమంది హస్తం ఆపెళ్లిలో వుంది.

పేష్కార్ కృష్ణస్వామి, శేషాద్రి, సంతానం, డాక్టర్ సూర్యారావు, గార్డెన్ సూపరింటెండెంట్ తమ్మన్న, ఇంజనీర్ జగ్గారావు, జనార్దననాయుడు, క్యాటరింగ్ శాస్త్రి, రాఘవన్, టిటిడి యూనియన్ లీడరు చెంగారెడ్డి, డాక్టర్ ఎ.కె.వి.ఎస్.రెడ్డి, ఎస్. తిల్లేశ్వరరావు, జి.వల్లీశ్వర్, తిరుపతిరావు, బి. రామచంద్రయ్య, డాక్టర్ సుబ్బారాయుడు, నా పాత పి.ఎలు నారాయణ, విశ్వమూర్తి, డఫేదార్ సుబ్రమణ్యం, డ్రైవర్ గోపాల్ ఎందరో టిటిడి ఎంప్లాయీస్, తదితర శ్రేయోభిలాషులు మా కుమార్తె వివాహాన్ని వాళ్ల భుజస్కంధాల మీద వేసుకుని జరిపించారు. ముఖ్యంగా అప్పటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ ఎమ్.వి.ఎస్. ప్రసాద్ అందించిన సహకారం మర్చిపోలేనిది. ఇంకా విశేషం ఏమంటే, ప్రముఖ గాయనీమణి శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మి వచ్చి, మాంగల్యధారణ సమయంలో స్వచ్ఛందంగా రెండు కీర్తనలు శ్రావ్యంగా ఆలపించి, ఆ సన్నివేశానికి గొప్ప శోభ తీసుకువచ్చారు. నిజానికి, ఒక ఆడపిల్ల పెళ్లిచేసిన భారమే నాకు అనిపించలేదు.

★ ★ ★



శ్రీమతి ఎమ్.ఎస్.సుబ్బలక్ష్మి మంగళహారతి పాడుతుండగా ... గోపికా ప్రసాద్, సంజీవ్, శేషాద్రి, పి.వి.ఆర్.కె.ప్రసాద్

పెళ్లి జరిగిపోయింది. తిరుమల కొండకి నవదంపతుల్ని తీసుకువెళ్లి దర్శనం చేయించాం. అందరం కళ్యాణోత్సవంలో కూర్చున్నాం.

స్వామికి నమస్కరిస్తూ, జరిగిన శుభకార్యానికి మాటల్లో చెప్పలేనన్ని కృతజ్ఞతా భావాలు వ్యక్తం చేస్తున్నాను.

"ఒక రెండునెలలక్రితం పెళ్లి ఆలోచనేలేదు. ఇప్పుడు పెళ్లిచేసుకుని ఇక్కడకు వచ్చాం. ఏమిటీ మాయ? ఎలా జరిగిందిదంతా?"... ఒక్కసారిగా ఆ రెండుమాసాల కథ నా కళ్ల ముందు సినిమా రీలులా తిరిగిపోయింది. వుండబట్టలేక నా మనసులో భావాల్ని మా వియ్యంకుడు వాసుదేవరావుగారి ముందు అనేశాను.

"నేను చెప్పాను గదా! ఇక్కడే! మా నరేంద్రకి సంబంధాలు వెతుకుతూ కొండకొచ్చి ఇలాగే కళ్యాణోత్సవం చేయించుకున్నాం. ఇక మావాడి పెళ్లి భారం నీదే స్వామీ - అనుకున్నాం. అప్పుడే ఇక్కడ పరిచయమైన అర్చకులు మీ గురించి చెప్పి, మీకో అమ్మాయివుందనీ, మద్రాసులో చదువుతోందనీ, పెళ్లీడు వచ్చుంటుందనీ, ప్రయత్నించమనీ చెబితే... మా అబ్బాయి కూడా మనసు మార్చుకుని..." ఆయన చెబుతూనే వున్నారు.

అంతే! స్వామివారి కళ్యాణోత్సవం పందిట్లోనే నాకర్థమైపోయింది - మా సంబంధం గురించి వాళ్లకి 'ఎవరు' చెప్పారో, మాధవి కళ్యాణం 'ఎలా' జరిగిందో, 'ఎవరు' జరిపించారో.... ఆయనింకా వివరించాలా!

హరే శ్రీనివాస!

* * *





# సంజీవ్ పెళ్ళిలో

'స్వాతి'లో మా 'మధుపెళ్ళి' అనుభవం చదివాక కొంతమంది మిత్రులు నన్ను అడుగుతూ వచ్చారు - "మీ అమ్మాయి పెళ్ళి చాలా విచిత్రంగా జరిగిందని రాశారు గదా, మరి మీ అబ్బాయి సంజీవ్ పెళ్ళిలో అలాంటి విశేషం ఏమీ జరగలేదా?" అని.

జరిగినదాంట్లో విశేషం ఉందో లేదో కాని సంజీవ్ పెళ్ళి విషయంలో జరిగింది మాత్రం ఇది:

2002 సెప్టెంబరులో అనుకున్నాం - సంజీవ్ పెళ్ళి ప్రయత్నాలు చేయాలని. అలా నిర్ణయించాక, అప్పటికే ఆసక్తి చూపుతున్న రెండు సంబంధాల జాతకాలు తెప్పించాం. అలాగే చాలాకాలంగా మాకు బాగా తెలిసున్న హరిరావుగారి కుమార్తె శ్రీలేఖ జాతకం పంపించమని ఆయన్నే అడిగాం. అలా వచ్చిన మూడు జాతకాల్నీ హైద్రాబాద్‌లో ఉత్తరాది మఠానికి చెందిన జ్యోతిష్కులు, నిష్ఠాగరిష్ఠులు అయిన వేదవ్యాసాచారిగారికి చూపించాం. కానీ ఆయన వాటిని విశ్లేషించకుండానే, "తిరుమలేశుడితో మీకున్న అనుబంధం దృష్ట్యా, మీరు తిరుమలకి వెళ్ళి స్వామివారికి కళ్యాణోత్సవం చేయించి, అప్పుడు ఆరంభించండి జాతకాలు చూడటం" అంటూ సలహా ఇచ్చారు. ఆ సలహా పాటించాం... శ్రీనివాసుడి కళ్యాణోత్సవం పూర్తయింది. "అబ్బాయి పెళ్ళిపనిమీద బయల్దేరుతున్నాం. ఇక నీదే భారం స్వామీ!" అనుకుని బయటకు వస్తూనే కొండమీదున్న ఉత్తరాదిమఠానికి భోజనానికి వెళ్ళాం. అక్కడ కర్నూలు నుంచి వచ్చిన పగడాల రామ్మూర్తి ఆచారిగారు తారసపడ్డారు. (ఈయన వేదవ్యాసాచారికి అన్నగారు. జ్యోతిశ్శాస్త్రంలో ఉద్దండపండితులు.) ఆయన్ని చూస్తూనే గోపికకి తన హ్యాండ్‌బ్యాగ్‌లో వున్న మూడు జాతకాలు తీసి ఆయనకి చూపించాలనిపించింది. "సరే కానీయ్" అన్నాను.

విచిత్రం! ఆ మూడింటిలో తాను చూసిన మొదటి జాతకాన్నే ఆయన ఆమోదించారు. ఆ జాతకం చూస్తూనే, "మీకు తెలిసున్న వాళ్ళమ్మాయే ఈ పిల్ల. స్తోమతులగురించి ఆలోచించకుండా చేసుకోదలిస్తే, ఇది చాలా మంచి సంబంధం" అనేశారు. మిగతా రెండు జాతకాలకి ఆయన ప్రాధాన్యత ఇవ్వలేదు.

చివరికి మేం ఆ ఒక్క సంబంధమే చూడటం, శ్రీలేఖ - సంజీవ్‌లు (వాళ్ళకి ఊహ తెలిశాక) అప్పుడే మొదటిసారిగా మాట్లాడుకోవటం, ఈ సంబంధం అటూ ఇటూ అందరికీ నచ్చటం జరిగింది. పెళ్ళి 2002 నవంబరులో జరిగిపోయింది.

మాకు ఆనందం కలిగించిన విషయం ఏమిటంటే, హరిరావు - సుశీల దంపతులు ఆదిలాబాదు నుంచి వచ్చి తిరుపతిలో పెళ్ళి చేయటం. మా ఊహకందని విధంగా మమ్మల్ని

ఆనందాతిశయంలో ముంచెత్తిన మరో విషయం ఏమిటంటే - ఈ పెళ్ళిలో ఉత్తరాదిమఠ స్వామీజీ శ్రీ సత్యాత్మ తీర్థ స్వామీజీ, మంత్రాలయం శ్రీ రాఘవేంద్ర స్వామి మఠం స్వామీజీ శ్రీ సుషమేంద్ర తీర్థ స్వామీజీ, పెజావర్ మఠం స్వామీజీ శ్రీ విశ్వేశతీర్థ స్వామీజీలు తమ రాకతో కళ్యాణ మంటపాన్ని పావనం చేసి, వధూవరులను ఆశీర్వదించటం.

అనేకమంది సుధా పండితులు, వేదపండితులు కూడా ఈ పెళ్ళికి విచ్చేసి, వధూవరులకు ఆశీరక్షతలు అందించారు.

"ఇలా ఏకకాలంలో ముగ్గురు స్వామీజీల ఆగమనంతో, ఇందరు పండితుల ఆశీఃపఠనంతో వివాహ వేదిక పునీతం కావటం గతంలో ఎప్పుడూ జరగలేదు. ఇది అద్భుతం. అమోఘం" అంటూ పెళ్ళి పందిట్లో రామ్మూర్తి ఆచారిగారు విస్మయానందాలు వ్యక్తం చేశారు. మా ఆనందానికి అవధుల్లేవు!! 'కళ్యాణ శ్రీనివాసుడి'కి నమస్కరించకుండా వుండలేకపోయాం...

* * *

కుమారుడు సంజీవ్, కోడలు శ్రీలేఖ (ఎడమవైపు)
భార్య గోపిక, అల్లుడు నరేంద్ర, కుమార్తె మాధవిలతో (కుడివైపు) రచయిత ప్రసాద్



# 30

# హరిగురు అనుగ్రహం

**2003** ఏప్రిల్ మొదటివారంలో ఒకరోజు....

రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీమతి సతీనాయర్‌కి వీడ్కోలు - కొత్త ప్రధానకార్యదర్శి శ్రీమోహన్ కందాకి స్వాగతం తెలిపే కార్యక్రమం ఐ.ఏ.ఎస్. ఆఫీసర్స్ అసోసియేషన్ భవనం ఆవరణలో జరుగుతోంది.

నేనూ, సతీనాయర్ 1966 ఐఏఎస్ బ్యాచ్‌కి చెందిన వాళ్ళం. మా బ్యాచ్‌కి చెందినవాళ్ళూ, మా కన్నా సీనియర్లయిన వాళ్ళూ మరికొంతమంది కూడా ఆ సభలో ఉన్నారు. మాలాంటి వాళ్ళందరం గతస్మృతుల మధురానుభూతిలో తేలిపోతున్నాం. ముస్సోరిలో లాల్ బహదూర్ శాస్త్రి అకాడమీలో చేరిన కొత్తలో అనుభవాలు, అప్పటి బ్యాచ్‌మేట్‌ల గురించి ఆరాలు, ఎవరెవరు రిటైరైపోయారూ, ఇంకా ఎవరెవరు ఎక్కడున్నారూ వగైరా పలకరింపులు నడుస్తున్నాయి....

వీడ్కోలు ప్రసంగాలకి జవాబిచ్చేటప్పుడు శ్రీమతి సతీనాయర్ కూడా మిగతా సీనియర్స్‌లాగే 37 సంవత్సరాలు వెనక్కి వెళ్ళిపోయింది. ముస్సోరిలో ట్రైనింగ్ రోజుల్లో వుండే (కొత్తగా ఐఏఎస్‌లో చేరినప్పుడు కలిగే) ఆనందం, ఉత్సాహం - బ్యాచ్‌మేట్ల కుర్రతనం చేష్టలు....వగైరా తలుచుకుంటూ ఆమె నా వంక చూసింది. ఒక ఛాందస మధ్వ బ్రాహ్మణుడి అవతారంలో నన్ను చూస్తూనే, "ఆ రోజుల్లో ప్రసాద్ ఇలా యోగిపుంగవుడిలా వుండేవాడు కాదు. ఈయన్ని ఇలా ఎప్పటికైనా చూస్తామని కూడా మేం ఎప్పుడూ అనుకోలేదు....." అంటూ ఆమె ఓ చెణుకు విసిరింది.

అప్పటి ప్రసాద్‌గురించి తెలిసున్నవాళ్లు నవ్వారు. నేను నవ్వుకున్నాను.

* * *

ఆ రాత్రంతా నా రూమ్‌మేట్ శరత్ కపిల తాగుతూనేవున్నాడు. అర్ధరాత్రివేళ నేను లేచి చూసి, విసుక్కున్నాను. - "శరత్ ఇలా తాగటం ఏమీ బాగాలేదు. లైట్లార్పేసి పడుకో".

శరత్ నావంక జాలిగా ఓ చూపు చూశాడు. అప్పట్లో నావేషం కూడా అందుకు తగినట్లుగానే వుండేది... తిరుపతిగుండు. ఢిల్లీలో శరత్ ఎప్పుడూ విని వుండని దక్షిణాది గ్రామీణ (గుంటూరు) నేపథ్యం. సరైన ఉచ్చారణలేని వచ్చీరాని హిందీభాష..... వాడేమో ఆధునికత వుట్టిపడే సెయింట్ స్టీఫెన్స్ (ఢిల్లీ) నుంచి వచ్చినవాడు. దాంతో సహజంగానే వాడు నన్ను చూసి జాలిపడ్డాడు. "ప్రసాద్, మందులో వున్న మజా తెలిస్తే నువ్విలా మాట్లాడవు. నువ్వు త్రాగి, అప్పుడు చెప్పు - త్రాగటం మంచిదికాదని" అంటూ శరత్ నన్ను రెచ్చగొట్టాడు. నేను ఎంత అనునయంగా చెప్పినా అతను వినిపించుకునే మూడ్‌లో లేడు.

చేతకాని మాటలు మాట్లాడొద్దన్నాడు. త్రాగుడులో వున్న ఆనందం తట్టుకోలేని పిరికివాణ్ణన్నాడు. తాగే ధైర్యం లేక నీతులు వల్లిస్తున్నానన్నాడు... అతని మాటలకి అడ్డూ ఆపూలేదు. నాకు పౌరుషం పొడుచుకొచ్చింది.

"శరత్, ఈ బ్రాందీ విస్కీల గురించి నాకు చెప్పకు. నాకివి కొత్తకాదు. వాటి లోతులు చూసేశాను. ఇప్పుడు కొత్తగా నీకోసం నేను ప్రయోగం చేయనక్కర్లేదు..." అంటూ గట్టిగా మందలించాను. "మందలించాను" అనుకున్నాను కానీ, దానివల్ల రాగల పరిణామం ఏమిటో ఆ క్షణంలో ఆలోచించలేదు. నా మాటలతో శరత్ మరింత రెచ్చిపోయాడు - "అలాగా! వీటి లోతులు చూసేశావా? ఏదీ ఇప్పుడు త్రాగి చూపించు ఎంత లోతుగా తాగ్గలవో చూస్తాను.... ఈ ఒక్క పెగ్ తాగ్గలవా?.. పోనీ, అరపెగ్గు.... పోనీ స్పూనంత తాగ్గలవా?...."

నాకు ఆవేశం వచ్చింది. అంతే, ఆ మిగతా రాత్రంతా సురాపానంలో శరత్‌తో పోటీపడ్డాను. కాని అలా శరత్‌తో పంతానికి పోయి నేను చేసిందేమిటి? - నిషాలో ఊగిసలాడుతూ, నాన్నగారికి చేసిన వాగ్దానానికి ఉద్వాసన చెప్పటం...?

★ ★ ★

అసలు నేను మా నాన్నగారికి (పత్రి కృష్ణారావుగారు) అలామాట ఇవ్వాల్సిన పరిస్థితి వస్తుందని ఎప్పుడూ అనుకోలేదు. కాని, వచ్చింది. అకాడమీలో ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసెస్ ట్రైనింగ్‌లో చేరటానికి బయల్దేరేముందు గుంటూర్లో ఫ్రెండ్సంతా బలవంతం చేసి, ఒక బీరు పార్టీ ఇచ్చారు. అప్పట్లో రాష్ట్రంలో మద్యనిషేధం అమల్లో వుండేది. అతికష్టం మీద బీర్లు సంపాదించాం. ఓపిక్కొద్దీ త్రాగేశాం. నాకది కొత్తకాదు.

అప్పటివరకూ ఇంటికి దూరంగా వుంటూ కాలేజిలో చదవాల్సిరావటం, ఎం.ఏ చదవటం కోసం నాగపూర్‌లో వుండాల్సిరావటం, లెక్చరర్‌గా కూడా ఇంటికి దూరంగా రాయపూర్ (మధ్యప్రదేశ్)లో వుంటూవుండటంతో అవకాశమున్న వ్యసనాలన్నీ నన్నూ ఆశ్రయించాయి. చివరికి నేను అకాడమీలో చేరేనాటికి నా పరిస్థితి ఏమిటంటే-

నా చిన్నప్పుడు ఒక జోక్ విన్నాను.... ఒక బ్రాహ్మణ అమ్మాయికి పెళ్లిసంబంధంగురించి తండ్రి తిరుగుతుంటాడు. మధ్యవర్తి ఎవరో వచ్చి "మంచి సంబంధం" అని ఒక కుర్రాడి గురించి చెబుతాడు. అమ్మాయితండ్రి సహజమైన ఆశతో అడుగుతాడు-

"అబ్బాయికేమీ చెడు అలవాట్లులేవుగా?"

"అబ్బే అస్సల్లేవు. అప్పడప్పుడు సిగరెట్ కాలుస్తూంటాడంతే!"

"ఆ! సిగరెట్ అలవాటుందా?"

"అదికూడా మరీ అదే పనిగా పీల్చడు. ఎప్పుడన్నా కారా కిళ్లీ వేసుకున్నప్పుడే...."

"ఆ!... కారాకిళ్లీ అలవాటుందా?"

"మామూలుగా వేయడు. ఏదన్నా నాటుకోడి, వేటపోతు మాంసం తిన్నప్పుడే..."

"అయ్యో! మాంసంకూడా తింటాడా?"

"అదైనా ఎప్పుడన్నా ఓ చుక్క త్రాగినప్పుడే..."

"అంటే, త్రాగుడు అలవాటుకూడా వుందా?..."

"అబ్బే, అదికూడా ఎప్పుడన్నా మంచి 'కంపెనీ' దొరికినప్పుడే..."

"......?"

.... ఇలాంటిస్థితిలో 1966లో నేను అకాడమీలో చేరాను. అలా చేరటానికి ముందు ఫ్రెండ్స్ ఇచ్చిన బీరు పార్టీ నుంచి ఆ రాత్రి ఇంటికి తిరిగి వెళ్లాల్సివచ్చినప్పుడు చాలా ఇబ్బంది పడ్డాను. నాలుగైదు కిళ్లీలు నమిలాను. సెంటు జల్లుకున్నాను- బీరు వాసన మా నాన్నగారికి తెలీకుండా జాగ్రత్తపడ్డాననుకున్నాను. కాని గుమ్మంలోకి అడుగు పెట్టీ పెట్టగానే ఆయన పసిగట్టేశారు. అప్పటికే నాలుగేళ్లపాటు లెక్చరర్‌గా చేసి వచ్చాను కాబట్టి ఆయన నామీద చిన్నపిల్లాడి మీద అరిచినట్లు అరవలేదు.

"చూడయ్యా! నువ్వొక క్రిందిస్థాయి మధ్యతరగతి కుటుంబానికి చెందినవాడివి. నీకు దారిద్ర్యం అంటే ఏమిటో తెలుసు. కాబట్టి నీ జీవితం నీ కన్నా లేనివాళ్ల జీవితాలు బాగుచేయటానికి ఉపయోగపడాలని నువ్వు 'ఐఏఎస్'లో చేరితే బాగుణ్ణనుకున్నాను... కాని ఇలాంటి దురలవాట్లు వున్నవాళ్లు ప్రజల్లో తమ అంకితభావం పట్ల విశ్వాసాన్ని కలిగించలేరు.... రాష్ట్రంలో మద్యనిషేధం అమల్లో వున్నాకూడా, దాన్ని ఉల్లంఘించి త్రాగుడు కోసం ఎగబడేవాడు ప్రజలకి ఏరకమైన

సేవలందించగలడు? వాడికి లేని నీతి, ప్రజలకి వుండాలని ఎలా చెప్పగలడు?.."ఇలా ఆయన చెప్పిన మాటలు భాషలో సున్నితంగా వున్నా, భావంలోని వాడి, వేడి నన్ను నిరుత్తరుణ్ణి చేశాయి.

“.... నీక్కావలసింది ఆ త్రాగుడు వల్ల వచ్చే కిక్కే అయితే, అదేదో నేనే ఇచ్చేవాణ్ణి గదా.......” ఇది ఆయన చెప్పిన ముగింపు వాక్యం... సిగ్గుపడ్డాను.

“ఇంకెప్పుడూ చేయను” అంటూ తలొంచుకుని ఇంట్లోకెళ్లిపోయాను. కానీ ఆ రాత్రంతా మథనపడిపోయాను. నాన్నగారిని కష్టపెట్టకూడదన్న భావంకన్నా, “దేశంలో అత్యున్నతమైన సర్వీసులో చేరేవాడు త్రాగుబోతు అయితే వాడు ప్రజలకెలాంటి విశ్వాసాన్నీ కలిగించలేడు...” అన్నమాటలే నన్ను వెంటాడాయి. అంతే! జీవితంలో ఇంకెప్పుడూ మద్యం ముట్టకూడదనుకున్నాను...

అలా దృఢంగా నిర్ణయించుకున్నాక ముస్సోరి చేరుకున్నాను. అక్కడ నా రూమ్‌మేట్ శరత్ కపిల!!

* * *

అకాడమీలో మన జోరు కొంచెం ఎక్కువగా వుండేది. ఆఫీసర్స్‌క్లబ్ ఎలక్షన్లలో పోటీ చేసి, ఛైర్మన్‌గా ఎన్నికయ్యాను. ట్రైనీల తరపున అకాడమీ మేనేజిమెంట్‌తో తలపడాలన్నా, ఏదన్నా కల్చరల్ ప్రోగ్రామ్స్ నిర్వహించాలన్నా.. అన్నింటికీ “నేనున్నా”నంటూ దూసుకువెళ్లడం అలవాటైపోయింది. అలా బ్యాచ్‌మేట్లలో బాగా పాపులర్‌అయిపోయాను. ఎంత బలంగా పాపులర్ అయ్యానంటే - “ప్రసాద్ చేతిలో సిగరెట్ లేకుండా వున్న ఫోటో చూపిస్తే వందరూపాయలు బహుమతి ఇస్తా”మంటూ ఫ్రెండ్స్ నా మీదే సవాళ్లు విసురుకునేటంతగా!

ఎం. ఏ చదువుతున్నప్పుడు ఒంటబట్టిన మహత్తరమైన దురలవాటు ఈ ధూమపానం. అకాడమీలో వుండగా రోజుకి 70-80 సిగరెట్లు కాలుస్తుండేవాణ్ణి. నా స్పీడు, ఈ అలవాట్ల జోరు నాకు అకాడమీలో తెచ్చిపెట్టిన బిరుదల్లా - 'జల్సారాయుడు'.

నిజానికి నాకీ దురలవాట్లు అబ్బటానికి మాఇంటి వాతావరణంలో ఏమాత్రం అవకాశంలేదు. సనాతన మధ్వ బ్రాహ్మణకుటుంబంలో వుండే ఆచార సాంప్రదాయాల మధ్య పెరిగాను. అమ్మ సుభద్రాదేవి గౌడీయ మఠం భక్తి మార్గంలో మునిగి వుండేది. నాకున్న ఏకైక తమ్ముడు విక్రమ్‌కి (ఇప్పుడు ఆర్మీలో కల్నల్) ఇప్పటికీ స్మోకింగ్, డ్రింకింగ్, మాంసాహారం అలవాట్లు లేవు. నా ప్రారబ్ధం - నా మీద నా కాలేజీ చదువు, పరిసరాల ప్రభావం అలాంటిది. అంటే నాకు అసలు దైవచింతన లేదని కాదు. ఏదో ప్రొద్దున స్నానం చేశాక, ఒక మినీ ప్రార్థన చేసేసి, ఆనవాయితీ ప్రకారం నమస్కారం పెట్టేసుకుని వచ్చేయటం వరకు విధిగా చేసేవాడ్ని. పరీక్షలు ప్యాసయితే





గుడికెళ్లి ఓ కొబ్బరికాయ కొట్టొచ్చేవాణ్ణి. ఐఏఎస్‌కి ఎంపికయినప్పుడు తిరుపతికి వెళ్లి, శ్రీనివాసుడికి తలనీలాలిచ్చేసి, అలాగే గుండుతో వెళ్లి అకాడమీలో చేరిపోయాను. అంతవరకే నాభక్తి!

అలా దేవుడికి నమస్కారాలు పెట్టే అలవాటు నా ఇతర దురలవాట్లని అరికట్టలేకపోయింది. ముస్సోరిలో ట్రైనింగ్ పూర్తయి, పశ్చిమ గోదావరి జిల్లాలో అసిస్టెంట్ కలెక్టర్‌గా ట్రైనింగ్‌లో వున్నప్పుడు అప్పటి జిల్లా జడ్జిగారి పుణ్యమా అని చతుర్ముఖపారాయణం కూడా అబ్బింది.

అసిస్టెంట్ కలెక్టర్ ట్రైనింగ్‌లో జ్యుడిషియల్ ట్రైనింగ్ కూడా ఒక భాగం. ఆ భాగం పూర్తిచేసినట్లు సర్టిఫికెట్ ఇచ్చేది జిల్లా జడ్జి. ఆయన 'రమ్మీ' ప్రియుడు. కాని క్లబ్‌లో ఆడడు. అందుకని సన్నిహితులైన వాళ్లని పిల్చుకుని, ఇంటి దగ్గరే 'పారాయణం' సాగించేవాడు. “నువ్వు రమ్మీ నేర్చుకోకపోతే, నీకు సర్టిఫికెట్ ఇవ్వనయ్యా” అనేవాడు. ఆయన జోక్‌గానే అన్నా, రెండుసార్లు అనిపించుకున్నాక, నేనే ఆయన బంగళాకి వెళ్లి, ఆయన దగ్గరే రమ్మీ నేర్చుకుని, ఆయనతోనే ఆడటం మొదలుపెట్టాను. అలా మనకున్న 'గొప్ప' గుణాల్లోకి ఈ పేకాటకూడా చేరిపోయింది.

దాంతో నేను భువనగిరి సబ్ కలెక్టర్‌గా వుండగా, అర్ధాంగిగా నా జీవితంలోకి ప్రవేశించిన గోపిక, నా ఈ 'కళలు' చూసి బిత్తరపోయింది. ఆమె మాకన్నా మరింత సాంప్రదాయబద్ధంగా వుండే మధ్వ బ్రాహ్మణకుటుంబంలోంచి వచ్చి వుండటంతో ఈ 'సకలకళావల్లభుడి' లక్షణాలకి తట్టుకోలేపోయింది. తన అసంతృప్తిని ఆమె రకరకాలుగా వ్యక్తం చేస్తూ వచ్చినా, నలుగురూ కలిసే ఫంక్షన్స్‌లో నాకన్నా సీనియర్స్ కూడా ఇలాగే స్మోక్ పైపులు, సిగార్‌లు, విస్కీ పెగ్‌లు ఆభరణాలుగా మోస్తూ తిరుగుతుంటే చూసి “బహుశా ఈ ఉద్యోగాల్లో ఇలాగే వుండాలి కాబోలు” అనుకొని అయిష్టంగా (తాత్కాలికంగా) రాజీపడుతూవచ్చింది. నన్ను మార్చే ప్రయత్నంలో ఆమె ఎంతవరకు విజయం సాధించిందో ఏమో గాని, నేను మాత్రం ఆమెకి రమ్మీ నేర్పేశాను! అదే పరిస్థితుల్లో భువనగిరి తర్వాత నల్గొండలో Small farmers development agency లోనూ, అక్కడ్నుంచి అప్పటి ముఖ్యమంత్రి పి.వి. నరసింహారావు గారి దగ్గర సెక్రటరీగానూ, దాని తర్వాత sugars లోనూ, మూడేళ్లపాటు ఖమ్మంజిల్లా కలెక్టరుగానూ పనిచేశాను.

అలవాట్ల విషయంలో నాన్నగారికిచ్చిన వాగ్దానాన్ని పూర్తిగా నిలబెట్టుకోలేకపోయినా “మనకన్నా లేనివాళ్ల జీవితాల్లో వెలుగులు నింపటంకోసమే నువ్వు IASలో చేరాలని కోరుకున్నాను” అన్న ఆయన ఆశే నేను పనిచేసిన ప్రతిపోస్టులోనూ నాకు స్ఫూర్తిగా నిలిచింది. ఆ స్ఫూర్తే నాకు కొన్ని కీలకమైన పోస్టుల్లో పనిచేసే అవకాశం కూడా కల్పించింది. అలాంటి వాటిల్లో ఒకటి ముఖ్యమంత్రి దగ్గర పనిచేయటం.

* * *

సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ (SFDA) ప్రాజెక్టు ఆఫీసర్‌గా వుండగా ఒకరోజు కలెక్టరు అకస్మాత్తుగా ఫోన్ చేసి, ముఖ్యమంత్రి పి. వి. నరసింహారావుగారు నన్ను తక్షణం రమ్మంటున్నారనీ, వెంటనే హైద్రాబాద్ వెళ్లాలనీ ఆదేశించారు. ముఖ్యమంత్రి నన్ను ఎందుకు రమ్మంటున్నారో ఆయనకీ తెలీదు, నాకూ తెలీదు.

నేను అయోమయంలో పడిపోయాను. ఏదన్నా నేరం చేశానా? రాజకీయంగా ఎవరన్నా ముఖ్యమంత్రి అనుయాయులకి అసంతృప్తి కలిగించానా? ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా ఎక్కడన్నా మాట్లాడానా?... చాలా డీలాపడిపోయాను. కలెక్టరు నాకంటే అయోమయంలో వున్నాడు. SFDA ప్రాజెక్టు ఆఫీసర్ అంటే ఒక డిప్యూటీ సెక్రటరీ కంటె క్రిందిస్థాయి పోస్టు. అంత చిన్న పోస్టులో వుండే వ్యక్తిని ముఖ్యమంత్రి అర్జంటుగా రమ్మనటమేమిటి?

ఏమైతేనేం - హైద్రాబాద్ వెళ్లాను. ముఖ్యమంత్రిని కలిసేముందు ఆయన ఆఫీసులో విచారించాను. - నన్నెందుకు రమ్మన్నట్లు. ఎవరికీ తెలీదు. నాలో ఆందోళన పెరిగింది. విషయమేదో చాలా సీరియస్‌గా వుందనుకున్నాను. అప్పటికి నాకు పూర్తిగా 30 ఏళ్లుకూడా లేవు. ఆవేశంపాలు ఎక్కువ. "సరే చూద్దాం, ఏదో నేరం చేశానంటారు. అంతే గదా" అనుకుంటూ, ఎదురుదాడికి కావలసిన మనోస్థైర్యంతో రెడీ అయిపోయాను. సి. ఎం. దగ్గరికి వెళ్లాక.....

"ఏమయ్యా! మీ నల్గొండ SFDA గురించి ముఖ్యమంత్రుల సమావేశంలో ప్రైమ్ మినిస్టర్ చెప్పారు.. ?" అంటూ ముఖ్యమంత్రి ఆరంభించారు.

నాకు అర్థమైపోయింది ఆయన దేన్ని గురించి చెబుతున్నారో.

నల్గొండ సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ SFDA ప్రధానంగా చిన్నరైతులకు సబ్సిడీలు ఇవ్వడం, బోర్‌లు తవ్వకుంటే రుణాలిప్పించటం, వర్క్స్ ప్రోగ్రామ్స్ ద్వారా రైతుకూలీలకి పనులు కల్పించటం చేస్తూండేది. దేశంలోని పైలెట్ ప్రాజెక్టులలో అది మొదటిది. అయితే ఈ రుణ సదుపాయాన్ని సొంతభూములున్న చిన్న, మధ్యతరగతి రైతులు బాగా ఉపయోగించుకునేవాళ్లు...

కాని నల్గొండ వంటి జిల్లాల్లో సన్నకారు రైతులకున్న భూములు చాలావరకు ఇనాం భూములు కావటంవల్ల వాళ్లకి బావులు తవ్వుకోటానికి అలాంటి భూముల మీద ఏ బ్యాంకూ రుణాలిచ్చే అవకాశం లేదు. పథకంయొక్క లక్ష్యం - ఆర్థికంగా బాగా వెనుకబడివున్న రైతులకి సహాయపడటం. కాని ఆ లక్ష్యం ఇక్కడ నెరవేరటంలేదు.

నేను సాహసించి ఒక ప్రయోగం చేశాను. ఎక్కడైతే ఎకరం, ఒకటిన్నర ఎకరం - (రెండున్నరెకరాలలోపు) భూములున్న రైతులు దగ్గర దగ్గరగా వుంటారో, అలాంటిచోట వాళ్లందరికీ కలిపి ఒక సామాజిక బావిని వాళ్ల చేతే తవ్వించటం. బావి తవ్వినందుకు వాళ్లకి వర్క్స్ ప్రోగ్రామ్ క్రింద కూలీ ఇస్తాం. ఆ కూలీలో సగాన్ని మోటారు వేయటానికి వాళ్ల వాటా క్రింద SFDA కి జమచేస్తాం. మోటారుకయ్యే వ్యయంలో మిగతాది SFDA సబ్సిడీ. అలావాళ్లకి సేద్యపు బావి లభిస్తుంది. ఆ మోటారు బావి తాలూకు సేద్యపు నీటికి వాళ్లు ఆయకట్టుదార్లవుతారు. అలా వాళ్లకి బావి తవ్వకంలో కూలీ లభిస్తోంది, వాళ్లు భూములు సేద్యం చేసుకోటానికి నీరూ లభిస్తోంది. పైగా ముందు, ముందు కూలీలుగానేకాక వాళ్లు వ్యవసాయదారులుగా కూడా బ్రతకవచ్చు... ఇది నా ఆలోచన. కాని ఇలా చేసేందుకు ఆ పథకంలో ఎక్కడా వెసులుబాటు లేదు. వర్క్స్ ప్రోగ్రామ్ క్రింద చెరువులు, రోడ్లు వగైరా మాత్రమే కమ్యూనిటీ వర్క్స్‌గా SFDA పథకంలో నిర్వచించబడ్డాయి. అయినా నిబంధనలు అతిక్రమించి బావులు తవ్వించడానికి సాహసించాను.

ఇనస్పెక్షన్‌కి వచ్చిన కేంద్ర ప్రభుత్వ అడిషనల్ సెక్రటరీ శ్రీరామకృష్ణయ్య (తరువాత కాలంలో ఆయన నాబార్డ్‌ఛైర్మన్‌గా, RBI డిప్యూటీ గవర్నర్‌గా కూడా చేశారు.) నిబంధనలకు విరుద్ధంగా చేస్తున్నప్పటికీ, ఐడియా బాగుందని మెచ్చుకున్నారు. కాని నేను చేసింది నిబంధనలను ఉల్లంఘించటమే అన్నారు... విషయం ప్రధానమంత్రి ఇందిరాగాంధీ గారితో చర్చించాలన్నారు... విషయం వెల్లడిస్తూ ముఖ్యమంత్రి తన సంభాషణ కొనసాగించారు....

".... నిబంధనలకి విరుద్ధంగా వున్నప్పటికీ నల్గొండజిల్లాలో జరుగుతున్న ప్రయోగంవల్లనే సన్నకారు రైతులకి నిజమైన ప్రయోజనం కలుగుతుందని ప్రధానమంత్రి ఇందిరాగాంధీ నమ్ముతున్నారయ్యా. మీ ఆంధ్రప్రదేశ్‌లోనే ఇలా జరుగుతోందని ఆవిడ చెప్పేదాకా నాకూ తెలీదు. ఏమైనా, ఇప్పుడావిడ ఈ ప్రయోగాన్ని అన్ని రాష్ట్రాలకీ విస్తరించాలని ఆదేశాలిచ్చారు. నాకు చాలా సంతోషమనిపించింది...." నేను ఊపిరిపీల్చుకున్నాను.

అలా కొంచెంసేపు మాట్లాడాక, ఆయన అకస్మాత్తుగా, "ఐ లైక్ యు ప్రసాద్, నా సెక్రటరీగా నువ్వు ఇక్కడికే వచ్చెయ్..." అంటూ ఆదేశించారు.

★ ★ ★

చేసిన ప్రతి ఉద్యోగంలోనూ నాన్నగారిచ్చిన స్ఫూర్తితో సాగుతూవచ్చిన నా ఆలోచనా విధానాన్ని, ఉద్యోగంలో నా పనితీరుని గోపిక హర్షించగలిగింది. కానీ నా అలవాట్లని ఏమాత్రం (అప్పటికవి తగ్గుముఖం పట్టినప్పటికీ) ఆమోదించలేకపోయింది. ఆ నేపథ్యంలో, 37 ఏళ్ల వయస్సులో నేను తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా 1978లో బాధ్యతలు స్వీకరించాను. భువనగిరి నాటికి, టిటిడిలో చేరేనాటికి నాలో వచ్చిన ప్రధానమైన తేడా - ధూమపానం నాకు 'విడాకులిచ్చేయటం'! అదో ప్రత్యేక వింత...

★ ★ ★

**భు**వనగిరిలో సబ్ కలెక్టరుగా వున్నప్పుడు - ఓ అర్ధరాత్రి ఒక అర్జంటు మెసేజ్ వచ్చింది. హైద్రాబాద్‌నుండి నల్గొండజిల్లాలో స్వగ్రామానికి వెళ్లిన ఒక డిప్యూటీ కలెక్టర్‌ని నక్సలైట్లు నరికి చంపేశారు.... ఆ డిప్యూటీ కలెక్టర్ డ్రైవర్ పరుగెత్తుకుంటూ భువనగిరి వచ్చి నాకు చెప్పాడు. నేను ఉరుకులు పరుగులమీద డి.ఎస్.పి ని తీసుకుని ఆ అర్ధరాత్రిలో స్పాట్‌కి పరుగెత్తాను. జరగాల్సిన తతంగం పూర్తయ్యాక, ఆ శవాన్ని పంపించేఏర్పాటు చేస్తుండగానే నక్సలైట్ల సంచారం గురించి సమాచారం వచ్చింది. వెంటనే డి. ఎస్. పి నేను కలిసి పోలీస్ పార్టీతో చుట్టుప్రక్కల అడవులన్నీ గాలించటం మొదలుపెట్టాం. మా బృందం అలా చెట్టూ, పుట్టా, కొండ, లోయ వెతికి వెతికి వెతుకుతూనే వున్నాం. ఇక ఉపయోగం లేదనుకున్నాక భువనగిరి తిరిగొచ్చేశాం. అలా అప్పటికి దాదాపు రోజున్నరపైగా తిరిగాం.

ఇంటికి రాగానే అలవాటు ప్రకారం గోపికని అడిగాను "సిగరెట్లు ఎక్కడ?"

గోపిక నన్ను నిలదీసింది. "మీరు మొన్న వెళ్లేటప్పుడు ఎన్ని సిగరెట్ ప్యాకెట్లు తీసుకెళ్లారు?"

గుర్తుచేసుకున్నాను. నేనేమీ ప్యాకెట్లు పట్టుకెళ్లలేదు. బహుశా చేతిలో ఒక సిగరెట్‌తో వెళ్లుంటాను. అదే చెప్పాను.

"మరి ఆ అడవుల్లో ఏం కాల్చారు?"

అప్పుడు నాకు స్ఫురించింది. గత రెండు రోజులుగా నేను ఒక్క సిగరెట్ కూడా కాల్చలేదు. దాంతో గోపిక అందుకుంది - "రెండురోజులపాటు సిగరెట్ ఆలోచనలేకుండా గడిపేశారు కదా! ఇప్పుడు సిగరెట్ త్రాగడం మానేయండి. ఏమవుతుందో చూద్దాం..."

నేను ఆలోచిస్తున్నాను.

".... మీరు మానగలరు. మానాలీ అనుకుంటే మీరు మానేయగలరు. సిగరెట్లు అదే పనిగా త్రాగటంవల్ల వచ్చే ఆనందం ఎంతో, అది తాగకపోయినా అంతే ఆనందం వుంటుందని ఈ రెండ్రోజుల్లో చూశారు కదా!....... అదే పనిగా ఆ పొగపీల్చి ఆరోగ్యం పాడుచేసుకోటం ఎందుకు?.... మీరు గట్టిగా అనుకుంటే మానేయగలరు. ఆ శక్తి మీకుంది.."

నా మనోబలం మీద ఆమె వేసిన బాణం పనిచేసింది. నేను ఆరోజు నుంచి సిగరెట్లు మానేశాను. అలా ఒక్క 'ధూమపాన రహిత' ప్రసాద్ టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా బాధ్యతలు స్వీకరించాడు. అంత మాత్రాన మిగతా వాసనలు వదుల్తాయా?

* * *





**టిటిడి**లో చేరాకకూడా మిగతా 'ప్రత్యేకతలు' అప్పుడప్పుడు నన్ను వెంటాడుతూనే వచ్చాయి. అయితే నేను మొదటిసారి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా తిరుమల ఆలయానికి వెళ్లి శ్రీనివాసుడి దర్శనం చేసుకున్నప్పుడు...

నూనె దీపాల వెలుగులో - కోటి సూర్యప్రభలతో ప్రకాశిస్తున్నట్లూ, సకల జనావళికి తానే రక్షకుడైనట్లూ, సమస్తపాపాలను నశింపజేసే దివ్యశక్తి కిరణాలను ప్రసరింపజేస్తున్నట్లూ కనుపించిన ఆ శ్రీనివాసుడి దివ్యమంగళ విగ్రహం చూస్తూ నన్ను నేను మైమరచిపోయాను. అంతకుముందు అనేక సార్లు తిరుమలకి వెళ్లాను. స్వామిని చూశాను. కాని ఆరోజు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ హోదాలో మొదటిసారిగా ఆయన ముందు ప్రణమిల్లినపుడు - నాలో అణువణువులోనూ ఏదో విద్యుత్ ప్రవహించినట్లు నా శరీరం కంపించింది.

కళ్లుమూసుకున్నాను. "నిన్ను నమ్మి ఇక్కడకు వచ్చే భక్తులకి, నీ ప్రతినిధిగా నిజమైన సేవచేసే అవకాశం కల్పించు స్వామీ" అని ప్రార్థిస్తున్నాను...

".. ఎలా సేవ చేయగలరు? మీ అలవాట్లు మార్చుకోకుండా మీరు శ్రీనివాసుడి ప్రతినిధిగా భక్తులకు ఎలాంటి విశ్వాసం కల్పించగలరు? దేవుడి సన్నిధిలో పనిచేసేటప్పుడుకూడా దుర్వ్యసనాల్ని పూర్తిగా వదిలించుకోలేకపోతే, భక్తులకి సేవచేయడానికి కావలసిన శక్తి, స్ఫూర్తి మీకు ఎలావస్తుంది?.. నా మాట వినండి. శ్రీనివాసుడి సేవకుడిగా పనిచేసేటప్పుడు మీకీ అలవాట్లు పనికిరావు...."అంటూ ఆ ముందురోజు గోపిక నాతో వాదిస్తూ చెప్పిన మాటలు గుర్తుకొస్తున్నాయి.

కళ్లెదురుగా పవిత్రతా పరిమళాలు వెదజల్లుతున్న స్వామి కనిపిస్తున్నాడు. చెవుల్లో గోపిక మాటలే మళ్లీ మళ్లీ వినిపిస్తున్నాయి.. ఆ క్షణంలో నాలో ఒక దృఢమైన సంకల్పం కలిగింది. "తిరుమలలో తిరుపతిలో వున్నంతకాలం మద్యమాంసాలను ముట్టను. పేకాట జోలికెళ్లను..."

అలా శ్రీనివాస దర్శనంతో మొలకెత్తిన సంకల్పం క్రమంగా స్థిరపడి, బలపడి, విస్తరించి కొన్ని మాసాల్లోనే నేను ఆ అలవాట్లకి పూర్తిగా (తిరుపతి బయటవున్నప్పుడుకూడా) శాశ్వతంగా దూరమైపోయేలా చేసింది.... ఒకప్పుడు దుర్వ్యసనాలకి బానిసైన మనసుని భక్తిపానం వైపుకి మరల్చింది - ఆ ఒక్క దర్శనం!!!!

* * *

**టిటిడి** ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగానే ఒకసారి గోపికతోసహా నేను బెంగుళూరు వెళ్లాల్సివచ్చింది. మా మామగారు సుసర్ల శ్రీనివాసరావుగారు కాకినాడనుంచి టెలిఫోన్ చేసి, ఉత్తరాదిమఠానికి చెందిన శ్రీ సత్య ప్రమోద తీర్థ స్వామీజీ బెంగుళూరు వచ్చి వున్నారనీ, ఎలాగూ అటేవెళ్తున్నాం కనుక మేమిద్దరం ఒకసారి ఆయన దర్శనం చేసుకుంటే మంచిదని సూచించారు.

అలాగే బెంగుళూరు వెళ్లి, ఆయన్ని చూడగానే నాలో చెప్పలేనంత గౌరవ భావం ంగిపొర్లింది. ఆయన ముఖంలో వర్చస్సు, మాటల్లో నిరాడంబరత, పనిలో నియమబద్ధత - స్ను బాగా ఆకర్షించాయి.

నిజానికి నాకు అప్పటికే టిటిడి కారణంగా అనేకమంది స్వామీజీలతో, పీఠాధిపతులతో న్నిహిత్యం ఏర్పడింది. కంచి, శృంగేరిల పీఠాధిపతులు, అహోబిలమఠం, పరకాలమఠం యర్‌లూ, ఆంధ్రప్రదేశ్‌కి చెందిన సీనియర్, జూనియర్ నారాయణ జీయర్‌లూ, తిరుమలలోని య్యంగార్‌లతో నాకు చాలా సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి.

పెజావర్ స్వామీజీ, ఇతర ఉడిపికి చెందిన పీఠాధిపతులూ, ఉత్తరాదిమఠం, వ్యాసరాయమఠం, ులబాగల్‌కి చెందిన శ్రీపాదరాజమఠం, మంత్రాలయానికి చెందిన రాఘవేంద్రస్వామి మఠం ంటి మఠాధిపతులతో ముఖాముఖి చర్చించే అవకాశం లభించింది. ఇంకా పుట్టపర్తి త్యసాయిబాబా, చిన్మయానంద స్వామి, స్వామి రంగనాథానంద (రామకృష్ణామఠం), శుక హ్మాశ్రమానికి చెందిన విద్యా ప్రకాశానందస్వామి, వరల్డ్ టీచర్స్ ట్రస్టుకి చెందిన మాస్టర్ ఎక్కిరాల ృష్ణమాచార్య, వ్యాసాశ్రమ స్వామీజీలు, బ్రహ్మకుమారి ఈశ్వరీయ విద్యాలయం ప్రతినిధులు... లా అనేకమంది ఆధ్యాత్మిక గురువులతో, ప్రబోధకులతో సత్సంబంధాలు నెలకొన్నాయి. ామచంద్రమిషన్, హరేకృష్ణ ఉద్యమానికి చెందిన స్వామీజీలు, కర్నాటకకి చెందిన అనేకమంది అద్వైత ప్రచారకులు, లింగాయత్ స్వామీజీలకు, రాధాస్వామి సత్సంగ గురువులకు చేరువయ్యాను.

ఈ పరిచయాలు, సంబంధాలు ఎంతవరకు వెళ్లాయంటే, తిరుమలలో తిరుపతిలో జరిగే ించుమించు ప్రతి ఆధ్యాత్మిక సభలోనూ నేను పాల్గొంటుండేవాణ్ని. ఈ విషయంలో తిరుమల తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌పోస్టు నాకు కల్పించిన అవకాశం మహత్తరమైంది. (ఎవడు కల్పించాడీ అవకాశం?)

అలా అనేకమంది ప్రముఖ హిందూ ధర్మప్రచారకుల, బోధకుల, పీఠాధిపతుల సంపర్కంతో అనేక విషయాలు తెలుసుకుంటున్నప్పుడే హిందూ ధర్మ ప్రచారం కోసం టిటిడి కూడా అప్పుడు చేస్తున్న దానికన్నా యింకా ఏదో చేయాలన్న ఆలోచనరావటం, ఫలితంగా అనేక ప్రచురణలు ప్రారంభించటం జరిగింది. అడ్మినిస్ట్రేషన్ ఎంత సర్వమత సమభావనతో నడిచేదయినప్పటికీ, నా దగ్గరకి వస్తున్న వాళ్లందరి దృష్టిలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ అంటే గొప్ప ఆధ్యాత్మిక తత్త్వవేత్తగా వుండాలన్న ఆశ గోచరించేది. అందుకే, నేను ముముక్షువు కాలేకపోయినా, పదిమందికీ ఉపయోగపడే పుస్తక ప్రచురణలు చేపట్టడం జరిగింది.

చొక్కాజేబులో పట్టే సైజులో మా పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ రావుల సూర్యనారాయణ మూర్తి రాసిన 'భగవద్గీత' దగ్గర్నుంచి, ప్రొఫెసర్ రఘునాథాచార్య ఆధ్వర్యంలో 'ఆర్ష విజ్ఞాన సర్వస్వం'





శీర్షికన రూపొందిన భారీ గ్రంథాల వరకూ వేలాది పుస్తకాలను ప్రచురిస్తూ వచ్చాం. పిల్లలను భక్తి మార్గంలోకి మళ్లించటంకోసం 'బాలభారతి' శీర్షికన పురాణగాథల పుస్తకాలు, గృహస్థులు ఆచరించాల్సిన, తెలుసుకోవలసి విషయాల మీద పుస్తకాలు, సీనియర్ సిటిజన్స్‌కి వుపకరించే వేదాంత తత్త్వబోధనల పుస్తకాలు.... ఇలా అనేక కేటగిరీల్లో పుస్తకాలు ముద్రించాం. వేదాలను కూడా తెలుగులో ప్రచురింపజేశాం.. ఆడియో రికార్డింగ్ చేయించాం... అదొక మహోద్యమంలా సాగింది. ఆ ఆధ్యాత్మిక సాహితీ ప్రచురణ యజ్ఞంలో జంధ్యాల పాపయ్య శాస్త్రి (కరుణశ్రీ), సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, మహాపండితులు మల్లాది చంద్రశేఖరశాస్త్రి, శ్రీభాష్యం అప్పలాచార్య, నండూరి రామకృష్ణమాచార్య, బాలాంత్రపు రజనీకాంతరావు, రాణి నరసింహశాస్త్రి, పన్నాల రాధాకృష్ణశర్మ, డాక్టర్ అర్కసోమయాజి, ఉషశ్రీ, సముద్రాల లక్ష్మయ్య, రామ్మూర్తి శర్మ, ప్రొఫెసర్ రామరాజు, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, ఎన్.సి.వి కృష్ణమాచార్యులు వంటి అనేకమంది భాషాకోవిదుల ప్రజ్ఞాపాటవాలు ఆజ్యంలా పనిచేశాయి. వీళ్లందరికీ సమన్వయకర్తగా రఘునాథాచార్య వ్యవహరించేవారు.

ఈ ఉద్యమంతో భక్తిరసమయ సాహిత్యం ప్రచారంలోకి వెళ్లింది. మార్కెటింగ్ అద్భుతంగా జరిగింది. 'బాలభారతి' పుస్తకాలైతే, మళ్లీ మళ్లీ ప్రచురించాల్సివచ్చింది. గోదావరి, కృష్ణా పుష్కరాల్లో ఈ పుస్తకాల కాపీలు లక్షలాదిగా ప్రజల్లోకి పంపిణీఅయ్యాయి. ఈ సాహిత్యం రాష్ట్రంలో మూలమూలలకి చొచ్చుకు పోవటంతో " ఈ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ ఎవరో పరమహంసలా వున్నాడు" అని నలుగురు అపోహపడే పరిస్థితి ఏర్పడింది.

అప్పుడే నాకీ ప్రశ్న ఉదయించింది - ఇంత ఆధ్యాత్మిక సాహిత్యాన్ని ప్రచారం చేస్తున్నాను. హిందూధర్మం గురించి ప్రజల్లోకి తీసుకువెళ్తున్నాను. ఇంత మంది పీఠాధిపతులతో, మఠాధిపతులతో, స్వామీజీలతో అనేక ధార్మిక విషయాల మీద చర్చిస్తున్నాను. కానీ, ఇంతకీ ఒక వ్యక్తిగా నేను ఆచరించాల్సిన ఆధ్యాత్మిక ధర్మం ఏది?ఏది?ఏది?

ఈ ప్రశ్నే ఒకరోజు ఆలయంలో ఒక ఆర్జిత సేవలో వుండగా శ్రీనివాసుణ్ని అడిగాను. "నేను ఆచరించాల్సిన ధర్మం ఏది? నాకు ఎవరు చెబుతారు? ఎప్పుడు చెబుతారు?....." ఆ స్వామి ఎప్పటిలాగే ఉలకలేదు - పలకలేదు... కాని, అక్కడ్నుంచి ఇంటికిరాగానే మా మామగారి ఫోన్‌కాల్ - బెంగుళూరులో శ్రీసత్యప్రమోద తీర్థ స్వామీజీ గురించి..... !

★ ★ ★

అదిగో, అలా జరిగింది నేను శ్రీ సత్య ప్రమోద తీర్థస్వామీజీని దర్శించటం. ఆ తేజోమూర్తిని చూస్తున్నప్పుడే నాలో అనిర్వచనీయమైన గురు భక్తి పొంగుకొచ్చింది. అత్యంత వినమ్రంగా ఆయన ఆశీస్సుల కోసం చూస్తున్నాను.


శ్రీ సత్యప్రమోద తీర్థ స్వామీజీతో ప్రసాద్

అకస్మాత్తుగా ఆయన నన్ను దగ్గరికి పిలిచి, మంత్రాక్షితలతో పాటు ఒక కృష్ణాజినం (జింకచర్మం), దేవతార్చన పెట్టె అందివ్వ బోయారు. నాకు అర్థమై పోయింది. దేవతార్చన పెట్టె ఇస్తున్నారు అంటే నేను నిత్యదేవతార్చన చేయాలన్న మాట! మామూలుగానే రోజుకొక్కసారయినా గాయత్రిజపం చేసే అలవాటులేని నేను ఈ నిత్యదేవతార్చన ఎలా చేయగల్ను? పైగా అది తీసుకున్నానంటే, రోజూ దేవతార్చన చేస్తానని ఒప్పుకున్నట్లే. అలా ఎవరన్నా గృహస్థ శిష్యులు ఒప్పుకుని చేయకపోతే ఆయనకి నచ్చదు. ఆయన ఏ శిష్యుడింటికైనా ఎప్పుడైనా అకస్మాత్తుగా వెళ్లిచూసి, అర్చన జరగటంలేదంటే సాలిగ్రామం, విగ్రహాలతో సహా ఆ పెట్టె తీసుకువెళ్లిపోతారని ప్రతీతి. మరి నాకా పూజల అలవాటులేదు. కొత్తగా మొదలెడదామన్న ఆసక్తీలేదు. ఎలా?

అందుకే నేను నా నిరాసక్తత వ్యక్తం చేశాను. చుట్టూవున్న వారి శిష్యులు, అనుయాయులు విస్మయంతో చూస్తున్నారు. వాళ్ల దృష్టిలో - స్వామీజీ దగ్గర్నుంచి మంత్రాక్షితలు పొందటమే గొప్ప ఆశీర్వచనం. వారి దగ్గర్నుంచి సుదర్శన సాలిగ్రామం పొందటమంటే ఎంతో పుణ్యఫలం వుంటేనేగాని సాధ్యపడదు. ఇక అసలు సాలిగ్రామమే ఇచ్చారంటే అదొక అసాధారణమైన శుభవార్త. ఇక కృష్ణుడు, వాసుదేవ సాలిగ్రామం, అందమైన శంఖం, సుదర్శన సాలిగ్రామం, విష్ణుపాదాలు, చక్రాంకిలతోపాటు హనుమాన్, గరుత్మంతుడు, ఆదిశేషులతో కూడిన పూజ పెట్టె ఆయన ఇస్తున్నారంటే, అదొక పూర్వజన్మ సుకృతంగా శిష్యులు భావిస్తారు. అలాంటి అదృష్టం నన్ను వరిస్తోందని వాళ్ల నమ్మకం. వాళ్లంతా నాకు వెనకాల్నుంచి సన్నగా సలహా ఇస్తున్నారు - "తీసుకోండి, తీసుకోండి... వద్దనకండి"......

నేను ధైర్యం చేయలేకపోయాను. ఎందుకంటే తీసుకున్నాక వాటికి న్యాయం చేయాలి. నేను చేయగలనన్న నమ్మకం నాకులేదు.

స్వామీజీ చిరునవ్వు నవ్వారు-"ప్రసాద్, మాకెందుకో ఈ దేవతార్చన సామగ్రి నీకు ఇవ్వాలనిపించింది. ఇది దైవ సంకల్పం కావచ్చు. నీకా అర్హత లేకపోతే మాకీ సంకల్పం కలిగేది కాదు... ఒకవేళ నువ్వు దీనికి న్యాయం చేయలేకపోతే, ఆ లోపానికి బాధ్యత గురువుదే కాని నీదికాదు. అలాంటి దోషం జరిగితే మేం స్వీకరిస్తాం... తీసుకో... కొంతకాలం తర్వాత నీ అనుభవమేమిటో మాకు చెప్పు..."





మృదుమధురమైన ఆ మాటలు నన్ను మంత్రముగ్ధుణ్ణిచేశాయి. నాలోనాకు తెలీనిఉత్తేజాన్ని నింపాయి. చూస్తున్నకొద్దీ "ఈయనే నా గురువు" అన్న భావం వెంటాడసాగింది. అంతకుముందు వరకూ వెంటాడుతూ వచ్చిన సందేహం మటుమాయమైంది.

అప్పుడు స్వామీజీనాకు అనేక కొత్తవిషయాలు చెప్పారు. క్రమంగా అర్థమైంది. అవన్నీ గృహస్థాశ్రమధర్మాలు! - ఉద్యోగరీత్యా చేయాల్సిన లౌకికమైన విధినిర్వహణ వేరు. వ్యక్తిగా ఆచరించాల్సిన, స్వధర్మానుసారమైన సాధనవేరు. ఏది విధి, ఏది నిషేధం అని శాస్త్రాలు ఘోషిస్తున్నాయో విశదీకరించారు. గృహస్థు ఏమిచేయచ్చు, ఏంచేయకూడదో స్పష్టపరిచారు.. వర్ణాశ్రమధర్మం ప్రకారం బ్రాహ్మణుడు పాటించాల్సిన విధులు (కర్మలు), అనుసరించకూడని మార్గాలు (నిషిద్ధం) విడమరచి చెప్పారు.

"... స్వధర్మే నిధనంశ్రేయః పరధర్మో భయావహః"
- (భగవద్గీత)

క్షణకాలం కళ్లుమూసుకుని శ్రీనివాసుడ్ని తలుచుకున్నాను. కళ్లు తెరిచేసరికి దేవతార్చన సామగ్రి నాచేతుల్లో వుంది (స్వామీజీ నాచేతిలో వుంచారు).

తిరుపతి తిరిగొచ్చేశాక కొంతకాలంపాటు దేవతార్చన సామగ్రికి రోజూ హారతిచ్చేవాడ్ని. అంతే!

కొంతకాలానికి టిటిడి నుంచి బదిలీ అయింది. ఏడాదిపాటు ఇంగ్లాండులో వుండొచ్చాను. ఇంగ్లాండులో వున్నకాలంలో ఆ దేవుడి పెట్టెని కాకినాడలో మా మామగారింటికి పంపితే - మా అత్తగారు శాంతమ్మగారు శ్రద్ధతో ప్రతిరోజూ ఒక అర్చకునితో పూజచేయించారు. ఇంగ్లాండునుంచి తిరిగిరాగానే, గోపిక నాకు ఆ పెట్టె విషయం గుర్తు చేసింది. స్వామీజీ చెప్పిన మాటలు స్ఫురణ కొచ్చాయి. - స్వామీజీ కళ్లముందు మెదిలారు. "నీవు నిత్యదేవతార్చన చేయలేకపోతే, ఆ దోషాన్ని గురువుగా మేం స్వీకరిస్తాం" అన్నమాటలు పదే పదే చెవుల్లో వినిపిస్తున్నాయి.

వెనక్కితిరిగి సమీక్షించుకున్నాను. నేను శ్రీనివాసుడ్ని ఏం కోరుకుంటే, ఇలా జరిగిందో నెమరు వేసుకున్నాను... అంతే! ఇక ఆలస్యం చేయలేదు. ఆ రోజునుంచి (ఇప్పటికి దాదాపు 20 సంవత్సరాలు) 'గురువు' బోధించిన విధి, నిషేధాలను, గృహస్థాశ్రమధర్మాలను ఆచరణలో పెట్టడానికి శక్తివంచన లేకుండా సాధన చేస్తూనేవున్నాను.

★ ★ ★

**దేవ**తార్చన, సంధ్యావందనం, దైవచింతన, భక్తిజ్ఞాన సముపార్జన పట్ల జిజ్ఞాస - ఇవన్నీ గురు ఆశీర్వాదబలంతో, నా భార్య గోపిక సహకారంతో సాగుతున్న నా జీవనవిధానం.



శ్రీ సత్యాత్మ తీర్థస్వామితో ప్రసాద్

గురు శ్రీసత్యప్రమోద తీర్థస్వామి ఆశీర్వచన ఫలితంగా, మొదట్లో గాయత్రీజపం, సంక్షిప్త దేవతార్చనతో ప్రారంభమైన నా అనుష్ఠాన కర్మ క్రమంగా నాలో ఈ వైదిక ధర్మం పట్ల ఆసక్తిని పెంచింది. గత 20 ఏళ్లలో అనేకమంది స్వామీజీల ఆశీస్సులు కొత్త కొత్త రూపాల్లో నాకులభించాయి.

ఢిల్లీలో ప్రధానమంత్రి పి.వి. నరసింహారావుగారి దగ్గర మీడియా సలహాదారుగా పనిచేసే రోజుల్లో (1992-96) పెజావర్ మఠానికి చెందిన శ్రీ విశ్వేశతీర్థ స్వామీజీ బదరీనాథ్ నుండి తెచ్చిన అత్యంత అరుదైన ఒక వ్యాస సాలిగ్రామం బహూకరించారు. ఆ సాలిగ్రామానికి పూజచేయటం ఆరంభించిన కొద్దిరోజులకే హైద్రాబాద్ బదిలీకావటం, అనునిత్యం పండిట్ శ్రీనాగేంద్రప్రసాద్ గారివద్ద శాస్త్రపఠనం ద్వారా జ్ఞాన సముపార్జనయత్నం ఆరంభించటం జరిగింది. అలా ఆరంభమై, శ్రీమధ్వాచార్యుల భాష్యంతో కూడిన శ్రీవేదవ్యాసులవారి బ్రహ్మసూత్రాల పఠనం, శ్రీ టీకాచార్యుల, శ్రీరాఘవేంద్రుల వ్యాఖ్యాన పఠనం, మహాభారత తాత్పర్యనిర్ణయం, భాగవత తాత్పర్య నిర్ణయం, ఉపనిషత్తులు వగయిరాల పఠన కార్యక్రమాలలో మునిగిపోయాం.

ఉత్తరాదిమఠానికి చెందిన శ్రీ సత్యాత్మ తీర్థస్వామి - (శ్రీ సత్యప్రమోద స్వామికి శిష్యులు, వారితరువాత పీఠాధిపతి.) నాకు అష్టమంత్ర ఉపదేశంతో పాటు శ్రీ కృష్ణ, శ్రీనివాసుల విగ్రహాలను బహూకరించారు. రాఘవేంద్రస్వామి మఠానికి చెందిన స్వామీజీ సుదర్శన సాలిగ్రామం బహూకరించారు. ఉడిపి శ్రీకృష్ణమఠానికి చెందిన పాలిమార్ మఠస్వామిజీ కృష్ణమంత్ర జపం ఉపదేశించారు. పండిట్ నాగేంద్రప్రసాద్‌గారు బ్రహ్మసూత్రభాష్యం పూర్తిచేసి మంగళం చేసుకుంటున్నప్పుడు ఒక త్రివిక్రమ విగ్రహాన్ని యిచ్చారు. పండిట్ వ్యాసకరె ప్రభంజనాచారి గారు శ్రీ విష్ణుతత్వ వినిర్ణయం పాఠం చెప్పి ఒక 'శింశుమార' విగ్రహాన్ని యిచ్చారు. వీటికి తోడు సంధ్యావందనం, మంత్రజపం, దేవతార్చన, బ్రహ్మయజ్ఞం, నైవేద్యం, వైశ్వదేవహోమం, హస్తోదకం, బలిహరణం..... ఇవన్నీ మానాన్నగారు కాలంచేసే నాటికే (1997), రెండున్నర గంటలపాటు సాగే నా నిత్యకార్యక్రమంలో భాగమైపోయాయి.





గృహస్థాశ్రమ ధర్మాన్ని పాటిస్తూ, గురువులు బోధించిన విధుల్ని ఆచరిస్తూ, అందులోభాగంగా ఏకాదశినాడు నిర్జల ఉపవాసదీక్ష, ఏడాదికి నాలుగుమాసాలు చాతుర్మాసదీక్ష అవలంబిస్తూ జీవితం గడపటానికి నేను, నా భార్య అలవాటుపడిపోయాం. ఉద్యోగవిరమణ చేసేనాటికి రోజుకి కనీసం తొమ్మిదిగంటలు ఆధ్యాత్మికచింతనలో గడపాలని గోపిక, నేను అనుకునేవాళ్లం. ఇప్పటిదాకా 'కర్మ' (పూజ) ఆచరిస్తున్నాను తప్ప ఇంకా మేంకోరుకున్నట్లుగా జ్ఞానకార్యం సాగించలేకపోయాను. జ్ఞాన సాధన విషయంలో నా అర్ధాంగి నాకన్నా చాలా ముందుకెళ్లిపోయింది. అప్పుడప్పుడు గోపిక అంటూంటుంది - ఒకప్పుడు పూజచేయటానిక్కూడా టైమ్ ఖర్చు పెట్టని నేను ఇవ్వాళ అనుష్ఠాన కర్మకోసం మితిమీరి టైమ్ గడుపుతున్నాననీ, జ్ఞానకార్యం నిర్లక్ష్యం చేస్తున్నాననీ.

నిజమే, గృహస్థాశ్రమ ధర్మంలో చెప్పబడిన 'నిషేధాల'ను పూర్తిగా పాటించటంలోగానీ, జ్ఞాన సాధన కార్యంలోగానీ ఇంకా చాలా వెనుకబడే వున్నాను. కాకపోతే గురువులు బోధించిన ఈ 'స్వధర్మాచరణ' సాధనలో భాగంగా నా అవతారంలో మార్పు వచ్చింది. ఇప్పుడు నా నుదుటిమీద అక్షత, అంగారం చోటుచేసుకున్నాయి. సాంప్రదాయబద్ధంగా ఒక శిఖ నా శిరస్సున వెలిసింది.

బహుశా నా ఈ అవతారాన్ని చూసేనేమో - ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా ఇటీవల పదవీ విరమణ చేస్తూ శ్రీమతి సతీనాయర్ అన్నది - "అప్పటి జల్సారాయుడు ప్రసాద్ ఒకనాటికి ఇలా మారిపోతాడని మేమెవ్వరం వూహించలేదు... !"

నాలోఈ మార్పుకి ప్రేరణ ఎక్కడిది? - అని ఇప్పుడు నాకు సందేహంలేదు. సింహావలోకనం చేసుకుంటే తెలిసిపోయింది. ఏ శక్తి నన్ను ధూమ, మద్యపానాది వ్యసన మార్గంలోంచి భక్తిపాన మార్గంలోకి మళ్లించిందో, నాచేత టిటిడిలో కొన్ని సత్కార్యాలు చేయించిందో, నాకు తగిన గురువుని చూపించిందో, నాధర్మం ఏమిటో అర్థమయ్యేలా - ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించేలా చేసిందో- ఇప్పుడు స్పష్టంగా తెలుస్తోంది....

హరే శ్రీనివాస !

★ ★ ★

భగవంతునిపట్ల విశ్వాసంవుంచి ప్రతివ్యక్తీ జీవిత పరమార్థాన్ని తెలుసుకుని, జీవి పరలోక ప్రయాణం సయితం ప్రశాంతంగా సాగటానికి ఉపకరించే ధర్మమార్గాన్ని, భక్తిమార్గాన్ని అవలంబించాలని ఆశిస్తూ...

పి వి ఆర్ కె ప్రసాద్

శ్రీ కృష్ణార్పణమస్తు

# 'గాడ్ బ్లెస్ యు'

'స్వాతి'లో 'సర్వసంభవామ్' చదివిన కొంతమంది పాఠకులు ఆ శీర్షికకి సంబంధించి నన్ను కొన్ని వివరణలు కోరుతూ వచ్చారు.

'స్వాతి' వారపత్రికలోనే 2003 ఆగష్టు నుండి అక్టోబరు వరకు 'గాడ్ బ్లెస్ యు' శీర్షిక క్రింద ఆ ప్రశ్నలూ, వాటికి నా వివరణలూ ప్రచురితమయ్యాయి. **'నాహం కర్తా, హరిః కర్తా'** పాఠకుల సౌలభ్యం కోసం వాటిలో ముఖ్యమైన ప్రశ్నలు, జవాబులను ఇక్కడ ఇస్తున్నాను.

- పి.వి.ఆర్.కె. ప్రసాద్

*ప్రశ్న: ఒకవ్యక్తి జీవితంలో ఇన్ని అద్భుత సంఘటనలు (సర్వసంభవామ్) ఎదురవడం సాధ్యమంటారా? త్యాగరాజు, రామదాసు వంటి మహా వాగ్గేయకారుల జీవితాల్లో కూడా ఇన్ని అద్భుతాలు జరిగిన దాఖలాల్లేవు. దైవభక్తి వున్న ప్రతివ్యక్తి జీవితంలో ఇలాంటి సంఘటనలు జరుగుతాయా?*

*- కుమార్ ఎస్సెన్వీ, హైదరాబాద్*

జవాబు: త్యాగరాజు, రామదాసు వంటి వాగ్గేయకారుల జీవితాలతో పోల్చదగ్గ జీవితంకానీ, అర్హతకానీ నాకుందని నేను భావించడం లేదు. ('సర్వసంభవామ్' శీర్షికన చివరిభాగంలో 'హరిగురు అనుగ్రహం' చదవండి.)

తిరుమలలో ప్రతిరోజూ అనేకమందికి అద్భుతాలు జరుగుతూనే వుంటాయి. వాటి గురించి వాళ్ళకి, యింకొందరికి మాత్రమే తెలుస్తుంది. టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పనిచేసే అవకాశం వచ్చినందువల్ల కొన్ని సంఘటనలను దైవానుగ్రహంగా సమన్వయపరుచుకునే అవకాశం నాకు కలిగింది.

'సర్వసంభవామ్'లో మీరు చదివి అద్భుతాలు అనుకుంటున్న వాటికన్నా నేను అక్కడ చేయాలనుకుని, విశ్వప్రయత్నం చేసి చేయలేకపోయినవి చాలా ఎక్కువగా వున్నాయి. భక్తివున్నంతమాత్రాన అద్భుతాలు సాధ్యపడతాయా అని అడిగారు. జరగాలనిలేదు. మచ్చుకి - సనాతన ధర్మ పరిశోధనా గ్రంథాలయం. దీనికి మాస్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్య, స్వామి రంగనాథానందల హస్తాలమీదుగా శంకుస్థాపన చేయించాను. కాని దాన్ని పూర్తిచేసే అవకాశం నాకు రాలేదు. కళ్యాణోత్సవాలని ఆలయం బయట సువిశాల మంటపంలోకి (వేలాది భక్తులు తిలకించటానికి వీలుగా) తరలించాలని శాయశక్తులా ప్రయత్నించాను. సాధ్యపడలేదు. రోప్‌వే నిర్మాణానికి నేను వుండగానే అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయి. కాని అమలు జరగలేదు. శ్రీవారి నగలన్నింటినీ ఒక బుల్లెట్ ప్రూఫ్ అద్దాలతో వుండే మ్యూజియమ్‌లో పెట్టి భక్తులందరూ దర్శించుకునే ఏర్పాటు చేయాలనుకున్నాను. కానీ అమలు జరగలేదు... అలాగే వేంకటేశ్వర స్వామిది 70 అడుగుల ఎత్తయిన ఏకశిలా విగ్రహం చెక్కించి తిరుపతి నుండే భక్తులు వీక్షించగలిగేలా రెండో ఘాట్ రోడ్‌లో ఎత్తైన కొండ శిఖరం మీద ప్రతిష్ఠింపచేయాలనుకున్నాను. శిల ఎంపిక కూడా జరిగిపోయింది. కాని అసలు కార్యం జరగలేదు... తిరుమల ముఖద్వారంలో రాతిరథం చెక్కించాలనుకున్నాను. అవలేదు... ఇలా చేయలేకపోయినవి చాలా వున్నాయి.

నాకర్థమైందల్లా - ఏది ఎప్పుడు ఎవరిద్వారా ఎంతవరకు జరగాలని భగవంతుడు నిర్ణయిస్తాడో అంతవరకే జరుగుతుంది. ఏదన్నా కార్యసిద్ధి జరగాలంటే మూడు విషయాలు - యోగ్యత, ప్రయత్నం, భగవదనుగ్రహం - వుండాలని శాస్త్రాలు చెబుతున్నాయి. మొదటి రెండూవున్నా, మూడోది లేకపోతే కార్యసిద్ధి జరగదు. భగవదనుగ్రహం అనేది మన మన కర్మ ఫలం ప్రకారమే ప్రాప్తిస్తుందని పండితులు చెబుతుంటారు.

*ప్రశ్న: సర్వసంభవామ్'లో ఒక్కొక్కసారి కొన్ని పాత్రలకు ఇబ్బంది కలిగించే విధంగా నిజాలు రాశారు కదా! మీరు నిర్భయంగా, నిజాయితీగా ఎలా రాయగలిగారు?*

*- ఎ.వి. సోమయాజులు, సురేష్‌నగర్ పార్కు, కాకినాడ*

జవాబు: నా అనుభవాల్ని రాసేటప్పుడు వ్యక్తుల్ని దృష్టిలో పెట్టుకుని రాయలేదు. జరిగింది జరిగినవిధంగా చెప్పాలని చూశాను. నాహం కర్తా, హరిః కర్తా!

*ప్రశ్న: సర్వసంభవామ్'లో మీ అనుభవాలలో మీరు సాధించిన ప్రతి పనీ, శ్రీనివాసుడి అనుగ్రహం వల్లనే సాధ్యపడిందని అర్థం వచ్చేలా రాశారు. ఈ విషయం మీకు ఆయా అనుభవాల కాలంలోనే అనిపించిందా? ఇప్పుడనిపిస్తోందా?*

*- డాక్టర్ ఆర్. సీతన్న నాయుడు, రిటైర్డ్ జనరల్ మేనేజర్ (డెయిరీ), కాకినాడ.*

జవాబు: మంచి ప్రశ్న వేశారు. ఆరోజుల్లో కొంత అనిపించినప్పటికీ, నిజానికి విశ్లేషించినకొద్దీ ఆ అనుభవాల తాలూకు భావాలలో స్పష్టత ఇప్పుడు వస్తోంది. అదివరకు అనేక సందర్భాలలో ఆ శక్తి నాదేనని, నేనే చేశానని అని అప్పట్లో అనిపించినా, ఆ శక్తి, ప్రేరణ, స్ఫూర్తి ఎక్కడ్నుంచి ఎలా వచ్చాయి అన్న విషయంలో ఇప్పుడు ఎలాంటి సందేహం లేదు. అలా ఎక్కడెక్కడ ఆ శక్తి నాదని ఆ రోజుల్లో భ్రమించానో, నా అనుభవాల కథనాలలో బ్రాకెట్ లలో ప్రశ్నార్థకం రూపంలో (?) వ్యక్తం చేశాను.

*ప్రశ్న: సర్వసంభవామ్'లోని చివరి భాగం హరిగురు అనుగ్రహం'లో దుర్వ్యసనాలకి బానిసైన మీరు టిటిడిలో చేరాక శ్రీనివాసుడి తొలిదర్శనం నుంచే మీలో సంస్కరణ ప్రారంభమైందన్నట్లుగా అర్థమవుతోంది. 37ఏళ్ళ వయస్సుకే మీలో ఆ మార్పు సాధ్యమయినమాట నిజమే అయితే మాలాంటి యువకులంతా కూడా శ్రీనివాసుడ్ని చూడగానే సంస్కరింపబడిపోతామంటారా? నిజం చెప్పండి.*

*- ఎమ్.కె. సూర్య, పత్తేబాద, ఏలూరు-2*

జవాబు: మనిషి వ్యసన పరుడయ్యాడంటే అది వారి వారి ప్రారబ్ధం. భగవంతుడి అనుగ్రహం కూడా ఇతరుల ప్రేరణల ద్వారా లభ్యమవుతూంటుంది. ఆ మంచి సలహాలు విని పశ్చాత్తాప దృష్టితో, దైవం పట్ల భక్తితో మార్పుకోసం ప్రయత్నిస్తే ప్రతివ్యక్తికీ మంచి సంస్కారం లభించి తీరుతుంది. మన ప్రారబ్ధాన్ని బట్టి కొంతమందికి త్వరగా, కొంతమందికి ఆలస్యంగా అది ప్రాప్తిస్తుంది. ఒక్కసారి గుడికి వెళ్ళి దేవుడికి నమస్కారం పెట్టేస్తే మారిపోతారని నా ఉద్దేశ్యంకాదు. నేను టిటిడిలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ కాకముందు కూడా చాలాసార్లు తిరుమల వెళ్ళాను. కాని ఆ మార్పు అప్పుడు రాలేదు కదా! అలాంటి మార్పు మనలో రావాలంటే ముందుగా మన మనసులో ఆ మార్పుకోసం కోరిక జనించాలి. ఆ దిశగా ప్రయత్నం జరగాలి. ఆ మార్పుకి భగవదనుగ్రహం కావాలని ప్రార్థించాలి.

*ప్రశ్న: మీరు ఎన్నెన్నో అద్భుత సంఘటనలు చవిచూశారని సర్వసంభవామ్' ద్వారా తెలుస్తోంది. మరి మీ నిజ జీవితంలో ఏదైనా సమస్యవస్తే, దానికి మీకు వెంటనే పరిష్కారం లభిస్తోందా?*

*-పులిజాల రవీందర్‌రావు, వనస్థలిపురం, హైదరాబాద్*

జవాబు: పెద్ద సమస్య ఎదురయిన ప్రతిసారీ శ్రీనివాసుడ్ని ప్రార్థించటమే నేను చేసే మొదటిపని. నాకు ఇష్టమైన విధంగా పరిష్కారమైన సందర్భాలూ వున్నాయి. నేను ఆశించని విధంగా పరిష్కరింపబడిన సందర్భాలూ వున్నాయి. కొన్నిసార్లు అసలు పరిష్కారమే దొరక్కుండాపోవటం కూడా జరిగింది. ఎలా జరిగినప్పటికీ అది భగవత్ప్రసాదమే అని సమాధానపడటంలోనే సంతోషం వుంది. నిజమైన ఆనందం వుంది.

*ప్రశ్న: మీరు వ్రాసిన సర్వసంభవామ్'లో కొన్ని విషయాలు మీ వ్యక్తిగత ప్రచారం కోసం రాసినట్లుగా వున్నాయి... ఒక వ్యక్తి జీవితంలో యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనలను 'శ్రీ వేంకటేశ్వరుని లీలలు'గా ఎలా చెప్పగలరు? ఇలాంటివి ప్రతి వ్యక్తి జీవితంలో జరుగుతూనే వుంటాయి. అలా జరగటం ఆయా సమయాల్లో గ్రహబలాన్ని బట్టి వుంటుంది.*

*- ఆర్.వి.కె. బాబు, పటమట, విజయవాడ*

జవాబు: ఆ దృష్టితో మాత్రమే చూసినప్పుడు మీరు చెప్పింది సబబుగానే కనుపిస్తుంది. ఆ అనుమానంతోనే ఆ అనుభవాల్ని రాయాలావద్దా అని చాలాకాలం రాయటానికి వెనకాడటం జరిగింది.

గత ఏడెనిమిదేళ్ళుగా శాస్త్రం చదివే అవకాశం కలిగింది. దానివల్ల ధృవపడిన నా నమ్మకం ఏమిటంటే ఏదీ యాదృచ్ఛికం కాదు. యాదృచ్ఛికం కాదన్న దృక్పథంతో చూడటం మొదలుపెడితే చిన్న చిన్న సంఘటనలలో కూడా భగవంతుని లీలలు కనుపిస్తుంటాయి. జరిగిన ప్రతి పనిలో భగవంతుని లీల చూడగలగటం సత్వకాల లక్షణం అని పండితులు చెబుతుంటారు. అలా కొన్నింటిలోనైనా భగవంతుని లీల వుందని నాకు అనిపించినవాటిని 'సర్వసంభవామ్'లో వెల్లడించాను. మీరు చెప్పినట్లు ఇలాంటి సంఘటనలు ప్రతి వ్యక్తి జీవితంలో జరుగుతూనే వుంటాయి. వాటిల్లో భగవంతుని లీలల్ని చూడటం చూడకపోవటం అన్నది వాళ్ళ వాళ్ళ స్వభావాన్ని బట్టి వుంటుంది. నా అనుభవాల్ని నలుగురితో పంచుకోవటం కోసం 'సర్వసంభవామ్' ద్వారా నేను చేసిన ప్రయత్నంలో మీకు నా వ్యక్తిగత ప్రచారం మాత్రమే కనబడటం కూడా భగవంతుని లీలగా భావిస్తాను. గ్రహానుకూలత, గ్రహాల వ్యతిరేకత అన్నది కూడా భగవదధీనమని శాస్త్రం చెబుతోంది.

*ప్రశ్న: 'స్వాతి'లో మీ 'సర్వసంభవామ్'లో చివరి భాగమైన 'హరిగురు అనుగ్రహం'లో పండిట్ వ్యాసనకెరె ప్రభజంనాచారి గారు మీకు శ్రీ విష్ణుతత్త్వ వినిర్ణయం పాఠం చెప్పి ఒక శింశుమార విగ్రహం ఇచ్చారని చెప్పారు. 'శింశుమారుడు' ఎవరు? శింశుమార విగ్రహం విశిష్టత ఏమిటి?*

*- వి. ఇందిరా పరిమళ, ఒంగోలు*

జవాబు: శింశుమారుడు సాక్షాత్తు శ్రీహరి అవతారమేనని భాగవతం చెపుతోంది. దోషా, శర్వరీ అనే దంపతులకి శింశుమార రూపంలో శ్రీ మహావిష్ణువు జన్మించాడనీ, ఈ రూపం కాలాన్ని నియంత్రించేది కనుక ఈయన కాలనియామకుడనీ భాగవతాది శాస్త్రాలు చెబుతున్నాయి.

శాస్త్రాలలో ఇచ్చిన వివరణ ప్రకారం - శింశుమార స్వరూపం అనగా తలక్రిందులుగా వున్న వృశ్చికం ఆకారంలో ఆకాశంలో కనుపించే మహాజ్యోతిర్మండలమే శింశుమార చక్రం. తన తోక చివరిభాగంలో ధృవమండలాన్ని ధరించి, దాని చుట్టూ సమస్త గ్రహ నక్షత్రాలను త్రిప్పుతూ, సర్వాధారమైన కాలాన్ని నిర్మించి, అందరి ఆయుష్షును నిర్ధారిస్తాడు శింశుమారుడు. ధృవ మహారాజుకి 'భ్రమి' అనే తన కుమార్తెనిచ్చి వివాహం చేశాడు కనుక ధృవుడికి మామ అవుతాడు. దేహాన్ని వదిలేశాక జీవి ప్రయాణించే (అర్చిరాది) మార్గంలో పోయే బ్రహ్మజ్ఞానులు శింశుమారుని దర్శనం చేసుకొన్న తర్వాతనే ముక్తిని పొందుతారు.

త్రికాలాలలో ఆకాశంలోగల ఈ శింశుమార చక్రాన్ని చూస్తూ, 'నమో జ్యోతిర్లోకాయ కాలాయనామానిమిషాంపతయే మహాపురుషాయాభిధీమహి' (భాగవతము - పంచమ స్కంధము) అని ఉపస్థానము చేయవలెనని భాగవతంలో చెప్పబడింది. ఇలాచేస్తే, మూడు కాలాలలో మనంచేసే పాపాలు పరిహారమవుతాయంటారు. ఆయుఃవ్యవస్థాపకత్వమే కాలము యొక్క లక్షణం. అటువంటి కాలానికి నియామకుడైనందున ఆయుఃనియామకుడు శింశుమారుడే.

ఈ శింశుమార మూర్తిని నిత్య దేవతార్చనలో ఆరాధించినట్లయితే సంపూర్ణ ఆయుష్షును కరుణించి అపమృత్యువు రాకుండా విఘ్నాలను పరిహరిస్తూ సాధన చేసుకోవటానికి అనుకూలమవుతుందని సూచిస్తూ, ఈ శింశుమార విగ్రహాన్ని శ్రీ ప్రభంజనాచారి బహూకరించివుంటారు.

*ప్రశ్న: మీ 'సర్వసంభవామ్' చదువుతుంటే కళ్ళు చెమర్చేవి. ఒళ్ళంతా గగుర్పొడిచేది... తిరుమలలో ఆలయశిఖరంపై విమాన వేంకటేశ్వర స్వామి దర్శనం ప్రాశస్త్యం ఏమిటి?*

*- కరణం శేషగిరిరావు, లబ్బీపేట, విజయవాడ*

జవాబు: విజయనగరం అచ్యుతరాయల కాలంలో శ్రీవారి ఆలయంలో వైఖానస అర్చకుని (ఒక తీవ్ర నేరారోపణపై) శిరచ్ఛేదన జరిగిందట. మళ్ళీ అతని సంతతి పెరిగి, వాళ్ళకి పూజార్హత లభించేవరకూ శ్రీ వ్యాసరాయలు వారు 12ఏళ్ళపాటు ఆలయంలో పూజలు జరిపారనీ, ఆ సమయంలో ఆనందనిలయం విమానంపైన వ్యాసరాయలు వారి ఆధ్వర్యంలో విమాన వేంకటేశ్వరుని ప్రతిష్ఠ జరిగిందనీ తెలుస్తోంది. ఏ కారణంవల్లనయినా మూలవిరాట్‌ని దర్శించలేకపోయిన వారి సదుపాయం కోసం ఈ విమాన వేంకటేశ్వరుని ప్రతిష్ఠ చేశారు. శ్రీవారి ముందు శ్రీనివాస కళ్యాణం, వేదపారాయణం చేసుకోగోరేవాళ్ళు (అది గర్భగుడిలో సాధ్యపడదు కనుక) ఈ విమాన వేంకటేశ్వరుని ఎదురుగా అరుగులపై కూర్చుని పారాయణ చేసుకుంటుంటారు. గతంలో అక్కడ మెట్లపై నిలబడి చూసేటప్పుడు ఆనంద నిలయం శిఖరంపై "ఎక్కడ విమాన వేంకటేశ్వర స్వామి?" అను భక్తులు వెతుక్కుంటూండేవాళ్ళు. నేను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుండగా ఆలయంలో అష్టబంధనం, నూతన ధ్వజస్తంభ ప్రతిష్ఠ, ఆనందనిలయం సంప్రోక్షణ వగైరా జరిగినప్పుడు, ఈ విమాన శ్రీనివాసుడ్ని సులభంగా గుర్తించేలా వెండి మకర తోరణం, దాన్ని సూచిస్తూ ఆ క్రింద ఒక బాణపు గుర్తు ఏర్పాటుచేశాం.

*ప్రశ్న: 'శివుని ఆజ్ఞ లేనిదే చీమయినా కుట్టదు'. నేను ఎలా వ్యవహరిస్తున్నానూ ఎలా వ్యవహరించాలీ అన్న విధి ఇదివరకే నిర్ణయమైపోయివుంటే, నా ద్వారా జరిగే పాపపుణ్యాలకు నేనెలా బాధ్యుణ్ణి?*

*- కె. శేషగిరిరావు, డిప్యూటీ మేనేజర్, ఎంఎంటిసి, విశాఖపట్నం.*

*- జె. హరేరామ, హైదరాబాద్*

జవాబు: మనిషి పూర్తిగా అస్వతంత్రుడై వుంటే మీరు చెప్పిన సందేహానికి అవకాశం వుంటుంది. కాని, కర్మానుసారం విధి లిఖించబడివున్నప్పటికీ, ప్రతి మనిషికీ దత్త స్వాతంత్ర్యం వుంది. అంటే, భగవంతుడిచ్చిన బుద్ధి, విచక్షణా జ్ఞానాన్ని వుపయోగించి సత్కర్మని ఆచరించే అవకాశం వుంది. శాస్త్రాలలో చెప్పబడిన విధి, నిషేధాల ప్రయోజనం కూడా ఇదే. ఏది ఆచరించవచ్చో, ఏదో ఆచరించకూడదో, ఎలాంటి సత్కర్మలు పుణ్యఫలాన్నిస్తాయో, ఎలాంటి దుష్కర్మలు పాపఫలాన్ని మూటగడతాయో శాస్త్రాలలో స్పష్టంగా చెప్పబడివుంది. కొన్ని కొన్ని సందర్భాలలో తాము ఈ జన్మలో ఎంతో భక్తి ప్రపత్తులలో భగవంతుడ్ని ఆరాధించినప్పటికీ, ఎన్నో పుణ్యకార్యాలు చేస్తున్నప్పటికీ, కష్టాల కడలిలోంచి బయటపడలేకపోతున్నామని వాపోతుంటాం. క్రితం జన్మ తాలుకు పుణ్యఫలం వల్ల ఈ జన్మలో సంస్కారం అబ్బినప్పటికీ, ఇప్పుడు లభించిన పుణ్య ఫలాన్ని మించిన పాపఫలాన్ని క్రిందటి జన్మలో మూటగట్టుకుని వున్నామని గ్రహించాలని పండితులు చెబుతుంటారు. అందుకే ఎలాంటి కష్టనష్టాలు ఎదురయినా సత్కర్మలని ఆచరిస్తూనే ముందుకుసాగే వారే పుణ్య ఫలాన్ని సమకూర్చుకోగలుగుతారు. ఏ రకమయిన సత్కార్యాలు చేయకపోయినా, ఎన్నో రకాల దుష్కర్మలు ఆచరిస్తున్నా కొంతమంది చాలా సుఖంగా బ్రతుకుతున్నట్లు కనుపిస్తుంటారు. అంటే, గత జన్మ తాలూకు పుణ్య ఫలాన్ని వాళ్ళు ఇప్పుడు అనుభవిస్తున్నారు. పై జన్మకి పాప ఫలాన్ని మూటగడుతున్నారన్నమాట. ఆ రకంగా మనం చేసే కర్మలకి మనమే బాధ్యులమవుతున్నాం. మన యీ కర్మానుసారంగా ఫలం నిష్పక్షపాతంగా యివ్వడం భగవంతుడు చేస్తున్న, యితర దేవతల చేత చేయిస్తున్న పని. అలా భగవంతుడే చేయిస్తున్నాడు కనుక 'శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదని' నానుడి.

* * *

# ఈ రచన గురించి.....

...యజ్ఞం చేయించినా, ధ్వజస్తంభం ఎత్తించినా అన్నింటికీ సర్వాంతర్యామి అయిన శ్రీ వేంకటేశ్వరుడే ప్రసాద్‌గారి ద్వారా బృహత్‌కార్యాల్ని చేయించినట్లు 'స్వాతి'లో వెలువడిన వారి స్వీయ అనుభవాల ద్వారా అర్థమవుతోంది. పదిమందికి ఉపయోగపడే ఏ నిస్వార్థ కార్యానికయినా కర్తని భక్తి, విశ్వాసాలు ముందుకు నడిపిస్తాయని స్పష్టమవుతోంది... సంఘటనల వివరణ, వర్ణన అద్భుతంగా వుంది...

*- డా॥ కైలే ఆశయ్య, ఐఐఎస్, జాయింట్ డైరెక్టర్, ఆలిండియా రేడియో, హైదరాబాద్*

... నేను పుస్తకాలు విపరీతంగా చదువుతాను కాని, ఇలా ఆద్యంతం ఉత్కంఠకలిగించేలా కథల రూపంలో రాయబడిన 'స్వీయానుభవాల్ని' చదవడం నాకు ఇదే మొదటిసారి. చాలా క్లిష్టమైన సమస్యల్నిగానీ, పథకాల్నిగానీ సాధించడంలో ప్రసాద్‌గారు వాడిన టెక్నిక్‌లు నాలాంటి Management Executives కి చాలా ఉపయోగపడతాయి. చిత్తశుద్ధితో, స్వార్థరాహిత్యంతో భక్తులు చేసే మంచి పనులకి భగవదనుగ్రహం ఎప్పుడూ వుంటుందని ప్రసాద్ గారి అనుభవాల నుంచి తెలుసుకున్నాను.

*- జి.రాజా కార్తికేయ, మేనేజ్‌మెంట్ ఎగ్జిక్యూటివ్ ఐ-ఫ్లెక్స్ సొల్యూషన్స్, బెంగుళూరు-1*

'సర్వసంభవామ్'లోని ప్రతి సంఘటనలోనూ, 'పిలిస్తే పలుకుతాడు దేవుడు' - అని శ్రీ ప్రసాద్ తమ స్వీయానుభవాల ద్వారా నిరూపించారు. లక్షలాది పాఠకుల మనసుల్ని దైవానికి మరింత చేరువ చేశారు.

*- వేమూరి బలరాం, ఎడిటర్, స్వాతి, విజయవాడ-2*

... భాగవతం చదువుతుంటే కొన్ని ఘట్టాలు చిన్ని కృష్ణుడి లీలల్ని చదవనీయకుండా కన్నీటి ముత్యాలు అడ్డుపడుతుండేవి. అలాంటి అనుభవం మళ్ళీ 'స్వాతి'లో సర్వసంభవామ్ చదువుతున్నప్పుడు కలిగింది....

*- ఆదూరి సత్యవతీదేవి, సీతమ్మధార, విశాఖపట్నం*

...'స్వాతి'లో ప్రసాద్‌గారి అనుభవాల రచన నాలో అణువణువుని అలౌకిక ఆనందంతో స్పందింపచేసింది.

*- నారాయణ చెట్టి, ఐ.ఏ.ఎస్.(రిటైర్డ్), ఆదర్శ నగర్, హైదరాబాద్*

...ఆస్తికత, నాస్తికతల మధ్య ఊగిసలాడి అలసిన నావంటి వారిలో ప్రసాద్‌గారి రచన కొత్త ఆశల్నీ, ఆలోచనల్నీ రేకెత్తిస్తున్నది.

*- మంగెన గంగాధరరావు, ఇరగవరం, ప.గో.జిల్లా.*